ఓ రామచంద్రా! నిరంతరము 'అనహం'భావనయొక్క అభ్యాసముచే 'అహం'భావనను ఆకాశపుష్పమువలె సర్వథా మిథ్యగానొనర్చి, ధనుస్సున నారూఢమొనర్పఁబడిన బాణమువలె సదా అపరాఙ్ముఖుఁడవై, దృఢముగ బ్రహ్మపదమును శీఘ్రము నవలంబించి శాశ్వతముగ వెలయుము.

సనభోఽహామహన్తాం త్వం చేతస్యేవమనారతం
సర్వభావైరనారూఢో భవ తీర్ణభవార్ణవః. 13

అహంభావనను నిరంతరము ఆకాశపుష్పమువలె మిథ్యగ నెఱుఁగుచు, సర్వభావములచేతను అప్రాప్యమైనట్టి ఆత్మపదమునుబొంది సంసారసముద్రమును దాటినవాఁడవుకమ్ము.

స్వభావమాత్ర విజయే స్వయం యస్య న వీరతా
తస్యోత్తమపదప్రాప్తౌ పశోర్బ్రూహి కథైవ కా. 14

స్వాభావికమగు (అజ్ఞానజనితమైన) అహంకారమాత్రమును జయించుటయం దెవనికి వీరత్వము లేదో, అట్టి పశువునకు ఉత్తమ బ్రహ్మపదప్రాప్తియం దేమి ప్రసంగముండునో చెప్పుము!

షడ్వర్గో నిర్జితః పూర్వం యేనోత్తమవిదా స్వతః
భాజనం స మహార్థానాం నేతరో నరగర్దభః. 15

ఏ యుత్తమజ్ఞాని స్వయముగ కామక్రోధాదులను దన యరిషడ్వర్గమును (ఆఱుగురు శత్రువులను) ముందుగనే జయించునో, అతఁడే ముక్త్యాది మహత్పదార్థములకుఁ బాత్రుఁడగును. గాని యితర మనుజరూప గర్దభములు కాదు.

యస్య స్వాన్తర్మనో వృత్తిర్జీయమానా జితాథవా
విషయః స వివేకానాం న పుమానితి కథ్యతే. 16

ఎవని యంతఃకరణమున మనోవృత్తి జయింపఁబడుచున్నదో, లేక, జయింపఁబడినదో, అతఁడే వివేకాదులకుఁ బాత్రుఁడగును మఱియు నాతఁడే మనుజుఁడనఁదగును

అర్థో దృషదివామ్భోధౌ యో యః ఆపతతి త్వయి
తస్మాదేవ పలాయస్వ నాహమిత్యేవ భావయన్. 17

ఓ రాఘవచంద్రా! సముద్రమునఁ బడవేయఁబడిన శిలాది పదార్థములు సముద్రములో అసంగముగ నుండునట్లు నీవున్ను నీకు సంప్రాప్తించిన క్రియాదులందు 'అనహం'భావన ('ఈ దేహాదులు నేనుగాను. అసంగమగు ఆత్మనే నేనను భావన) యొనర్చుచు నిర్లేపముగ నుండుము.

నాహమస్మీతి బుద్ధ్వాపి సోపపత్తికమప్యలం
జానానో జ్ఞప్తిమాత్రం చ కిమజ్ఞ ఇవ ముహ్యసి. 18

ఓ రామచంద్రా! 'ఈ శరీరాదులు నేనుగాను'అను 'అనహం'భావన నెఱిఁగియు, ఉత్తమ చిద్రూపసుఖమును లెస్సగ ననుభవించుచును అజ్ఞునివలె నేల మోహమొందు చుంటివి?

న జ్ఞేయమర్థతోఽస్తీహ హేమ్నీవ కటకాదితా
భ్రాన్తిమాత్రాద్భ్రతే సా చ శామ్యత్యస్మరణేన తే. 19

సువర్ణము నెఱిఁగినచో కటకాదులన్ని నెఱుఁగఁబడినవేయగును. గాన సర్వకారణకారణమగు ఆత్మ నెఱిఁగిన నీకు తదన్యమగు ఏ పదార్థమున్ను నిఁక కారణతః నెఱుఁగనది లేదు. నామరూపాత్మకమగు ఈసమస్తమున్ను కేవలము భ్రాంతిమాత్రమైయున్నది. అద్దాని విస్మరణముచే, లేక, ఆత్మజ్ఞానముచే నది శమించును.

యోయో భావ ఉదేత్యన్తస్త్వయి స్పన్ద ఇవానిలే
నాహమస్మీతి చిద్వృత్త్యా తమనాధారతాం నయ. 20

ఓ రామచంద్రా! వాయువందు చలనమువలె నేయే వృత్తి నీయంతఃకరణమున నుదయించునో, చిదాకారవృత్తితోఁ గూడినవాఁడవై, ఆయావృత్తి నేను గానను ఈభావనచే నద్దానిని నిరాధారముగ నొనర్చివేయుము.

లోభో లజ్జా మదో మోహో యేనాదావితి నో జితాః
నిరర్థకమనర్థోఽస్మిన్స కిమర్థం ప్రవర్తతే. 21

ఇట్లు, అనహంభావనచే లోభము, లజ్జ, మదము, మోహము మున్నగువానిని మొదటనే జయింపనివాని కీయధ్యాత్మజ్ఞానమున మనోరథము నిష్ఫలమగును. యథేష్టాచరణాదుల నిందించు ఈయధ్యాత్మశాస్త్రమున అనధికారియగు యాతఁడేల ప్రవర్తించుచున్నాఁడు?

అహం త్వం పవనే స్పన్ద ఇవ యత్త్వయి సంస్థితమ్
పరమాత్మని తన్నాన్యదేతత్స్పన్ద ఇవానిలే. 22

వాయువునందు చలనమువలె నీయందే 'అహం' త్వము గలదో, అది, బోధచే నీవు పరమాత్మరూపుఁడవు కాఁగా, వాయువుకంటె చలనము భిన్నముకానట్లు, నీకంటె వేఱుగాకుండును.

అసర్గసంవిదా సర్గః పరేఽస్తోఽతివిరాజతే
సంనివేశవిశేషేణ దురర్థోఽపి హి శోభతే. 23

కంఠమునందు ధరింపఁబడిన పుష్పమాలయందుఁ గల్పింపఁబడిన సర్పాదులబోధచే తన్మాలయందు విలీనమై తిరిగి పుష్పమాలగనే శోభించునట్లు, కూటస్థాద్వయ చిన్మాత్రజ్ఞానముచే పరమాత్మయందు విలీనమై, తద్రూపమునేపొంది శోభించును.

పరమాత్మా తు నోదేతి నాస్తం యాతి కదాచన
న చాస్మాదన్యదస్తీతి కో భావోఽభావ ఏవ వా. 24

యథార్థముగ పరమాత్మ యుదయించుటలేదు, అస్తమించుటలేదు. నిత్యసిద్ధమైయున్నది. (కల్పితవస్తువుయొక్క బాధచే అధిష్ఠానము బాధింపఁబడదుగాన,) మఱియు ఈ పరమాత్మకంటె నన్యముగ నెద్దియులేకయుండ నిఁక భావాభావములఁగూర్చి వేఱు చెప్ప నేల?

పరం పరే పూర్ణం పూర్ణే శాన్తం శాన్తే శివం శివే
ఇత్యేవమాత్రం వితతం నాహం న చ జగన్న ధీః. 25

పరమై, పూర్ణమై, శాంతమై, శివమైనట్టి పరమాత్మ, పరమై, పూర్ణమై, శాంతమై, శివమై

నట్టి పరమాత్మయందు స్థితిగల్గియున్నది. ఇంతమాత్రమగు స్థితియే తత్త్వబోధచే విస్తారముగఁ జెప్పఁబడినది. కావున నిఁక అహంకారముగాని, బుద్ధిగాని, జగత్తుగాని యెచట!

అనిర్వాణే వినిర్వాణం శాన్తం శాన్తే శివే శివమ్
నిర్వాణమప్య నిర్వాణం సనభోర్థం న వాపి తత్. 26

నాశరహితమై, శాంతమై, శివమైనట్టి బ్రహ్మమందు, నాశరహితమై, శాంతమై శివమైనట్టి బ్రహ్మముస్థితినొందియున్నది. రజ్జువునందు కల్పితమగు సర్పముయొక్క శమనమువలె, నామరూపాత్మకమైన కల్పితజగత్తుయొక్క శమనము (నిర్వాణము) అశమనమేయగును. వాస్తవముగ బ్రహ్మము ఆకాశాది పదార్థసహితమై యెన్నడును లేదు.

శాస్త్రాఘాతాః ప్రసహ్యన్తే సహ్యన్తే వ్యాధివేదనాః
నాహమిత్యేవమాత్రస్య సహనే కా కదర్థనా. 27

మనుజుఁడు శస్త్రప్రహారములను సహించుచున్నాఁడు. వ్యాధిబాధలనుడఁగూడ నోర్చుకొనుచున్నాఁడు. అట్టిచో నాతనికి 'ఈ శరీరేంద్రియాదులు నేనుగాను' అను ఈ 'అనహం' భావనామాత్రమును సహించుటయందేమి కష్టముగలదు?

జగత్పదార్థసార్థానామహమిత్యత్రయోఽఙ్కురః
తస్మిన్నిర్మూలతాం యాతే జగన్నిర్మూలతాం గతం. 28

జగత్తునందలి సమస్తపదార్థసమూహములకును దేహాదులందలి అహంభావనయే అత్యుయమగు అంకురమైయున్నది. బోధచే నయ్యది నిర్మూలింపఁబడ ఈ జగత్తున్ను నిర్మూలమగుచున్నది.

బాష్పేణేవాహమర్థేన నిఃసారేణాపి సారవత్
వ్యామలః పరమాదర్శస్తచ్ఛాన్తౌ సంప్రసీదతి. 29

పరమాత్మయను స్వచ్ఛమైన యద్దము అహంకారమను ముఖబాష్పముచే మాలిన్యసహితముగఁ గోచరించుచున్నది. ఆ యహంకారమను నిస్సారబాష్పము శమింప ఆత్మ నిర్మలత్వము నొందుచున్నది.

అహమర్థః పరే వాయౌ స్పన్దస్తత్ప్రశమే తు తత్
అనిర్దేశ్యమనాభాసమనన్తమజమవ్యయం. 30

పరమాత్మయను వాయువందు అహంకారమను స్పందము (చలనము) గలదు. అయ్యది శమింప, అనిర్దేశ్యమై, చిదాభాసరహితమై, అనంతమై, అజమై, అవ్యయమైనట్టి చిదాకాశమాత్రము శేషించును.

అహమర్థః పురో ద్రవ్యప్రతిబిమ్బప్రదర్శితి
తచ్ఛాన్తౌ సా నిరాభాసమనన్తమజమవ్యయం. 31

అహంకారము యెదుటనుండు పదార్థములయొక్క ప్రతిబింబమును చైతన్యమునఁ గలుగఁజేయుచున్నది. ఆ యహంకారము శమింప చైతన్యమాభాసరహితమై, అనంతమై, అజమై, అవ్యయమైనట్టి పరమాత్మరూపమే యగును.



అహమర్థామ్బుదే క్షీణే పరమార్థశరన్నభః
పరయానన్తయా లక్ష్మ్యా స్వచ్ఛయాచ్ఛం విరాజతే. 32

అహంకారమను మేఘము శమింప, ఆత్మయను శరత్కాలాకాశము, పరమై, అనంతమై, స్వచ్ఛమైనట్టి (మోక్ష) లక్ష్మితోడ నిర్మలమై విరాజిల్లును.

అహమర్థమలోన్ముక్తమవ్యక్తం తామ్ర మజ్జ చేత్
తత్పరం పరమాభాసం సంపన్నం హేమ కాన్తిమత్. 33

ప్రియుఁడవగు రామచంద్రా! అహంకారమను తామ్రమలముతోటి చిరకాల సంపర్కముచే జీవత్వము (తామ్రత్వము) నొందిన, అవ్యక్తమైన బ్రహ్మమను సువర్ణము శ్రవణాద్యుపాయములచే తదహంకారమలమునుండి విడివడినచో, తిరిగి పరమప్రకాశమానమై కాంతివంతమైనట్టి సువర్ణము (బ్రహ్మము)గనే చెన్నొందును.

యథా నిరభిధార్థశ్రీర్భజత్యవ్యపదేశ్యతామ్
తథా నహన్తా హన్తేయం బ్రహ్మత్వమధిగచ్ఛతి. 34

సముద్రమందు లీనమైన సైంధవాది పదార్థముల శోభ, సైంధవాది నామములనువీడి అనిర్వచనీయమై, సముద్రరూపత్వము నొందునట్లు, బ్రహ్మమందు లీనమైన అహంత్వమున్ను అనహంత్వమున్ను, బ్రహ్మరూపత్వమునే పొందుచున్నవి.

అస్త్యహన్త్వే స్థితం బ్రహ్మ సనామేవ పదార్థవత్
శాన్తవత్సదివాభాసం తద్వత్సవ్యపదేశవాన్. 35

సద్రూపమై, శాంతమై, ప్రకాశమానమైనట్టి బ్రహ్మము, అవ్యపదేశ్యము (నిర్దేశింపఁదగనిది)అయినను అహంత్వము మున్నగు అల్పపదార్థములకంటె అతిక్రమణమును జూపుటకొఱకై, ప్రవృత్తినిమిత్తము బృహత్త్వలక్షణాదులఁ దెల్పు (బ్రహ్మ)మున్నగు నామములచేఁ గల్పింపబడి నామయుక్తపదార్థములవలెనే వ్యవహరింపబడుచు అహంత్వమందు స్థితిగల్గియున్నది.

అహమర్థో జగద్బీజం యది దగ్ధమభావనాత్
తదహన్త్వం జగద్బన్ధ ఇత్యాదేః కలనైవ కా. 36

అభావనచే(భావనామూలమగు అజ్ఞాననాశముచే) జగత్తుయొక్క బీజమగు అహంపదార్థము నశింప, ఇక అహంత్వము, జగత్తు, బంధము, మున్నగువాని కల్పనయే యెచట?

సద్బ్రహ్మ శివమాత్మేతి పరే నామ కలఙ్కితా
ఉదేత్యహన్తా కుమ్భత్వాదివ మృద్ధాతువిస్మృతిః. 37

పరిచ్ఛిన్నమగు ఘటాకారముచే మృత్తికయొక్క విస్మృతియుదయించునట్లు,సత్తు (త్రికాలాబాధ్యము) బ్రహ్మము (అపరిచ్ఛిన్నము) శివము (నిరతిశయానందమయము) ఆత్మ (అపరోక్షచిదేకరసము) ఈ మొదలగు స్వభావములతోఁగూడిన ఆత్మయందు, అజ్ఞానమువలన, ఆ స్వభావముల సంకోచ

రూపమగు నామముచే కళంకితమైనదియు, తత్స్వభావచతుష్టయ రహితమైనదియునగు, 'అహంత్వము' ఉదయించుచున్నది.

అహమర్థాదియం బీజాత్సత్తా బిమ్బలతోత్థితా
యస్యాం జగన్త్యనన్తాని ఫలాన్యాయాన్తి యాన్తి చ. 38

ఈ 'అహం' పదార్థమను బీజమునుండి యీదృశ్యసత్తయను ప్రతిబింబితలత యావిర్భవించినది. దానియందనంతములైన జగద్రూపఫలము లుత్పన్నములై నశించుచున్నవి.

సాద్ర్యబ్ధ్యుర్వీ నదీ సేయం రూపాలోకైషణాదికా
అహమర్థస్య మరిచబీజస్యాన్తశ్చమత్కృతిః. 39

ఈ అహంకారమను మరిచబీజ (మిరియ) మందు పర్వత సముద్ర పృథివీ నదీసహితమున్ను, రూపాదిబాహ్యేంద్రియ విషయయుక్తమున్ను, మనస్సహితమున్ను తన్మనోగోచరమునగు కామసంకల్పాది వృత్తియుతమున్ను నగు చమత్కృతి యుదయించుచున్నది.

ద్యౌః క్షమా వాయురాకాశం పర్వతాః సరితో దిశః
ఇత్యామోదోఽహమర్థోగ్రకుసుమస్య వికాసినః. 40

అంతరిక్షము, పృథివి, వాయువు, ఆకాశము, పర్వతములు, నదులు, దిక్కులు, ఇవి యన్నియు అహంకారమను వికసిత పుష్పము యొక్క సుగంధములు.

అహమర్థః ప్రవిసృతః ప్రకటీ కురుతే జగత్
సద్రూపాలోకమననం ప్రవృత్త ఇవ వాసరః. 41

దివసము (పగలు) ప్రారంభమగుటతోడనే రూపాదుల ప్రకాశమును, మననమును గావించునట్లు, ఆత్మయందు అహంకార ముదయించుటతోడనే జగత్తును ప్రకటమొనర్చుచున్నది.

ప్రవృత్తేన దినేనార్థః ప్రకటీక్రియతే యథా
అసజ్జగదహన్త్వేన క్షణాన్నిర్మీయతే తథా. 42

దివసము ప్రారంభమగుటతోడనే పదార్థములు బ్రకటించునట్లు, అహంకారము భావనామాత్రముచే క్షణకాలములో ఈయసత్తగు జగత్తును నిర్మించుచున్నది.

అహమిత్యర్థదుస్తైలలవో బ్రహ్మణి వారిణి
ప్రసృతో యత్తదా శ్వేతత్రిజగచ్చక్రకం స్థితం. 43

బ్రహ్మమను జలమందు, అహంకారమను దుష్టతైల బిందువు పడుటతోడనే అది వెంటనే విస్తరించి ముల్లోకములను శ్వేతచక్రాకారముగ స్థితి నొందుచున్నది.

ఉన్మేషమాత్రేణాహన్తా జగన్త్యనుభవత్యహో
న నిమేషేణ దృగివ సత్యానీత్యప్యసన్త్యలమ్. 44

ఆహా! తెఱచియుండు దోషయుక్తమగు నేత్రము, అసత్యములైనను జగత్తులను సత్యములుగ ననుభవించునట్లు, రెప్పపాటుకాలములో ఈ అహంత్వము అనేకజగంబుల ననుభవించుచున్నది.



అహమర్థే ప్రవిసృతే సంసారో హ్యనుభూయతే
నాన్తర్ధ్యాయ పరిక్షీణే లోచనస్యేవ తారకే. 45

మూయఁబడకయు, క్షయింపకయునుండు (తెఱచియుండు) కనుగ్రుడ్లు పదార్థములఁ గాంచునట్లు అహంకారము విస్తరింప జగత్తు ననుభవించుచున్నది.

అహమంశే నిరంశత్వం నీతే శాశ్వతసంవిదా
శామ్యతీయమశేషేణ సంసారమృగతృష్ణికా. 46

నిరంతరపరమాత్మజ్ఞానముచే అహంకారము నిశ్శేషముగ నశింప, ఈసంసారమను మృగతృష్ణ (ఎండమావులు) పూర్ణముగ శమించిపోవుచున్నది.

స్వసంవిద్భావనామాత్రసాధ్యేఽస్మిన్వరవస్తుని
సిద్ధమాత్రాత్మని స్వైరం మా ఖేదం గచ్ఛ మా భ్రమిమ్. 47

ఓ రామచంద్రా! స్వప్రకాశమగు చిన్మాత్రముయొక్క భావనామాత్రముచే సాధ్యమై, స్వతస్సిద్ధమైనట్టి ఆత్మయను శ్రేష్ఠవస్తువుయొక్క ప్రాప్తియందు ఖేదమునుకాని, (అహంభావనాది) భ్రమనుగాని పొందకుము.

స్వయత్నమాత్రసంసాధ్యాదసహాయాదిసాధనాత్
అనహంవేదనాన్నాన్యచ్ఛ్రేయః పశ్యామి తేఽనఘ 48

పాపరహితుఁడవగు నో రామచంద్రా! ఇతర సహాయకములగు సాధనలులేకనే, స్వయత్నమాత్రముచే సులభసాధ్యమగు ఈ 'అనహం' (బ్రహ్మ)భావనకంటె అన్యముగ నీకు శ్రేయప్రదమైనదగు మఱిదేనినిగూడ నేను గాంచుటలేను.

విస్మృత్యాహంత్వమాస్స్వ ప్రవిసృతవిభవః పూరితాశేషవిశ్వో
విష్వక్శైలాన్తరిక్షక్షితిజలధిమరున్మార్గరూపోఽమలాత్మా
స్వస్థః శాన్తో విశోకః కరణమలకలావర్జితో నిష్ప్రపఞ్చో
నిఃసంచారశ్చరాత్మా సకలమసకలం చేతి సిద్ధాన్తసారః. 49

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే అహన్తానిరాసో నామ చతుర్థః సర్గః ॥ 4 ॥

ఓ రామచంద్రా! నీవు ప్రథమమున వ్యష్ట్యహంభావమును మఱచి, నలువైపుల విస్తరించియున్న పర్వత, అంతరిక్ష, పృథివీ, సముద్ర, వాయువులస్వరూపమును, వానిమార్గమగు ఆకాశముయొక్క స్వరూపమునుబొంది ఇవ్విధమున విశ్వమంతటిని పరిపూరితమొనర్చి, వ్యాపించిన విభవముగలవాఁడవై, సమష్టిభావముతోడియుండుము. పిదప, 'చరాచరజగంబంతయు నిష్ప్రపంచరూపమగు బ్రహ్మమే' అని యిట్లు ప్రపంచమును నిషేధముగావించి, స్వస్థుఁడవై, శాంతుఁడవై, దుఃఖరహితుఁడవై, కరణముల (ఇంద్రియ, మానసాదుల) మలములుగాని, కళలుగాని లేనివాఁడవై, నిర్మలాత్ముఁడవై సం

యును. ఏలయనగా, అధ్యారోప, అపవాదములచే శేషించు నిష్ప్రపంచమైనట్టి శుద్ధాత్మయే సర్వ వేదాంత సిద్ధాంతసారమై యున్నది.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్యప్రకాశికయందు నిర్వాణప్రకరణమున ఉత్తరార్థమున
అహంతానిరాసమను నాల్గవ సర్గము ॥ 4 ॥

---

## పఞ్చమః సర్గః

[శాస్త్రం జితేంద్రియేష్వేవ సఫలం నేతరేష్వితి
వసిష్ఠేన భుశుణ్డోక్తా విద్యాధరకథోచ్యతే.

జితేంద్రియులయందే వేదాంతాదిశాస్త్రముల యధ్యయనము సఫలమగునుగాని అజితేంద్రియులందుగాదను నివ్విషయముగూర్చి భుశుండునిచే వచింపఁబడిన విద్యాధరకథను వసిష్ఠమునీంద్రుఁడు శ్రీరామచంద్రునకు వర్ణించి చెప్పుట యిటఁగాననగును.]

శ్రీవసిష్ఠ ఉవాచ:—

స్వభావం స్వం విజిత్యాదావిన్ద్రియాణాం సచేతసాం
ప్రవర్తతే వివేకే యః సర్వం తస్యాశు సిధ్యతి. 1

శ్రీ వసిష్ఠుఁడు:—ఓ రామచంద్రా! విషయములవైపుకుఁ బరువిడునట్టి తనయొక్క మనస్సహితమగు సమస్తేంద్రియముల స్వభావమును మొట్టమొదట జయించి, ఆపిమ్మట వివేకాదిసాధనములందుఁ బ్రవర్తించువానికి సర్వమున్ను శీఘ్రముగ సిద్ధించుచున్నది.

స్వభావమాత్రం యేనాన్తర్న జితం దగ్ధబుద్ధినా
తస్యోత్తమపదప్రాప్తిః సికతాతైలదుర్లభా. 2

నష్టబుద్ధియగు యెవఁడు మొదటతనస్వభావమాత్రమును అంతఃకరణమున జయింపకుండునో, అతనికి నిసుకయందుఁ దైలమువలె నుత్తమమగు ఆత్మపదప్రాప్తి దుర్లభమేయగును.

శుద్ధేఽల్పోఽప్యుపదేశో హి నిర్మలే తైలబిన్దువత్
లగత్యుత్తానచిత్తేషు నాదర్శ ఇవ మౌక్తికమ్. 3

శుద్ధచిత్తునియందు అల్పోపదేశమైనను, నిర్మలవస్త్రాదులందు తైలబిందువువలె శీఘ్రముగఁ బ్రవేశించును. త్రిప్పిపెట్టిన యద్దమందు ముత్యములు ప్రతిబింబించనట్లు, సాధనచతుష్టయములేని చిత్తముగలవారియం దాయుపదేశము ప్రవేశింపదు.

అత్రైవోదాహరన్తీమమితిహాసం పురాతనం
మమ పూర్వం భుశుణ్డేన కథితం మేరుమూర్ధని. 4

ఇవ్విషయమున, పూర్వము మేరుపర్వతశిఖరముపై భుశుండునిచే నాకుఁజెప్పఁబడిన యొక పురాతనమైన కథ నుదాహరించుచున్నాను, వినుము.



పురా భుశుణ్డః కస్మింశ్చిత్పృష్ట ఆసీత్కథాన్తరే
మయా కదాచిదేకాన్తే మేరోః శిఖరకోటరే. 5

పూర్వము మేరుపర్వత శిఖరముయొక్క యొకానొక గుహయందేకాంతస్థానమున విరాజమానుఁడై యున్న భుశుండుని, అధ్యాత్మకథాప్రసంగమున నే నిట్లడిగితిని —

ముగ్ధబుద్ధిమనాత్మజ్ఞం కం త్వం సుచిరజీవితం
స్మరసీతి మయా పృష్టేనోక్తం తేనేదమఙ్గ మే. 6

'ప్రియుఁడా! ముగ్ధబుద్ధియు (ఇంద్రియజయములేనివాఁడును), ఆత్మజ్ఞానరహితుఁడును, దీర్ఘకాలము జీవించినవాఁడునగు యే ప్రాణిని నీవు స్మరించుచున్నావు?' నే నిట్లడుగ నంత నాతడిట్లు వచించె.

భుశుణ్డ ఉవాచ:—

ఆసీద్విద్యాధరః పూర్వమనాత్మజ్ఞః సుఖేదితః
లోకాలోకాన్తరశృఙ్గే శుష్క ఆర్యో విచారవాన్. 7

భుశుండుఁడు:—మహాత్మా! పూర్వము లోకాలోకాంతర పర్వత శిఖరముపై, ఆత్మజ్ఞానములేనివాఁడును, జయింపఁబడని యింద్రియములచే మిగుల ఖేదమొందువాఁడును, తపస్సు మున్నగువానిచే శుష్కించినవాఁడును, సదాచారసంపన్నుఁడును, విచారవంతుఁడునగు విద్యాధరుఁడొకఁడు గలఁడు.

తపసా బహురూపేణ యమేన నియమేన చ
అక్షీణాయురతిష్ఠత్స పురా కల్పచతుష్టయమ్. 8

అనేకవిధములగు తపస్సుచేతను, యమ, నియమములచేతను క్షయింపని యాయువుగలవాఁడై పూర్వము నాలుగుకల్పములవఱకు నాతఁడుండియుండెను.

తతశ్చతుర్థే కల్పాన్తే వివేకస్తస్య చోదభూత్
విదూరస్యేవ వైడూర్య మహాచిత్యాజ్జలదోదయాత్. 9

తదుపరి నాల్గవకల్పముయొక్క చివర, మేఘోదయముచే విదూరమను భూమియందు వైడూర్యమణి యుద్భవించునట్లు, చిరకాలతపస్సుచే నాతనికి వివేకము జనించెను.

పునర్మృతిః పునర్జన్మ జరా మేతి విభావయన్
లజ్జేఽహం తత్కిమేకం స్యాత్స్థిరమిత్యవమృశ్య సః. 10

'మఱలమరల జన్మము, మరలమరల మృత్యువు, మరలమరల వార్ధక్యము జీవునకుఁ గలుగుచున్నవి. దీనిని విచారించుచు నేను లజ్జితుఁడనగుచున్నాను. కావున [illegible]యుండవో, అటువంటి స్థిరవస్తువొకటి యేదియైయుండును? — అని యిట్లాతఁడు విచారణయొనర్చెను,

మామాజగామ సంప్రష్టుమష్టాదశమయీం పురీం
స్వాముపోహ్య విరక్తాత్మా సంసారారసతాం గతః. 11

పంచప్రాణ, దశేంద్రియ, మనో, బుద్ధి, స్థూలదేహంబులను బదునెనిమిది అవయవములతో గూడిన తినపురమును (ఉపాధిని) చిరకాలమువరకు ధరించుటచే మిగుల శ్రాంతుఁడై, సంసారము యెడల విరక్తిగల్గి, (తారణోపాయమునుగూర్చి) నన్నడుగుటకై యాతఁడు నాచెంతకు వచ్చెను.

స మత్సమీపమాగత్య కృతోదారనమస్కృతిః
మత్పూజితోఽవసరత ఉవాచేదమనిన్దితమ్. 12

అట్లు నావద్దకువచ్చి, ఆదరముతోఁటి నమస్కరించెను. నేనున్ను నాతని నుచితరీతి సత్కరింప నంత ప్రశ్నావసరమును బొంది యాతఁడీయుత్తమవాక్యములఁ బల్కెను —

విద్యాధర ఉవాచ:—

మృదూని పరితాపీని దృషద్దృఢబలాని చ
ఛేదే భేదే చ దక్షాణి స్వశస్త్రాణీన్ద్రియాణి చ. 13

విద్యాధరుఁడు:—మహాత్మా! విషయములందు శీఘ్రముగఁ బ్రవేశించుటచేఁ గోమలములును తదుపరి సంతాపమును గలుగఁజేయునవియు, తమవిషయములనుండి తొలఁగనందుచే నతిదృఢములును, ఛేదన, భేదనములందు నిపుణులునగు నిజేంద్రియములకును, శస్త్రములకును భేదమేమియును లేదు.

పర్యాకులాని మలినాని విపత్ప్రదాని
దుఃఖోర్మిమన్తి గుణకానన పావకత్వాత్
హార్దాన్ధకారగహనాని తమోమయాని
జిత్వేన్ద్రియాణి సుఖమేతి చ కిం మహార్థైః. 14

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే విద్యాధరోపాఖ్యానే విద్యాధరప్రశ్నో నామ పఞ్చమః సర్గః ॥ 5 ॥

మహాశయా! ఈ యింద్రియములు హృదయమందు రూఢినొందిన అంధకారయుతములైన యరణ్యములవంటివై, తమోమయములై, కామాదిమర్కటములచే వ్యాకులములై, విపత్తినిగలుగఁజేయునవై, పదూర్మ్ములను దుఃఖరూపతరంగములచేఁ బూర్ణములై, మలినములై, గుణములను వనమును దగ్ధమొనర్చున వగుటచే దాహప్రదములైయున్నవి. వీనిని జయించుటచేతనే మనుజుఁడు సుఖవంతుఁడు కాఁగలడు. కావున, ఈవిద్యాధరభోగములచే నాకేమి ప్రయోజనము? (అనగా, వానియెడల విరక్తుఁడనై యుపదేశమునకై తమ్ముల శరణుబొందుటకై యేతెంచితినని భావము)

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్యప్రకాశికయందు నిర్వాణప్రకరణమున ఉత్తరార్ధమున విద్యాధరోపాఖ్యానమున విద్యాధరప్రశ్నయను నైదవ సర్గము ॥5॥



## షష్ఠః సర్గః.

[దివ్యభోగప్రసక్తేన చిరం స్వేన పరీక్షితాః
ఇహ విద్యాధరేణోక్తా విషయేన్ద్రియదుర్నయాః

దివ్యభోగములందాసక్తములును, చిరకాలమువఱకుఁ బరీక్షింపఁబడినవియునగు ఇంద్రియములయొక్కయు, విషయములయొక్కయు దుష్టత్వమును విద్యాధరుఁడు వర్ణించుట యిటఁ గానఁగును]

విద్యాధర ఉవాచ:—

యదుదారమనాయాసం క్షయాతిశయ వర్జితమ్.
పదం పావనమాద్యన్తరహితం తద్వదాశు మే. 1

విద్యాధరుఁడు:— మహాత్మా! సర్వదుఃఖరహితమై, సహజానందరూపమై, క్షయాతిశయవర్జితమై, ఆద్యంతరహితమైనట్టి పరమపావనమైన పదమేదిగలదో, అద్దానిని నాకు శీఘ్రముగవచింపుడు.

ఏతావన్తమహం కాలం సుప్త ఆసం జడాత్మకః
ఇదానీం సంప్రబుద్ధోఽస్మి ప్రసాదాదాత్మనో మునే. 2

ఓ మునీంద్రా! ఇంతకాలమువఱకు నేను జడాత్మకుఁడనై నిద్రించుచుంటిని. ఇపుడు మనస్సుయొక్క తీవ్రవైరాగ్యమను ప్రసన్నత్వముచే జాగ్రతుఁడనైతి.

మనో మహామయోత్తప్తం క్షుబ్ధమజ్ఞానవృత్తిషు
మాముద్ధర దురన్తేహం మోహాదహామితి స్థితాత్. 3

మహాత్మా! మనస్సుయొక్క మహారోగరూపమైన కామముచే సంతప్తుఁడనై, అజ్ఞానవృత్తులందు క్షోభనొందుచు, దుశ్ఛేద్యమైన కర్మతోఁ గూడుకొనియున్నట్టి నన్ను, అనాత్మయందాత్మాభిమానము కలుఁగజేయునదైన మోహము (అజ్ఞానము) నుండి యుద్ధరింపవేడెద.

శ్రీమత్యపి పదస్త్వాశు శాతనాః కాతరాదయః
గుణవత్యగ్రపత్రేఽపి తుహినానీవ పఙ్కజే. 4

లక్ష్మికి ఆధారమున్ను, గుణవతి (కమలసూత్రములతోఁగూడియున్నది)యు, గొప్పపత్రములు గలదియునైనను కమలముపై మంచుబిందువులు పడునట్లు, అనేక ఐశ్వర్యములతోఁ గూడియున్నవారును, గుణవంతులునైయున్నను, అజితేంద్రియత్వకారణమునను, ఆత్మజ్ఞానరాహిత్యమువలనను, విద్యాధరులపై కామ, క్రోధాది దుఃఖబాధలున్ను, భయ, కార్పణ్యాది దోషములున్ను వచ్చిపడుచున్నవి.

జాయన్తే చ మ్రియన్తే చ కేవలం జీర్ణజన్తవః
న ధర్మాయ న మోక్షాయ మశకా ఇవ పఙ్కజే. 5

జ్ఞానాభావముచే, కేవలము శిథిలీభూతులైన విద్యాధరాది దేవయోనులున్ను కమలమునందలి దోమలవలెఁ బుట్టుచు చచ్చుచున్నారు. మఱియు, విషయలంపటులగుటచే వారు ధర్మముకొఱకుగాని మోక్షముకొఱకుగాని ప్రయత్నించుటలేదు.

భావైస్తైరేవ తైరేవ తుచ్ఛాలమ్బ విడమ్బనైః
చిరేణపరిఖిన్నాః స్మో విప్రలమ్భాః పునః పునః. 6

తుచ్ఛమైన యల్పసుఖము నొసంగునవియు, పూర్వమనేక పర్యాయములనుభవింపఁబడిన వియునగు అయాశబ్దాది విషయములచే, విషయేంద్రియ స్పర్శములను వంచనోపాయములద్వారా మరల మరల వంచింపఁబడినవారమై చిరకాలము మేము మిగుల ఖిన్నులమైయున్నాము.

నాన్తోస్త్యస్య న చ స్థైర్యావస్థాః విశ్రాన్తమానసమ్
భ్రమన్తో భోగభఙ్గేషు మరు భూమిష్వివాధ్వనః. 7

మనస్సునకు విశ్రాంతి లేక, మరుభూములందువలె క్షణభంగురమైన భోగములందుఁ జరించుచున్న, నాకీ సంసారమార్గముయొక్క అంతముగాని, స్థిరత్వముగాని లేకయున్నది.

ఆపాతమధురారమ్భా భఙ్గురా భవహేతవః
అచిరేణ వికారిణ్యో భీషణా భోగభూమయః. 8

సంసార దుఃఖమునకు హేతువులైన యీభోగస్థితు లారంభమున క్షణకాలము మాత్రమే రమణీయముగఁ దోచునవియు, క్షణభంగురములును, శీఘ్రముగనే వికారయుక్తములగునవియు, భయంకరములు నైయున్నవి.

మానావమానపరయా దురహంకారకాన్తయా
నరేమే వామయా తాత హతవిద్యాధరశ్రియా. 9

ఓ మునీంద్రా! మానావమానతత్పరయు, దుష్టమగు అహంకారముగలవారికి ప్రియమైనదియు వివేకులకుఁ బ్రతికూలమైనదియునగు విద్యాధరసంపదయను కాంతతోటి నేను రమింపను.

దృష్టాశ్చైత్రరథోద్యాన భువః కుసుమకోమలాః
కల్పవృక్షలతా దత్తసమస్త విభవశ్రియః 10

పుష్పములచేఁ గోమలమైనట్టి నందనవనభూములను నేను గాంచితిని. కల్పవృక్షలతలచే నొసంగఁబడిన యైశ్వర్యము లన్నింటిని బొందితిని.

విహృతం మేరుకుఞ్జేషు విద్యాధరపురేషు చ
విమానవరమాలాసు వాతస్కన్ధస్థలీషు చ. 11

మహాత్మా! మేరుపర్వత కుంజములందును, విద్యాధరుల నగరములందును, శ్రేష్ఠములైన విమానములయొక్క మాలలందును, ఉత్తమవాయువుతోఁగూడిన స్థలములందును, నేను బాగుగ విహరించియుంటిని.

విశ్రాన్తం సురసేనాసు కాన్తాభుజలతాసు చ
హారిహారవిలాసాసు లోకపాలపురీషు చ 12

దేవతల సైన్యములందును, విలాసముచే మనస్సును హరించునట్టి స్త్రీల భుజారూపలతలందును, లోకపాలుర పురములందును నేను చిరకాలము విశ్రమించితిని.



న కించిదుచితం సాధు సర్వమాది విషోష్మణా
దగ్ధం భస్మాయతే తాత విజ్ఞాతమధునా మయా. 13

మహాశయా! కాని, ఇందేదియు యోగ్యమైనదియు, సుఖదాయకమైనదియు లేదని యిపుడు నే నెఱింగితిని. మఱియు నవియన్నియు మానసిక వ్యథలను విషముయొక్క యుష్ణత్వముచే దగ్ధమై భస్మమువలె నిపుడు నాకుఁ గానుపించుచున్నవి.

రూపాలోకనలోలేన వనితానన గృధ్నునా
నావభాసేన దోషాయ దుఃఖం నీతోస్మి చక్షుషా. 14

రూపగ్రహణమునఁ జంచలములైనవియు, స్త్రీల ముఖముల గాంచుటయందు మిగుల నభిలాషగలవియు, ప్రకాశయుక్తములు నగు యీ నేత్రములచే (స్వవిషయసంగ కారణమున) దుంఖమునే పొందితిని.

ఇదం గుణావహం నేదమితి ముక్త్వా వికల్పనమ్
రూపమాత్రానుసారిత్వాదవస్తున్యపి ధావతి. 15

వనితాదులందు వస్త్రాభరణములే శోభాదాయకములుగాని రక్తమాంసాదులు కావు—అను నివ్విధముగ వస్తువులందు 'ఇది గుణావహమైనది, ఇది కాదను' ఈవివేకము లేకయే కేవలము రూపమాత్రమువెంట తుచ్ఛవస్తువునుగూర్చి యీ నేత్రము బరువిడుచున్నది.

తావదాయాతి విరతిం న వశం యావదాపదామ్
నానా బన్ధపరం చేతః పరానర్థేహితోన్ముఖమ్. 16

నానావిధములగు బంధనాదులఁ గలుగఁజేయు కర్మలందుఁ దత్పరమై, మరణాది మహా అనర్థములఁ గలిగించు దుర్వ్యసనములందాసక్తమై చిత్తమెంతవఱకు నరకాద్యాపదల వశమును బొందుచుండునో, అంతవఱకది విరతి (ఉపరతి) ని బొందనేరదు.

ఘ్రాణమేతదనర్థాయ ధావచ్చైవాభితః స్ఫుటమ్
న నివారయితుం తాత శక్నోమీహ హయం యథా. 17

ఓ మునీంద్రా! నలువైపుల ప్రత్యక్షమగు అనర్థముల కొఱకుఁ బరువిడుచున్న యీ ఘ్రాణేంద్రియమును, దుష్టాశ్వమునువలె నేనిట నివారింపజాలకున్నాను.

గన్ధోదక ప్రణాలేన ముఖశ్వాసానుపాతినా
వైరిణేవాతిదోషేణ ఘ్రాణేనాస్మి నియోజితః. 18

ఒకానొకఁడు గొప్పదోష కారణమున శత్రువుచే బలవంతముగ వశీకరింపఁ బడినవాఁడై దుర్గంధయుక్తమైన స్థానమున నియోగింపఁబడువిధమున, నేనున్ను శ్లేష్మాది దుర్గంధోదకముతోఁ గూడినదై, ముఖశ్వాసాది యుక్తమైనట్టి ప్రణాళికారూపమైన ఘ్రాణేంద్రియముచే నద్దానిబలమున నియోగింపఁబడుచున్నాను.

చిరం రసనయా చాహమనయా నయహీనయా
గజగోమాయుగుప్తేషు దుఃఖాద్రిష్వలమాహతః. 19

భక్ష్యాభక్ష్యముల గూర్చిన విచారణలేనట్టి యీ జిహ్వేంద్రియముచేతను, గజ, శృగాలము (నక్క) లచే రక్షింపబడునవై, క్రిమికీటకపశ్వాదియోనిరూపములైనట్టి దుఃఖరూప పర్వతములపై నేను విసరివేయఁబడుచున్నాను.

నిరోద్ధుం న చ శక్నోమి స్పర్శలమ్పటతాం త్వచః
గ్రీష్మకాలసమిద్ధస్య తాపమంశుమతో యథా. 20

గ్రీష్మకాలమందలి ప్రదీప్తుఁడగు సూర్యుని తాపమును నిరోధింపఁజాలనట్లు, త్వగింద్రియము యొక్క స్పర్శలోలత్వమును నేను నిరోధింపఁజాలకున్నాను.

శుభశబ్దరసార్థిన్యో మునేః శ్రవణశక్తయః
మాం యోజయన్తి విషమే తృణేచ్ఛా హరిణం యథా. 21

సుఖదాయకమైన శబ్దరసము యొక్క యాస్వాదనమున ననురాగము గలిగియున్న శ్రవణ శక్తులు, కోమలతృణము నభిలషించు హరిణమునువలె నన్ను భయంకర స్థానమున నియోగించుచున్నవి.

ప్రణతాః ప్రియకారిణ్యః ప్రహ్వాభృత్యసమీరితాః
వాద్యగేయరవోన్మిశ్రాః శుభశబ్దశ్రియః శ్రుతాః. 22

ప్రియమొనర్చువారును వందనమాచరించు వారును, వినమ్రులునగు భృత్యాదులచే నుచ్చరింపఁబడిన వాద్య, గానశబ్దములచే మిళితములైన యనేకశుభశబ్దముల వైభవమును నేను వినియున్నాను.

శ్రియః స్త్రియో దిశశ్చైవ తటాశ్చామ్బోధిభూభృతామ్
దృష్టా విభవహారిణ్యః ప్రక్వణన్మణిభూషణాః. 23

శబ్దవంతములైన మణులయొక్క యాభరణములను ధరించువారును, తమ యైశ్వర్యములచే మనస్సున్ను హరించువారునునగు అనేక స్త్రీలను, విభవములను, దిక్కులను, సముద్ర, పర్వతాదుల తీరములను నేను గాంచితిని.

చిరమాస్వాదితాః స్వాదుచమత్కారమనోరమాః
ప్రహ్వాకాన్తాజనానీతాః షడ్రసాగుణశాలినః 24

తమరుచియొక్క చమత్కారముచే మనోరమమైనవియు, వినమ్రులగు స్త్రీలచేఁ గొనిరాఁబడినవియు షడ్రసముల మేళన, పాకచాతుర్యరూప గుణములచే శోభాయమానములు నగు పదార్థములను చిరకాలము నేనాస్వాదించితిని.

కౌశేయకామినీహారకుసుమాస్తరణానిలాః
నిర్విఘ్నమభితః స్పృష్టా భృశమాభోగభూమిషు 25

పట్టువస్త్రములను, స్త్రీలను, హారములను, పుష్పశయ్యలను, సుగంధశీతలమంద వాయువులను, భోగస్థితులందు నేను బూర్ణముగ నిర్విఘ్నతాపూర్వకముగ స్పృశించితిని.



వధూముఖౌషధీపుష్పసమాలమ్భనభూమయః
అనుభూతా మునే గన్ధా మన్దానిలసమీరితాః. 26

ఓ మునీంద్రా! ఉత్తమస్త్రీల ముఖములను, చందనాద్యోషధులను, పుష్పములను, కస్తూరీకర్పూరాదుల లేపనస్థితులను, మందవాయువుచేఁ గొనిరాఁబడిన యనేక సుగంధములను నే ననుభవించితిని.

శ్రుతం స్పృష్టం తథా దృష్టం భుక్తం ఘ్రాతం పునః పునః
సంశుష్కవిరసం భూయః కిం భజామి వదాశు మే. 27

మహాత్మా! శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములను విషయములను నేను మరల మరల వింటిని, స్పృశించితిని, కాంచితిని, భుజించితిని, మూర్కొంటిని. కాని యవియన్నియు నిపుడుమిగుల శుష్కప్రాయములుగను, రసహీనములుగను గన్పట్టుచున్నవి. కావున తిరిగి నేనిపుడు దేనిని సేవింపవలెనో శీఘ్రముగ వచింపవేఁడెద.

భుక్త్వా వర్షసహస్రాణి దుర్భోగపటలీమిమామ్
ఆబ్రహ్మస్తమ్బపర్యన్తం న తృప్తిరుపజాయతే. 28

బ్రహ్మాది స్తంబ (తృణ) పర్యంతముగల యీ దుష్టమైన భోగసమూహమంతటిని వేలకొలది వత్సరము లనుభవించినను తృప్తిగలుగదు.

సామ్రాజ్యం సుచిరం కృత్వా తథా భుక్త్వా వధూగణమ్
భంక్త్వా పరబలాన్యుచ్చైః కిమపూర్వమవాప్యతే. 29

మహాత్మా! ఉత్తమచక్రవర్తియొక్క రాజ్యమును చిరకాలమేలి, అనేక లలనాగణంబుల ననుభవించి, శత్రుబలంబులఁ బూర్ణముగఁ దనుమాడినను ఈ జీవుఁ డపూర్వమగు పదార్థమును దేనిని బొందుచున్నాఁడు?

యేషాం వినాశనం నాసీద్యైర్భుక్తం భువనత్రయమ్
తేఽపి తేఽప్యచిరేణైవ సమం భస్మపదం గతాః. 30

ఎవరికి (హిరణ్యకశిపుఁడు మున్నగువారికి) వినాశములేదో, ముల్లోకముల నెవ రనుభవించిరో అట్టివారుకూడ శీఘ్రముగనే భస్మపదమును బొందిరి.

ప్రాప్తేన యేన నో భూయః ప్రాప్తవ్యమవశిష్యతే
తత్ప్రాప్త్యై యత్నమాతిష్ఠేత్కష్టయాఽపి హి చేష్టయా. 31

దేనిని బొందినచో మరలంపొందఁదగినదేదియు మిగిలియుండదో, అద్దానిప్రాప్తికొఱకే కష్టాచరణముచేసైనను బ్రయత్నింపవలెను.

యేన కాన్తాశ్చిరం భుక్తా భోగాస్తస్యేహ జన్తుభిః
దృష్టో న కస్యచిన్మూర్ధ్ని తరుర్వ్యోమప్లవశ్చ వా. 32

ఎవఁడు చిరకాలము పరితాపగ్రస్తుఁడును, తదితరములగు అనేక విషయభోగములను ననుభవించెనో, అట్టివాని శిరస్సుపై కల్పవృక్షమును గాని విమానమును గాని యెవరును గాంచలేదు.

చిరమాశు దురన్తాసు విషయారణ్యరాజిషు
ఇన్ద్రియైర్విప్రలబ్ధోఽస్మి ధూర్తైర్బాల ఇవార్భకః. 33

దురంతములైన విషయములను మహారణ్యసమూహములందు, ధూర్తబాలకులచే సాధుబాలకునివలె నేను జిరకాలము వంచింపఁబడితిని.

అద్య త్వేతే పరిజ్ఞాతా మయా స్వవిషయారయః
కష్టా ఇన్ద్రియనామానో వఞ్చయిత్వా తు మాం పునః. 34
సంసారజఙ్గలే శూన్యే దగ్ధం నరమృగం శఠాః
ఆశ్వాస్యాశ్వాస్య నిఘ్నన్తి విషయేన్ద్రియలుబ్ధకాః. 35

శబ్దాదివిషయరూపములగు పంచభూతములనే మనస్సనంఁడి బయటకు లాగి తమతమ భోగార్థము శ్రోత్రాదీంద్రియసమూహములచే స్థితినొందియున్నవియు, కష్టప్రదములునగు నా విషయములను శత్రువులను నేఁడు నేనెఱిఁగితిని. ఈ విషయములను శఠులగు బోయవారు శూన్యమైన యీ సంసారారణ్యమున హీనుఁడనైన మనుజరూపమృగమగు నన్ను మోసగించి మోసగించి చంపుచున్నారు.

విషమాశీవిషైరేభిర్విషయేన్ద్రియపన్నగైః
యేన దగ్ధా న దృష్టాస్తే ద్విత్రా ఏవ జగత్యపి. 36

ఈ భయంకరమైన విషయేంద్రియ సర్పముల దృష్టివిషయములచే గాంచఁబడనివారును, దగ్ధముకానివారునునగు జనులు ఈ ప్రపంచమందంతట నే యిద్దఱో, ముగ్గురో యుందురు.

భోగభూమేభిర్వలితాం తృష్ణాతరలవాగురామ్
లోభోగ్రకరవాలాఢ్యాం కోపకున్తకులాకులామ్. 37
ద్వన్ద్వజాలరథవ్యాప్తామహంకారానుపాలితామ్
చేష్టాతురంగమాకీర్ణాం కామకోలాహలాకులామ్. 38
శరీరసీమాన్తగతాం దురిన్ద్రియపతాకినీమ్
యే జేతుముత్థితాస్తాత త ఏవేహ హి సద్భటాః. 39

ఓ మునీంద్రా! భోగములను భయంకరములైన యేనుగులచే జుట్టఁబడినదియు, తృష్ణయను జంచలమైన పాశముగలదియు, లోభమను తీక్ష్ణఖడ్గములచే బూర్ణమును, క్రోధమను నీఁటెల సమూహముచే జిహ్నితమైనదియు, శీతోష్ణాది ద్వంద్వంజాలమను రథములచే వ్యాప్తమును, అహంకారమను సేనాపతిచేఁ బాలితమును, చేష్టలనుఁ జంచలములైన యశ్వములచే బూర్ణమును, కామమను కోలాహలముతోఁ గూడినదియు, శరీరమను నగరముయొక్క యెల్లనాక్రమించినదియు, దుష్టములైన యింద్రియములను పతాకములచే నొప్పునదియునగు సేనను జయించుటకెవఁడు సన్నద్ధుఁడగునో, అతఁడే యీ ప్రపంచమున నుత్తమవీరుఁడగును.



సుసాధ్యః కరటోద్భేదో మత్తైరావణదన్తినః
నోత్పథప్రతిపన్నానాం స్వేన్ద్రియాణాం వినిగ్రహః. 40

మదించిన 'ఐరావత'మను నేనుఁగుయొక్క గండస్థలమును జీల్చుటయు సులభమేకాని, దుర్మార్గమునఁ బ్రవృత్తములగు తనయింద్రియములను నిగ్రహించుటమాత్రము సులభముకాదు.

పౌరుషస్య మహత్త్వస్య సత్యస్య మహతః శ్రియః
ఇన్ద్రియాక్రమణం సాధో సీమాన్తో మహతామపి. 41

ఓ సాధూ! తత్త్వవేత్తలకుఁగూడ, పౌరుషముయొక్కయు, మహత్త్వముయొక్కయు, మహాధైర్యముయొక్కయు, విశ్రాంతిసంపదయొక్కయు సీమాంతము (మేర) యింద్రియనిగ్రహమే యై యున్నది.

తావదుత్తమతామేతి ధ్రుమానపి దివౌకసామ్
కృపణైరిన్ద్రియైర్యావత్తృణవన్నాపకృష్యతే. 42

కుత్సితములైన యింద్రియములచేఁ దృణమువలె నీడ్వఁబడనంతవఱకు మనుజుఁడు దేవతలకును మాన్యుఁడగును.

జితేన్ద్రియా మహాసత్త్వా యే త ఏవ నరా భువి
శేషానహమిమాన్మన్యే మాంసయన్త్రగణాంశ్చలాన్. 43

జితేంద్రియులగు మహాత్ములే యీ ప్రపంచమున మనుష్యులనఁ దగుదురు. తక్కిన వారిని (అజితేంద్రియులను) చలించుచున్న మాంసయంత్రములుగనే నేను దలంచుచున్నాను.

మనః సేనాపతేః సేనామిమామిన్ద్రియపఞ్చకమ్
జేతుం చేదస్తి మే యత్నో జయామి తదలం మునే. 44

ఓ మునీశ్వరా! పంచేంద్రియములను సైన్యమునకు సేనాపతియైనట్టి మనస్సును జయించుటకేదేని యుపాయమున్నచో నిఁక ఆ సైన్యమును బూర్ణముగ జయింపగలను.

ఇన్ద్రియోత్తమరోగాణాం భోగాశావర్జనాదృతే
నౌషధాని న తీర్థాని న చ మన్త్రాశ్చ శాన్తయే. 45

ఇంద్రియములను భయంకరరోగములయొక్క శమనమునకై భోగములఁగూర్చినయాశను ద్యజించుటతప్ప వేఱు ఔషధములు గాని, తీర్థములు గాని, మంత్రములు గాని లేవని నేను నిశ్చయించితిని.

నీతోఽస్మి పరమం ఖేదమభిధావద్భిరిన్ద్రియైః
ఏక ఏవ మహారణ్యే తస్కరైః పథికో యథా. 46

మహారణ్యమున నొంటరిగానున్న బాటసారి చోరులవలన ఖేదమొందునట్లు సఖుడై ప్రుల్లఁ బరువిడు యీ యింద్రియములచే నేను మిగుల ఖేదమొందుచున్నాను.

పఙ్కవన్త్యప్రసన్నాని మహాదౌర్భాగ్యవన్తి చ
గన్ధిశైవలతుచ్ఛాని పల్వలానీన్ద్రియాణి చ. 47

బురదతోఁగూడి మలినములై, మహాదౌర్భాగ్యయుతములై, దుర్గంధముతోను నాచుతోను గూడి తుచ్ఛములైనట్టి అల్పజలాశయము (మడుఁగు)లున్ను, ఇంద్రియములున్ను సమానములు.

దురతిక్రమణీయాని నీహారగహనాని చ
జనితాతఙ్కజాలాని జఙ్గలానీన్ద్రియాణి చ. 48

దాటుటకు కష్టసాధ్యములును, మంచుచే దట్టమైనవియు, భయమును గొల్పునవియునగు యరణ్యములున్ను, ఇంద్రియములున్ను సమానములు.

పఙ్కజాని సరన్ధ్రాణి సుదుర్లక్ష్యగుణాని చ
గ్రన్థిమన్తి జడాఙ్గాని మృణాలానీన్ద్రియాణి చ. 49

బురదయందుఁ బుట్టునవియు, రంధ్రముతోఁగూడినవియు, మిగుల దుర్లక్ష్యమగు తంతువులు (వాసనలు) గలదియు, గ్రంథియుక్తములును, జడమైన అవయవములతోఁ గూడి నవియునగు తామర తూండ్లును, యింద్రియములును సమానములు.

రూక్షాణి రత్నలుబ్ధాని కల్లోలవలితాని చ
దుర్గ్రహగ్రాహఘోరాణి క్షారామ్బూనీన్ద్రియాణి చ. 50

నిష్ఠురములును, రత్నలోభులును, తరంగ (షడూర్మి)యుక్తములును, గ్రహించుటకుఁ గష్టసాధ్యమైనట్టి మొసళ్లతోఁగూడి భయంకరమైనవియునగు సముద్రపు క్షారోదకములున్ను, ఇంద్రియములున్ను సమానములు.

బాన్ధవోద్వేగదాయీని దేహాన్తరకరాణి చ
కరుణాక్రన్దకారీణి మరణానీన్ద్రియాణి చ. 51

బంధువులకు భయమును గొల్పునదియు, మఱియొక దేహమును బొందించునదియు, కరుణచే రోదనము గల్పింపజేయునదియునగు మరణమున్ను, ఇంద్రియములున్ను సమానములు.

అవివేకిష్వమిత్రాణి మిత్రాణి చ వివేకిషు
గహనాన్తరశూన్యాని కాననానీన్ద్రియాణి చ. 52

అవివేకులకు శత్రువులున్ను, వివేకులకు మిత్రులున్నునైనవియు, దట్టములును, అనంతములును, జనశూన్యములునగు యరణ్యములున్ను ఇంద్రియములున్ను సమానములు.

ఘనాస్ఫోటాన్యసారాణి మలినాని జడాని చ
విద్యుత్ప్రకాశాన్వితాని భీమాభ్రాణీన్ద్రియాణి చ. 53

గొప్పశబ్దముతోఁగూడినవియు, అసారములును, మలినములును, జడములును మెఱపు యొక్క ప్రకాశమువలె క్షణకాలము సుఖముగను గలిగించునవియు, భయంకరములునగు మేఘములున్ను, ఇంద్రియములున్ను సమానములు.



క్షుద్రప్రాణిగృహీతాని వర్జితాని కృతాత్మభిః
రజస్తమోభిభూతాని స్వేన్ద్రియాణ్యవటాని చ. 54

తుచ్ఛసుఖమందాసక్తిగల ప్రాణులచే గ్రహింపఁబడునవియు, మహాత్ములచే వర్జింపఁబడునవియు, రజస్తమోగుణంబులచే వ్యాప్తములునగు యింద్రియములున్ను, మురికిగుంటలున్ను సమానములు.

పాతనైకాన్తదక్షాణి దోషాశీవిషవన్తి చ
రూక్షకణ్టకలక్షాణి శ్వభ్రాగ్రాణీన్ద్రియాణి చ. 55

క్రిందఁబడఁద్రోయుటయందు దక్షనిపుణములును, దోషయుక్తములును, సర్పములతోఁగూడి విషయుతములై యుండునవియు, అనేకములగు కఠినములైన ముండ్లతోఁగూడియున్నవియు, శిథిలమైన ముఖములు గలివియునగు గోతులున్ను ఇంద్రియములున్ను సమములు.

ఆత్మంభరీణ్యనార్యాణి సాహసైకరతాని చ
అన్ధకారవిహారీణి రక్షాంసి స్వేన్ద్రియాణి చ 56

తమ యుదరపోషణమున మక్రము ప్రవీణులును, అనార్యులును, నీచసాహసమందు నిరతులును, అంధకారమున విహరించువారునునగు రాక్షసులున్ను, ఇంద్రియములున్ను సమానములు.

అన్తఃశూన్యాన్యసారాణి వక్రాణి గ్రన్థిమన్తి చ
దహనైకార్థయోగ్యాని దుర్దారూణీన్ద్రియాణి చ. 57

లోన శూన్యముగనుండునవియు, సారరహితములైనవియు, వక్రములును, గ్రంథియుక్తములును కాల్చుటకు మాత్రము తగినవియు నగు శిథిలములైన వెదురు బొంగులున్ను, ఇంద్రియములున్ను సమములు.

ఘనమోహప్రబన్ధీని దుష్పాంకపగహనాని చ
మహావకరతుచ్ఛాని కుపురాణీన్ద్రియాణి చ. 58

చోరత్వము, జూదము, కలహము మున్నగు దుర్వ్యసనములతోఁ గూడియుండుటచే ఘనమోహసంయుక్తములును, శిథిలమైన కూపములచేఁ బరిపూర్ణములును, గొప్పధూళిచేఁ గప్పఁబడి నిందితములై యొప్పునవియునగు దుర్జననివాసములైన పురములున్ను, ఇంద్రియములున్ను సమానములు.

అనన్తేషు పదార్థేషు కారణాని ఘటాదిషు
సంభ్రమాణి సపఙ్కాని చక్రకాణీన్ద్రియాణి చ. 59

అనంతములైన ఘటాదిపదార్థములకుఁ గారణములును, భ్రమయుక్తములును పంకసహితములునగు కులాలుని (కుమ్మరివాని) చక్రములున్ను, ఇంద్రియములున్ను సమములు.

ఆపన్నిమగ్నమిమమేవమకించనం త్వం
మాముద్ధరోద్ధరణశీల దయోదయేన
యే నామ కేచన జగత్సు జయన్తి సన్త-
స్తత్సంగమం పరమశోకహరం వదన్తి. 60

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే విద్యాధరోపాఖ్యానే వైరాగ్యవర్ణనం నామ షష్ఠః సర్గః ॥ 6 ॥

ఆపదలుగలవారి నుద్ధరించునో మహాత్మా! ఈ ప్రకారమగు దుష్టములైన యింద్రియములచే జనింపఁజేయఁబడిన ఆపదలను సముద్రమున మునింగి, సమస్తమును త్యజించి తమశరణాగతిని బొందిన యీ దీనుని దయచేసి (తత్త్వోపదేశముచే) యుద్ధరింపుడు. ఏలయనఁగా, జగత్తున సర్వోత్తములై వెలయుచునుంటి తత్త్వజ్ఞులగు మహాత్ముల సాంగత్యమును సమస్తశాస్త్రములున్ను సజ్జనులున్ను సకలశోకాపహారకములుగ వచించుచున్నారు.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్యప్రకాశికయందు నిర్వాణప్రకరణమున ఉత్తరార్ధమున విద్యాధరోపాఖ్యానమున వైరాగ్యవర్ణనమను నాఱవసర్గము ॥ 6 ॥

---

## సప్తమః సర్గః

[బ్రహ్మైవ న జగద్దుఃఖమజ్ఞానం జగదాతతమ్
అహంబీజాత్ప్రరూఢో హి జగద్వృక్షోఽత్ర వర్ణ్యతే.

సమస్తము బ్రహ్మమే; జగత్తొకింతయును లేదు. అజ్ఞానముచే ఈ జగత్తు దుఃఖములచే వ్యాప్తమైయున్నది. అహంకారమను బీజమునుండి యీ జగద్రూపవృక్షము వృద్ధినొందినది — ఈమున్నగు విషయములిచట వర్ణింపఁబడుచున్నవి.]

భుశుణ్డ ఉవాచ:—

తతస్తస్య మయా బ్రహ్మంస్తచ్ఛ్రుత్వా పావనం వచః
ఇదముక్తం యథా పృష్టం సుస్పష్టపదయా గిరా. 1

భుశుండుఁడు. — మహాత్మా! అపుడాతని యాపవిత్రవాక్యములను వినియాతఁడడిగిన విధముననే స్పష్టపదములతోఁగూడిన వాక్కుతోనే నిట్లు పలికితిని.

సాధు విద్యాధరాధీశ దిష్ట్యా బుద్ధోఽసి భూతయే
భవాన్ధకూప కుహరాచ్చిరేణోత్థానమిచ్ఛసి. 2

ఓ విద్యాధరాధిపా! నీవాత్మజ్ఞానమను ఐశ్వర్యముకొఱకై సౌభాగ్యవశమున జాగృతుఁడవైతివిగాన చాలమంచిది. చిరకాలమునకిపుడు నీవు సంసారమను అంధకూపమునుండి వినిర్గతుఁడవు కాఁదలంచితివి.

పావనీయం తవ మతీ రాజతే ఘనరూపిణీ
వివేకే నానలేనేవ కనకద్రవసంతతిః. 3

అగ్నిచే వ్యాప్తమగు సువర్ణద్రవసమూహమువలె నీబుద్ధి యిపుడు వివేకముచేఁబూర్ణమై శోభించుచున్నది.



ఉపదేశగిరామర్థమాదత్తే హారిహేలయా
ముకురే నిర్మలే ద్రవ్యమయత్నేనైవ బిమ్బతి. 4

కావుననే యీ నీబుద్ధి నాయుపదేశవాక్కుల యర్థమును అప్రయత్నముగనే గ్రహింపగలదు. నిర్మలమైన యద్దమునఁ బదార్థముల ప్రతిబింబము అయత్నముగనే పడునుగదా!

యదిదం వచ్మి తత్సర్వమోమిత్యాదాతుమర్హసి
అస్మాభిశ్చిరమన్విష్టం నాత్ర కార్యా విచారణా. 5

నేను దేనిని వచింతునో, దానినంతయు నీవంగీకారబుద్ధిచే గ్రహింపఁదగినది. ఏలయనఁగా మేము చిరకాలము విచారించి దీనిని నిశ్చయించితిమి. అందుచే నీవిటఁ గొంచెమైనను విచారింపబనిలేదు.

యత్కించిత్స్వదతేఽన్తస్తే బుధ్యస్వాబోధముత్సృజన్
నాసి త్వం చిరమప్యన్తః ప్రేక్షితోఽపి న లభ్యసే. 6

నీవు నీయజ్ఞానమును త్యజించి, అహంకారాది యేదృశ్యప్రపంచము నీయంతఃకరణమున ననుభూతమగుచున్నదో, అది నీవు కావని తలంచుము. ఏలయనఁగా, దృశ్యవర్గమునఁ జిరకాలము వెదకినప్పటికిని ఆత్మ నీకు లభ్యముకాదు. (కావున, దృశ్యమాత్రరూపమైనట్టి అజ్ఞానమును వీడి, దానికి సాక్షియైనట్టి ఆత్మయే నీవని యెఱుఁగుము)

నాహం త్వమస్తి న జగదితి నిశ్చయినస్తవ
సర్వమస్తి శివం తచ్చ న దుఃఖాయ సుఖాయ తే. 7

'నేనుగాని, నీవుగాని, ఈ జగత్తుగాని లేవు, అంతయు బ్రహ్మమయమేయై యున్నది' అను ఈనిశ్చయము సుఖమునే గలిగించునుగాని దుఃఖమును గలిగింపదు.

కిమజ్ఞత్వాజ్జగజ్జాతం జగతోఽథ కిమజ్ఞతా
విచార్యాపీతి నో విద్మ ఏకత్వాదలమేతయోః. 8

సుషుప్తియందుఁ బ్రసిద్ధమైనట్టి అజ్ఞానమునుండి జాగ్రత్స్వప్నరూపమగు జగత్తు పుట్టినదా? లేక, జాగ్రదాదిరూపమగు జగత్తునుండి సుషుప్తిసంబంధమైన అజ్ఞానము పుట్టినదా? అనియిట్లు విచారించినప్పటికిని కార్యకారణభావవ్యవస్థను మన మెఱుఁగజాలము. కావున, (కాఠిన్య, ద్రవావస్థలకంటె యందును ఘృతమునొక్క యేకత్వమువలె) యీరెండు దశలున్ను అజ్ఞానరూపములగుటచే వానిగూర్చిన విచారము వ్యర్థమేయగును.

మృగతృష్ణామ్బువద్విశ్వమవస్తుత్వాత్సదప్యసత్
యచ్చేదం భాతి తద్బ్రహ్మ న కించిత్కించిదేవ వా. 9

ఈజగత్తంతయు నెండమావులందలి జలమువలె అవస్తువగుటచే, సత్తువలె భాసించుచున్నప్పటికిని అసత్తేయగును. మఱియు ఈభాసించునది యంతయు అధిష్ఠానరూపముచే బ్రహ్మమేయైయున్నది. కాని జగద్రూపముచే (అవస్తువై, బాధింపఁబడుటఁబట్టి) బ్రహ్మముకానిదై యొప్పుచున్నది.

మృగతృష్ణాంబువద్విశ్వం నాస్తి త్వమథవాస్తి చ
ప్రతిభాసోఽపి నాస్త్యత్ర తదభావాగతః శివమ్. 10

మృగతృష్ణాజలమునకువలె ఈప్రపంచమునకు నాస్తిత్వముగాని, అస్తిత్వముగానిలేవు. మఱియు అభావమువలన ప్రతిభాసమున్నునిట లేకయున్నది, కావున సమస్తము శివరూపమైన బ్రహ్మమేయగును.

విశ్వబీజమహంత్వం త్వం విద్ధి తస్మాద్ధి జాయతే
సాద్ర్యబ్ధ్యుర్వీనదీశాది జగజ్జరఠపాదపః. 11

ఓ విద్యాధరా! ఈ జగత్తునకు మూలము అహంకారమనియే నీవెఱుఁగుము. దానినుండియే పర్వత, సముద్ర, పృథివీ, నదీ, దిగాదిసహితమగు ఈజగత్తను పురాతనవృక్షము జనించినది.

అహన్త్వబీజాదణుతో జాయతేఽసౌ జగద్ద్రుమః
తస్యేన్ద్రియరసాఢ్యాని మూలాని భువనాని హి. 12
తారకాజాలకలికా ఋక్షౌఘః కోరకోత్కరః
వాసనాగుచ్ఛవిసరాః పూర్ణచన్ద్రఫలాలయః. 13
స్వర్గాదయో బృహద్వర్గా మహావిటప కోటరాః
మేరుమన్దరసహ్యాదిగిరయః పత్త్రరాజయః. 14
సప్తాబ్ధయోఽగ్రసుతయః పాతాలం మూలకోటరమ్
యుగాని ఘుణవృన్దాని పర్వాణి గుణపఙ్క్తయః. 15
అజ్ఞానముత్పత్తిమహీ నరా విహగకోటయః
ఉపలమ్భో బృహత్స్తమ్భో దవో నిర్వాణనిర్వృతిః. 16
రూపాలోకమనస్కారా వివిధా మోదవృత్తయః
వనం విపులమాకాశం శుక్తిజాలం ముఖత్వచః. 17
విచిత్రశాఖా ఋతవ ఉపశాఖా దిశో దశ
సంవిద్రసమహాపూరో వాతస్పన్దో నివర్తనః. 18
చన్ద్రార్కరుచయో లోలా మజ్జనోన్మజ్జనోన్ముఖాః
రమ్యాః కుసుమమఞ్జర్యస్తిమిరం భ్రమరభ్రమః. 19

సూక్ష్మమైనట్టి అహంకారమను బీజమునుండి యీజగత్తను వృక్షము జనించుచున్నది. ఇంద్రియములయొక్క విషయములందలి ఆసక్తియను రసముచే బూర్ణములైనట్టి యధోలోకము లీవృక్షముయొక్క మూలములైయున్నవి. అశ్వినిమొదలగు యిరువదియేడు నక్షత్రముల సమూహము దీనిప్రధానమైన మొగ్గలు, తక్కిన నక్షత్రముల సమూహము దీని చిన్నమొగ్గలు. వాసనలు దీని పూఁగుత్తులు. పూర్ణచంద్రుఁడు ఫలగుచ్ఛము. స్వర్గాది మహత్తరమైన లోకములు దీనికొమ్మలు. మేరు, మందర, సహ్యాది పర్వతములు పత్రసమూహములు. సప్తసముద్రములు దీని పాదులయొక్క నలుప్రక్కలనున్న అగడ్తలు. పాతాళము దీని మూలభాగము యుగములు దీనిని దొలుచునట్టి పురుగులు. ఋతుమాసాదులు దీని గనుపులు. అజ్ఞానమే దీని యుత్పత్తిప్రదేశము. జీవులేదీనిపైనుండు అసంఖ్యములైన పక్షులు. భ్రాంతిజ్ఞానమే దీని మహాస్తంభము (సర్వవృక్షాధారమగు మధ్యభాగము,) తత్త్వజ్ఞానముచే నొందు నిర్వాణరూపమగు నిర్వృతి (శాంతియే) దీనిని భస్మీభూతమునరుచునట్టి దావాగ్ని. ఇంద్రియములయొక్క విషయసాక్షాత్కారమున్ను, మనస్సుయొక్క సంకల్పవికల్పాదులున్ను దీని గంధములు. అవ్యాకృతాకాశము దీని విశాలమైన వనము. (హాస్యాదులందలి) ముఖచర్మములు. నేత్రపుటములు పైక్రింది పెదవులు. ఉద్భిన్నమైన శుక్తిజాలమువంటి దీని పుష్పోద్భేదనము. ఋతువులు దీని విచిత్రములైన శాఖలు. దశదిక్కులు దీని యుపశాఖలు. ఆత్మసంవిత్తు దీని జీవనహేతువైన రసప్రవాహము. సూత్రాత్మ దీని వాయుపటలము. ప్రతిదిన ముదయాస్తమయములందుఁ దత్పరులగు చంద్రసూర్యులయొక్క ప్రకాశములు దీని రమ్యమైన పూఁగుత్తులు. అంధకారమే దీని తుమ్మెదలయొక్క భ్రమణము;

పాతాలమాశాగగనం సరిత్సు-
మాపూర్య తిష్ఠత్యసదేవ సద్వత్
తస్యానహన్తాగ్నిహతే హి మర్ద్ధ-
బీజే పునర్నాస్తి సతోఽపి రోహః. 20

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే విద్యాధరోపాఖ్యానే జగద్వృక్షబీజవర్ణనం నామ సప్తమః సర్గః ॥7॥

ఈప్రకారముగ ఈ సంసారవృక్షము, తన మూలముచేఁ బాతాళమును, మధ్యభాగముచే దిక్సమూహమును, అగ్రభాగముచే నంతరిక్షమును వ్యాపించియున్నదై వాస్తవముగ అసత్తైనను భ్రాంతిచే సత్తువలెఁ గోచరించుచున్నది. ఆత్మజ్ఞానరూపమైన 'అనహంభావనా'మయమగు అగ్నిచే అహంకారమను దీని బీజము దగ్ధమొనర్పఁబడనీక శేషాపాతమువలనఁ బ్రతిభాసమాత్రముగా నున్నప్పటికిని దీనికి మరల జన్మాదులచే బ్రరోహము లేదు.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్యప్రకాశికయందు నిర్వాణప్రకరణమున ఉత్తరార్ధమున విద్యాధరోపాఖ్యానమున జగద్వృక్షబీజవర్ణనమను నేడవ సర్గము ॥7॥

---

## అష్టమః సర్గః

[ఇహ సంసారవృక్షస్య జ్ఞానాదుచ్ఛేద ఈర్యతే
సంకల్పమణ్డపప్రాయః సంసార ఉపవర్ణ్యతే.

జ్ఞానముచే సంసారవృక్షముయొక్క యుచ్ఛేదనము, సంకల్పమండపముగా సంసారము వర్ణింపఁబడుట, యిచటఁ గాననగును.]

భుశుణ్డ ఉవాచ:—

విద్యాధర ధరాధారో గిరికన్దరమన్దిరః
దిగన్తరామ్బరాచార చారసంచార చఞ్చురః. 1
ఈదృశోఽయం జగద్వృక్షో జాయతేఽహంత్వబీజతః
బీజే జ్ఞానాగ్నినిర్దగ్ధే నైవ కించన జాయతే. 2

భుశుండుఁడు:- ఓ విద్యాధరా! అధోలోకము లేడింటితోఁగూడిన యీ భూమండల మెద్దాని మూలభాగమైయున్నదో, లోకాలోకాంతపర్వతములు గుహ లెద్దాని (ఆలవాలసహితమగు) వేదియై యొప్పుచున్నవో, ఏది దశదిశలందును, ఆకాశమందును శాఖావిస్తారములచేతను, ప్రాణిసంచారముచేతను జంచలమైయున్నదో, అట్టి యీ సంసారవృక్షము అహంకారమను బీజమునుండి యుత్పన్నమగుచున్నది. కాని, ఎపుడు జ్ఞానాగ్నిచే ఆబీజము దగ్ధమగునో, అపుడీవృక్ష మొకింతేని జనింపకుండును.

ప్రేక్షమాణం చ తన్నాస్తి కిలాహం త్వం కదాచన
ఏతావదేవ తజ్జ్ఞానమనేనైవ ప్రదహ్యతే. 3

వాస్తవముగ ఈప్రపంచమేమి అని తత్త్వదృష్టిచే విచారించి, సమస్తము బ్రహ్మమాత్రముగ నిశ్చయించుటచే ఆ యహంకార మెన్నఁడును నుండఁజాలదు— ఇంతమాత్రమే (పైఁదెల్పిన) యీ జ్ఞానము దీనిచేతనే అహంకారము దహింపఁబడుచున్నది.

అహంత్వభావాచ్చాహంత్వమస్తి సంసారబీజకమ్
నాహంత్వభావాన్నాహత్వమస్తీతి జ్ఞానముత్తమమ్. 4

దేహాదులందు 'అహం' భావన యొనగ్చుటవలన అహంకారము అస్తిత్వముగలదై సంసారమునకు బీజమైయలరుచున్నది. సర్వత్ర బ్రహ్మభావన గావించుటచే నిఁక ఆయహంకారముండఁజాలదు. ఇదియే యుత్తమమైన జ్ఞానము.

సర్గాదావేవ సర్గస్య కిలాస్యాభావయోగతః
కుతోఽహంత్వం కుతస్త్వం త్వం కుతో ద్వైతైక్యవిభ్రమః. 5

సృష్ట్యాదియందే యీ సృష్టియొక్క అభావము ప్రసిద్ధమైయుండ నిఁక 'అహంత్వమెచట' త్వంత్వమెచట (నేను, నీవను భావము లెక్కడివి,) ద్వైత, ఏకత్వ విభ్రమమెచట?

సమాకర్ణ్య గురోర్వాక్యం యతన్తే యే స్వయత్నతః
సంకల్పత్యాగమామూలం పదప్రాప్తౌ జయన్తి తే. 6

గురువాక్యము నెవరు శ్రద్ధతో విని, తదుక్తరీతి సంకల్పమును సమూలముగఁ ద్యజించుటకై స్వయముగ యత్నమాచరించుదురో, వారే నిస్సంకల్పమగు ఆత్మపదప్రాప్తియందు జయించుదురు,

రన్ధనాజ్జయమాప్నోతి స్వశాస్త్రే సూపకృత్కృతే
వివేకీ స్వవివేకిత్వం యతనాదేవ నాన్యథా. 7



పాచకుఁడు పాకశాస్త్రమును బాగుగ నభ్యసించి, తదుక్తరీతి స్వయముగ పాకాదుల గావించుటవలన త్రుత్తమున్నగువాని జయమును, రాజాదుల సన్మానమును బొందునట్లు, వివేకియు గురువువద్ద శ్రవణముచేసి, ఆశ్రవణము చేసినదానిని స్వప్రయత్నముచే బాగుగ సాధించుటచేతనే కైవల్యపదమును బొందగల్గునుగాని మఱియొక విధముగఁగాదు.

చిచ్చమత్కారమాత్రంత్వ జగద్విద్ధిహ నేతరత్
నాశాసు నబహిర్నాన్తరేతత్క్వచన విద్యతే. 8

ఓ విద్యాధరా! ఈ జగత్తును నీవు చిత్తు(చైతన్యము)యొక్క చమత్కారముగనే యెఱుగుము. కావుననే యాచైతన్యముకంటె భిన్నముగ దిక్కులందుగాని, బాహ్యమునగాని, అభ్యంతరమునగాని, యేమియును లేదు.

సంకల్పోన్మేషమాత్రేణ జగచ్చిత్రం విలోక్యతే
తదున్మేషవిలయి చిత్రకృచ్చిత్తచిత్రవత్. 9

చిత్రకారుని చిత్తమందలి చిత్రమువలె ఈజగద్రూపచిత్రము సంకల్పముయొక్క యావిర్భావమాత్రముచే గానుపించుచు, తదభావముచే లయించుచు నున్నది.

మణ్డపోఽస్తి మహాస్తమ్భో ముక్తామణివినిర్మితః
బహుయోజనలక్షాణి కాన్తకాఞ్చనచిత్రితః. 10
మణిస్తమ్భసహస్రేణ వృతోఽగ్రే ప్రోతమేరుణా
ఇన్ద్రాయుధసహస్రాఢ్య [illegible] 11
స్త్రీబాలపురుషాదీనాం వాస్తవ్యానామితస్తతః
క్రీడార్థం స్థాపితా యత్ర నానారచనయాన్తరే. 12
భూతబీజపరా పూర్ణాస్తమోరిపుసఘుంఘుమాః
తమఃప్రకాశచిత్రాఖ్యా లోకాన్తరసముద్గకాః. 13
ఆమోదసుభగాలోల జలదావలి పల్లవాః
లీలాపద్మాకరే స్త్రీణాం విలూనాః కల్పపాదపాః. 14
జలనిఃశ్వాసచలితాః కన్దుకాని కులాచలాః
సంధ్యామ్బుదాః కర్ణపూరాశ్చామరాః శరదమ్బుదాః. 15
కల్పాన్తకాలజలదాస్తాలవృన్తపదంగతాః
భూతలం ద్యూతఫలకం వితానం తారకామ్బరమ్. 16
భూతశారపరావర్తే ద్యూతేఽక్షాః శశిభానవః
వ్యోమాజిరే జగద్భాసపణే గృహనివాసినామ్ 17

జగత్తను ఈసంకల్పరచితమగు మహామండపము గొప్ప స్తంభములతోఁగూడినదియు, ముత్తములచేతను, మణులచేతను నిర్మింపఁబడినదియు, అనేకలక్షలయోజనముల వఱకు విస్తరించినదియు,

ఉత్తమ సువర్ణముచేఁ జిత్రింపఁబడినదియునై యున్నది. అగ్రభాగమున నది మేరుపర్వతసహితముగ వేలకొలఁది మణుల స్తంభములచే నావరింపఁబడియున్నది. ఒకచోట నింద్రుని యనేక యాయుధములచేఁ బూర్ణమైయు, వేఱొకచోటఁ గల్పాంతమందలి సంధ్యాకాలమేఘమువలె సుందరమైయు నొప్పుచున్నది. దానియందు నివసించు స్త్రీ, బాల, పురుషాదుల క్రీడార్థము మధ్యభాగమున నిటనట వివిధ రచనలతోఁ గూడినట్టి, పాతాళ, స్వర్గాదిలోకముల యాకృతిగల స్ఫటిక లమర్పఁబడియున్నవి. ఆ స్ఫటిక లోకచోటుఁ బ్రాణులచేతను, వాని భోగ్యపదార్థరూప బీజములచేతను బూర్ణములై యున్నవి. వేఱొకచోట, అంధకారనాశకులగు సూర్యచంద్రాదులచే వ్యవహారము ప్రవృత్తముకాఁగా శబ్దయుతములై యున్నవి. ఇంకొకచోట అంధకార ప్రకాశములచే విచిత్రమైన పేళ్ళు గలిగియున్నది. క్రీడాలక్ష్మికి స్థానభూతమైనట్టి యా మండపమున సుగంధముచే రమణీయములై, చంచలమేఘములను బల్లవములచే శోభితములై, స్త్రీల యలంకారముకొఱకై యనేక యాభూషణముల నొసంగునవై నట్టి కల్పవృక్షములు విరాజిల్లుచున్నవి. మఱియు, ఆమండపమున కులపర్వతములు బాలుర శ్వాసచేఁగూడఁ జలించు నటువంటి బంతులైయు, సంధ్యాకాల మేఘములు దిక్కులను వనితల గర్ణభూషణములైయు, శరత్కాలమేఘముల చామరములైయు నొప్పుచున్నవి. కల్పాంతమందలి మేఘములేయట విసనకఱ్ఱలై భూతలమే జూదమాడు ఫలకమై, నక్షత్రసహితమగు యాకాశమే వితానమై (పైకప్పై) యలరుచున్నవి. మఱియు నట ఆకాశమను ముంగిలియందు జగత్తుయొక్క యావిర్భావ, తిరోభావాదులే, పణము (పందెము)లుగాఁగల్గిన జూదమును ఆ మండపప్రభువులగు బ్రహ్మాదులాడుచుండ చతుర్విధ భూతసమూహములయొక్క జననమరణాదిరూప భ్రమణమే ద్యూతఫలకములయొక్క పరావర్తమైయు సూర్యచంద్రగ్రహాదులే పాచికలైయు నొప్పుచున్నవి.

ఇతి సంకల్ప ఏవాన్తశ్చిరభావనయా యథా
అగ్రస్థదృశ్యోపమయా సత్యతామివ గచ్ఛతి. 18
తథైవాయం జగద్రూపః సంకల్పైః సుసముత్థితః
చిచ్చమత్కారమాత్రాత్మా చిత్రకృచ్చిత్తచిత్రవత్. 19

ఈ ప్రకారమగు సంకల్పమండపమును గూర్చిన సంకల్పము ఎట్లంతఃకరణమునఁ జిరకాల భావనచే నెదుటనున్న దృశ్యమువలె సత్యత్వము నొందుచున్నదో, అట్లే యీ జగత్తున్ను, చిత్తుయొక్క చమత్కారమాత్రమే అయి, చిత్రకారుని చిత్తమందలి చిత్రమువలె సంకల్పములచేతనే ప్రకటమగుచున్నది.

అసత్యమేవ స్ఫురతి సర్వమస్తి చ నాస్తి చ
అసదుత్థిత ఏవాయం కుతోఽపీహ సముత్థితః. 20

అసత్తై యావిర్భవించు మాయాగజాదులవలె ప్రతిభాసరూపముచే సత్యమై, యథార్థముగ అసత్యమై, యీ జగత్తు స్ఫురించుచున్నది.

హేమ్నీవ కటకాదిత్వం సంసారోదరకోటరః
చిచ్చమత్కార ఏవాయమవికల్పన సంక్షయః. 21



సువర్ణమందు కటకాద్యాభరణములవలెఁ దన యుదరభాగమున ఈ ప్రపంచమును ధరించియున్న చిత్తుయొక్క చమత్కారమే యిది, సంకల్ప, వికల్పములు గావింపకుండుటచే దీనియొక్క నాశము సంభవించుచున్నది.

అత్యన్తమేవ స్వాయత్తో యథేచ్ఛసి తథా కురు
యశ్చాన్నపానదానాదావనాదరముపేయివాన్
తస్యేదం పశ్చిమం జన్మ న స కర్మ సముజ్ఝతి. 22

ఓ విద్యాధరా! ఇట్లీజగత్తుయొక్క యుత్పత్తినాశములు మనుజునకు సర్వదా తన యధీనములనేయున్నవి. కావున, ఇపుడు నీకెట్లిష్టమో యట్లాచరింపుము. ఎవఁడన్నపానాది ఐహికభోగముల యొక్కయు, దానయజ్ఞాది ఆముష్మికభోగములయొక్కయు ఫలములను గోరకయుండునో, ఆతనికిది యంతిమజన్మమగును. అట్టివాఁడు కర్మలఁ ద్యజింపక నిష్కామముగా నాచరించును.

ప్రాప్తో వివేకపదవీమసి పావనాత్మ
న్పుణ్యాం పవిత్రితజగత్త్రితయాం ద్వితీయామ్
నాధఃపతిష్యసి పునర్మనసామునేతి
జానామి మానసమమలం పదముత్సృజత్వమ్. 23

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు
నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే విద్యాధరోపాఖ్యానే మాయామణ్డపవర్ణనంనామ
అష్టమః సర్గః ॥ 8 ॥

శుద్ధబుద్ధివగు నో విద్యాధరా! పతనమునకు హేతుభూతమగు అవివేకపదము నుల్లఘించి, ముల్లోకములను బావనమొనర్చునట్టి యతిపవిత్రమైన వివేకపదమును నీవు బొందితివి. ఇట్టి వివేకయుక్తమగు మనస్సుచే నీకిఁక నధఃపతనము గలుగదని యెంచుచున్నాను. కావున నీవు మనోవాక్కులకు పరమై, చిన్మాత్రమైనట్టి నిర్మల ఆత్మపదము నవలంబించి, మనస్సు ఇత్యాది దృశ్యసమూహమునంతయు ద్యజించివేయుము.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్యప్రకాశికయందు నిర్వాణప్రకరణమున ఉత్తరార్ధమున
విద్యాధరోపాఖ్యానమున మాయామండపవర్ణనమను నెనిమిదవ సర్గము ॥8॥

---

## నవమః సర్గః

[చిదన్తోదయధ్వంస సత్తాస్ఫూర్తివివర్తనమ్,
ఏవా చిత్కచనం విశ్వం చిన్మాత్రమితి వర్ణ్యతే.

జగత్తుయొక్క యుత్పత్తి, నాశ, సత్తా, స్ఫూర్తి, పరివర్తనములు చిత్తుయొక్క యధీనములనియు, జగత్తు చిత్తుయొక్క స్ఫురణమాత్రమై చిన్మాత్రమేయనియు నిట వర్ణింపఁబడుచున్నది.]

భుశుణ్డ ఉవాచ:—

అబుధ్యమానశ్చేత్యాది చిద్రూపమపి చానఘ
శాన్త చిద్ఘన ఏవాస్వ నిర్మలాప్స్వన్తరంశువత్. 1

భుశుండుఁడు:—పాపరహితుఁడవగు నో విద్యాధరా! విషయములను, వానిక్రియాగుణ దోషాదులను, వానిఁ బ్రకాశింపఁజేయు చిదాభాసుని స్మరింపక, నిర్మలజలమందుఁ బ్రవేశించిన తాపరహితమై, ప్రకాశమాత్రమైనట్టి సూర్యకిరణమువలె శాంతుఁడవై, చిద్ఘనమాత్రుఁడవై యుండుము.

అచేతనం చేతనాన్తశ్చేతనాదేవ విద్యతే
స్వేఽసౌ దృశ్యేఽపి సదృశం పయోరాశౌ యథానలః. 2

అచేతనమై, జడమై, దుఃఖాదిరూపమైనట్టి జగత్తునకు చైతన్యముతోటి అసాదృశ్యము (విరోధము) భాసించుచున్నను, వాస్తవముగ నది చేతనరూపమేయగుటచే, సముద్రమం దగ్నివలె చైతన్యసదృశమై, చైతన్యమందే వెలయుచున్నది. గాని అన్యత్ర కాదు.

న చేతనాచేతనయోర్ద్వైతుశ్చిత్వాత్తథైవ చిత్
వినాశోత్పాదయోర్వహ్నిజ్వాలాయాః పవనో యథా. 3

అగ్నిజ్వాలయొక్క యుత్పత్తి, వినాశములకు, వాయువు కారణమైనట్లు, చిత్తున్ను దన చైతన్యశక్తివలన చేతనాచేతనపదార్థములకుఁ గారణమైయున్నది.

నాహమస్మీతి చిద్రూపం చితి విశ్రాన్తిరస్తు తే
తతో యథా యాదృశేన భూయతే తాదృశో భవ. 4

'నేను చిద్రూపుఁడను గాను' ఈ యహంకారమును తొలగించి కేవల చిద్రూపముననే విశ్రాంతిగలిగియుండుము. అట్లు అహంభావము సంపూర్ణముగ నశింప, ఏ స్వరూపము (చిన్మాత్రము) నీ కనుభూతమగునో, తద్రూపుఁడవే యై యుండుము.

చిద్రూపః సర్వభావానామన్తర్బహిరసి స్థితః
ప్రసన్నామ్బుభరస్యాన్తర్బహిశ్చైవ యథా పయః. 5

నిర్మలమైన జలసమూహముయొక్క బాహ్యాభ్యంతరముల రెంటియందును జలమాత్రమే యుండునట్లు, సమస్తపదార్థములయొక్క బాహ్యాభ్యంతరములందును చిద్రూపమే స్థితిగలిగియున్నది.

నాహమస్మీతి చిద్రూపం చితౌ చేల్లగ్నమఙ్గ తే
న చాన్యచ్చేతితం బ్రహ్మరూపం కేనోపమీయతే. 6

ఓ ప్రియుఁడా! 'నేను చిద్రూపుఁడను గాను' ఈ యహంకారమును త్యజించి అఖండ చిద్రూపమున సంలగ్నుఁడవైనచో, అన్యప్రకాశరహితమగు యా బ్రహ్మరూపమిఁక దేనితోఁ బోల్పనగును.

ససురాసురపాతాల భూవిష్టపమివోషితమ్
నానాభావాజవీభావ క్రియాకాలమివాకులమ్. 7



యథా రజ్గమయం కుడ్యే జగన్మౌనమివ స్థితమ్
తథా చిచ్చిత్రకచితం ఖే కుడ్యే చాత్మసంస్థితమ్. 8

ప్రీతి, హర్షము, క్రోధము, యుద్ధము, జయము, అపజయము మున్నగువానిచేతను, పలాయన, ధావనాది వివిధక్రియాకాలాదుల భావములచేతను వ్యాపించినట్టి సురాసురసహితమగు పాతాళ, భూలోక, స్వర్గాదులతోఁగూడిన జగత్తుయొక్క చిత్రము గోడపై రంగులతోటి చిత్రింపఁబడినది. యెట్లు మౌనముగ (నిర్వ్యాపారముగ) నుండునో, అట్లే మాయాశబలిత చైతన్యమను చిత్రకారునిచే చిదాకాశమను గోడపైఁ జిత్రింపఁబడిన యీ జగత్తను చిత్రమున్ను నిర్వికార అద్వయమగు ఆత్మరూపముగనే యున్నదిగాని జగద్రూపముగఁ గాదు.

తేనైవ భూయతే భూరి యచ్చిత్తం కచితం స్వతః
అచేతనం చేతనం వా యథేచ్ఛసి తథా కురు 9

ఓ విద్యాధరా! అచేతనమైన జగద్రూపముగాని, చేతనమైన బ్రహ్మరూపముగాని యేది చైతన్యమున స్వతఃవిశేషముగఁ బ్రకటమగుచున్నదో అట్టిరూపమే యనుభవింపఁబడుచున్నది. కావున నీయధీనమందున్నట్టి సమాధి, వ్యుత్థానములరెంటిలో దేనిని నీవిచ్ఛగింతువో దానినాచరింపుము.

చిచ్చమత్కృతయో వ్యోమ్ని స్ఫురన్త్యేతా జగత్తయా
అర్కాంశువదరో ధిన్యః స్వచ్ఛా విదితవేదినామ్. 10

మరుభూమియందు సూర్యకిరణరూపములగు మృగతృష్ణానదులు, మరుభూమి నెఱిఁగిన వారిని నిరోధింపనివై స్వచ్ఛమైన కిరణరూపములుగనే యెట్లు భాసించునో, అట్లే తత్త్వవేత్తల దృష్టియందీజగద్రూపమున చిత్ - చమత్కృతులే చిదాకాశమున భాసించుచున్నవగును. (కావున ఈ జగద్రూపము వారిని నిరోధింపదని భావము.)

తిమిరాక్రాన్తదృష్టీనాం యథా కేశోణ్డ్రకాది ఖే
స్ఫురత్యేవం జగద్రూపమనాత్మన్యేవ తిష్ఠతామ్. 11

తిమిరముతోఁగూడిన దృష్టిగల జనుల కాకాశమున కేశాదులు కల్పించునట్లు, అనాత్మయందేయుండునట్టి అజ్ఞానుల కీజగత్తు (ఆత్మకంటె భిన్నముగ) గోచరించును.

ఏవం జగత్త్వమహమిత్యవ బోధరూప
మాభాసమాత్రముదితం న చ నోదితం చ
అర్కాంశు జాలరచనానగరాభమత్ర
కుడ్యాదిసత్యమిదమస్తి న ఖే లతేవ 12

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే విద్యాధరోపాఖ్యానే చిత్కచనయోగోపదేశో నామ నవమః సర్గః ॥ 9 ॥

ఈ ప్రకారముగ ఈజగత్తు బోధరూపమైనట్టి ఆత్మస్వరూపమై, ఆభాసమాత్రమై (చిత్తుయొక్క చమత్కారమాత్రమై) అజ్ఞుల దృష్టియందు ఉదయించినదై, తత్త్వజ్ఞుల దృష్టియందు ఉదయించనిదై యున్నది. మఱియు, సూర్యకిరణసమూహముచేతనే నిర్మితమగు గంధర్వనగరమును బోలినట్టి యీవ్యవహారదశయందలి కుడ్యాదిజగత్తున్ను, ఆకాశమందు లతలేనట్లు, జగద్రూపముగ లేనిదియే యై యున్నది.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్యప్రకాశికయందు నిర్వాణప్రకరణమున విద్యాధరోపాఖ్యానమున చిత్కచనయోగోపదేశమను దొమ్మిదవ సర్గము ॥9॥

---

## దశమః సర్గః

[యథాభూతం స్థితం బ్రహ్మ నిర్వికారమకారణమ్
నాసీదేవ జగత్క్వాపి కదాపీత్యుపవర్ణ్యతే.

సత్యమై, కారణరహితమై, నిరాకారమైన బ్రహ్మమే యీ సమస్తమున్నునై యున్నది. జగత్తనునది యేదియు నెప్పుడును లేదు—అను విషయము లిచటఁ బ్రతిపాదింపఁబడుచున్నవి.]

భుశుణ్డ ఉవాచ: —

విద్ధి త్వం చేతనాదేవ చేతనేతరచేతనమ్
జలేఽగ్నిరివ చిజ్జాడ్యే నాతో భిన్నే మనాగపి. 1

భుశుండుఁడు:— ఓ విద్యాధరా! చైతన్యముకంటె భిన్నముగ ఏజగత్తు భాసించుచున్నదో అద్దానిస్ఫురణమును చైతన్యమగుటవలన చిద్రూపముగనే యెఱుంగుము. ఏలయనగా, చైతన్యమునందలి స్ఫురణము చైతన్యముకంటె వేఱుకాదు. కావునఁ జలమందుఁ బ్రతిబింబించిన అగ్ని జలముకంటె వేఱుకానట్లు, చైతన్యమునఁ బ్రతిబింబించిన జగత్తున్ను చైతన్యముకంటె వేఱుకాదు. అందుచే, చిత్తు, జడత్వము కొంచెమైనను భిన్నముకానేరవు.

తద్వేదనావేదనయోరభేదాత్స్వస్థమాస్యతామ్
నియన్త్రమేవ చిత్రస్థఙ్ఞప్తివద్వ్యోమమధ్యవత్. 2

ఓ విద్యాధరా! ఇట్లు జ్ఞానాజ్ఞానముల అభేదము సిద్ధించుటచే, పరిచ్ఛేదరహితుఁడవై, చిత్రకారుని చిత్తమందున్న చిత్రమందలి తచ్చిత్రమునుగూర్చిన జ్ఞానమువలెను, గంధర్వనగరముయొక్క యధిష్ఠానమగు యాకాశముయొక్క మధ్యభాగమువలెను, స్వస్థుఁడవై యుండుము.

బ్రహ్మణ్యశేషశక్తిత్వాదచిత్తం విద్యతే తథా
అక్షుబ్ధే విమలే తోయే భావిఫేనలవో యథా 3

శాంతముగను, నిర్మలముగ నున్నట్టి జలమందు భావికాలమున నుద్భవింపఁబోవు ఫేనలవము (కొంచెమునురుగు) యెట్లుండునో, అట్లే మాయాశబలిత బ్రహ్మమునను, అనంతశక్తిత్వకారణమున, అచిద్రూపమగు యీజగత్తు ప్రళయకాలమందు సూక్ష్మరూపముగ నుండును.



న కారణం వినోదేతి జలాత్ఫేనలవో యథా
న కారణం వినోదేతి సర్గాది బ్రహ్మణస్తథా. 4

కారణములేక జలమునుండి నురుఁగు ఎట్లుద్భవింపదో, అట్లే కారణములేక బ్రహ్మమునుండి సృష్ట్యాదులున్ను నుద్భవింపవు.

నచ కారణమస్త్యత్ర సర్గవృత్తావకారణే
నాతః సంజాయతే కించిజ్జగదాదిర్న నశ్యతి. 5

అకారణమగు బ్రహ్మమున సృష్టిరచనయందేకారణమున్ను లేదు. కావున, ఈజగదాదులెవ్వియు నుత్పన్నమగుటలేదు, నశించుటలేదు.

అత్యన్తం కారణాభావాన్న కించిజ్జాయతే జగత్
మరావమ్బ్వివ నాస్త్యేవ దృష్టమప్యగ్రతో జగత్. 6

కారణముయొక్క అత్యంతాభావముచే జగత్తు లేశమైనను నుద్భవించుటలేదు. మఱియు, ఎదుటఁ గానుపించుచున్నప్పటికి మరుభూమియందలి జలమువలె నిది లేనిదేయగును.

బ్రహ్మానన్తమజం శాన్తమతోఽస్తీదం న సర్గధీః
కారణాభావతస్తేన బ్రహ్మైవేదమఖణ్డితమ్. 7

కారణముయొక్క అభావముచే సృష్టి లేకయున్నది. కావున నిదియంతయుఁ అజమై, శాంతమై, అనంతమై, అఖండమైనట్టి బ్రహ్మమే యగును.

అతః శిలోదరాభోఽసి వ్యోమకోశోపమోఽపి చ
బ్రహ్మైకఘనరూపత్వాదజోఽనవయవోఽసి చ 8

ఇక్కారణమున బ్రహ్మైక ఘనరూపుఁడవగుటచే నీవు శిలామధ్యభాగమువలెను, ఆకాశకోశమువలెను, ప్రశాంతుఁడవై, అజుఁడవై, అవయవరహితుఁడవై చెన్నొందుచున్నావు.

జ్ఞోఽసి కించిన్న కించిద్వా నిఃశఙ్కమలవాస్యతామ్
అచేతనాచిదాభాసే శామ్యతామాత్మనాత్మని. 9

ఓ విద్యాధరా! నీవు జ్ఞానస్వరూపుఁడవు. (అధిష్ఠానదృష్టిచే) ఈసమస్తమున్ను నీవే. (దృశ్యమంతయు బాధింపఁబడుటచే) ఈ సమస్తమున్ను నీవు కావు. కావున నిశ్శంకగా వెలయుము. మఱియు బుద్ధియు, చిదాభాసుఁడును లేనట్టి శుద్ధమైన ఆత్మయందు స్వయముగఁ బ్రశాంతినొందుము.

నిత్యానన్దతయాఽజస్య కారణం నాస్తి కార్యకృత్
సర్గాద్యసంభవే తస్మాద్యదస్తి తదజం శివమ్. 10

అజుఁడగు పరమాత్మ స్వాభావిక నిత్యానందస్వరూపుఁడగుటచే నాతనికి కార్యనిమిత్తమగు యే ప్రయోజనాపేక్షయు లేదు. అందుచే, సృష్ట్యాది కార్యములు అసంభవములగుటచే, ఏది కలదో, అది అజమైనట్టి శివరూపమేయగును.

అజో యేషాం తు చిద్రూపో నాస్తి మూర్ఖవిలాసినామ్
సర్గనాశే సముత్పన్నే కిం తేషాం ప్రవిచార్యతే. 11

ఎవరి దృష్టియందు అజమై, చిద్రూపమైనట్టి బ్రహ్మము లేకయున్నదో, ఆట్టి మూర్ఖత్వ విలాసులు సృష్టియొక్క నాశోత్పత్తుల విషయమునయేమి విచారించుచున్నారు? (వారి యావిచారము నిష్ఫలమని భావము)

యత్ర యత్ర పరం బ్రహ్మ తత్ర సన్తి జగన్తి హి
జగచ్ఛబ్దార్థరూపేణ ముక్తాన్యేవంవిధాని చ. 12

ఎచటెచటఁ పరబ్రహ్మము గలదో, అచటచట జగచ్ఛబ్దార్థరహితము (మిథ్యారూపము) లైన జగత్తులు గలవను విచారము గలవారు, అర్థప్రబుద్ధులు.

తృణే కాష్ఠే జలే కుడ్యే సర్వత్రైవ పరం స్థితమ్
సర్వత్రైవ చ సర్గౌఘః పరిప్రోతః స్థితో మిథః. 13

తృణ, కాష్ఠ, జల, భిత్త్యాదులందంతట పరబ్రహ్మమే స్థితినొందియున్నది సృష్టిసమూహము సర్వత్రయాపరబ్రహ్మమందే పరస్పరము గ్రుచ్చఁబడియున్నది.

బ్రహ్మణః కః స్వభావోఽసావితి వక్తుం న యుజ్యతే
అనన్తే పరమే తత్త్వే స్వత్వాస్వత్వాత్యసంభవాత్ 14

బ్రహ్మముయొక్క యిది యేస్వభావమనునది చెప్పుటకు వలనుపడదు. ఏలయనఁగా, అనంతమై, అద్వయమైనట్టి పరబ్రహ్మమందు నిజస్వభావ పరస్వభావములు అత్యంత, అసంభవములై యున్నవి.

అభావసవ్యపేక్షస్య భావస్యాసంభవాద్యపి
పదం బధ్నన్తి నానన్తే స్వభావాద్యా దురుక్తయః. 15

అభావముతో, పరస్పరసంబంధము గలవగుటచే భావమున్ను పరమాత్మయందు అసంభవమగుటచే, అనంతమైన పరబ్రహ్మమందు స్వభావాది దుష్టవచనములు సంభవింప నేరవు.

అస్వత్వాభావయోర్నిత్యేఽనన్తేఽత్యన్తమసంభవాత్
స్వత్వభావేషు సిద్ధేషు స్వభావోక్తిర్న తిష్ఠతి. 16

నిత్యమై, అనంతమై, సర్వరూపమైనట్టి పరబ్రహ్మమున, 'అస్వత్వ' (పరకీయ) అభావములు అసంభవములగుటచే, వాని వ్యావర్తక (నిషేధార్థక) పదార్థములగు 'స్వత్వ,' 'భావ'ములున్నట లేకయుండుటఁబట్టి పరబ్రహ్మమున స్వభావవచనము సంభవింప నేరదు.

నాహన్త్వం లభ్యతే సాధో బుద్ధ్యాలోకే నిరీక్షితమ్
అసదేవ కుతోఽప్యేతద్బాలయక్ష ఇవోదితమ్. 17

ఓ సాధూ! విచారించి చూచినచో బ్రహ్మమందెచటను 'అంహత్వము' లభింపదు. కావున నవి అసత్తేయగుచు బాలుని బేతాళమువలె నెచట నుండియో యుదయించినదై యున్నది.



ముక్తం త్వహన్త్వశబ్దార్థైర్లభ్యతే యచ్చ తత్పరమ్
యుక్తం త్వహన్త్వశబ్దార్థైః ప్రేక్ష్యమాణం విలీయతే. 18

'అహంత్వ' శబ్దార్థరహితమగు యే పరబ్రహ్మము లభించుచున్నదో, అద్దానియందు 'అహంత్వ' శబ్దార్థముల సంయోగము సంభవించినచో, శాస్త్రాచార్యానుభవములచేఁ బరీక్షించి, తత్త్వదృష్టిచే గాంచినచో నయ్యది నశించిపోవును.

భేదో జగద్బ్రహ్మదృశోరభేదః
పర్యాయశబ్దార్థ విలాసతుల్యః
సంకల్పమాత్రం కథితో న సత్యో
యథానయోర్వై కటకత్వహేమ్నోః. 19

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే ఉత్తరార్ధేవిద్యాధరోపాఖ్యానే సర్గాపవర్గప్రతిపత్తియోగోపదేశో నామ దశమః సర్గః ॥ 10

'జగత్తు' 'బ్రహ్మ' శబ్దముల భేదమేదిగలదో, అది వాస్తవముగ అభేదమేయైయున్నది. ఆ రెండుశబ్దములును పర్యాయపదముయొక్క విలాసతుల్యములేయగును. సువర్ణ, కటక (ఆభరణ) ముల భేదమెట్లు 'రాహువుయొక్క శిరస్సు' అనుదానివలె వికల్పమాత్రమే అయియున్నదో, అట్లే జగద్బ్రహ్మల భేదమున్ను వికల్పమాత్రమేయనియు, సత్యముకాదనియు విజ్ఞులు బల్కిరి.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్యప్రకాశికయందు నిర్వాణప్రకరణమున ఉత్తరార్ధమున విద్యాధరోపాఖ్యానమున స్వర్గాపవర్గప్రతిపత్తియోగోపదేశమను బదవసర్గము ॥ 10 ॥

—o—

## ఏకాదశః సర్గః.

[ఇహేన్ద్రియజయాత్పూర్ణే నిర్వికారమనఃస్థితిః
దేహాదిదృశ్యాదృష్టిశ్చ దృఢీకార్యేతి వర్ణ్యతే.

ఇంద్రియములను జయించి నిర్వికారమగు ఆత్మయందు స్థితినొందవలెను దేహాదిదృశ్యము యొక్క అభావనను స్థిర మొనర్పవలెనను విషయములిటఁ బొందుపఱుపఁ బడినవి.]

భుశుణ్డ ఉవాచ:—

శస్త్రాణి దయితాఙ్గాని లగ్నాన్యఙ్గే నిరమ్బరే
యో బుధ్యమానః సుసమః స పరస్మిన్పదే స్థితః. 1

భుశుండుడు:—ఓ విద్యాధరా! శస్త్రముల యాఘాతములున్ను, స్త్రీలయొక్క కోమలమైన అవయవములున్ను వస్త్రసహితమగు దేహమునకుఁ దగిలినపుడు, ఆ రెంటినినుభవించుచును నెవఁడు వికారరహితుఁడై సమముగనుండునో, అట్టిజితేంద్రియుఁడే పరమపదము(బ్రహ్మము)న నున్నవాఁడగును.

తావత్పురుషయత్నేన ధైర్యేణాభ్యాసమాహరేత్
యావత్సుషుప్తతోదేతి పదార్థోదయనం ప్రతి. 2

శస్త్రముల యాఘాతములు, స్త్రీలయొక్క అవయవములు మున్నగునవి దేహమునకు సోఁకినను, లేక యట్టిపదార్థములతోటి సంబంధము గలిగినను వానిని మిథ్యయని, విరసములని యెఱిఁగి జాగ్రత్తునందే (స్వాత్మసుఖమాత్రవిశ్రాంతిరూపమగు) సుషుప్తిదశఁ బొందనంతవఱకు, పురుషప్రయత్నముచేతను, ధైర్యముచేతను, ఇంద్రియజయము నభ్యసించవలెను.

యథా భూతార్థతత్త్వజ్ఞమాధయోఽగ్రగతా అపి
న మనాగపి లిమ్పన్తి పయాంసీవ సరోరుహమ్. 3

కమలమును జల మంటనట్లు, తీవ్రమానసికవ్యథలైనను, యథార్థముగ పరమాత్మ నెఱిఁగిన తత్త్వజ్ఞానిని లేశమైనను స్పృశింపనేరవు.

శస్త్రాఙ్గనానభాంస్యఙ్గ లగ్నాన్యలమసంవిదమ్
అలగ్నానీవ శాన్తాత్మా యః పశ్యతి స పశ్యతి. 4

శస్త్రముల ఆఘాతములున్ను, స్త్రీల కోమలమైన అవయవములున్ను శరీరమునకు దగిలినప్పటికిని, వికారరహితుఁడై, ఆకాశమువలెఁ దగులనట్లెవఁడుగాంచునో, అట్టి శాంతుఁడగు మహాత్ముఁడే నిజముగఁ గాంచువాఁడగును. (సాక్షాత్కార జ్ఞానవంతుఁడని తెలియనగును.)

విషం యథా స్వాన్తరేవ ఘుర్ఘుణీభవతి స్వయమ్
నచ ఘుర్ఘుణతా నామ విషాదన్యాస్తి కాచన. 5
స్వరూపమజహత్త్వేవం జీవతామధితిష్ఠతి
తథాత్మా తత్పరిజ్ఞాన మాత్రైకప్రవిలాపినీమ్. 6

విషమెట్లు తనవిషస్వభావమునుండి చ్యుతినొందకయే ఘుటాది కీటరూపత్వమును బొందుచున్నదో, ఆ కీటరూపత్వము విషముకంటె అన్యమెట్లుకాదో, అట్లే ఆత్మయుఁ దనస్వరూపమును దృజింపకయే జీవరూపత్వము నొందుచున్నది. మఱియు, ఆత్మనుగూర్చిన జ్ఞానమాత్రముచే ఆ జీవరూపత్వము నశించుచున్నది.

జీవో భవతి ఘుర్ఘుణోఽమృత్యాత్మైవ యథా తథా
అత్యజన్తి నిజంరూపం చిజ్జడం రూపమృచ్ఛతి. 7

అమరణస్వభావముగల జడమైన విషము తనస్వభావమును ద్యజింపకయే మరణస్వభావముగల ఘుణ(కీట)రూపత్వమును బొందునట్లు, చిద్రూపమగు బ్రహ్మమున్ను దన స్వభావమును వీడకయే జడరూపతను బొందుచున్నది.



బ్రహ్మణ్యనన్యోఽప్యన్యాభో ఘుర్ఘుణః క్వచిదుత్థితః
తత్స్థః స ఏవాస ఇవాప్యతత్స్థ ఇవ సర్గకః. 8

బ్రహ్మముకంటె వేఱుగాకున్నను, వేఱుగాకున్నదానివలె భాసించు యీ సృష్టియను దుష్టఘుణము (కీటము) విషమందు కీటమువలె బ్రహ్మమందెటనుండియో యావిర్భవించినది. ఇది యా బ్రహ్మమందున్నదై, బ్రహ్మరూపమేయైనను, దానికంటె వేఱుగను, దానియందు లేనిదానివలెను భాసించుచున్నది.

విషం విషత్వమజహద్యథా స్వాన్తః కృమిః క్రమాత్
న జాయతే న మ్రియతే మ్రియతేఽపి చ జాయతే. 9

విషము తనస్వభావమును ద్యజింపకయే క్రమముగ తనయందు కీటరూపమును బొందునట్లు బ్రహ్మమున్ను తనస్వభావమును వీడకయే జీవరూపమును బొందుచున్నది. మఱియు విషము విషదృష్టిచే జన్మింపకయు, మరణింపకయు నున్నట్లును, కీటదృష్టిచే జన్మించుచును, మరణించుచున్నట్లును, బ్రహ్మమున్ను బ్రహ్మదృష్టిచే జననమరణరహితమైయు, జీవదృష్టిచేఁ జననమరణసహితమైయు నున్నది.

స్వేనైవ సంవిదర్థేన పదార్థామగ్నరూపిణా
తీర్యతే గోష్పదమివ న తు దైవాద్భవార్ణవః. 10

దేహేంద్రియాదులందును, తద్విషయాదులందును అహంకార, మమత్వరూపమగు ఆసక్తి లేకుండుటచేతనే, మఱియు, శ్రవణ, మననాదిరూప స్వప్రయత్నముచేతనే (ఆత్మ సాక్షాత్కరింపఁబడ) యీ సంసారసాగరము గోష్పదజలమునవలె దాటఁబడుచున్నది. గాని దైవము (అదృష్టము)చేగాదు. (దైవముకున్న తరింపఁజేయునని స్వప్రయత్నము నుపేక్షింపరాదని భావము)

సర్వభావాన్తరావస్థా సర్వభావాతిశాయినీ
అన్తః శీతలతా యస్మింస్తస్మిన్కిమివ హేలనమ్ 11

సమస్తప్రియతమపదార్థముయొక్క సారభూతమై, సర్వసాంసారిక సుఖములకంటెను అత్యుత్తమమైనట్టి, ఆత్మసుఖరూపమైన శీతలత్వము (శాంతి) అంతఃకరణమున నెపుడుదయించునో, అపుడు పరమదరిద్రునియందుగూడ విశ్రాంతియొక్క అనాదరమెట్లుండగలదు? (అతఁడును బూర్ణముగ విశ్రాంతి ననుభవించునని భావము)

జగత్పదార్థసత్తాన్తః సామాన్యేనాశు భావితే
మనోహంకార బుద్ధ్యాది కః కలఙ్కోఽమలాత్మని. 12

మనస్సు, బుద్ధి, అహంకారము మున్నగు సమస్తజగత్పదార్థములయొక్క సత్తసామాన్యత్రమగు బ్రహ్మమున శీఘ్రముగ లయింప ఇఁక నట్టి నిర్మలమైన బ్రహ్మమందు కళంకమెచట?

యథా ఘటపటాద్యర్థాన్పశ్యస్యేవం శరీరకమ్
తథాఽహన్త్వమనోబుద్ధివేదనాద్యపి పశ్య హో. 13

ఓ విద్యాధరా! ఘటపటాది పదార్థముల నెట్లు తటస్థభావముచే గాంచుచున్నావో, అట్లే

'అహం'త్వాభిమానమును వదలి, శరీరము, మనస్సు, బుద్ధి, వేదన, అహంత్వము మున్నగువానినిగూడ తటస్థభావముతోఁటి గాంచుము.

జగత్పదార్థసార్థా ఘమనోబుద్ధ్యాది సంస్థితమ్
జ్ఞ ఏవాసంవిదం స్తిష్ఠ పరినిష్ఠితనిష్ఠయా. 14

అటుపిమ్మట సర్వసాక్షిరూపుఁడవై, బాహ్యజగత్పదార్థసమూహములయొక్కయు ఆభ్యంతర మనోబుద్ధ్యాదులయొక్కయు ననుభవమునొందక, స్వాభావిక చిత్-స్థితియందుండుము.

న కేనచిత్క్వాపి కదాచిదేవ కశ్చి
ద్దోషో న చైవేహ గుణః కదాచిత్
సుఖేన దుఃఖేన భవాభవేన
న చాస్తి భోక్తా న చ కర్తృతా చ. 15

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే విద్యాధరోపాఖ్యానే యథాభూతార్థవేదనం నామైకాదశః సర్గః ॥ 11 ॥

అట్టి జ్ఞానస్థితియందు సంపత్తివిపత్తులచేగాని, తజ్జనితములగు సుఖదుఃఖములచేగాని, ఏ కారణముచేతను నెవనికిని నెపుడును ఏదేనిగుణముగాని, దోషముగానిలేదు. ఏలయనఁగా నట్టి శుద్ధాత్మస్థితియందు కర్తృత్వ భోక్తృత్వములులేవు.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున ఉత్తరార్ధమున విద్యాధరోపాఖ్యానమున యథాభూతార్థ వేదనమను పదునొకండవ సర్గము ॥ 11 ॥

—o—

## ద్వాదశః సర్గః

[భ్రాన్తిమాత్రమహంభావశ్చిద్వివర్తో జగద్భ్రమః
తస్య మూలమవిద్యేతి తత్క్షయక్రమ ఈర్యతే.

అహంభావము భ్రాంతిమాత్రమనియు, జగద్భ్రమ చైతన్యముయొక్క వివర్తమాత్రమేయనియు, వర్ణింపఁబడుచు ఆభ్రమకు మూలభూతమైనట్టి అవిద్యయొక్క నాశక్రమమిచట వివరింపబడుచున్నది.]

భుశుణ్డ ఉవాచ:—

ఖ ఏవ వ్యోమ సంపన్నమితి సంకల్పనం యథా
భ్రాన్తిమాత్రమసద్రూపం తథాహంభావ భావనమ్. 1

భుశుండుఁడు:—ఓ విద్యాధరా! ఆకాశముననే మఱియొక యాకాశముత్పన్నమైనదని మనస్సుచే సంకల్పించుట యెటువంటిదో ఆరెండవ యాకాశమెట్లుకల్పనయై భ్రాంతిమాత్రమైయుండునో



అట్లే ఆత్మయందును భ్రాంతిమాత్రమై, అసద్రూపమైనట్టి 'అహంభావము'యొక్క భావనయును కల్పనయే యగును.

ఖే ఖం జాతమితి భ్రాన్తేరహం కల్పయితా యథా
తథా నిర్వ్యపదేశ్యాత్మ సదస్త్వసదివాతతమ్. 2

ఆకాశమందాకాశ ముత్పన్నమైనదను భ్రమయొక్క కల్పకునివలె, ఆత్మయందహంభావమును గల్పించు కల్పకుఁడు, అవిద్యచే, గప్పఁబడినదై, అనిర్వచనీయమై, అసత్తువలె గోచరించునట్టి సద్రూపమగు ఆత్మయే.

స్వే స్వాత్మైవాస్తి చిద్రూపం తత్స్వకం బుధ్యతే వపుః
భాసతే యదిదన్త్వేన నాహమస్మి న చానహమ్. 3

(పైదృష్టాంతము) మొదటియాకాశమం దెట్లు, అద్వయమగు ఆకాశాత్మయే గలదో, మఱియు, రెండవ ఆకాశము, తత్కల్పకుని చిద్రూపమే తనయొక్క సంకల్పాత్మకమైన దేహమును నట్లుగా గల్పించి యెఱిఁగిన దెట్లగునో, అట్లే అవిద్యచేఁ గప్పఁబడిన చిదాత్మయు తనదేహమగు చిత్స్వరూపమునే అవిద్యయని నమ్మి, యవిద్యనే 'అహం' ఇదం, (నేను,ఇది) మున్నగు రూపములచే గల్పించి భాసించుచున్నది. కావున నేననునదిగాని, ఈజగత్తుగాని, అవిద్యతప్ప వేఱేమియుఁగావు.

తతశ్చిద్రూపమస్తీదృగ్యత్ర స్థూలం ఖమప్యలమ్
అణావివ మహామేరు స్తత్సంవిత్తిర్హి ఖాదితా. 4

ఇక్కారణమున నెచట ఆకాశమున్ను అతిస్థూలమై యొప్పునో, అట్టి పరమసూక్ష్మమైనదియు, సమస్తస్థూలకల్పన కధిష్ఠానమైనదియునగు బ్రహ్మము (చిత్తు) మాత్రమే గలదని నిశ్చితమగుచున్నది. అణువునందు మహామేరువువలె అయతిసూక్ష్మమైన చిత్తుయొక్క కల్పనయే యీ యాకాశాది జగద్రూపమైయున్నది.

ఘనస్తతోఽచిదాభాసః ఖాదప్యతితరామణుః
జానాతి యత్స్వభావం తదేతత్సర్గతయా స్థితమ్. 5

ఆకాశముకంటె అతిసూక్ష్మమైనట్టి చైతన్యము అజ్ఞానరూపమైన అనాది వివర్తముచే స్థూలమువలెనయి, అనాదియైన యా'అహం, ఇదం, (నేను,ఇది)రూపవాసనవలన నుత్తరోత్తర స్థూలమైనట్టి తన స్వభావకల్పనచే సమస్తము నెఱుఁగుచున్నది చిత్తుయొక్క యీకల్పనయే సృష్టిరూపమున రూఢినొందినది.

అహన్తాఖాదితాద్యాత్మవిదః ప్రసరణం జగత్
అమ్భోద్రవప్రసరణం యథావర్తాది వేష్టనమ్ 6

జలమునకు ఆవర్త, తరంగాదులవలె, ఆత్మచైతన్యమునకు, 'అహంత్వ,' ఆకాశాదిరూపమైన జగత్తు వివర్తరూప విస్తారమై యున్నది.

అచిత్ప్రసరణం శాన్తమస్పన్దీవ జలద్రవః
నిఃస్పన్దపవనాకారమాకాశహృదయోపమమ్. 7

చిత్తుయొక్క వివర్తరూప విస్తారముయొక్క అభావమే శాంతజలముయొక్కయు, నిశ్చల వాయువుయొక్కయు, ఆకాశ హృదయముయొక్కయు స్థితిని బోలినట్టి, జగత్తుయొక్క యుపరమము (ప్రళయము) అగును.

— న దేశకాలాదిజగత్త్రసరేషు చ యుజ్యతే
ఘనాచ్ఛాన్యాన్నిరాభాసాచ్చిన్మాత్ర విసరాదృతే. 8

ఈ ప్రకారమగు దేశకాలాది జగత్తునందును, అవాంతరములైన యితర అనేకకార్యము లందును, ఘనమగు అవిద్యయొక్క యాభాసములేనట్టి చిద్రూపముయొక్క ప్రసఅము (వ్యాప్తి) తప్ప వేఱొకరూపము తగదు.

చిన్మాత్రే ప్రసృతే కాలే వ్యోమ్ని నావి జలే స్థలే
నిద్రాయాం జాగ్రతి స్వప్నే భవేజ్జగదివోదితమ్. 9

ఇట్లు చిన్మాత్రము (వివర్తరూపముగ) ప్రసరించుటచేతనే దేశకాలములందును, ఆకాశము నందును, నావయందును, జలమందును, స్థలమందును, స్వప్నమందును, జాగ్రత్తునందును, జాగ్రత్సిద్ధ మగు మనోరాజ్యమందును, ఈ జగత్తు ఉదయించినదానివలె నగుచున్నది.

ప్రసరణాప్రసరణే న చ సంభవతో విదః
ఖాదప్యత్యన్తస్వచ్ఛత్వాదక్షోభాదేః సదైవ హి. 10

కాని, ఆకాశముకంటెను అతిసూక్ష్మమగుటచేతను, సంచలనాది వికారములెవ్వియు లేని దగుటచేతను, చిత్తుయొక్క వాస్తవికమగు విస్తరణము, సంకోచము అసంభవములైయున్నవి. (కావున జగత్తుయొక్క యుత్పత్తి, నాశములు అజ్ఞానసిద్ధములేయగును.)

జ్ఞశ్చేతతి న భోగాది న చైవాత్మన్యసావహమ్
ద్రవత్వ మమ్బునీవాన్తరద్వితీయః పరే స్థితః 11

జ్ఞానమాత్రమగు ఆత్మ విషయజనితములగు సుఖదుఃఖాదుల ననుభవింపదు. మఱియు, దాని యందు 'నేను, ఇది' మున్నగు వ్యవహారమున్ను నుండదు. జలమందు ద్రవత్వమువలె అద్వితీయమగు ఆ యాత్మ తన కూటస్థస్వభావమున నే యుండియున్నది.

ధీర్హ్రీః శ్రీర్భీః స్మృతిః కీర్తిః కాన్తిరిత్యాదికం గణమ్
న పశ్యతి విసంకల్పస్తమసీవ పదాన్యహేః 12

చీకటియందు సర్పముయొక్క యడుగులు గానరానట్లు, సంకల్పరహితమగు ఆత్మ, చింత, లజ్జ, హర్షము, భయము, స్మృతి, కీర్తి, ఇచ్ఛ మున్నగు మనోవృత్తులఁ గానకుండును.

బ్రహ్మేన్దు బిమ్బస్ఫురితి చిజ్జ్యోత్స్నాంశామృతద్రవః
దిక్కాలాసంభవాత్స్వర్గో నేశ్వరాద్భాతి రిచ్యతే. 13

బ్రహ్మమను చంద్రబింబమునుండి స్ఫురించిన చిదాభాసు (జీవు)డను చంద్రికయొక్క యంశ మగు నేత్రాది జ్ఞానరూపమైన అమృతమున కధీనమగుటచే తద్ద్రవప్రాయమైనట్టి యీ సృష్టి, దేశ కాలములచే స్పృశింపఁబడనట్టి బ్రహ్మమునుండి వేఱుగాను,



అధిమాన్యః స్ఫురత్యేవం పరే స్ఫురతి భాసురమ్
జరదాద్యాత్మకం చిత్తం చక్రావర్తత్వమివామ్బుని. 14

ఇట్లు పరమాత్మ తనయందు నిజస్వరూపముకంటె వేఱుగాని ప్రకాశమయమైన జగదా కారముగ సర్వసామాన్యసచ్చిదానందరూపముచే స్ఫురించుచున్నను, దేహాదులను నాకానాకచోట విశేషాభిమానముచే మానసికచింతాయుక్తుండై న అహంకారారూత్మగా వేఱుగ నున్నవానివలె స్ఫురించు చున్నాఁడు. ఈ సమస్త జీవ, బంధ, మోక్షాదిజగద్రూపమున్ను, జలమందు ఆవర్తసమూహమువలె ఆత్మయందుఁగల్పితమై, భ్రాంతచిత్తముకంటె అన్యముకానిదై యున్నది.

మజ్జనోన్మజ్జనారావైర్వివర్తావర్తవేష్టనైః
అచ్ఛిన్నానుపదం క్షీణా భాతి సర్గసరిచ్చిరమ్. 15

మజ్జన ఉన్మజ్జనముల(మునుఁగుట, తేలుటయొక్క)శబ్దములచేతను, విశాలమగు ఆవర్తముల చేతను బూర్ణమైనట్టి యీసృష్టియనునది, మరుభూమియొక్క సాక్షాత్కారముచే మృగతృష్ణానదివలె, ఆత్మయొక్క సాక్షాత్కారమాత్రముచే శాశ్వతముగ క్షయించుచున్నది.

యథావర్తైః పయో భాతి ధూమో భాతి యథా ఘనః
తథా జడాత్మకతయా తృతీయః సర్గ ఏతయోః. 16

జలము ఆవర్తములుగను పొగ మేఘరూపముగను భాసించునట్లు, బ్రహ్మ, మనంబులను మూఁడవదియగు యీ సృష్టి జడ, అజడరూపములుగ భాసించుచున్నది.

దారుణి క్రకచచ్ఛేదే యథావర్తాదికం తథా
అదిగాదా పరే సర్గస్తదతద్రూపవానయమ్. 17

అంపముచే కోయ్యఁ భేదింపఁబడ నద్దాని యావర్తాదు లాకొయ్యకంటె వేఱుగను, వేఱుగా కుండను నెట్లు గన్పట్టునో, అట్లే దేశకాలాదివర్జితమగు పరమాత్మయం దీసృష్టియు జడ, అజడరూప ములుగ భాసించుచున్నది.

సంసారకదలీస్తంభాద్వినా సంకల్పపల్లవమ్
మృదునోతి దృషత్స్తూకారాన్నకించిల్లభతేఽన్తరమ్. 18

స్వతః మిథ్యయగుటచే అతికోమలమై, అధిష్ఠాన సత్తాదృష్టిచే సత్యమగుటచే శిలకంటెను అతిదృఢమైనట్టి యీ జగత్తునకును, స్ఫటికశిలయందు ప్రతిబింబించిన కదళీస్తంభమునకును, సంకల్ప కల్పిత పల్లవములందు దప్ప మఱియొకటను ఏభేదమున్ను బొందఁబడుటలేదు.

సహస్రఖురమూర్ధాక్షి కరవక్త్రేహితోహితమ్
నానాద్రితనుదిగ్దేశ సరిత్స్వాదేశమాత్రకమ్. 19

వేలకొలది శిరములు, పాదములు, నేత్రములు, హస్తములు, ముఖములు, వాని చేష్టా వితర్కములు, వివిధ పర్వతములు, ప్రాణుల శరీరములు, దిక్కులు, నదులు — వీనితోఁగూడిన యీ జగత్తంతయు, పరమాత్మయొక్క స్వరూపమున అగుంష్ఠమాత్రమువలె పరిచ్ఛిన్నమైయున్నది.

అన్తః శూన్యమసారాత్మ బహురాగోపరఞ్జితమ్.
స్ఫురద్వీరాగవిహిత మార్జనామాత్ర తర్జనమ్. 20

లోనశూన్యమై (మిథ్యయై), అనేకప్రకారములైన కామాదులను రంగులచే రంజితమై, అసారమైనట్టి యీ జగత్తు కేవలము తీవ్రవైరాగ్యమాత్రముచేతనే తుడిచివేయఁబడుచున్నది (నిరసింపఁబడుచున్నది).

ససురాసురగన్ధర్వ విద్యాధర మహోరగమ్
జడాత్మపవనస్పన్ది పరచేతన చేతితమ్. 21

సుర, అసుర, గంధర్వ, విద్యాధర, మహోరగాది సహితమగు ఈజగత్తంతయు జడమైన వాయువుచేతను, సూత్రాత్మచేతను, సంచలనశీలమై పరబ్రహ్మచైతన్యముచే లేక (దృష్టిచైతన్యముచే) ప్రకాశితమగుచున్నది.

పటే చిత్రమహారాజ్యమివ భాసురసున్దరమ్
పరామర్శాసహం చారు వికల్పస్ఫూర్జితం జగత్. 22

వస్త్రముపైని మహారాజ్యముయొక్క చిత్రమువలె ప్రకాశమానమై సుందరమైనట్టిదియు వికల్పముచేస్ఫురించునదియు రమణీయమైనదియునగు ఈజగత్తు ఆత్మవిచారముచే (లేక పరబ్రహ్మముచే మర్దించుటచే) నశించుచున్నది.

స్పన్దాత్మని వికల్పాంశే పతితాఽసత్యరూపిణి
సంవిత్ప్రసరతి భ్రాన్తా తైలబిన్దురివామ్భసి. 23

చలనశీలమై అసత్యమైన భ్రాంతియుతమైనట్టి వికల్పాంశమగు మనస్సునందు ప్రతిబింబించిన సంవిత్తు జలమందు తైలబిందువువలె విస్తరించుచున్నది.

హృల్లేఖాజాలవిసరైః సర్వావర్తవివర్తనైః
విసరత్స్నేహసంమిశ్రజడానుదయచర్వణైః. 24

హృదయమును క్షోభపెట్టు కామవాసనాజాలసమూహములచే బంధింపఁబడినదియు స్త్రీపుత్రాదులందు వ్యాపించిన రాగముతోఁగూడి జడములై మిథ్యయగుటచే వాస్తవముగ నుత్పన్నము కానివే యైనట్టి శబ్దస్పర్శాదులయొక్క యాస్వాదనములచేఁ బ్రసరించినదియు సమస్త విషయాదులను ఆవర్తములతోఁ గూడియున్నదియునగు వస్తువే చిత్రమందలి మహారాజ్యరూపముగ వర్ణింపఁబడిన యీ సంసారమైయున్నది.

అహమిత్యాది చిద్రూపే వికల్పేనోన్ముఖీ సతీ
న పరాద్వ్యతిరిక్తైషా జలత్వాదివ తోయతా. 25

ఇట్లు ఆదిచైతన్యము అహంభావాది వికల్పముచే బహిర్ముఖమై జీవరూపమును బొందినట్లున్నను జలత్వముకంటె తోయత్వము వేఱుకానట్లు వాస్తవముగ పరమాత్మకంటె వేఱుకానిదై యున్నది.



చిదాదిత్యః స్వ ఆత్మైవ సర్గ ఇత్యభిధీయతే
భూత్వాహమితి తేనాన్యో న సర్గోఽస్తి న సర్జకః. 26

చైతన్యమను సూర్యుఁడే ఉపాధియందుఁ బ్రవేశించుటద్వారా 'అహం'మున్నగు నామముల బొంది సృష్టియనఁబడుచున్నాఁడు. యథార్థముగ చైతన్యమునకన్యముగ నేదైన సృష్టిగాని స్రష్టగాని లేఁడు.

స్పన్దాత్మికాయాం సత్తాయాం యథా స్పన్దో జలద్రవః
తథా చిదాత్మా వ్యోమత్వే న వ్యోమత్వాది వేత్తి హి. 27

జలము తనచలనరూపమగు సత్తయందెట్లు వాస్తవముగ చలనరహితమైయున్నదో, అట్లే ఆకాశాది ప్రపంచరచనయందును చిదాత్మ తదాకాశాదుల రూపమునను లేదు. అది వానికర్తయును గాదు. మఱియు వానినెఱుఁగుటయు లేదు. (జగత్తు భ్రాంతిమాత్రమేయని భావము)

దేశకాలాది నిర్మాణపూర్వకం వేదనం విదః
సర్గాత్మకత్వాత్తేనామ్బుద్రవసామ్యం న దూరగమ్. 28

సృష్టి (వ్యవహార) దశయందు దేశకాలముల భేదములను కల్పనచే నిర్మించి, అచట ఆత్మకు ఆకాశాదివికల్పముల వేదన వర్ణింపఁబడినదిగాన పైన దెల్పిన జలసామ్యరూపదృష్టాంతము అయుక్తముగా నేరదు.

మనోహంభావబుద్ధ్యాది యత్కించిన్నామ వేదనమ్
అవిద్యాం విద్ధి యత్నేన పౌరుషేణాశు నశ్యతి. 29

ఓవిద్యాధరా! మనస్సు, అహంభావము, బుద్ధి, దేశకాలాదులు మున్నగువాని యనుభవమను వికల్పమెయ్యదిగలదో దానినే 'అవిద్య'యని యెఱుఁగుము. ఆత్మజ్ఞానరూపమగు పురుషప్రయత్నముచే నయ్యది శీఘ్రముగ నశించును.

అర్ధం మిథఃసంకథయా భాగః శాస్త్రవిచారణైః
ఆత్మప్రత్యయతః కష్టమవిద్యాయా నివర్తతే. 30

అవిద్యయొక్క అర్ధభాగము, దాన, సన్మాన, ప్రమాణాదులచేఁ తత్త్వవేత్తలను సంతోషపఱచి వారితో సంభాషించుటచేత నశించుచున్నది. తక్కిన యర్ధభాగము శాస్త్రవిచారములచేతను, ఆత్మసాక్షాత్కారముచేతను నశించుచున్నది.

చతుర్భాగాత్మని కృతే ఇత్యవిద్యాక్షయే క్రమాత్
సమకాలాచ్చ యచ్ఛిష్టం తదనామార్థసన్మయమ్. 31

పుత్రదారధనాదులందలి మమత్వము (అవిద్యయొక్క యర్ధభాగము), దేహాదులందలి అహంభావరూపమగు విక్షేపశక్తి (పాతికభాగము), ఆవరణశక్తి (పాతికభాగము) - ఇట్లు నాలుగు భాగములు విభజింపఁబడిన 'అవిద్య'ఁ ఉత్తరోత్తరభూమికల నారోహించుటచే నశింపఁగా, తత్కాలముననేగాని, లేక, క్రమముగగాని నామరూపరహితమైన సన్మాత్రమగు ఆత్మయే శేషించును.

శ్రీరామ ఉవాచ:—

అర్ధం మిథఃసంకథయా భాగః శాస్త్రవిచారణైః
ఆత్మప్రత్యయతో భాగః కథం తస్యా నివర్తతే. 32
సమకాలే క్రమాచ్చేతి మునినాథ కిముచ్యతే
తదనామార్థసచ్చేతి సచ్చాసచ్చేతి కిం వద. 33

శ్రీరాముడు:—మహాత్మా! అవిద్యయొక్క అర్ధభాగము తత్త్వవేత్తలను బ్రసన్నుల యొనర్చి వారితో సంభాషించుటచేతను, తక్కినయర్ధభాగము శాస్త్రవిచారములచేతను, ఆత్మసాక్షాత్కారముచేతను ఎట్లునశించునో వచింపవేడెద. ఓమునిశ్రేష్ఠా! "సమకాలమునగాని, లేక, క్రమముగగాని" అనుమాటకర్థమేమి? మఱియు 'నామరూపరహితమగు సన్మయము శేషించును' అనుచోట సన్మయ శబ్దమున 'మయ'ప్రత్యయముచే 'అసత్' అంశముయొక్క స్ఫురణమగుచున్నది. అట్టిచో నద్దానియందు అసదంశ మెంతయో వచింపుఁడు?

శ్రీవసిష్ఠ ఉవాచ:—

సుజనేన విరక్తేన సంసారోత్తరణార్థినా
సహచాప్యాత్మవిదుషాం ప్రస్మృతిం ప్రవిచారయేత్. 34

శ్రీవసిష్ఠుఁడు:—ఓ రామచంద్రా! సంసారమును దాటనెంచు విరక్తులైన సజ్జనులు, ఆత్మవేత్తలతోడను, తదితరులగు ముముక్షువులతోడనుగలసి ఈ సంసారమేమి? దీనిపరిణామమెట్టిది? దీని మూలమెద్ది? దీని సారమెయ్యది? దీనినెట్లు మనుజుఁడు తరింపఁగలఁడను ఈప్రకారముగ సంసారమును గూర్చి విచారింప వలయును.

యతః కుతశ్చిదన్విష్య సనీరాగమమత్సరమ్
జనం సజ్జనమాత్మజ్ఞం యత్నేనారాధయేద్బుధః. 35

బుద్ధిమంతుఁడగువాఁడు, విరక్తుఁడును, మాత్సర్యరహితుఁడును, ఆత్మజ్ఞుఁడునగు సజ్జనుని ఎచటనో యొకచోట వెదకి ఆతనిని బ్రయత్నముచే నారాధింపవలెను. (సంతుష్టి పఱచవలెను.)

సంపన్నే సంగమే సాధోరవిద్యార్ధం క్షయం గతమ్
విద్ధి వేద్యవిదాం శ్రేష్ఠ జ్యేష్ఠశ్రేష్ఠదశోదయాత్. 36

వేద్యము నెఱుఁగువారిలో శ్రేష్ఠుఁడవగు నో రామచంద్రా! సాధుపురుషుఁడగు మహాత్ముని సాంగత్యముసిద్ధింప, భూమికలన్నిటిలో జ్యేష్ఠమైనదియు, సాధనచతుష్టయ సంపత్తితోఁగూడి యున్నందున శ్రేష్ఠమునునగు శుభేచ్ఛయను మొదటిభూమిక యుదయించుటచే నపుడు అవిద్యయొక్క అర్ధభాగము నశించినదనియెఱుఁగుము.

అర్ధం సజ్జన సంపర్కాదవిద్యాయా వినశ్యతి
చతుర్భాగస్తు శాస్త్రార్థైశ్చతుర్భాగః స్వయత్నతః. 37



అవిద్యయొక్క యర్ధభాగము సజ్జనుల సంపర్కముచేతను, ఒక నాల్గవభాగము శాస్త్రవిచారముచేతను, తక్కిన నాల్గవభాగము ఆత్మసాక్షాత్కారరూపమగు స్వప్రయత్నముచేతను నశించుచున్నది.

ఏకోఽభిలాష ఉత్పన్నో భోగ్యేభ్యశ్చ నివార్యతే
తత్త్వయే యాత్యవిద్యాయాశ్చతుర్థాంశః స్వయత్నతః. 38

కేవల మొక తీవ్రమోక్షమును గూర్చిన యభిలాష యుత్పన్నమైనచో నదియే వైరాగ్యాది సంపత్తిచే జీవుని భోగములనుండియు తత్సాధనముల నుండియు విరక్తునిఁ జేయును. పిమ్మట భోగములు క్షయింప స్వప్రయత్నముచే అవిద్యయొక్క నాల్గవభాగము నశించుచున్నది.

సాధుసఙ్గమశాస్త్రార్థస్వయత్నైః క్షీయతే మలమ్
ఏకైకేనాథ సర్వైశ్చ తుల్యకాలం క్రమాదపి. 39

సాధుసాంగత్యము శాస్త్రవిచారము స్వప్రయత్నము — ఈమూఁడును ఏకకాలమున బ్రాప్తించినచో నేకకాలమునను, క్రమముగఁ బ్రాప్తించినచో క్రమముగను, అవిద్యయను మలము క్షయించుచున్నది.

యదవిద్యాక్షయైకాత్మ న కించిత్కించిదేవ చ
శిష్యతే తత్పరం ప్రాహురనామార్థమసచ్చ సత్. 40

అట్లు, అవిద్యక్షయింప పిమ్మట నేది శేషించుచున్నదో, అది పరమాత్మరూపమనియే వచింపఁబడినది. (దృశ్యమంతయు బాధింపఁబడుటచే) అదిఏదియు గాకయున్నది, (అధిష్ఠానదృష్టిచే) అంతయు నదియే అయియున్నది. మఱియు ఆపరమాత్మ నామరూపరహితమై సదసద్రూపమై వెలయుచున్నది. అనఁగా అర్థక్రియావ్యవహారమునకు అయోగ్యమగుటఁబట్టి అసత్తుల్యమున్ను, అబాధ్యమైన పరమ పురుషార్థమగుటచే సద్రూపమున్నునైయున్నది.

బ్రహ్మేదం ఘనమజరాద్యనన్తమేకం
సంకల్పస్ఫురణమవిద్యమానమేవ
బుద్ధ్వైవం వ్యపగతమానమేయమోహో
నిర్వాణం పరివిహరన్విశోకమాస్స్వ. 41

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే ఉత్తరార్థే విద్యాధరోపాఖ్యానే సంకల్పసర్గయోరైక్య ప్రతిపత్తిర్నామ ద్వాదశః సర్గః ॥ 12 ॥

ఓ రామచంద్రా! ఈప్రకారముగ శేషించిన ఆత్మవస్తువు ఆనందఘనమై అనంతమై జరాది వికారరహితమై ఏకమైయున్నది. జీవజగద్రూపములు సంకల్పముయొక్క స్ఫురణ మాత్రములేయై అసత్తై (లేనివై) పఱఁగుచున్నవి. ఇట్లుఆత్మతత్త్వము నెఱిఁగి, ప్రమాతృ, ప్రమాణ, ప్రమేయాదిత్రిపుటీ మోహమును బారద్రోలి నిర్వాణమగు బ్రహ్మమే అయి నిరతిశయ బృహద్రూపముచే నంతట వ్యాపించి విహరించుచు దుఃఖరహితుఁడవై చెన్నొందుము!

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్యప్రకాశికయందు నిర్వాణప్రకరణమున ఉత్తరార్ధమున విద్యాధరోపాఖ్యానమున సంకల్పసర్గముల నైక్యప్రతిపత్తియను పండ్రెండవ సర్గము ॥ 12 ॥

---

## త్రయోదశః సర్గః

[మాయాకార్యే న దేశాదేరపేక్షేత్యత్ర వర్ణ్యతే
ఇన్ద్రిస్త్రాసరేణ్వాదరే రాజ్యకల్పనాఖ్యానవిస్తరః.

మాయా కార్యమున దేశకాలాదుల అపేక్ష లేదని వచించుచు త్రసరేణువునందు ఇంద్రుఁడు రాజ్యకల్పనగావించునట్టి కథనిచట వివరించుచున్నారు.]

భుశుణ్డ ఉవాచ:—

జగత్ప్రసరరూపస్య న దేశ ఉపయుజ్యతే
న కాలో ధారణే స్తమ్భ ఆలోకస్యామ్బరే యథా. 1

భుశుండుఁడు:— ఓ విద్యాధరా! ఆకాశమున నేకకాలమునఁ బ్రసరింపఁబడిన ప్రకాశమును ధరించుటయందు స్తంభమెట్లు ఉపయుక్తము కాదో అట్లే మాయాజగత్తుయొక్క విస్తారమును ధరించుటయందు పూర్వసిద్ధములగు దేశకాలములున్ను ఉపయుక్తములు కానేరవు.

మనోమనననిర్మాణమాత్రమేతజ్జగత్త్రయమ్
శాన్తం తను లఘు స్వచ్ఛం వాతాన్తః సౌరభాదపి. 2

ఈ ముల్లోకములున్ను ఆత్మయందు మనస్సుయొక్క మననముయొక్క రచనామాత్రములై శాంతములై వాయువునందలి ప్రకాశ సుగంధములకంటెను అతి సూక్ష్మములై లఘురూపములై స్వచ్ఛములైయున్నవి

చిచ్చమత్కృతిమాత్రస్య సాధో జగదణోః కిల
వాతాన్తః సౌరభం మేరుకన్యానుభవయోగతః. 3

ఓ సాధూ! చైతన్యముయొక్క చమత్కారమాత్రమగు ఈజగత్తను అణువుతోఁ బోల్చిన వాయువునందలి ప్రకాశముగాని, సుగంధముగాని మేరుపర్వతమువలె స్థూలమైనవగును. ఏలయనగా, ఆప్రకాశ సుగంధములు అన్యుని నేత్రములచేగాని, నాసికాదీంద్రియములచేగాని యనుభవింపఁబడుచున్నవి.

యం ప్రత్యుదేతి సర్గోయం స ఏవైనం హి చేతతి
పదార్థః సంనివేశం స్వమివ స్వప్నం పుమానివ. 4

మనోరాజ్యమునుగాని, స్వప్నపదార్థములనుగాని యామనోరాజ్యము యొక్కయు, స్వప్నముయొక్కయు సాక్షియగు ద్రష్టయే స్వయముగఁ బ్రకాశింపఁజేయు నట్లు, ఈసృష్టియు నెవని మనంబున నుదయించునో, అతఁడే యద్దానిని స్వయముగఁ బ్రకాశింపఁజేయును.



అత్రైవోదాహరన్తీమమితిహాసం పురాతనమ్
యద్వృత్తం దేవరాజస్య త్రసరేణూదరే పురా. 5

ఇవ్విషయమునఁ బూర్వమింద్రునకు త్రసరేణువందెయ్యది యనుభూతమయ్యెనో యా పురాతన చరిత్ర నిచట నుదాహరించుచున్నాను.

క్వచిత్కదాచిత్కస్మింశ్చిత్కించిత్కల్పద్రుమే భవత్
కస్యాంచిద్యుగశాఖాయాం ఫలం జగదుదుమ్బరమ్. 6

ఒకానొకపుడొకకల్పవృక్షమున (సమస్తకల్పనా ఫలముల కాధారమగు మాయాశబలిత బ్రహ్మమున) నొకానొక యుగసంధిరూపమగు శాఖయందు జగత్తను మేడిపండు కాచెను.

ససురాసురభూతౌఘమశకాహిత ఘుంఘుమమ్
శైలమాంసలపాతాలద్యుభూమ్యుగ్రకపాటకమ్. 7

చిచ్చమత్కృతి చారూచ్చైర్వాసనారసపీవరమ్
వివిధానుభవామోదం చిత్తాస్వాదమనోహరమ్. 8

బృహద్బ్రహ్మతరుప్రౌఢసత్తావ్రతతి కోటిగమ్
అహంకారమహావృన్తం సమాలోకసముజ్జ్వలమ్. 9

మోక్షద్వారవికాసాస్యం సరిదబ్ధిశిరావృతమ్
మాత్రాపఞ్చకకోశస్థం తరత్తారకసీకరమ్. 10

కల్పావసానజరఠం కాకకోకిలగామ్యథ
పతితం శాన్తిమాయాతం క్వాప్యస్తావాసనం గతమ్. 11

ఆ ఫలము దేవతలు, అసురులున్నగు ప్రాణిసమూహమను దోమలచే శబ్దయుక్తముగా నొనర్పఁబడినదై, పర్వతాదులతోఁగూడి దృఢముగ నున్నట్టి పాతాళ, స్వర్గ, భూలోకాది గొప్పకవాటములు గలదై, చైతన్యముయొక్క చమత్కృతిరూపమగు విచిత్రరచనచే రమణీయమై, మహత్తరరూపముగలదై, వాసనయను రసముచే స్థూలమై, వివిధ శబ్దాది విషయముల యనుభవమను సుగంధముతోఁ గూడినదై, చిత్తముయొక్క ఆస్వాదముచే మనోహరమై (పైనఁదెల్పిన) గొప్పదగు (మాయాశబలిత) బ్రహ్మమను గల్పవృక్షమున జనించిన యనేక సూక్ష్మజగత్సత్తాసమూహమందంతర్గతమైనదియు, అహంకారమను గొప్పతొడిమగలదియు, సాక్షిచైతన్యముచే సముజ్జ్వలమైనదియు, మోక్షద్వారమగు జ్ఞానమే వికసించినముఖముగాఁగలదియు నదులు సముద్రములను నాడులచే నావరింపఁబడినదియు, పంచతన్మాత్రలను కోశమున నున్నదియు, ఊర్ధ్వగాములగు నక్షత్రములే రసకణములుగాఁగలదియు, మహాకల్పాంతమునఁ బరిపక్వమై పడుట కున్ముఖమైయుండునదియు, పిమ్మట అవివేకులను కాకులచేతను, వివేకులను కోకిలలచేతను దినఁబడునదియు, తుదకు క్రిందఁబడినదై, వాసనారహితమై శాంతిని (బ్రహ్మభావమును) బొందునదియు నైయుండెను.

తత్రాభూదమరాధీశః శక్రస్త్రిభువనేశ్వరః
క్షౌద్రకుమ్భనిషణ్ణానాం క్షుద్రాణామివ నాయకః. 12

మధుమక్షికల సమూహమందు వాని నాయకునివలె ముల్లోకములకు ప్రభువును, దేవతాధిపుడునగు ఇంద్రుఁడా యుదుంబర (మేడి) ఫలమున నుండెను.

గురూపదేశస్వాభ్యాసాత్స క్షీణావరణోఽభవత్
మహాత్మా భావితాన్తాత్మా పూర్వాపరవిదాం వరః 13

సంకల్పములన్నింటిని ద్యజించుటచే శుద్ధాంతఃకరణుఁడై యున్నవాఁడును, మహాత్ముఁడును పూర్వాపరముల నెఱిఁగినవారిలో శ్రేష్ఠుఁడునగు యా యింద్రుఁడు గురూపదేశ స్వాభ్యాసములచే నశించిన అవిద్యావరణ గలవాఁడాయెను.

నారాయణాదిషు తతః కదాచిద్వీర్యశాలిషు
క్వచిదేవ నిలీనేషు సత్స్వేకః ససురాధిపః. 14
శస్త్రజ్వాలానలోద్భారైరయుధ్యత మహాసురైః
విజితస్తైర్మహావీరైర్యరతో వ్యద్రవద్ద్రుతమ్. 15
దిశో దశ సువేగేన ద్రుద్రావాభిద్రుతోఽరిభిః
న విశ్రామాస్పదం ప్రాప పరలోక ఇవాధమః. 16

తదుపరి, యొకప్పుడు మహాపరాక్రమశాలురగు నారాయణాదు లెచటనో క్షీరసాగరాదులందు శయనించియుండ, అపుడొంటరిగనే యా దేవనాయకుఁడు శస్త్రములజ్వాలయను అగ్నిని ధరించునట్టి గొప్పయసురులతోఁగూడ యుద్ధమాచరించెను. కాని మహావిక్రమశాలురగు యా యసురులచే నాతఁడు పరాజితుఁడై శీఘ్రముగఁ బరువెత్తెను. మిగుల వేగముగ పదిదిక్కులందుఁ బరువిడుచు నాతఁడు అధముఁడు ఉత్తమపరలోకమును బొందనట్లు, విశ్రాంతిస్థానము నెచటనుఁ బొందకుండెను.

తద్భ్రాన్తదృష్టిష్వరిషు మనాక్ ఛిద్రమవాప్య సః
ప్రశమం కాయసంకల్పం నీత్వా స్వం స్వాన్తరే బహిః. 17
కమప్యర్కాంశుకోశస్థం త్రసరేణుం వివేశ సః
సంవిద్రూపతయా పద్మకోశం మధుకరో యథా. 18

పిమ్మట నాతని శత్రువులొకింత భ్రాంతదృష్టిగలవారు కాఁగా నాతఁడు విశ్రాంతిస్థానావసరము నొంది, తన శరీరముయొక్క స్థూలాకార సంకల్పమును తన యంతఃకరణముననే సూక్ష్మభూతములందు లయమొనర్చి అతి సూక్ష్మరూపుఁడై, కమలకోశమందు భ్రమరము ప్రవేశించునట్లు, బాహ్యప్రదేశమున సూర్యకిరణమును కోశముననున్న యొకానొక త్రసరేణువందు తన సూక్ష్మసంకల్పముచే బ్రవేశించెను.

స తత్రాశు విశశ్రామ చిరాదాశ్వాసమాయయౌ
అథ విస్మృతసంగ్రామో నివృత్తిం సముపాగమత్. 19



అతఁడచట శీఘ్రముగ విశ్రమించెను. ఏలయనఁగా చిరకాలమున కాతనికి శాంతి లభించినది. తదుపరి యాతఁడు యుద్ధమును మఱచినవాఁడై, యచ్చోటనుండి బయటకు వెడలక నచటనే పరమశాంతిని బొందెను.

కల్పితం సద్మ తత్రాథ స క్షణాదనుభూతవాన్
తస్మిన్సద్మని పద్మాన్తే రేమే స్వ ఇవ విష్టరే. 20

అతఁడచట గృహమును గూర్చిన కల్పనయొనర్చి, క్షణకాలములోనే దాని ననుభవించెను. ఆ కల్పిత గృహమునఁ బద్మాసనముపైఁ గూరుచుండి, నిజస్వర్గలోకమందలి సింహాసనముపైవలె సుఖించెను.

గృహస్థః స దదర్శాథ కల్పితం నగరం హరిః
మణిముక్తాప్రవాలాదికృత ప్రాకారమస్థిరమ్. 21
నగరాన్తర్గతోఽపశ్యత్తతో జనపదం హరిః
నానాద్రిగ్రామగోవాటపత్తనారణ్యరాజితమ్. 22
తాదృగ్గతిశ్చేతితవాన్స శక్రో భువనం తతః
సాద్ర్యబ్ధ్యుర్వీనదీశాన్తం సక్రియాకాలకల్పనమ్ 23
తాదృగ్గతిశ్చేతితవాన్స శక్రస్త్రిజగత్తతః
సపాతాలమహీవ్యోమవిష్టపార్కాదిపర్వతమ్ 24

అట్లా గృహమున నున్న యింద్రుఁడంత మణులతోడను, ముత్యములతోడను, పగడములతోడను నిర్మింపఁబడిన ప్రాకారములు గల మందిరములచే శోభించు నగరమొకదానిని గాంచెను. ఆ నగరముయొక్క చివరకుఁబోవ మరల యాతఁడచట పలువిధములైన పర్వత, గ్రామ, గోవాస, పట్టణారణ్యములచే శోభాయమానమైన జనపదమొండు వీక్షించెను. పిదప అట్టి సంకల్పములోనే గూడుకొనియున్న యా యింద్రుఁడు, పర్వత, నదీ, సముద్ర, పృథివీసహితమైనదియు, రాజులతోడను, వారివారి రాజ్యముల సరిహద్దులతోడను గూడినదియు, క్రియాకాలాదుల కల్పనతోటి సంయుక్తమైనదియు నగు భూలోకమును గాంచెను. తదనంతర మాతఁడట్టిసంకల్పముతోనే గూడుకొనియున్నవాఁడై పాతాళ, పృథివీ, ఆకాశ, స్వర్గ, సూర్య, పర్వతాది సహితములైన ముల్లోకముల గూర్చిన యనుభవము నొందెను.

తత్రాతిష్ఠత్సురేశత్వే స భోగభరభూషితః
పుత్రో బభూవ తస్యాథ కున్దో నామాథ వీర్యవాన్. 25
తతో జీవితపర్యన్తే త్యక్త్వా దేహమనిన్దితః
నిర్వాణమాయయౌ శక్రో నిఃస్నేహ ఇవ దీపకః. 26

ఆ తరువాత యనేకములైన భోగములచేఁ బరిపూర్ణుఁడై యింద్రుఁడు దేవతలకుఁ బ్రభువై వసింపఁదొడఁగెను. పిదప, మహాపరాక్రమశాలియైన కుందుఁడను పుత్రుఁడాతనికి జనించెను. తదనంతరము జీవితాంతమున, నిందారహితుఁడగు ఆయింద్రుఁడు తన శరీరమును ద్యజించి, తైలరహితమగు దీపమువలె నిర్వాణము (మోక్షము) నొందెను.

త్వదస్త్రైలోక్యరాజ్యోఽభూజ్జనయిత్వా సుతం నిజమ్
కాలేన జీవితస్యాన్తే జగామ పరమం పదం. 27
తత్పుత్రోఽపి తథైవాథ కృత్వా రాజ్యే సుతం నిజమ్
జగామ జీవితస్యాన్తే పావనం పరమం పదమ్. 28

తదుపరి యాతని సుతుఁడగు కుందుఁడు ముల్లోకములకధిపతి యాయెను. అతఁడును నట్లే కొమరుని విడిచి జీవితాంతమున పరమపదమును బొందెను. ఆ పుత్రుఁడును జిరకాలము రాజ్యమేలి, తన సుతునియటనియోగించి, జీవితాంతమున పరమపావనమైనట్టి మోక్షపదము నలంకరించెను.

ఏవం పౌత్రసహస్రాణి సమతీతాని సున్దర
తత్రాద్యాపి సురేశస్య యేషాం రాజ్యే స్థితోఽశకః. 29

ఓ సుందరుఁడా! ఈ ప్రకారముగ నాతనికి వేలకొలఁది పౌత్రాదులు గడచిరి. ఇపుడున్ను ఆ యింద్రునిరాజ్యమున 'అంశకుఁడను' రాజు విద్యమానుఁడై యున్నాడు.

ఇత్యద్యయావదమరేశ్వరవంశ ఏవ
సంకల్పితే జగతి శక్రపదం విధత్తే
తస్మిన్నతేఽపి గలితేఽపి హతేఽపి నష్టే
క్వాప్యమ్బరే దినకరాతపపావనాణౌ. 30

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే విద్యాధరోపాఖ్యానాన్తర్గతేన్ద్రోపాఖ్యానే త్రసరేణ్వన్తరసర్గసంఘవర్ణనం నామ త్రయోదశః సర్గః ॥ 13 ॥

ఓ విద్యాధరా! ఈప్రకారముగ, ఆ యాకాశప్రదేశమున సూర్యకిరణముచే బవిత్రమొనర్పబడినయాత్రసరేణువెచటనో విలీనమై, క్షయించి, నాశమొందినను, యింద్రునిచే సంకల్పింపఁబడిన యారాజ్యమందాతని వంశజులే నేఁటికిని రాజ్యమేలుచున్నారు.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణ ప్రకరణమున ఉత్తరార్ధమున విద్యాధరోపాఖ్యానాంతర్గతమైన యింద్రోపాఖ్యానమున త్రసరేణ్వంతర సర్గసంఘవర్ణనమను బదుమూఁడవ సర్గము ॥ 13 ॥

—o—

## చతుర్దశః సర్గః

[తత్కులోత్పన్నశక్రస్య ఓసతన్త్రా జగత్ప్రథా
తత్రోచ్యతే బ్రహ్మదృష్టా సర్వదృష్ట్యా ఖ శక్రతా.

ఆ యింద్రవంశమున జన్మించిన యొకానొక యింద్రుఁడు కమలనాళసూత్రమందు జగత్తును గాంచుటయు బ్రహ్మదృష్టియందు సర్వదృష్టిచే ఇంద్రత్వము పొందఁబడుటయు నిచట వర్ణింపఁబడుచున్నవి.]



భుశుణ్డ ఉవాచ:

తస్య శక్రస్య కులజః కశ్చిదాసీత్సురాధిపః
తత్రోత్తమగుణః శ్రీమాన్ప్రాశ్చాత్యా యస్య సా తనుః. 1

భుశుండుఁడు:—ఓ విద్యాధరా! ఆ యింద్రకులముననే జన్మించినవాఁడును, ఉత్తమగుణములచే బరిపూర్ణుఁడును, శ్రీమంతుఁడును, వైరాగ్యాది సంపదలతోఁ గూడియున్నవాఁడును, అంతిమశరీరధారియునగు ఒకానొక యింద్రుఁడుండెను.

అథేన్ద్రకులపుత్రస్య తస్య తత్ర బభూవ హ
ప్రతిభా జ్ఞానసంప్రాప్తిర్బృహస్పతి గిరోదితా. 2

ఇంద్రకులమున జన్మించిన యా సుతునకు, పిదప బృహస్పతియొక్క యుపదేశముచే ఆత్మజ్ఞానము సంప్రాప్తించెను.

తతో విదితవేద్యోఽసౌ యథాప్రాప్తానువృత్తిమాన్
చకార జగతాం రాజ్యమాజ్యపానామధీశ్వరః. 3

తదుపరి, వేద్యవస్తువు (ఆత్మ) నెఱింగినవాఁడును, యథాప్రాప్తములగు కర్మల నాచరించువాఁడునగు ఆ దేవరాజు జగత్తును బరిపాలించెను.

యుయుధే దానవైః సార్ధమజయత్సర్వశాత్రవాన్
శతం చకార యజ్ఞానామజ్ఞానోత్తీర్ణమానసః. 4

అతఁడసురులతోడ యుద్ధమొనర్చెను. మఱియు, సర్వశత్రువులను జయించెను. అజ్ఞానముసుదాటినట్టి విశుద్ధమనస్సుగల యా రాజు నూఱశ్వమేధయాగంబులఁగూడఁ జేసెను.

ఉవాస కార్యవశతో బిసబాలాన్తరే చిరమ్
అన్యాన్యపి చ వృత్తాన్తశతాన్యనుబభూవ హ. 5

ఏదో యొక కార్యవశమున నాతఁడు కమలనాళతంతువందుఁ జిరకాలము వసించెను. అచట నాతఁడు రాజ్య, యుద్ధ, జయ, పరాజయాది ఇతరములగు అనేక కార్యములనుగూడ ననుభవించెను.

కదాచిదాసీత్తస్యేచ్ఛా ప్రబోధ బలశాలినః
బ్రహ్మతత్త్వమవేక్షేఽహం యథావద్ధ్యానవానితి. 6

ఉత్తమ జ్ఞానసంపన్నుఁడగు ఆ దేవనాయకున కొకపుడు 'ధ్యానమందున్నవాఁడనై మాయాశబలిత బ్రహ్మముయొక్క స్వభావమును గాంతు'నను ఇచ్ఛ పొడమెను.

సోఽపశ్యత్ప్రణిధానేన తత ఏకాన్తసంస్థితః
న బాహ్యాభ్యన్తరేఽశేషకారణత్యాగశాన్తధీః. 7
సర్వశక్తిపరబ్రహ్మ సర్వవస్తుమయం తతమ్
సర్వథా సర్వదా సర్వం సర్వైః సర్వత్ర సర్వగమ్. 8

పిమ్మట బాహ్యాభ్యంతరములందలి సమస్త విక్షేపకారణములను త్యజించుటచే శాంతబుద్ధి గలవాఁడై, ఏకాంతమున స్థితినొంది, యాతఁడు ధ్యానముద్వారా, సర్వశక్తియుతమై, సర్వవస్తుమయమై, సర్వవ్యాపకమై, సర్వదా సర్వవిధముల సర్వరూపమై, సర్వత్రనున్నదై, సర్వగామియైనట్టి పరబ్రహ్మమును గాంచెను.

సర్వతః పాణిపాదాన్తం సర్వతోఽక్షిశిరోముఖమ్ 9
సర్వతః శ్రుతిమల్లోకే సర్వమావృత్య సంస్థితమ్.
సర్వేన్ద్రియగుణైర్ముక్తం సర్వేన్ద్రియగుణాన్వితమ్
అసక్తం సర్వభృచ్చైవ నిర్గుణం గుణభోక్తృ చ. 10
బహిరన్తశ్చ భూతానామచరం చరమేవ చ
సూక్ష్మత్వాత్తదవిజ్ఞేయం దూరస్థం చాన్తికే చ తత్. 11
సర్వత్ర చన్ద్రార్కమయం సర్వత్రైవ ధరామయమ్
సర్వత్ర పర్వతమయం సర్వత్రాబ్ధిమయం తథా. 12
సర్వత్ర సారగురుకం సర్వత్రైవ నభోమయమ్
సర్వత్ర సంసృతిమయం సర్వత్రైవ జగన్మయమ్. 13
సర్వత్రైవ చ మోక్షాత్మ సర్వత్రైవాద్యచిన్మయమ్
సర్వత్ర సర్వార్థమయం సర్వతః సర్వవర్జితమ్. 14
ఘటే పటే వటే కుడ్యే శకటే వానరే తథా
ధామ్ని వ్యోమ్ని తరావద్రావనిలే సలిలేఽనలే. 15

ఆ పరబ్రహ్మమంతటను హస్తపాదములుగలదై, ఎల్లెడల నేత్రములు, ముఖములు, కర్ణేంద్రియములతోఁగూడి యున్నదై, సమస్తలోకములను వ్యాపించి యున్నదై, సర్వేంద్రియగుణవర్జితమై సర్వేంద్రియములయొక్క రూపాదులను గ్రహించునట్టి శక్తులతోఁగూడియున్నదై, పరమార్థమున అసక్తమైయున్నను, వ్యవహారమున సమస్తమును భరించునదై, నిర్గుణమై, కాని (వ్యవహారమున) గుణముల ననుభవించునదై, సమస్తభూతములయొక్క బాహ్యాభ్యంతరములందున్నదై, చరమై, అచరమై, అతిసూక్ష్మమగుటఁజేసి (అజ్ఞానులకు) తెలియఁబడనిదై, అజ్ఞానులకు దూరమై, జ్ఞానులకు సమీపమై, సర్వత్రచంద్ర, సూర్య, పృథివీ, పర్వత, సముద్ర, ఆకాశమయమై, సర్వత్ర చిత్సార గురురూపమై. సర్వత్ర సృష్టిపూర్ణమై, జగన్మయమై' సర్వత్ర మోక్షరూపమై, ఆద్య చిన్మయమై, సర్వత్ర సర్వపదార్థమయమై, సర్వత్ర సర్వవర్జితమై, ఘట, వస్త్ర, వృక్ష, శకట, గృహ, వానర, మందిర, ఆకాశ, పర్వత, వాయు, జల, అగ్న్యాది సమస్తపదార్థములందున్నదై వెలయుచుండుట నాతఁడు గాంచెను.

నానాచారవిచారాణి వివిధావృత్తిమన్తి చ
పరమాణ్వంశమాత్రేఽపి త్రిజగన్తి దదర్శ సః. 16

అనేక ఆచారవిచారములతోఁగూడియున్నవై, వివిధకార్యసంయుతమైనట్టి ముల్లోకములను ఆయింద్రుఁ డొకపరమాణువుయొక్క అంశమాత్రముననే వీక్షించెను



మరీచస్యాన్తరే తైక్ష్ణ్యం శూన్యత్వమివ చామ్బరే
త్రిజగత్సత్యసతి చ విద్యతే చిన్మయాత్మని. 17

మిరియమందు కారమువలెను, ఆకాశమందు శూన్యత్వమువలెను, ముల్లోకములున్ను, అవిర్భావతిరోభావములున్ను, కాలాత్ముఁడగు చిన్మయ పరమాత్మునియందుఁగలవు.

ఇత్యేవం భావయన్ముక్తభావయా శుద్ధసంవిదా
శక్రః క్రమేణ తేనైవ తథైవ ధ్యానవానభూత్ 18

ఈ ప్రకారముగ జీవభావవర్జితుఁడై, శుద్ధజ్ఞానముచే గాంచుచున్న యాయింద్రుఁ డాశరీరమున నట్లే క్రమముగ ధ్యానవంతుఁడాయెను,

ధ్యానేన సర్వమేకత్ర పశ్యంశ్చిరముదారధీః
దదర్శైమమసౌ సర్గమస్మదీయం మహామతిః. 19

ఉదారబుద్ధియు, మహామతియు నగు ఆయింద్రుఁడట్లు సమస్తమును నొకమాయాశబలితబ్రహ్మముననే చిరకాలము చూచుచు, ఈ మనయందఱిచే ననుభూతమగుచున్న బ్రహ్మాండము నట్లు వీక్షించెను.

తతోఽస్మిన్విచరన్సర్గే విక్రాన్తే శక్రతాం గతః
చకార జగతాంరాజ్యం వృత్తాన్తశతశోభితమ్. 20

పిమ్మట ఈ బ్రహ్మాండమందు (మనస్సుచే) సంచరించుచు ఇంద్రలోకమున ఇంద్రదర్శనముచే (నేనింద్రుఁడనను సంస్కారము ఉద్బుద్ధమగుటచేతను, పూర్వము తానాచరించిన నూఱశ్వమేధయాగముల ఫల మవశ్యము పొందవలసియున్నందునను) ఇంద్రత్వమును బొందెను. మఱియు ననేకవృత్తాంతములచే శోభితమగు పెక్కులోకముల రాజ్యమున్ను నేలెను.

విద్యాధరకులాధీశ ఇత్యద్యైవ స దేవరాట్
తస్యేన్ద్రస్య కులోత్పన్న ఇతి విద్ధి యథాస్థితమ్. 21

ఓ విద్యాధరనృపాలా! ఈప్రకారముగ ఆ త్రసరేణువందలి యింద్రునియొక్క కులమందు జన్మించిన యాతఁడే యిపుడును ఈబ్రహ్మాండమందు దేవరాజయియున్నాఁడని యెఱుఁగుము.

తతో హృదయబీజస్థప్రాజ్మఖ్యాభ్యాసయోగతః
బిసబాలనివాసాదివృత్తాన్తమనుభూతవాన్. 22

ఈ లోకమందలి యింద్రపదవిని బొందిన పిమ్మట, హృదయమందు బీజమువలె సంస్కారరూపముగానున్న పూర్వపు జ్ఞానయోగాభ్యాసవశమున నాతఁడు కమలనాళసూత్రమందలి తన నివాసాదివృత్తాంతమంతయును స్మరించెను.

యథైష శక్రః కథితస్త్రసరేణూదరాస్పదః
బిసబాలాస్పదశ్చైతత్కులజః కాన్తిమానథ. 23

తథా శతసహస్రాణి తత్రేతశ్చాన్యతశ్చఖే
తాదృశవ్యవహారాణి సమతీతాని సన్తి చ. 24

ఓ విద్యాధరా! కమలనాళతంతువులోపలి త్రసరేణువందలి యింద్రకులమున జన్మించిన శోభావంతుఁడైన యాతఁడెట్లు మనయింద్రుఁడని చెప్పఁబడెనో, అట్లే యింకను ఇట నట లక్షల కొలఁది యింద్రులును, అట్టివేయగు అనేక వ్యవహారములున్ను చిదాకాశమున గడచిపోయినవి. వర్తించుచున్న వికూడను.

మహతీయమవిచ్ఛిన్నా చిరాయైవం తరఙ్గిణీ
తావద్దృశ్యసరిత్ప్రోథారూఢారూఢే చ తత్పదే. 25
ఇతి మాయేయమాదీర్ఘా ప్రసృతా ప్రత్యయోన్ముఖీ
సత్యావలోకమాత్రాత్తువిలయైకవిలాసినీ. 26

ఆత్మసాక్షాత్కారము కానంతవఱకు ఈ ప్రబలమైన దృశ్యమనునది నిరంతరము చిరకాలము త్రెంపులేక ప్రవహించుచు నేయుండును. మఱియు మనుజుఁడు ఆ బ్రహ్మపదమున సగము ఆరూఢుఁడై సగము అనారూఢుఁడైయున్నతఱి 'ఇదియే ఆ అతిదీర్ఘమైన మాయ' అను అనుభవము గలవాఁడగును. కాని, సత్యమైనట్టి పరమాత్మయొక్క సాక్షాత్కార మాత్రముచే ఈ విలసితమగు మాయ పూర్ణముగ విలయమొందును.

యతః కుతశ్చిన్మాయేయం యత్ర క్వచన వానఘ
యథాకథంచిత్సంపన్నమాత్రైవ పరిదృశ్యతే. 27

పాపరహితుఁడవైన యో విద్యాధరా! ఎట్లనో, ఎచటనో, ఏదియోవిధమున నుత్పన్నమైనంతమాత్రముననే యీ మాయ యనుభవమునకు వచ్చుచున్నది. మాయయగుటచే దీని వైచిత్ర్యములందు హేతువిశేషములఁగూర్చి చింతింపఁదగదు.

అహంభావచమత్కారమాత్రాద్వృష్టిరివామ్బుదాత్
జాయతే మిహికేవాశు ప్రేక్షామాత్రవినాశినీ. 28

మేఘమునుండి వర్షమువలె అహంభావమను చమత్కారమాత్రముచే మంచువలెను ఈ మాయ జనించుచున్నది. కాని, ఆత్మదర్శనమాత్రముచే నియ్యది నశించుచున్నది.

యేనాయతాభిమతదర్శనద్రష్టృదృశ్య
ముక్తస్వభావమవభాసనమాత్మతత్త్వమ్
సర్వార్థశూన్యమత ఏవ చ శూన్యరూప
మేకం ఖమాత్రమివ మాత్రవికల్పమేవ. 29

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే విద్యాధరోపాఖ్యానాన్తర్గతేన్ద్రాణ్యాఖ్యానే సర్గసంకల్పయోరైక్య ప్రతిపాదనం నామ చతుర్దశః సర్గః ॥ 14 ॥



ఏ కారణమున ఈ జగత్తు పరమార్థమున బ్రహ్మస్వరూపమై, సర్వవికల్ప రహితమై యున్నదో, ఆ కారణముచే నిది అహంకారవశమున విస్తృతములగు మానసవికల్పములు లేనిదై, ద్రష్టృదర్శన దృశ్యమను త్రిపుటీరూపమైన యింద్రియజనిత వికల్పములున్ను లేకయున్నదై (జాగ్రదవస్థాశూన్యమై), కావుననే వాసనామయములగు సర్వస్వప్నపదార్థ రహితమై, సుషుప్త్యజ్ఞాన వర్జితమై, ఆకాశమువలెఁ బరిపూర్ణముగ భాసించునదై, చిద్రూపమైనట్టి ఆత్మయేయగుచున్నది.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణ ప్రకరణమున ఉత్తరార్థమున విద్యాధరోపాఖ్యానాంతర్గతమగు యింద్రాణ్యాఖ్యానమున సర్గసంకల్పముల ఐక్యప్రతిపాదనమను బదునాల్గవ సర్గము ॥ 14 ॥

---

## పఞ్చదశః సర్గః

[అహంభావో జగద్భ్రాన్తేర్బీజం రూపం చ [illegible]తే
తన్మార్జనాజ్జగన్ముక్త్యా శుద్ధశేషాత్కృతార్థతా.

జగద్భ్రాంతికి అహంభావమే బీజమని చెప్పి, దానిరూపమును వర్ణించుచు, అద్దానిరాహిత్యముచే జగత్తుయొక్క అభావముద్వారా శేషించునట్టి శుద్ధాత్మయొక్క ప్రాప్తిచే కృతార్థత్వము గలుగునని యిట వచించుచున్నారు.]

భుశుణ్డ ఉవాచ:—

యత్రాహన్త్వం జగత్తత్ర పూర్వమాగత్య తిష్ఠతి
నరాణ్యాన్తర పీన్ద్రస్య త్రసరేణూదరే యథా. 1

భుశుండుఁడు:— ఓ విద్యాధరా! ఎచట అహంభావముండునో, అచట త్రసరేణువందు ఇంద్రునిరాజ్యాది ప్రపంచమువలె, జగత్తు ముందుగనే వచ్చి కూర్చుండును.

భ్రమస్యజాగతస్యాస్య జాతస్యాకాశవర్ణవత్
అహంభావోఽభిమన్తాత్మా మూలమాద్యముదాహృతమ్. 2

ఆకాశమందు నీలవర్ణమువలె నావిర్భవించినట్టి యీ జగద్భ్రమకు అభిమన్తృ (అభిమానించువాని) రూపమగు అహంభావమే ఆది మూలమని వచింపఁబడినది.

వాసనారససం సిక్తాదహంబీజకణాదయమ్
బ్రహ్మాద్రౌ వ్యోమవిపినే జాయతే త్రిజగద్ద్రుమః. 3

వాసనయను జలముచేఁ దడుపఁబడినదై, అహంభావమను బీజకణమునుండి, బ్రహ్మమను బర్వతముపై, ఆకాశమను నరణ్యమున, త్రైలోక్యమను వృక్షము జనించుచున్నది.

తారకాపుష్పనికరో విలీనాచలపల్లవః
సరిత్సారశిరాపూరో వాసనాసారతత్ఫలః. 4

అహంత్వసలిలస్యేదం జగత్స్పన్ద ఉదాహృతః
చిచ్చమత్కరణస్వాదుర్వాసనావిసరద్రవః. 5

ఆ త్రైలోక్యవృక్షము నక్షత్రములను పుష్పసమూహముతోఁ గూడినదై, మేఘములయొక్క మంచుచేఁ గప్పఁబడిన పర్వతములను చిగుళ్లుగలదై, నదులను నాడీప్రవాహములచేఁ బూర్ణమై, వాసనలను బీజములతోఁగూడిన ఫలములచే శోభితమై, విషయసుఖమను మాధుర్యముచే నొప్పునదై, దుష్టవాసనలను విస్తృతమైనద్రవము గలదైయున్నది. ఈ జగత్తు 'అహంత్వమను జలముయొక్క చలన (విలాస) మాత్రమే యని పేర్కొనఁబడినది.

తారకాసీకరాసారో నభోన స్తనిఖాతవాన్
భావాభావమహావర్తో నానాగిరితరఙ్గకః. 6
త్రిలోకీవిలిఖలేఖో విలోలాలోకఫేనిలః
బ్రహ్మాణ్డబుద్బుదోద్భేదః కవాటాపీడపీవరః. 7
భూపీఠ దృఢపిణ్డీరపిణ్డశ్ఛిద్ఘనమద్గుమాన్
చిత్రాజవం జవీభావమజ్జనోన్మజ్జనాత్మకః. 8
జరామరణమోహాదివీచీచయచమత్కృతః
ఉత్పన్నధ్వంసి దేహాదిబిన్దువృన్దైకబన్ధురః. 9

ఈ జగత్సముద్రము నక్షత్రములను జలబిందుసహితమై, ఆకాశమను అపారమైన సరోవరముతోఁగూడినదై, పదార్థముల యావిర్భావ, తిరోభావములను గొప్పసుడులు గలదై, వివిధపర్వతములను తరంగసంయుతమై, చిత్రమందలి రేఖలవలె ముల్లోకములందలి జనులను రేఖలుగలిగియున్నదై, సూర్యచంద్రాదులు ప్రకాశమను నురుఁగుగలదై, బ్రహ్మాండములను బుద్బుదసహితమై, మోక్షద్వారమును అవరోధించు మోహమను కవాటము (అనకట్టతలుపు)లచే స్థూలమై, భూపీఠమను దట్టమైన నురుఁగుతోఁగూడినదై, జీవులను జలకాకులచే నొప్పునదై, ఆ కాకులయొక్క వేగగమనముచేతను, అవి క్రిందకు, పైకి, ప్రక్కలకు పరిభ్రమించుటచేతను మజ్జనోన్మజ్జనము (మునుఁగుట తేలుట) లచే శోభించునదై, జరామరణమోహాదిరూపమగు తరంగసమూహమను చమత్కారముతోఁగూడియున్నదై, ఉత్పత్తినాశశీలములైన దేహాదిపదార్థములను బిందుసంతతిచే మనోహరమై, వెలయుచున్నది.

అహంత్వపవనస్పన్దో జగదిత్యవగమ్యతామ్
అహంత్వపద్మసౌగన్ధ్యం జగదిదిత్యవబుధ్యతామ్. 10

ఓ విద్యాధరా! 'ఈ జగత్తును, అహంత్వ'మను, వాయువుయొక్క చలనముగను, 'అహంత్వమను కమలముయొక్క సుగంధముగను నెఱుఁగుము.

నానాస్త్వజగతీ భిన్నే పవనస్పన్దవత్సదా
పయో ద్రవత్వమివ చ వహ్నిరౌష్ణ్యమివాపి చ. 11

వాయు, చలనములవలెను, జల, ద్రవత్వములవలెను, అగ్ని, ఉష్ణత్వములవలెను అహంత్వ, జగత్తులు సదా అభిన్నరూపములే అయియున్నవి.



జగదస్త్యహమర్థేఽన్తరహమస్తి జగద్ధృది
అన్యోన్యభావినీ త్వేతే ఆధారాధేయవత్స్థితే. 12

జగత్తుఅహంకారమందున్ను జగత్తునందు అహంకారమున్ను గలదు. ఈరెండున్ను బరస్పరమొకదానినొకటి యుత్పన్నమొనర్చునవియు, పరస్పర మొకదాని యధీనమున మఱియొకటి స్థితిగలిగియున్నవియు నగును.

జగద్బీజమహన్త్వం యో మార్ష్టి బోధాదవేదనాత్
అలం చిత్రం జలేనేవ తేన ధౌతం జగన్మలమ్. 13

ఎవఁడు జగత్తుయొక్క బీజమగు యీ అహంకారమును 'అనహంభావ'రూపమగు జ్ఞానముచే నశింపఁజేయునో. అతఁడు జ్ఞానమగు జలముచేజగత్తను మాలిన్యమును బూర్ణముగఁ గడిగివేసినవాడగును.

అహన్త్వం నామ తత్కించిద్విద్యాధర న విద్యతే
అకారణమవస్తుత్వాచ్ఛశశృఙ్గమివోదితమ్. 14

ఓ విద్యాధరా! యథార్థముగ ఈయహంభావమేమియును లేదు. అవస్తువు (అసత్తు) అగుటచే నిది శశశృంగము (కుందేటికొమ్ము)వలె నావిర్భవించినదే యగును.

బ్రహ్మణ్యతితతేఽనన్తే సంకల్పోల్లేఖవర్జితే
అహన్త్వకారణాభావాన్న కదాచన సన్మయమ్. 15

మనస్సుకంటెను ఇంద్రియాదులకంటెను బరమై, అనంతమై, సంకల్పవికారములు లేనిదైనట్టి పరబ్రహ్మమందు 'అహంత్వము' యొక్క కారణములేనందుచే నది (ఆ యహంకారము) యెన్నటికిని సత్తుకానేరదు.

అవస్తున్యేతి సర్గాదౌ నసంభతి కారణమ్
అతోఽహన్త్వాది నాస్త్యేవ వన్ధ్యాసుత ఇవ క్వచిత్. 16

అవస్తువిషయమున కారణము సంభవింపమి, సృష్ట్యాదులవిషయమునను కారణము సంభవింపకయేయున్నది. అందుచే వన్ధ్యాపుత్రునివలె అహంభావాదులెచటను లేనివేయగును.

తదభావాజ్జగన్నాస్తి ఓత్వం జగదభావతః
శిష్టం నిర్వాణమేవాతః శాన్తమాస్స్వ యథాసుఖమ్. 17

ఓ విద్యాధరా! అహంకారమను బీజమే లేనపుడిఁక నద్దాని కార్యమగు జగత్తున్ను లేకయేయున్నదిగును. కావున, జగజ్జీవాదుల అభావముచే శేషించునట్టి చిద్రూపమైన నిర్వాణస్వరూపమున శాంతముగను, సుఖపూర్వకముగను నుండుము.

అభావాదుపపత్తిస్థా దేవం జగదహన్త్వయోః
రూపాలోకమనస్కారాః శాన్తా స్త్వవ న చేతరత్. 18

ఈ ప్రకారముగ ఉపపత్తిచే ప్రతిష్ఠింపఁబడిన, జగదహంభావముల అభావముచే బాహ్యమగు రూపప్రకాశాది ప్రపంచము, అభ్యంతరమగు మానసికప్రపంచము - అంతయు నీయొక్క శాంత (బ్రహ్మ)రూపమే అయియున్నదిగాని అన్యముకాదు.

యన్నాస్తి తత్తు నాస్త్యేవ శేషం శాన్తమసి ధ్రువమ్
సంప్రబుద్ధోఽసి మా భూయో నిర్మూలాం భ్రాన్తిమాహర. 19

ఓ విద్యాధరా! ఏది లేదో, అది యెపుడును లేకయేయున్నది. కాన, నీవు నిక్కముగ శేషించినట్టి దుఃఖవిక్షేప రహితమైన శాంతమగు బ్రహ్మమే యైయున్నావు. నీవిపుడు ప్రబుద్ధుఁడవైతివి. కావున నిర్మూల మొనర్పఁబడిన భ్రమను మరల ధరింపకుము.

వ్యపగతకలనాకలఙ్కశుద్ధః
శివమసి శాన్తమసీశ్వరోఽసి నిత్యః
ఖమపి భవతి పర్వతోపమానం
జగదపి వా పరమాణురూపమేవ. 20

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే
మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే విద్యాధరోపాఖ్యానే
విద్యాధరనిర్వాణం నామ పఞ్చదశః సర్గః ॥ 15 ॥

ఓ విద్యాధరా! నీవు బాహ్యాభ్యంతర కళంకరహితుఁడవై, శుద్ధుఁడవై, శివరూపుఁడవై, శాంతుఁడవై, నిత్యుఁడవై, బ్రహ్మరూపుఁడవై యున్నావు. అధ్యారోపమున ఆకాశము (శూన్యము)న్ను పర్వతమువలెను, అపవాదమున బ్రహ్మాండమున్ను అణురూపమువలెను కాఁగలదు.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున ఉత్తరార్ధమున
విద్యాధరోపాఖ్యానమున విద్యాధర నిర్వాణమను
పదునైదవ సర్గము ॥ 15 ॥

---

## షోడశః సర్గః

[శ్రుత్వా విద్యాధరస్యాత్ర సమాధిరుపవర్ణ్యతే
కథాశేషోపసంహారోఽనహంభావప్రశంసయా.

ఇట్టి యుపదేశమును విని విద్యాధరుఁడు సమాధినొందుట, అనహంభావమును ప్రశంసించుచు విద్యాధరోపాఖ్యానమును సమాప్తిగావించుట యిచటఁ గాననగును.]

భుశుణ్డ ఉవాచ:—

కథయత్యేవమప్యేవం స విద్యాధరనాయకః
ఆసీత్సంశాన్తసంవిత్తిః సమాధి పరిణామవాన్. 1

భుశుండుఁడు:— ఓ వసిష్ఠమునీంద్రా! ఇట్లు చెప్పుచుండ నంత ఆ విద్యాధరనాయకుని దృశ్యవృత్తులన్నియు శమించుటచే నాతఁడు సమాధినిష్ఠుఁడాయెను.



ప్రబోధ్యమానోఽపి మయా భూయోభూయ స్తత స్తతః
న పపాత పురో దృశ్యే పరం నిర్వాణమాగతః. 2

అపుడు నేనతనిని మరల మరల యిటునటునుండి మేల్కొలిపినను, పరమనిర్వాణదశను బొందిన యాతఁడు మరల శబ్దాది విషయములవైపునకుఁ బడకయుండెను.

స ప్రాప పరమం స్థానం తావన్మాత్రప్రబోధవాన్
కేనచిన్నాధికే నాజ్ఞే యత్నేనాతిశయైషిణా. 3

ప్రియుఁడా! (ఉత్తమాధికారియగుటచే) ఆతఁడు నాయొక్క ఆ అంతమాత్రపు ఉపదేశముచేతనే - శ్రవణమనన నిదిధ్యాసనాది అధిక ప్రయత్నముచేతనుగూడ శీఘ్రముగఁ బొందఁబడని యా పరమపదము (బ్రహ్మము)ను బొందెను.

అత ఉక్తం మయా రామ యది శుద్ధే హి చేతసి
ఉపదేశః ప్రసరతి తైలబిన్దు రివామ్భసి. 4

ఓ రామచంద్రా! కావుననే జలమందు తైలబిందువువలె, శుద్ధచిత్తమున నుపదేశము వ్యాపించునని నేను మొట్టమొదటనే చెప్పితిని.

నాహమిత్యస్తి తేనాన్తస్త్వేనం భావయ శాన్తయే
ఏతావదుపదేశోక్తిః పరమా నేతరాస్తి హి. 5

చిదేకరసమగు నీయొక్క ప్రత్యగాత్మయందు అహంకారములేదు. కావున శాంతికొఱకై ఈ యసత్యమైన అహంకారమును భావింపకయుండుము. సర్వోత్తమమైన యుపదేశకథన మింతియే. అన్యమేమియులేదు.

ఏషైవాభవ్యమనసి పతితా ప్రవిలీయతే
ఉత్తానే మసృణాదర్శే ముక్తాఫలమివామలమ్. 6

త్రిప్పిపెట్టిన మలినమైన యద్దమున ముత్యము ప్రతిబింబించనట్లు, ఇట్టి యుపదేశము అవిచారులగు (సంసారాసక్తులగు) మనుజుల మనంబునఁ బడినచోఁ బ్రతిబింబించక విలీనమై పోవును.

భవ్యే తు శాన్తమనసి లగత్యభ్యేత్య విచ్యుతిమ్
ప్రవిశ్యాన్త ర్విచారాఖ్యామర్చిరర్కమణౌ యథా. 7

విచారశీలమై, భవ్యమై, శాంతమైనట్టి మనస్సునం దుపదేశము బాగుగఁ బ్రవేశించి, చ్యుతినొందక, వృద్ధినొందును. మఱియు నట్లు ప్రవేశించి, సూర్యకాంతమణియందు సూర్యకిరణ మగ్నిని జనింపఁజేయు నట్లు, మోహారణ్యమునంతయు భస్మీభూత మొనర్చునట్టి వివేక మను నగ్నిని నట నుత్పన్నము చేయును.

అహంభావనమేవోచ్చైర్బీజం దుఃఖాఖ్యశాల్మలేః
మమేదం తద్వదాదీతి శాఖాప్రసర కారణమ్. 8

దుఃఖరూపమైన యీ సంసారమను బూరుగుచెట్టుయొక్క గొప్పబీజము అహంభావనయే. అట్లు అహంభావనవలెనే మమత్వభావనయున్ను, రాగాది శాఖాప్రసరణమునకు హేతువైయున్నది గావున, అది సంసారవృక్షముయొక్క మూలాదిశరీరమైయున్నది.

అహమాదౌ మమేత్యన్తస్తత ఇచ్ఛా ప్రవర్తతే
ఇదమర్థశతానర్థకారిణీ భవభారిణీ. 9

మొట్టమొదట 'అహంభావన'యను బీజము, పిమ్మట మమత్వమను వృక్షము, ఆపిదప 'ఇదం' (ఇది) రూపమైన యనేక అనర్థములను గలుగజేయునదియు, సంసారమును భరించునట్టిదియు నగు ఇచ్ఛయను శాఖలున్ను గలుగుచున్నవి.

ఏవంవిధా మునిశ్రేష్ఠ మూఢా అపి చిరాయుషః
భవన్త్యనియమో హ్యత్ర దీర్ఘాయుష్యస్య కారణమ్. 10

ఓ ప్రియుఁడవగు మునిశ్రేష్ఠా! ఈప్రకారముగ విషయలంపటులగు మూఢులున్ను నొక్కొక్కప్పుడు చిరంజీవులగుదురు. అందు నియమమేమియును లేదు. కాని యా చిరజీవనమునకు ముఖ్యకారణము తత్త్వజ్ఞానమే అయియున్నది.

అన్తః శుద్ధమనస్కా యే సుచిరాయాభయప్రదమ్
మనాగప్యుపదిష్టాస్తే ప్రాప్నువన్తి పరం పదమ్. 11

చిరకాలాభ్యాసముచే నెవరి యంతఃకరణము శుద్ధమైయుండునో, అట్టివారు స్వల్పమైన యుపదేశముచేతనే పర పదమును (ఆత్మసాక్షాత్కారమును) బొందుదురు.

శ్రీవసిష్ఠ ఉవాచః —

మేరుమూర్ధని మామేవముక్త్వా స విహగాధిపః
తూష్ణీం బభూవ ముక్తాత్మా ఋష్యమూక ఇవామ్బుదః. 12

శ్రీవసిష్ఠుఁడు:- ఓ రామచంద్రా! మేరుపర్వతశిఖరముపై పక్షిరాజగు ఆముక్తాత్ముఁడైన భుశుండుఁడివ్విధమున నాకుఁజెప్పి పిదప, ఋష్యమూక పర్వతముపై మేఘమువలె, మౌనముదాల్చియుండెను.

అహమాపృచ్ఛ్య తం సిద్ధం విద్యాధరమథో పునః
ప్రాప్త ఆత్మాస్పదం రామ మునిమణ్డలమణ్డితమ్. 13

ఓ రామచంద్రా! ఇట్లు నేనాసిద్ధుఁడగు భుశుండుని బ్రశ్నించి, మరల యటనుండి యా విద్యాధరుని చెంతకు తత్సంవాదమునుగూర్చి యడుగుటకై పోయి, పిదప మునిమండలముచే శోభితమగు స్వాశ్రమమునకు దిరిగివచ్చితిని.

ఏతత్తవాద్య కథితం బలిభుక్కథోక్తం
విద్యాధరోపశమనం లఘుబోధనోత్థమ్
అస్మిన్భుశుణ్డవిహగేన్ద్రసమాగమే మే
చైకాదశేహ హి గతాని మహాయుగాని. 14



ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే విద్యాధరోపాఖ్యానే విద్యాధరనిర్వాణం నామ షోడశః సర్గః ॥ 16 ॥

ఓ రామచంద్రా! ఇవ్విధమున, కాకభుశుండునిచేఁ జెప్పఁబడినదియు, స్వల్పమైన యుపదేశముచేతనే విద్యాధరునకు శాంతిని గలుగఁజేసిన విషయమును గూర్చినదియునగు కథను నేను నీకిపుడు వర్ణించి చెప్పితిని. అట్టి పక్షిరాజగు భుశుండునితో నేను సంభాషించి యిప్పటికీకల్పమునఁ బదునొకండు మహాయుగములు గడచినవి.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున
విద్యాధరోపాఖ్యానమున విద్యాధరనిర్వాణమను బదునాఱవ సర్గము ॥16॥

---

## సప్తదశః సర్గః

[అత్రాహంబీజ నిర్దాహాదనహంభావవహ్నినా
దేహాదిసంసృతేః సమ్యగ్బాధేఽలీకత్వమీర్యతే.

అనహంభావమను నగ్నిచే అహంకారమను బీజము దహింపఁబడ దేహాదిరూపసంసారము పూర్ణముగ బాధింపఁబడుటవలన నది మిథ్యయేయగునని యిట వర్ణింపఁబడుచున్నది.]

అనహంవేదనాఽదేవం శుభాశుభఫలప్రదా
సంసారఫలినీ నూనమిచ్ఛాన్తరుపశామ్యతి. 1

శ్రీవసిష్ఠుఁడు:— ఓరామచంద్రా! ఇవ్విధమున, అనహంభావనచేతనే - శుభాశుభఫలముల నొసంగునదియు, సంసారరూపఫలములచేఁ బరిపూర్ణమైనదియునగు ఇచ్ఛ అంతఃకరణమున శమించుచున్నది.

అనహంవేదనాభ్యాసాత్సమలోష్టాశ్మకాఞ్చనః
భూత్వా శాన్తభవావేగో న నరః పరితాప్యతి. 2

అనహంభావముయొక్క యభ్యాసముచే మనుజుఁడు సువర్ణ, లోష్టము (మట్టిగడ్డ)లను సమముగ నెంచువాఁడై, సంసారబాధ శమించువాఁడగుచు మరల యెన్నటికి దుఃఖము నొందకుండును.

అహన్తాపుటకోడ్డీన పరబోధబలేరితః
అహమిత్యర్థపాషాణో న జానే క్వాశు గచ్ఛతి. 3

శ్రవణాదుల యభ్యాసముచే, అహంత్వలక్షణముగల ప్రమాతయను యంత్రపేటికనుండి అగ్నిజ్వాలవలె నావిర్భూతమగు బ్రహ్మజ్ఞానముయొక్క బలముచే, విసరఁబడు అహంకారమను శిల యెగిరి యెచటికో శీఘ్రముగఁ బోవుచున్నది.

అహన్తా పుటకోడ్డీన బ్రహ్మ వీరబలేరితః
అహమిత్యర్థపాషాణో నజానే క్వాశు గచ్ఛతి. 4

అహంత్వలక్షణముగల ప్రమాతయను యంత్రపేటికనుండి, శ్రవణాదుల యభ్యాసముచే అగ్నిజ్వాలవలె వినిర్గతమగు బ్రహ్మసాక్షాద్రూపమను వీరుని బలముచే విసరఁబడు అహంభావమను శాయి యెగిరి యెచటికో శీఘ్రముగఁ బోవుచున్నది.

అహన్తాపుటకోడ్డీనో బ్రహ్మవీరబలేరితః
శరీరయన్త్రపాషాణో న జానే క్వాశు గచ్ఛతి. 5

అహంత్వలక్షణముగల ప్రమాతయను యంత్రపేటికనుండి శ్రవణాదుల యభ్యాసముచే నగ్నిజ్వాలవలె నావిర్భూతమగు బ్రహ్మరూపమను వీరుని బలముచే విసరఁబడు శరీరయంత్రమను శిల యెగిరి యెచటికో శీఘ్రముగ బోవుచున్నది.

అహమర్థహిమం త్వన్తరనహన్తా చిదర్చిషా
ఉడ్డీయేవ విలీనం సన్న జానే క్వాశు గచ్ఛతి. 6

అనహంభావనారూపమగు చిద్రూపాగ్నిచే అహంకారమను మంచు గరఁగి యెచటికో శీఘ్రముగఁ నెగిరిపోవు చున్నది.

అహంరసో విలీనే న్తరనహన్తా చిదర్చిషా
శరీరపర్ణాదుద్వర్ణాన్న జానే క్వాశు గచ్ఛతి. 7

అనహంభావనా రూపమగు చిద్రూపాగ్నియొక్క జ్వాలచే, పాండురవర్ణ మంఁదిన శరీరమను పత్రమునుండి అహంభావమను రసమెచటికో వెడలిపోవుచున్నది.

శరీరపర్ణాన్నిష్పీత స్త్వహంభావ రసాసవః
అనహంతార్కమార్గేణ పరతామధి గచ్ఛతి. 8

అనహంభావరూపమగు సూర్యకిరణముచే శరీరమను పత్రమునుండి త్రాగఁబడినట్టి అహంభావమను రసము తనపూర్వాకారమగు బ్రహ్మరూపత్వమును సూక్ష్మజలాత్మస్థితిని బొందుచున్నది.

శయనే కర్దమే శైలే గృహే వ్యోమ్ని స్థలే జలే
స్థూలా సూక్ష్మా నిరాకారా రూపాన్తరగతాపి చ. 9
యత్ర యత్ర స్థితా సుప్తా ప్రబుద్ధా భస్మతాం గతా
ధృతా నీతా నిమగ్నా చ దూరస్థా నికటా సతీ. 10
శరీరవటధానాన్తః స్థితాహ న్త్వనవాఙ్కురా
శాఖాజాలం తనోత్యాశు సంసారాఖ్యమిదం క్షణాత్. 11
అహన్త్వ వటధానాన్తః స్థితదేహబృహద్ద్రుమః

తత్త్వజ్ఞానములేనివో శరీరమను వటవృక్షబీజము శయ్యపైగాని, బురదయందుగాని, పర్వతముపైగాని, గృహమందుగాని, ఆకాశమునగాని, జలమందుగాని, స్థలమందుగాని, యున్నప్పటికి, లేక స్థూలముగాఁగాని, సూక్ష్మముగాఁగాని, నిరాకారముగాఁగాని యున్నప్పటికి, లేక, రూపాంతరమును బొందినను, లేక, ఎచటెచటనున్నను, నిద్రించుచున్నను, లేక మేలుకొనియున్నను, లేక, భస్మీభూతమైనను, ధరింపఁబడినను, కొనిరాఁబడినను, నిమగ్నమైయున్నను, దూరముగనున్నను, లేక, సమీపమునయున్నను, ఎట్టిస్థితియందున్నప్పటికిని యందు అహంకారమను సూతనాంకుర ముండియే యుండును అవసరమును బొంది అయ్యది క్షణకాలములోనే సంసారమను శాఖాసమూహమును విస్తరింపఁజేయును. ఇవ్విధమున జ్ఞానాభావముచే అహంకారమను వటబీజమే స్థితియందున్నప్పటికిని శరీరమను గొప్పవృక్షమును దనయందుఁ గల్గియేయుండును.

సంసారశాఖానివహం యత్ర తత్ర తనోత్యలమ్. 12

అవసరమునుబొంది యది సంసారమను శాఖాసమూహమును బూర్ణముగ విస్తరింపఁజేయును.

శాఖాశతేద్ధదలపుష్పఫలద్రుమోఽస్తి
బీజోదరే నను దృశా పరిదృశ్యతేఽసౌ
దేహో స్త్వహన్త్వ కణికాన్తర శేషదృశ్య
సంవిత్పరీత ఇతి బుద్ధిదృశైవ దృష్టమ్. 13

వటబీజమందెట్లు అనేకశాఖలతోడను, పుష్పఫలాది సమూహములతోడను గూడిన వృక్షము గలదో, కనుకనే అంకురాది రూపమునవది బహిర్గతమగుటను జనులెట్లు ప్రత్యక్షముగఁ గాంచుచున్నారో, అట్లే అహంకారమను సూక్ష్మబీజములోన నమస్త ద్రవ్యవృత్తులతోఁగూడిన దేహముగలదను నిర్విషయమును వివేకవంతులు సూక్ష్మదృష్టిచే గాంచిరి.

దేహాదహన్త్వమనవాప్తవతో విచారై
శ్చిద్వ్యోమమాత్ర వపుషో వపుషోఽథ వోచ్చైః
నాహన్త్వబీజ జఠరాదసతోఽభ్యుదేతి
సంసారవృక్ష ఇహ బోధమహాగ్నిదగ్ధాత్. 14

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే అహన్త్వాసత్తాయోగోపదేశో నామ సప్తదశః సర్గః ॥ 17 ॥

శ్రవణాది విచారములద్వారా తత్త్వబోధచే చిన్మాత్రశరీరధారియగు జీవన్ముక్తునియొక్క, విద్యమానమైయున్నట్టి, అహంభావరహితమగు శరీరము నుండిగాని, లేక, నిత్యనిరతిశయానందమునఁ బ్రతిష్ఠితుఁడైయున్న విదేహముక్తునియొక్క, జ్ఞానాగ్నిదగ్ధమగు అహంత్వబీజకోశము నుండిగాని మరల యీ సంసార వృక్షము జనింపనేరదు.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణ ప్రకరణమున నుత్తరార్ధమున అహంత్వాసత్తాయోగోపదేశమను బదునేడవ సర్గము ॥17॥

## అష్టాదశః సర్గః

[ఉహ్యమానాన్యనన్తాని పవనైః సర్వతోఽమ్బరే
మృతజీవమనఃస్థాని వర్ణ్యన్తేఽత్ర జగన్తి హి.

ఆకాశమున వాయువుచే నంతటం గొట్టుకొనిపోఁబడునవియు, మృతజీవుని మనంబున నున్నవియునగు అనేకజగత్తుల వర్ణనమిచట, గావింపఁబడుచున్నది.]

**శ్రీవసిష్ఠ ఉవాచ:—**

మరణం సర్వనాశాత్మ న కదాచన విద్యతే
స్వసంకల్పాన్తరస్థైర్యం మృతిరిత్యభిధీయతే. 1

శ్రీవసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! జ్ఞానములేనిచో, మనస్సు, బుద్ధి, అహంకారము మున్నగు సమస్తపదార్థముల యొక్క నాశరూపమగు మరణ మెన్నటికిని గలుగదు. మఱియు జ్ఞానముచే సంభవించు తనయొక్క సమస్తకర్మలయొక్కయు, సంకల్పములయొక్కయు అభావమే మరణమని చెప్పఁబడును.

పశ్యేమే పుర ఉహ్యన్త ఇవ మన్దర మేరవః
ఆరూఢా అపి దిగ్వాతైః సరిద్బిమ్బితశైలవత్. 2

ఆయాజీవుల సంకల్పములచే కల్పితములైనట్టి మేరుమందరాచలాదులు ఆరూఢములైయున్నవైనను, నదియందు బ్రతిబింబించిన పర్వతములవలె వానిని నాయెదుట దిక్కులందలి వాయువులచే అన్యస్థానములకుఁ గొట్టుకొనిపోఁబడుచున్న వానివలె నేను గాంచుచున్నాను. నీవున్ను గాంచుము.

ఉపర్యుపర్యన్తరస్థాః కదలీదలపీఠవత్
శ్లిష్టాశ్లిష్టస్వరూపాః ఖే మిథః సంసృతయః స్థితాః. 3

అరఁటిస్తంభముయొక్క పట్టలవలె నొకదానిపైన నొకటి, ఒకదానిలో నింకొకటియుండియున్నవై, పరస్పరము కూడియున్నట్టియు, భిన్నముగానున్నట్టియు స్వరూపములుగలవైన యనేక జగంబు లాకాశమున గానుపించుచున్నవి.

**శ్రీరామ ఉవాచ:—**

పశ్య మే పుర ఉహ్యన్త ఇతి వాక్యార్థమక్షతమ్
న కించిదవగచ్ఛామి యథా వన్మునినాయక. 4

శ్రీరాముఁడు.— ఓ మునీంద్రా! నా యెదుట మేరుమందరాచలాదులు కొట్టుకొనిపోవుచున్నవను, ఈమొదలగు వాక్యముల పూర్ణమైన యర్థము నేనొకింతైనను దెలిసికొనఁజాలకున్నాను. కావున యథారీతి దానిని సెలవిండు.

**శ్రీవసిష్ఠ ఉవాచ:—**

ప్రాణస్యాభ్యన్తరే చిత్తం చిత్తస్యాభ్యన్తరే జగత్
విద్యతే వివిధాకారం బీజస్యాన్తరివ ద్రుమః. 5



శ్రీ వసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! మరణించినవారి ప్రాణము లాకసమున నెగసిపోవును, ఆ ప్రాణమందు, చిత్తము గలదు. ఆ చిత్తమందు, బీజమందు వృక్షమువలె, వివిధాకారమగు జగత్తు గలదు.

మృతే పుంసి నభోవాతైర్మిలన్తి ప్రాణవాయవః
సరిజ్జలైరివామ్భోధి జలాన్యాత్మద్రుతాని హి. 6

ద్రవస్వభావము గలవగుటచే సముద్రజలములు నదీజలములతో కలియునట్లు, మృతినొందిన పిదప జీవుని ప్రాణవాయువు లాకాశమందలి వాయువులతోఁటి కలియును.

ఇతశ్చేతశ్చ యాన్తీవ తేషామన్తర్జగన్త్యలమ్
వ్యోమవాతవినున్నానాం సంకల్పైకాత్మకాన్యపి. 7

ఇక్కారణమున ఆకాశవాయువుచే విశేషముగఁ బ్రేరితములగు ఆప్రాణములందు సంకల్పరూపమున నున్న యనేక జగంబులుకూడ నిటునటు పరిభ్రమించునట్లుండును.

సా ప్రాణవాతైః పవనైః స్ఫురత్సంకల్పగర్భితైః
సర్వా ఏవ దిశః పూర్ణాః పశ్యామీమాః సమంతతః. 8

ప్రకాశమానములగు సంకల్పములచేఁ బూర్ణమైనట్టి ప్రాణవాయువులతోఁ గూడిన వాయువులచే ఈ దిక్కులన్నియుఁ నలువైపుల, బరిపూర్ణములైయున్నట్లు నేను గాంచుచున్నాను. నీవున్ను గాంచుము.

అత్రైవైతే పశ్య పశ్యామి సంకల్పజగతాం గణే
బుద్ధిదృష్ట్యా సముహ్యన్తే పురో మన్దరమేరవః. 9

సంకల్పజనితములైన జగత్తులను ముంగిటియందిట నాయెదుటనే యనేక మందర, మేరుపర్వతాదులు కొట్టుకొని పోవుచుండుటను జూచుచున్నాను. నీవున్ను బుద్ధిదృష్టిచేఁ జూడుము.

ఖవాతేష్వన్తర్మృతప్రాణాః ప్రాణానామన్తరే మనః
మనసోఽన్తర్జగద్విద్ధి తిలే తైలమివ స్థితమ్. 10

ఓ రామచంద్రా! ఆకాశమందలి వాయువందు మృతించినవారి ప్రాణములు గలవు. ఆ ప్రాణములందు వారి మనస్సుగలదు, ఆ మనస్సునందు, నువ్వులందు నూనెవలె జగత్తు కలదని నీవెఱుఁగుము.

ఖవాతైః ఖసమాః ప్రాణా యథోహ్యన్తే మనోమయాః
ఉహ్యన్తే వై తథైతాని తదఙ్గాని జగన్త్యపి. 11

ఆకాశవాయువులద్వారా యెట్లు తత్సమానములైన మనోమయ ప్రాణములు కొట్టుకొని పోఁబడుచున్నవో, అట్లే యా ప్రాణముల (మనస్సుల) కంగభూతములైన జగత్తులున్ను గొట్టుకొని పోఁబడుచున్నవి.

నభఃస్థాన్యమ్బరోర్వ్యాదివృన్దాని త్రిజగన్త్యపి
ఉహ్యన్తే చాప్యరూఢాని పునః సర్వత్ర గన్ధవత్. 12

చతుర్విధ ప్రాణి సమూహములతోఁగూడియున్నవై, ఆకాశపృథ్వ్యాది భూత సమేతములై, అప్రతిష్ఠితములైనట్టి ముల్లోకములున్ను నా యెదుట గంధమువలె సర్వత్ర కొట్టుకొని పోఁబడుచున్నవి.

తాని బుద్ధ్యైవ దృశ్యన్తే న దృష్ట్యా రఘునన్దన
పురః సంకల్పరూపాణి స్వస్వప్నపురపూరవత్. 13

ఓ రఘునందనా! ఈ యెదుటనున్న సంకల్పరూపములైన జగత్తులు స్వీయ స్వప్న నగరస్థ నదీప్రవాహమువలె బుద్ధిచేతనే కానిపించును గాని చర్మ నేత్రముచేఁ గాదు.

సర్వత్ర సర్వదా సన్తి సుసూక్ష్మాణ్యేవ ఖాదపి
కల్పనామాత్రసారత్వాన్న చోహ్యన్తే మనాగపి. 14

ఆకాశముకంటెను మిగుల సూక్ష్మమైనట్టి సంకల్పజనితములైన యీ మనోమయజగత్తులు సదా సర్వత్ర వెలయుచున్నవి. మఱియు, కల్పనామాత్రమైన రూపముగలవగుటచే యథార్థముగ నెచటను నొకింతైనను గొట్టుకొని పోఁబడనివేయగును.

తాన్యేవ దృఢభావత్వాత్స్వేషు లోకేషు తేష్వలమ్
సత్యాన్యేవ చిదంశస్య సర్వగత్వాద్ధ్రువాసివ. 15

కాని, చిదంశము సర్వత్ర వ్యాపించియుండుటచేతను, ఆ యా జీవులు తమతమ భోగ్యములైనట్టి స్వర్గ, నరక, భూమ్యాదులందు దృఢభావనయొనర్చుట చేతను ఆసంకల్పమయజగత్తులు సుఖదుఃఖాదిభోగక్రియ నొసంగుటయందు సమర్థములగుటఁ జేసి, నీవు నాయెదుట సత్యముగానున్న విధముననే సత్యములుగా దోచు చున్నవి.

ప్రతిబిమ్బం పురాణీవ పురః ప్రాణ సరిద్రయే
ఆరూఢాన్యపి చోహ్యన్తే రూఢాన్యపి చ నైవ చ. 16

ఎదుటనున్న ప్రాణరూపనదీ వేగమందు —ప్రతిబింబిత నగరములవలె ఆవిర్భవించినవియు, (వాసనామాత్రములై ప్రచ్ఛన్నముగనుండుటచే) ఆవిర్భవించనివియు నగు అనేక జగంబులు కొట్టుకొని పోఁబడుచున్నవి. (పరమార్థమున) కొట్టుకొని పోఁబడకయునున్నవి.

సౌరభాణి సముహ్యన్తే వాతాజ్జగ్ధాని రాఘవ
జగన్తి ప్రాణసంస్థాని వ్యోమాత్మకమయాని తు. 17

ఓ రాఘవా! వాయువందున్న సుగంధములు కొట్టుకొని పోఁబడునట్లు, ప్రాణవాయువందున్న ఆకాశమయ (సూక్ష్మ)ములగు జగత్తులున్ను గొట్టుకొని పోఁబడుచున్నవి,

కుమ్భే దేశాన్తరం నీతే యథాన్తర్వ్యోమ్ని నాన్యథా
స్పన్దనాదిమయే చిత్తే తథైవ త్రిజగద్భ్రమే. 18

ఘటము మఱియొకప్రదేశమునకుఁ గొంపోఁబడినను, అందున్న యాకాశమందు నేమియు భేదముగలుగనట్లు, చలనాది మయమగు చిత్తముయొక్కయు, తదంతర్గతములగు ముల్లోకముల యొక్కయు భ్రమణము సంభవించినను, ఆత్మయందెట్టి భేదమున్ను గలుగదు.



ఇత్థం న సజ్జగద్భ్రాన్తిరసత్యైవోదితేవ తే
న వినశ్యతి నోదేతి కేవలం బ్రహ్మరూపిణీ. 19

మృతినొందినవారి ప్రాణమందున్న సంకల్పమయమగు జగత్తెట్లు కల్పనామాత్రమైయున్నదో, అట్లే నీయొక్క జగద్భ్రాంతియు అసత్యముగనే యుదయించినదగును. యథార్థముగ, ఈ భ్రాంతియు నుదయించుటలేదు. నశించుటలేదు. (తత్త్వదృష్టిచే) కేవలము బ్రహ్మరూపమేయైయున్నది.

యది వాప్యుదితే వాతే స్తత్తదస్యా న లక్ష్యతే
తదన్తః సంస్థితైః స్పన్దో నావి కోశగతైరివ. 20

ఒకవేళ, వ్యవహారదశయందీపృథివి యుదయించినదగుచో, నౌకయందున్న జనులకానౌకయొక్క చలనము కానుపించనట్లు, ఆ పృథివియందున్నట్టి మనకు వాయుప్రేరితమగుదాని చలనమున్ను గోచరింపక యుండును.

యథా స్పన్దోఽబ్జలగ్నాయాం నావ్యన్తః సంస్థితైరపి
న లక్ష్యతే తథా పృథ్వ్యాం తత్సంస్థైస్తన్మయైరపి. 21

అవయవములకుఁ దగిలియున్నదైనప్పటికిని నావయందున్న జనులకా నావయొక్క చలనము గోచరించనట్లు, పృథివియందున్నవారై, పార్థివదేహాదిమయులై యున్నప్పటికిని, ఈ పృథివియొక్క చలనము జనులకు గోచరించుటలేదు.

యథా యోజనవిస్తీర్ణం లఘౌ సద్మాను భూయతే
యత్తస్య పాదపస్తమ్భే పరమాణౌ యథా జగత్. 22

అనేక యోజనముల విస్తీర్ణముగల స్థానమైనను చిన్నవృక్షస్తంభముపై చిత్రకారునిబుద్ధిచే నల్పత్వకల్పనచే నెట్లనుభూతమగుచున్నదో, అట్లే, పరమాణువందును మనస్సుయొక్క కల్పనచే జగత్తనుభూతమగుచున్నది.

వస్త్వల్పమప్యతి బృహల్లఘుసత్త్వో హి మన్యతే
మూషికాః స్వాఞ్జలిద్రవ్యం నవపఙ్కమివార్భకాః. 23

రత్నభండారమందుఁ బ్రవేశించిన యెలుకలు రత్నములను దుచ్ఛముగను, తమ దోసిలి మాత్రపు అన్నమును నధికముగను దలంచునట్లును, పసిబాలురు తమ బహుమూల్యములైన సువర్ణాదుల యాభరణములను దుచ్ఛముగను, మృత్తికచేఁ జేయఁబడిన యాభూషణములను నధికముగను భావించునట్లును, తుచ్ఛవిచారముగల జనులు అల్పవస్తువు (పరమాణువు)నుగూడ నధికముగఁ దలంతురు.

అసత్యైవ స్వరూపేఽస్మిఞ్జగదాఖ్యే విదో భ్రమే
లోకాన్తరాధర్మమయీ సా బృహంగిస్య భావనా. 24

అజ్ఞానముచే నావరింపఁబడిన చైతన్యముయొక్క జగద్రూప భ్రమయందు, అసత్యమైన పదార్థమున, జీవితునకిహలోకముయొక్కయు, మృతునకుఁ బరలోకములయొక్కయు, వానివాని ధర్మాధర్మములయొక్కయు కల్పన యేదిగలదో, అది వృద్ధినొందిన చిత్తముయొక్క సంకల్పరూప భావనయే యగును.

ఇదం హేయముపాదేయ మిదమిత్యస్త రఞ్జతా
యస్య తస్య భవాయాస్తి సర్వజ్ఞస్యాపి మూఢతా. 25

'ఇది త్యజింపఁదగినది, ఇది గ్రహింపఁదగినది' అను మమత్వభావన యెవని అంతఃకరణమున గలదో, వానికి అజ్ఞానము గలదనియే యర్థము. సర్వజ్ఞుఁడైన జ్ఞానికిఁగూడఁ బ్రారబ్ధక్షయ పర్యంతము వ్యవహార సంభ్రమము కొఱకిట్టి మూఢత్వము లేశము అనువర్తించియే యుండును.

స చేతనో హ్యావయవీ చేతత్యవయవాన్యథా
స్వాన్తరేవ తతం జీవస్త్రిజగద్బుధ్యతే తథా. 26

చైతన్యసహితుఁడగు వ్యష్టిజీవుఁడు తన హస్తపాదాద్యవయవములను దన మనస్సునందే యనుభవించునట్లు, సమష్టిజీవుఁడగు హిరణ్యగర్భుఁడున్ను దన మనస్సునందే యనుభవించునట్లు, సమష్టిజీవుఁడగు హిరణ్యగర్భుఁడున్ను దనయంతఃకరణముననే, వ్యాప్తములగు ముల్లోకముల ననుభవించును.

సంవిదాత్మపరాకాశ మనన్తమజమవ్యయమ్
వ్యోమ్నోఽవయవరూపాణి తస్యేమాని జగన్తి భోః. 27

ఓ రామచంద్రా! ఈశ్వరుఁడు (మాయాశబలిత చిదాకాశము) వాస్తవముగ చైతన్యస్వరూపుఁడును, చిదాకాశరూపుఁడును, అవ్యయుఁడును, అజుఁడును, అనంతరూపుఁడునై యున్నాఁడు. ఈ జగత్తులన్నియు ఆ మాయాశబలిత ఆ చిదాకాశముయొక్క అవయవములేయై యున్నవి.

సచేతనోఽయఃపిణ్డోఽన్తః క్షురసూచ్యాదికం యథా
బుధ్యతే బుధ్యతే తద్వజ్జీవోఽజ్ఞస్త్రిజగద్భ్రమమ్. 28

ఇనుపగుండు చైతన్యవంతమగుచో దనయందు కత్తి, సూది మొదలగు భావికాలవికారముల నెఱుఁగునట్లు, మాయోపహితుఁడగు ఈశ్వరుఁడున్ను బ్రళయకాలమునఁ దనయందు ముల్లోకముల గూర్చిన భ్రమ నెఱుఁగును.

అచిచ్చిద్వాపి మృత్పిణ్డః శరావోదఞ్చనాదికమ్
యథాఙ్గ మనుతే జీవస్తథాఙ్గ మనుతే జగత్. 29

అధిష్ఠానరూపముచే చిత్తున్ను, నిజరూపముచే జడమునగు మృత్తికాపిండము ఘటము, శరావము (మూకుఁడు) మొదలగు వానిని తన యంగములుగఁ దలంచునట్లు ఈశ్వరుఁడున్ను జగత్తును దన యంగముగఁ దలంచుచున్నాఁడు.

చిదచిద్వాఙ్కురో దేహే వృక్షత్వం మన్యతే యథా
వృక్షశబ్దార్థరహితం బ్రహ్మేదం త్రిజగత్తథా. 30

అధిష్ఠానరూపముచే చిత్తున్ను, నిజరూపముచే జడమునగు అంకురము తనదేహమందు వృక్షత్వమును భావించునట్లు, వృక్ష శబ్దార్థరహితమగు బ్రహ్మమున్ను ఈ త్రిలోకములను దనయందు భావించును.



చిద్వా చిద్వా యథాదర్శో బిమ్బితం వాప్యబిమ్బితమ్
నగరం వేత్తి నో వాపి తథా బ్రహ్మ జగత్త్రయమ్. 31

అధిష్ఠానరూపముచే చిత్తున్ను, నిజరూపముచే జడమునగు అద్దము ప్రతిబింబించిన నగరమును దనయందు దెలియునట్లును, ప్రతిబింబింపనిదాని నెఱుఁగనట్లును, బ్రహ్మమున్ను జీవేశ్వరోపాధ్యసహిత దృష్టిచే త్రైలోక్యమును దనయందు దెలియుచున్నాఁడు, శుద్ధదృష్టిచే నెఱుఁగుటలేదు.

దేశకాలక్రియాద్రవ్యమాత్రమేవ జగత్త్రయమ్
అహంత్వజగతోస్తేన భేదో నాస్త్యేతదాత్మనోః. 32

ముల్లోకములున్ను దేశ, కాల, క్రియా, ద్రవ్యమాత్రములే యైయున్నవి. అహంకారమున్ను దేశకాలాదులం దభిమానము గల్గియుండుటంబట్టి, వానితోటి తాదాత్మ్యము నొందియుండుటచే తత్సమాన స్వభావము గలిగియున్నది. కావున, అహంకారమునకును, జగత్తునకును భేదములేదు.

కల్పితేనోపమానేన యదేదదుపదిశ్యతే
తత్రోపమైకదేశేన ఉపమేయసధర్మతా. 33

జడమైనట్టి లోహ, మృత్పిండాదులు శ్రుతుల చేతను, నా చేతను నుపమానరూపముగఁగల్పింపఁబడి దృష్టాంతమివ్వఁబడినచోట, కేవల మొక్కయంశముననే యుపమేయముతోటి సామ్యమెఱుఁగవలెను.

యదిదం దృశ్యతే కించిజ్జగత్స్థావరజఙ్గమమ్
అముష్యతః పరాణుత్వం జీవస్యైతత్స్మృతం వపుః. 34

ఈ కాన్పించు చరాచరజగత్తంతయు, తనయొక్క సూక్ష్మబ్రహ్మభావమును ద్యజించక యున్నట్టి చైతన్యముయొక్క వివర్తమాత్రమగు శరీరమే యైయున్నది.

సర్వసంవేదనత్యాగే శుద్ధసంస్పన్దదే పదే
న మనాగపి భేదోఽస్తి సిఃసఙ్గోపలకోశవత్. 35

జ్ఞానముచే వివర్తమంతయు బాధింపఁబడ, శుద్ధమై, పూర్ణమై, సర్వత్ర నాశస్యవ్యాపనము గలుగఁజేయునదైనట్టి ఆత్మపదమున, నిస్సంగమైనట్టి శిలాకోశమునందువలె జీవ జగద్భేద మొక్కింతయు నుండదు.

యో యో నామ వికల్పాంశో యత్ర యత్ర యథా యథా
యదా యదా యేన యేన దీయతే స తథైవ చిత్ 36

అట్లు వివర్తము బాధింపఁబడని స్థితియందెచటెచట నెప్పుడెప్పుడేయేవిధమున నేయే వికల్పాంశము మూఢులచే నొసంగఁబడుచుండునో, ఆయావికల్పమునను నరించియే చైతన్యము వికాసము నొందుచుండును.

అచిత్త్వాన్నాస్తి మనసి సంకల్పః ఖ ఇవాఙ్కురః
చిత్త్వాత్తు చేతసో విద్ధి చితిరేవేహ కల్పనమ్. 37

ఆకాశమందు అంకురము లేనట్లు చైతన్యములేనిచో మనస్సునందు సంకల్పమున్ను నుండఁ జాలదు, చైతన్య మధిష్ఠానముగా నున్నందుననే చిత్తమునకు సంకల్పాదుల సామర్థ్యము గలుగుచున్నది. కావున సమస్త సంకల్పనలు చైతన్యముయొక్క వేషములగును.

యా యోదేతి వికల్పశ్రీరప్రబుద్ధాశయం ప్రతి
సర్వగత్వాదనన్తత్వాచ్చిదో వ్యోమ్నః సా న సన్మయీ. 38

చిదాకాశము సర్వవ్యాపకమై, అనంతమై యుండుటఁబట్టిఁ అజ్ఞానియొక్క యంతఃకరణమున నేయే వికల్పసమూదాయ ముదయించునో, అదియంతయు ఆచిదాకాశముయొక్క వివర్తమే యగును, కాని యది సన్మయము కానేరదు.

యథోదేతి వికల్పశ్రీః ప్రబుద్ధేనోదితైవ సా
సర్వగత్వాదనన్తత్వాచ్చిదో వ్యోమ్నః సా న సన్మయీ. 39

చిదాకాశము సర్వవ్యాపకమై, అనంతమై (దేశ కాలవస్తువులచే అపరిచ్ఛిన్నమై) యుండుటచే, జ్ఞానియొక్క అంతఃకరణమున నేవికల్పసముదాయముదయించునో, అది యుదయించనిదేయగును. ఏలయనఁగా, (దాని నాతఁడు మిథ్యగానే రెఁజుగును గాని) సన్మయముగఁ గాదు.

సర్వసంకల్పకలనా సత్యేత్యాబాలమక్షతమ్
స్వప్నాదావనుభూతోऽర్థః కేనాపి లభ్యతే. 40

జాగ్రత్తుయొక్క కల్పనయంతయు బాలునిమొదలు వృద్ధునివఱకు సర్వులకు సత్యముగనే భాసించుచున్నదనినచో, (అట్లే స్వప్నాదులుకూడ సత్యముగనే భాసించుచున్నవిగదా! కాని యా) స్వప్నాదులం దనుభూతములగు గజ, రజతాదిపదార్థముల నెవఁడు పొందుచున్నాఁడు? (ఎవఁడును బొందుటలేదు. కావున, నవి అసత్యములు అట్లే జాగ్రత్పదార్థములున్ను అసత్యములే).

సంకల్పో వాసనా జీవస్త్రయోऽర్థా లిఖితాశ్చితా
సోऽనుభూతోऽప్యసత్యః స్యాదసత్యస్యైవ నో సతః. 41

జాగ్రత్స్వప్నములను సంకల్పము, సుషుప్తియను వాసన, ఈ రెంటియందు ప్రతిబింబించిన భోక్తయగు జీవుఁడు – ఈ మూఁడు పదార్థములను కూటస్థ చైతన్యము తన స్వరూపమున చిత్రమువలె లిఖించినది. ఇట్టి సంసారచిత్రము అధిష్ఠాన సత్తాకారణమున సత్యముగ ననుభూతమైనను వాస్తవముగ అసత్యమేయగును. అసత్యరూపుఁడగు జీవునకే యట్లది సత్యముగఁ దోచునుగాని, అధిష్ఠానమగు సత్తునకుఁగాదు. (చిత్ర, ప్రతిబింబ, స్వప్నాదుల పదార్థము లా చిత్ర, ప్రతిబింబ, స్వప్న పురుషులకే సత్యములుగఁ దోచునుగాని, వాస్తవమనుజులకుఁ గాదు కదా!)

అసత్యతాభిదం సత్యం ముక్త ఏవ భవేచ్ఛివః
సాతివాహిక దేహైక పరిక్షయ వికాసవాన్. 42

నిత్యముక్తుఁడును, సత్యస్వరూపుఁడునగు పరమాత్మయే అసత్యరూపమైన జగత్తును ధరించుచున్నాఁడు. ఏలయనఁగా జ్ఞానముద్వారా సూక్ష్మశరీరసహితమైన అజ్ఞానమొకదాని సంక్షయముచే ప్రకాశరూపుఁడైన యా శివస్వరూపుఁడే శేషించుచున్నాఁడు.



జగన్తి వాతైరుహ్యన్తే వ్యోమ్ని శాల్మలితూలవత్
నోహ్యన్తే చోపలానీవ నచ సన్త్యేవ కల్పనాత్. 43

కావున, బూరుగుచెట్టుయొక్క దూదివలె ఆకాశమున జగత్తులు ప్రాణవాయువులచే గొట్టుకొనిపోఁబడుచున్నవను ఈ వాక్యము అజ్ఞానులకొఱకేయగును. వాస్తవముగ నవి కల్పనామయములగుటచే శిలలవలెఁ గొట్టుకొని పోఁబడుటయులేదు. విద్యమానములైయుండ్యు లేవు.

ఇత్యస్మిన్నఖిలపదార్థసార్థకోశే
[illegible]
అన్యోన్యం పరిమిలితానికానిచిచ్చ
నాన్యోన్యం పరిమిలితాని కానిచిచ్చ. 44

ఇవ్విధమున, సమస్తపదార్థసమూహముల కోశరూపమై, సర్వత్ర వ్యాప్తమైనట్టి చిదాకాశమందు అజ్ఞానకారణముననే యనేక బ్రహ్మాండములు, కొన్ని పరస్పరముకలసియు, కొన్ని వేరుగా నుండియు వర్తించుచున్నవి.

సర్వాత్మాత్పరమ చితేరనన్తరూపా
ణ్యారమ్భ ప్రచురదిగన్తసంభృతాని
లోలామ్బ్వాదరపుర బిమ్బభఙ్గురాణి
స్వాన్తః స్థావిరలమహాపురోపమాని. 45

పరబ్రహ్మము సర్వశక్తివంతమగుటచే ఈ బ్రహ్మాండములన్నియు అనంతరూపములై అనేక కార్యారంభసహితులైన దిగంతములందలి జనులచేఁ బూర్ణములై, చంచలమైన మేఘమందలి నగరప్రతిబింబమువలె క్షణభంగురములై, కావుననే, తమయందు సర్వసామగ్రిచేఁ బరిపూర్ణమైయున్నట్టి దేవగంధర్వాది మహాపురములఁ బోలినవైయున్నవి.

సన్త్యస్థైర్యాణ్యపి సతతం క్షణక్షయాణి
వ్యక్తాత్మాణ్యపి సతతం నిమీలితాని
సాలోకాన్యపి పరితస్తమోవృతాని
చిద్రూపార్ణవలహరీవివర్తనాని. 46

స్థిరముగా నున్నప్పటికిని సదా క్షణభంగురములై, జాగ్రదాదులందుఁ బ్రకటములైనను పరమార్థమున సదా అప్రకటములై, ప్రకాశయుక్తములైనను నెల్లెడల అజ్ఞానాంధకారముచేఁ గప్పఁబడినవై యీ జగంబులు చిద్రూపసముద్రముయొక్క తరంగముల వివర్తనములై యొప్పుచున్నవి.

పృథక్స్థితాని వ్యతిమిశ్రితాని
జలాని చైవామ్బునిధౌ నదీనామ్
తారార్కచన్ద్రగ్రహమణ్డలానాం
సమోదితా[illegible] నభసీవ భాసః. 47

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే జగజ్జాలకోశసాధర్మ్యయోగోపదేశో నామాష్టాదశః సర్గః ॥ 18 ॥

వేఱు వేఱుగ నున్నప్పటికిని ఈ బ్రహ్మాండములన్నియు ఆత్మయందు సముద్రమందు నదీజలములవలెను, ఆకాశమందు సమకాలమున నుదయించిన నక్షత్రముల ప్రకాశమువలెను ఏకరూపముగలవై యున్నవి.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణ ప్రకరణమున నుత్తరార్ధమున జగజ్జాలకోశ సాధర్మ్యయోగోపదేశమను బదునెనిమిదవ సర్గము ॥18॥

---

## ఏకోనవింశతిః సర్గః

[జీవస్వరూపతత్త్వం సమష్టివ్యష్టిదేహయోః।
కల్పనం స్థానకరణభేదాద్భోగశ్చ వర్ణ్యతే.

[జీవుని స్వరూపము, అతని తత్త్వము, స్థాన, కరణ భేదములచే సమష్టివ్యష్టిదేహముల కల్పన, వాని భోగము,—ఇట వర్ణింపఁబడుచున్నవి.]

శ్రీరామ ఉవాచ:—

మునే జీవస్య యద్రూపమాకృతిగ్రహణం తథా
యథా చ పరమాత్మత్వం స్థానం యచ్చాస్య తద్వద. 1

శ్రీరాముఁడు:— ఓ మునీంద్రా! జీవుని శాస్త్రీయ, వ్యవహారోపయుక్తమగు రూపమున్ను పారమార్థికరూపమున్ను ఏమి? వ్యవహారమునకు ద్వారభూతమైన స్థూలశరీరముయొక్క గ్రహణమాతని కెట్లు సంభవించును? మఱియు పరమాత్మరూపము నాతఁడెట్లు పొందగల్గును? దయచేసి వచింపవేఁడెద.

శ్రీవసిష్ఠ ఉవాచ:—

స్వసంకల్పేన చేతోఽర్థ్యుక్తం చిదిత్యపరనామకమ్
అనన్తం చేతనాకాశం జీవశబ్దేన కథ్యతే. 2

శ్రీ వసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! అనంతమైన చిదాకాశమగు బ్రహ్మమే స్వసంకల్ప[illegible]భూతమగు సూక్ష్మోపాధియందు ప్రవేశించి, నేత్రాదీంద్రియములద్వారా విషయముల [illegible] చేసిన [illegible]ముగలదై, ప్రాణధారణయొనర్చుటచే జీవుఁడని [illegible]న్నది.

న పరాణుర్న [illegible]స్థూలం న చ కించన
చిన్మాత్రం స్వానుభవాత్మక [illegible] జీవ [illegible]తే. 3



పరమార్థమున ఆ జీవరూపము సూక్ష్మముగాదు, స్థూలముగాదు, శూన్యముగాదు, మఱియే వస్తువుయొక్కయు రూపమున్నుగాదు. సర్వత్ర వ్యాప్తమై, స్వానుభవరూపమైనట్టి చిన్మాత్రమే 'జీవ' శబ్దముచేఁ జెప్పఁబడుచున్నది.

అణీయసామణీయాంసం స్థవిష్ఠం చ స్థవీయసామ్
న కించిన్మాత్రకం చైవ సర్వం జీవం విదుర్బుధాః. 4

సూక్ష్మపదార్థములకంటె నతిసూక్ష్మమై, స్థూలపదార్థములకంటె నతిస్థూలమై, ఏదియుగానిదై, అంతయు తానైనట్టి యే బ్రహ్మముగలదో, దానినే విజ్ఞులు జీవుఁడని చెప్పుదురు.

యస్య యస్య పదార్థస్య యో భావస్తేన తత్ర తమ్
స్థితం విద్ధి తదాభాసం తదాత్మైకాన్తవేదనాత్. 5

ఓ రామచంద్రా! ఎచట నేయే పదార్థములకేయే జాతిగుణాది అసాధారణరూపముగలదో అచట నాయారూపముచే ఆజీవచైతన్యమే స్థితిగల్గియున్నదని యెఱుఁగుము. ఏలయనఁగా, ఆచైతన్యమే చిత్తవృత్తిద్వారా తత్తత్పదార్థరూపముగ భాసించుచున్నది.

స చేతతి యథా యత్ర యద్యదాశు తదేవ హి
తథా తత్ర తదా రామ భవత్యనుభవాత్మకమ్. 6

ఓ రామచంద్రా! కావున, సమష్టిజీవుఁడెచట నెపుడెట్లనుభవమునొందునో, అచటనపుడట్లే శీఘ్రముగ నగుచున్నాఁడు. వ్యష్టిజీవుఁడెచట నెపుడెట్లగుచున్నాఁడో, అచట నపుడు శీఘ్రముగ నట్లే యనుభవము నొందుచున్నాఁడు.

పవనస్య యథా స్పన్దశ్చైత్యం జీవస్య వై తథా
స్వసంవిన్మాత్రనిర్ణేయం నోపదేశామ యత్నవత్. 7

వాయువునకు చలనము స్వభావమైనట్లు, సమష్టిజీవునకే విచిత్రమైన సృష్టి స్వభావమేయై యున్నది. గాని బాలుని బేతాళభ్రాంతివలె నుపదేశముచే గలిగినదికాదు. ఇవ్విషయమును స్వవిజ్ఞానమాత్రము చేతనే నిర్ణయింపవలసియున్నదిగాని, ఉపదేశముచేగాదు.

యథైవాస్పన్దనాద్వాతః సన్నైవైత్యసదాత్మతామ్
తథైవాచేతనాజ్జీవో జీవన్నేతి పరాం గతిమ్. 8

సంచలనము లేనిచో, వాయువు విద్యమానమైయున్నను అసద్రూపమేయగునట్లు, ఈప్రపంచముయొక్కయు, తదంతర్గతమగు పదార్థములయొక్కయు అనుభవము నొందకయుండినచో, విద్యమానుఁడైయున్నను జీవుఁడు బ్రహ్మభావమును బొందును.

జీవశ్చిద్ఘనరూపత్వాదహమిత్యేవ చేతనాత్
దేశకాలక్రియాద్రవ్యశక్తీర్నిర్మాయ తిష్ఠతి. 9

ఈ సమష్టి జీవుఁడు చిద్ఘనరూపుఁడగుటచే 'అహం' అను అహంకారమాత్రముయొక్క స్ఫురణముచే దేశ, కాల, క్రియా, ద్రవ్యాది శక్తులనావిర్భవింపజేసి వెలయుచున్నాఁడు.

దేశకాలక్రియాద్రవ్యచర్చితాచర్చితాం స్వయమ్
అసత్యాం సత్యవత్స్ఫురాం తావన్మాత్రశరీరికామ్. 10

చేతసా హ్యసదాకారాం ప్రాలేయ పరమాణుతామ్
పశ్యత్యాత్మన్యథాత్మత్వే స్వప్నే స్వమరణోపమామ్. 11

దేశకాలక్రియాద్రవ్యాదులచే సూక్ష్మ (సంస్కార) రూపమున నొకింత యావిర్భవించినదియు, స్థూలరూపమున బాగుగ నావిర్భవించనిదియు, అసత్యమైనను సత్యమువలె భాసించునదియు, అసత్యమైన యాకారముగలదియు, అతిసూక్ష్మమగుటచే మంచుబిందువువంటిదియు, స్వప్నమందలి స్వకీయమరణమును బోలినదియునగు తన యభిలషిత శరీరమును, సమష్టిజీవుఁడు తన సమష్టిచిత్తకల్పనచేఁ దనస్వరూపముననే గాంచుచున్నాడు.

స్వప్నస్యావయవాన్యత్వసదృశీం తాం విభావయన్
విస్మృత్య చేతనాం సత్తాం తత్తామేవాశు గచ్ఛతి. 12

స్వప్నమందుఁ దనఅవయవములను అన్యములుగఁ దలంచునట్లు, ఆ సమష్టిజీవుఁడు సమష్టిచిత్తరూపము (విష్ణుత్వము)ను భావించుచు, దన యానందస్వరూపమగు బ్రహ్మరూపమును మఱచి, పరిచ్ఛిన్నమైన జడజగద్రూపము నొందుచున్నాడు.

ఏవంరూపో బుధ్యమానః ప్రోచ్చూనత్వమథాత్మని
పశ్యత్యాశు స్వమాత్మానం చన్ద్రబిమ్బమివ ద్రుతమ్. 13

ఈ ప్రకారము చింతించుచు, పంచీకరణముద్వారా సమష్టిస్థూలరూపమగు విరాడ్రూపమును బొందుచున్నాడు. మఱియు దనయాత్మయందే సమష్టిమనస్సును, ద్రవస్వభావముగల చంద్రబింబమువలె శీఘ్రముగఁ గాంచుచున్నాడు. ఇదియే యాతని హిరణ్యగర్భరూపము.

ఆత్మన్యథేన్దుబిమ్బాత్మన్యసౌ సంవిత్తిపఞ్చకమ్
కాకతాలీయవద్భిన్నముదితం చేతతి స్వయమ్. 14

పఞ్చానాం సంవిదాం పఞ్చ భిన్నాన్యజ్ఞాన్యసావథ
బుధ్యతే తాని తద్రూపరన్ధ్రాణ్యను భవత్యపి. 15

తదుపరి చంద్రబింబరూపమైనట్టి తన యా స్వరూపమున కాకతాళీయముగ భిన్నముగనుదయించిన పంచజ్ఞానేంద్రియముల నాతఁడు స్వయముగ ననుభవించుచున్నాడు. మఱియు ఆపంచేంద్రియములయొక్క పంచ భిన్న ఛిద్రసహిత స్థానములను, రూపాది భోగద్వారములను చింతించి వానినిగూడ శీఘ్రముగ ననుభవించుచున్నాడు.

స పఞ్చావయవః పశ్చాద్రాజతే పురుషో విరాట్
అనంతాకారసంవిత్తిరవ్యక్తాత్మా నిరామయః. 16

ఇవ్విధమున అవ్యక్తరూపుఁడును, నిరామయుఁడును అనంతాకార జ్ఞానసంయుక్తుఁడు నగు పరమేశ్వరుఁడు (సమష్టిజీవుఁడు) తరువాత పంచేంద్రియములను అవయవములుగలవాఁడై విరాట్టై, తత్స్వరూపము [illegible] విరాట్పురుషుఁడై శోభించుచున్నాఁడు.



మనోమయోఽసావుదితః పరస్మాత్ప్రథమోత్థితః
ఆకాశవిశదః శాన్తో నిత్యానన్దవిభామయః. 17

మనోమయుఁడగు ఈహిరణ్యగర్భుఁడు పరబ్రహ్మమునుండి ప్రథమమున నావిర్భవించినవాఁడై, ఆకాశమువలె నిర్మలుఁడై, శాంతుఁడై, ఆనందరూపుఁడై, ప్రకాశమయుఁడై చెన్నొందుచున్నాడు.

స చాప్యపఞ్చభూతాత్మా పఞ్చభూతాత్మకోపమః
విరాడాత్మైకపురుషః పరమః పరమేశ్వరః. 18

అతఁడు పంచభూతాత్మకుఁడు గాకున్నను పంచభూతాత్మకునివలెఁ దోచుచు సమస్తప్రాణులయొక్క సమష్టిరూపమై, ఏకమైనట్టి విరాడ్రూపుఁడగు పురుషుఁడై, ఉత్తముఁడై నట్టి పరమేశ్వరుఁడే యగును.

స్వయమేవాశు భవతి స్వయమేవ విలీయతే
స్వయమేవ ప్రసరతి స్వయం సంకోచమేతి చ. 19

సర్వశక్తిమంతుఁడగుటచే నాతఁడు స్వయముగనే శీఘ్రముగ నావిర్భవించుచు, స్వయముగనే లయించుచు, స్వయముగనే విస్తరించుచు స్వయముగనే సంకోచమొందుచు నున్నాఁడు.

స్వసంకల్పకృతేనాసౌ కల్పౌఘేన క్షణేన చ
యదృచ్ఛయోదేతి పునః పునర్యాత్యుపశామ్యతి. 20

స్వసంకల్పముచేఁ గల్పింపఁబడిన కల్పముల సమూహములందును, క్షణకాలమందును గూడ నాతడు తనయిచ్ఛచే నావిర్భవించుచు మరల శమించుచు నుండును.

మనోమాత్రైకరూపాత్మా ప్రకృతేర్దేహ ఏష సః
ఏష పుర్యష్టకం ప్రోక్తః సర్వస్యైవాతివాహికః. 21

కేవల మనోమాత్రదేహధారియగు ఈతఁడే ప్రకృతి (సర్వోపాదానమగు ఈశ్వరుని) యొక్క దేహమై యొప్పుచున్నాఁడు. ఈతఁడే వ్యష్టిరూపముచే సర్వజీవులయొక్క పుర్యష్టకమనఁబడు సూక్ష్మదేహమున్నవాఁడై యున్నాఁడు.

సూక్ష్మః స్థూలోఽమ్బరాత్మైష వ్యక్తోఽవ్యక్తోఽనవర్జితః
సర్వస్య బహిరన్తశ్చ నంకించిత్కించిదేవ చ. 22

అవ్యక్త అనంతాకాశరూపుఁడగు ఈ పరమాత్మయే సూక్ష్మశరీరములందు సూక్ష్మముగను స్థూలశరీరములందు స్థూలముగను నున్నాఁడు. మఱియు నీతఁడు సమస్తపదార్థములయొక్క బాహ్యాభ్యంతరములందునుగూడ వెలయుచున్నాఁడు. పరమార్థమున నీతఁడు అపరిచ్ఛిన్నుఁడైయు, వ్యవహారమునఁ బరిచ్ఛిన్నుఁడై యొప్పుచున్నాఁడు.

అఙ్గాని రామ తస్యాష్టౌ మనఃషష్ఠాని పఞ్చ చ
స్వాహంభావానీన్ద్రియాణి భావాభావమయాని చ. 23

ఓ రామచంద్రా! మూర్తామూర్త రూపములగు, పంచజ్ఞానేంద్రియములు, కర్మేంద్రియ సహితమైన ప్రాణము, మనస్సు, అహంకారము — ఈ యెనిమిదిన్ని ఆతని యంగములు.

తేనగీతా ఇమే వేదాః సహశబ్దార్థకల్పనాః
నియతిః స్థాపితా తేన తథాద్యాపి యథాస్థితా. 24

స్వాయంభువగు అపరమేశ్వరుఁడే తన చతుర్ముఖంబులచే శబ్దార్థకల్పనాసహితములైన నాల్గువేదములను గానమొనర్చెను. మఱియు నేఁటివఱకు వ్యవస్థితమైయున్నట్టి నియతి (శాస్త్రీయసదాచారాది మర్యాదను) నాతఁడే స్థాపించెను.

అనన్తమూర్ధ్వం మూర్ధాస్య తథాధః పాదయోస్తలమ్
అపరాకాశముదరమిదం బ్రహ్మాణ్డమణ్డపమ్. 25

లోకాన్తరాణ్యనన్తాని పార్శ్వకాః క్షతజం పయః
మాంసపేశ్యః క్షితిధరాః సరితః సంతతాః శిరాః. 26

రక్తాధారా జలధయో ద్వీపాస్యైవాన్త్రవేష్టనమ్
బాహవః కకుభః స్ఫారాస్తారకా రోమసంతతిః. 27

పఞ్చాశదనిలస్కన్ధా ఏకోనాః ప్రాణవాయవః
మార్తణ్డమణ్డలం చణ్డం పిత్తం జఠరపావకః. 28

శశాఙ్కమణ్డలం జీవః శ్లేష్మా శుక్రం సితం బలమ్
మనః సంకల్పకోశాత్మా సారాత్మా పరమామృతమ్. 29

స్వర్గలోక మీవిరాట్పురుషుని శిరస్సు, పృథివి పాదతలము; మధ్యనున్న యాకాశ ముదరము! ఈ బ్రహ్మాండ మండపము శరీరము; అనంతములైన యితరలోకములు ప్రక్కఅవయవములు, జలము రక్తము, పర్వతములు మాంసపిండములు; నిరంతర ప్రవాహశీలములగు నదులు నాడులు; సముద్రములు రక్తసంచయస్థానములు; సప్తద్వీపములు ప్రేవుల వేష్టనములు; విశాలమగు దిక్కులు బాహువులు; నక్షత్రములు రోమసమూహము; నలుబది తొమ్మిది వాయుసమూహములు ప్రాణవాయువులు; సూర్యమండలము నేత్రములు, జఠరాగ్ని పిత్తము; చంద్రమండలము జీవుఁడు; శ్లేష్మము వీర్యము; మజ్జ, బలము సంకల్పకోశాత్మకమగు మనస్సు; పరబ్రహ్మమే సారమగు ఆత్మ.

మూలం శరీరవృక్షస్య బీజం కర్మద్రుమస్య చ
ప్రసవాత్సర్వభావానా మిన్దురానన్దకారణమ్. 30

చంద్రరూపమగు మనస్సే శరీరమను వృక్షమునకు మూలమున్ను, కర్మయను వృక్షమునకు బీజమున్ను, సమస్తపదార్థముల యుత్పత్తికి హేతువున్ను, అన్నాదులచేఁ దృప్తిపఱచుటచే ఆనందకారణమున్ను నైయున్నది.

యదిన్దుమణ్డలం నామ స సమ్రాడ్ జీవ ఉచ్యతే
శరీరకర్మమనసాం బీజం మూలం చ కారణమ్. 31



ఈ చంద్రమండలమే అన్నాదులకు హేతువగుటచే విరాట్పురుషునియందు జీవుఁడైయున్నది. ఇదియే వ్యష్టిశరీరములందు కర్మ, ప్రాణ, మనంబుల బీజమున్ను, మూలకారణమున్ను నైయున్నది.

అస్మాదిన్దు విరాడ్జీవాత్ప్రసరన్తి జగత్త్రయే
జీవా మనాంసి కర్మాణి సుఖాన్యత్రామృతాని చ. 32

ఈ చంద్రరూపుఁడగు విరాట్-జీవునివలననే ఈమూఁల్లోకములందును సమస్త జీవులును మనంబులును, కర్మలును, సుఖములు (భోగములు)ను, మోక్షములును బ్రసరించు చున్నవి.

విరాజ ఏతే సంకల్పా బ్రహ్మవిష్ణుహరాదయః
తస్య చిత్తచమత్కారాః సురాసురనభశ్చరాః. 33

బ్రహ్మవిష్ణుమహేశ్వరాదు లీచంద్రరూపుఁడగు విరాట్-పురుషుని సంకల్పరూపులేయై యున్నారు. మఱియు, సురాసురులు, ఆకాశచారులగు పక్ష్యాదులు ఈతని చిత్తముయొక్క చమత్కారములేయై యున్నవి.

చిత్స్వభావో బుధ్యమానః ప్రాలేయపరమాణుతామ్
యదా యదా భావయత్యాశు తదా తత్రైవ తిష్ఠతి. 34

చిత్స్వభావము సూక్ష్మమైనట్టి అమృతకళను సాక్షిరూపముగ చంద్రునియం దనుభవించుచు సృష్ట్యాదియం దెపుడు దేవతాదిశరీరాకారమును సంకల్పించుచున్నదో, అపుడు శీఘ్రముగ ప్రజాపతిమున్నగు రూపములతోఁటి వెలయుచున్నది.

తేనైతదేవ జీవస్య స్థానం విద్ధి రఘూద్వహ
పఞ్చావయవమేతత్తచ్ఛరీరమనుభూయతే. 35

రఘుకులోద్ధారకుఁడవగు రామచంద్రా! జాగ్రద్దశగ సర్వులచే ననుభూతమగు ఈ చంద్రమండలమే, అపంచీకృత పంచభూతములే అవయవములుగాఁ గల్గిన సమష్టిజీవుఁడగు విరాట్-పురుషునియొక్క శరీరముగ నెఱుఁగుము.

విరాడ్ జీవాచ్ఛన్ద్రమసో జీవభూతాని దేహినామ్
ప్రసరన్త్యన్నజాతాని ప్రాలేయ విసరాత్మనా. 36

చంద్రరూపుఁడగు ఈ (సమష్టి) విరాట్-జీవునినుండి హిమప్రసారముద్వారా ఓషధుల రూపమున సమస్తవ్యష్టిజీవులయొక్క అన్నాది జీవనసాధనములు లోకములందు విస్తరించుచున్నవి.

తాన్యేవ దేహిదేహేషు జీవా జీవన్తి జీవిషు.
మనో భూత్వా విచేష్టన్తే కర్మ జన్మసు కారణమ్ 37

చంద్రమండలోత్పన్నములగు ఆయన్నాదులే ప్రాణధారణమొనర్చి జీవుల దేహములందు జీవోపాధిరూపమున జీవించుచున్నవి. మఱియు నవియే మనస్సై జన్మ, కర్మల ముఖ్యకారణమై పఱఁగుచు చేష్టలొనర్చుచున్నవి.

ఏవం విరాట్సహస్రాణి మహాకల్పశతాని చ
గతాన్యథ భవిష్యన్తి నానాచారాణి సన్తి చ. 38

ఈ ప్రకారముగ ననేక ఆచారసహితములగు అసంఖ్యాకములైన విరాట్-శరీరములును, అసంఖ్యేయములగు మహాకల్పములును గతించినవి, వర్తించుచున్నవి, కలుగనున్నవి.

సర్వతోఽనుభవరూపయానయా
సత్తయోత్తమపదాద భిన్నయా
అన్తవర్జితమహాజగద్గయా
తిష్ఠతీతి పురుషః పరో విరాట్. 39

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే
మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే విరాడాత్మవర్ణనం
నామైకోనవింశః సర్గః ॥19॥

బ్రహ్మముకంటె వేఱుకానివాఁడై, కనుకనే యనంతుఁడై, అనుభవరూపుఁడై, వ్యష్టి, సమష్టి దేహములతోటి సంబంధముగల అధిష్ఠానసత్తతోఁ గూడినవాఁడై, సర్వదేశకాలములందును విరాట్-పురుషుఁడు మాయోపహిత బ్రహ్మమందు స్థితిగల్గియున్నాఁడు.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున
విరాడాత్మవర్ణనమను బందొమ్మిదవ సర్గము ॥19॥

---

## వింశతిః సర్గః

[వాసనా కర్మకామానురూపసంకల్పసర్జనే
సమష్టిసామ్యం వ్యష్టీనాం జీవానామిహ

వాసనా, కర్మ, కామనలయొక్క అనురూపమైన సమష్టి, వ్యష్టిజీవుల సామ్యమిచట వర్ణింపఁబడుచున్నది.]

**శ్రీవసిష్ఠ ఉవాచ:—**

సంకల్పపురుషస్త్వేషయద్యత్కల్పయతి స్వయమ్
తత్తథా తాదృశం పఞ్చభూతాత్మా భవతీవ ఖమ్. 1

శ్రీ వసిష్ఠుఁడు — ఓ రామచంద్రా! పంచభూతాత్మకుఁడును, సత్యసంకల్పుఁడునగు ఈ విరాట్పురుషుఁడేయే వస్తువును స్వయముగ నెట్లెట్లు సంకల్పించునో, ఆయావిధముగనే స్వయముగ నగుచున్నాఁడు. (చిదాకాశమగు బ్రహ్మము ఆయావిధమున వివర్తభావము నొందుచున్నది.)

సర్వం రామ జగజ్జాతం తత్సంకల్పం విదుర్బుధాః
తాదృగ్రూపం పఞ్చకాత్మ విషయోన్ముఖమాతతమ్. 2



ఓ రామచంద్రా! విజ్ఞులు జగత్సమూహము నంతయు విరాట్పురుషుని సంకల్పరూపమనియే చెప్పుచున్నారు. ఏలయనఁగా, ప్రథమమున ఉపాసనాసంయుతమగు వాసనచే బ్రహ్మము సృష్ట్యాదియందు పంచభూతాత్మకమగు విరాడ్రూపమై, తదుపాసనాఫలమైన పంచమహాభూతాత్మక విషయములయొక్క సమష్టిభోగముయెడల నున్ముఖమయ్యెను.

జగత్పదార్థసార్థస్య విరాట్ సర్వస్య కారణమ్
కారణేన సమాన్యేవ కార్యాణి చ భవన్త్యతః 3

సమస్త జగత్పదార్థసమూహముయొక్క కారణము విరాట్పురుషుఁడే అయియున్నాఁడు. కావున, జగజ్జీవరూపములగు కార్యములును తత్కారణముతోటి సమానముగనే సంభవించుచున్నవి.

యథైష స విరాడేవ విరాట్ ప్రత్యేకమాత్మని
స్వసంవిది ప్రసరతి బోధవాన్న త్వబోధవాన్ 4

కావున ప్రత్యేకమగు వ్యష్టిజీవుఁడును తనయందు సర్వసృష్టి సమర్థుఁడగుచున్నాఁడు. ఏలయనఁగా, నిజమనోవృత్తియను సారము స్వానుభవజ్ఞానము బాహ్యాభ్యంతర విషయాకారముగఁ బ్రసరింప విరాట్పురుషుఁడెట్లు ఆయాపదార్థముల జ్ఞానము గలవాఁడగుచున్నాఁడో, అట్లే వ్యష్టిజీవుఁడును గలవాఁడగునేగాని తద్విరుద్ధముగఁ గాదు.

ఆసరీసృపమారుద్రమేవమభ్యుదితో భ్రమః
అణావప్యద్రివిస్తారో బీజకోశ ఇవ ద్రుమః. 5

కీటపతంగాదుల మొదలు రుద్రునివఱకును ఈ ప్రకారముగ జగదాకారభ్రమ యుదయించినది. (ఇదియే సృష్టి) ఈ సృష్టియందు, బీజమున వృక్షమువలె, అణువునందు గూడ పర్వతముల యొక్క విస్తారము సంభవించుచున్నది.

ఆసరీసృపమారుద్రం విరాట్ ప్రత్యేకమాత్మని
పరాణావప్యనన్తాత్మబోధతో న త్వబోధతః. 6

పరమాణువందుఁగూడ అనంతాత్మ గలఁడను నిర్విషయము జ్ఞానముచేతనే యెఱుఁగఁబడును గాని అజ్ఞానముచేఁగాదు. కీట, పతంగాదుల మొదలు రుద్రునివఱకును ప్రత్యేకమగు ఆత్మయందును విరాట్టు (సృష్టికర్త) కలఁడు. కావున వ్యష్టి, సమష్టులందు సామ్యము సిద్ధించుచున్నది.

యాదృగేవ విరాడాత్మన్యేష విస్తార ఆగతః
తాదృగేవేహ సర్వస్మిన్నణుమాత్రేఽపి భూతకే. 7

ఈ సమస్త జగత్తుయొక్క విస్తారము విరాడాత్మయందెట్లు సంప్రాప్తించినదో, అట్లే అణుమాత్రములైన మశకాది సమస్త ప్రాణులందుఁగూడ సంప్రాప్తించుచున్నది.

పరమార్థేన న స్థూలం న సూక్ష్మం కించన క్వచిత్
యద్యథా వితతం యత్ర తత్తథాఽనుభూయతే. 8

పరమార్థమున ఈయాత్మ స్థూలముగాదు, సూక్ష్మముగాదు, ఎచటను పరిచ్ఛిన్నరూపమును గాదు; భ్రాంతిచే నెచట నెట్లు విస్తరింపఁబడుచున్నదో, అచట నట్లే శీఘ్రముగ ననుభవింపఁబడుచున్నది.

మనశ్చన్ద్రమసో జాతం మనసశ్చన్ద్ర ఉత్థితః
జీవాజ్జీవోఽథవైకైషా సత్తా ద్రవజలాఙ్గవత్. 9

లేక, చంద్రునినుండి మనస్సును, మనస్సునుండి చంద్రుఁడును నుత్పన్నమైనట్లు, జీవునినుండి జీవుఁడుత్పన్నమయ్యెనుగాన, జలద్రవములకువలె సమష్టి, వ్యష్టుల కొకేసత్తగలిగియున్నదగును.

శుక్రసారం విదుర్జీవం ప్రాలేయకణసంనిభమ్
ఆనన్దోఽచలసందోహస్తత ఏవ ప్రవర్తతే. 10

హిమకణమును బోలినదగు వీర్యమునే జీవునియొక్క సారమని చెప్పుదురు. ఏలయనఁగా మాతాపితరుల సమాగమకాలమున చిత్తైకాగ్రతచే భోగాకారవృత్తియందు నిశ్చలమగు బ్రహ్మముయొక్క ప్రతిబింబము పడుటచే, తద్వీర్యోపహితుఁడగు జీవునినుండియే ఆభాసరూపమగు ఆనందాతిశయము ప్రవర్తించుచున్నది.

తం చేతతి తదాభాసం పూర్ణమాత్మస్థమాత్మనా
తత్ర తన్మయతాం ధత్తే తేన తన్మయరూపిణీ 11

అపుడా బ్రహ్మముయొక్క యా ఆభాసరూపమైన ఆనందమునే వీర్యోపహితమగు జీవచైతన్యము తనయందున్న వీర్యస్వభావముచే ననుభవించుచున్నది. మఱియు నట్లనుభవించుచు వీర్యరూపమే ఆనందము, నేను ప్రీతముఁడను అను నివ్విధమున అయ్యానందముతోఁట తాదాత్మ్య మొందుచు తన్మయమై వర్తించుచున్నది.

జీవ సంవిదథైషా స్తర్యదుపాయాతి పఞ్చతామ్
న తత్ర కారణం కించిద్విద్యతే న చ కార్యతా. 12

తదుపరి యీ జీవసంవిత్తే (గర్భస్థవీర్యోపహిత చైతన్యమే) తదంతర్గతమగు దేహరూపమును తాదాత్మ్యముచేఁ (అభేదాధ్యాసము) బడయుచున్నది. కావున నట(దేహోత్పత్తియందు) (విరాట్టు, లేక, అన్యుఁడను) కారణముగాని, కార్యముగాని యేమియును లేదు.

ప్రతియోగివ్యవచ్ఛిత్తేరభావాత్స్వస్వభావయోః
స్వభావోక్తిర్నచైవాత్ర భవత్యర్థానుసారిణీ. 13

ఇవ్విషయమున పరబ్రహ్మముయొక్క స్వభావము కారణమను వాక్యము సార్థకము కాదు. 'స్వశబ్దము' శుద్ధమగు అద్వైత బ్రహ్మముయొక్క వాచకము కానేరదు. ఏలయనఁగా - మందు 'ప్రతియోగి' వ్యవచ్ఛేదములు (విరోధీ, విభాగములు) లేనందున, స్వభావమున్ను ?

జీవో జీవత్వమేవ స్వజీవత్వాదేవ చ స్వతః
అనన్యేన ఒహిష్ఠేన దృశ్యతే న చ వాయువత్. 14



ఒకవేళ, ఆ 'స్వ' శబ్దము, ఉపహితుఁడగు జీవుని పరముగ నెంచినయో నట్టున్ను నా ... 'స్వభావము తగదు. ఏలయనఁగా, వాయువువలె నదృశ్యుఁడగు జీవుఁడు బాహ్యాభ్యంతరములందు ఏకరూపుఁడైయున్నాఁడు. కావున, జీవత్వము, జీవుఁడు-రెండును స్వతః యొకేవస్తువైయున్నవి.

నీహారేణేవ సంవీతశ్చేత్యవస్తుపరాయణః
జాత్యన్ధ ఇవ పన్థానం మారుతాత్మా న పశ్యతి. 15

కాని, ప్రాణేంద్రియాది జడరూపములతోఁట తాదాత్మ్యమునొంది నవాఁడై, హిమమువలె సంకుచితుఁడై, దృశ్య(విషయ)వస్తు పరాయణుఁడై, జన్మాంధునివలె జీవుఁడు అవిద్యాదశయందుఁ దన నిజమార్గమును (స్వస్వరూపమగు బ్రహ్మమును) గాంచుటలేదు.

జగజ్జృమ్భికయా జీవః స్వమైక్యం ద్విత్వమాస్థితః
స్పన్దశక్త్యేవ పవన ఆవృతాత్మా న పశ్యతి. 16

చలనశక్తిచే వాయువు కప్పఁబడునట్లు జగదాకారముగ విజృంభించిన మాయాశక్తిచేఁ గప్పఁబడిన జీవుఁడు తన యేకత్వస్వరూపమునే ద్రష్టృదృశ్యాది ద్వైతరూపముగఁ గల్పించుకొని యందు స్థితిగల్గియున్నవాఁడై, తన శుద్ధరూపమును గాంచకయున్నాఁడు.

అజ్ఞానస్య మహాగ్రన్థేర్మిథ్యా వేద్యాత్మనోఽసతః
అహమిత్యర్థరూపస్య భేదో మోక్ష ఇతి స్మృత. 17

కావుననే అసత్తై, మిథ్యారూపమై, దృశ్యాత్మకమై, అహం, పదార్థరూపమైనట్టి అజ్ఞానమను మహాగ్రంథియొక్క భేదనమే (జ్ఞానముచే దానిని నశింపఁజేయుటయే) మోక్షమని చెప్పఁబడినది.

వ్యపగతఘన చేతనః సమన్తా
దహమితి నూనమనుబుధ్యమాన ఆస్స్వ
అనభిధఘన చేతనైకరూపః
క్షితసదసత్స దసత్సదోదితశ్చ. 18

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు
నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే జీవనిర్వాణ యోగోపదేశో
నామ వింశః సర్గః ॥ 20 ॥

ఓ రామచంద్రా! అందుచే నీవు అజ్ఞానమేఘము తొలఁగినట్టి చిత్ప్రకాశమాత్రుఁడవై, అహంకారమును విస్మరించి, సదా నామరూపరహితమై, మూర్తామూర్త వివర్జితమై, అజ్ఞానశూన్యమై నిత్యోదితమైనట్టి చైతన్యఘనైకరూపమును బొందినవాఁడవై, పరిపూర్ణుఁడవై, ఆనందపూర్వకముగ నుండుము.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున
జీవనిర్వాణయోగోపదేశమను నిరువదవ సర్గము ॥20॥

ఏకవింశతితమః సర్గః.

[అశుభా చ శుభా చాత్ర ద్వివిధా జ్ఞానబన్ధుతా
హేయా గ్రాహ్యా చ యాత్నేన లక్షణైరుపవర్ణ్యతే.

శుభమై, గ్రహింపఁదగినదైనట్టియు, అశుభమై, గ్రహింపఁదగనిదైనట్టియు నిరువిధములగు జ్ఞానబంధుత్వ మిట లక్షణములతోఁ గూడ వర్ణింపఁబడుచున్నది.]

శ్రీవసిష్ఠ ఉవాచ:—

జ్ఞానినైవ సదా భావ్యం రామ న జ్ఞానబన్ధునా
అజ్ఞాతారం వరం మన్యే న పునర్జ్ఞానబన్ధుతామ్. 1

శ్రీ వసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! మనుజుఁడు సదా జ్ఞానియే కావలసినది గాని జ్ఞానబంధువుకాదు. ఏలయనఁగా, జ్ఞానబంధువుకంటె అజ్ఞానియే యుత్తముడని నేను దలంచుచున్నాను.

శ్రీరామ ఉవాచ:—

కిముచ్యతే జ్ఞానబన్ధుర్జ్ఞానీ చైవ కిముచ్యతే
కిం ఫలం జ్ఞానబన్ధుత్వే జ్ఞానిత్వేఽపి చ కిం ఫలమ్. 2

శ్రీరాముఁడు:— ఓ మునీంద్రా! జ్ఞానబంధు వెవరు? జ్ఞాని యెవరు? జ్ఞానబంధు వగుటయం దేమి ఫలము? జ్ఞానియగుటయం దేమి ఫలము?

శ్రీవసి ఉవాచ:—

వ్యాచష్టే యః పఠతి చ శాస్త్రం భోగాయ శిల్పివత్
యతతే న త్వనుష్ఠానే జ్ఞానబన్ధుః స ఉచ్యతే. 3

శ్రీ వసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! ఎవఁడు శిల్పివలె శాస్త్రమును కేవలము భోగముకొఱకే పఠించునో, మఱియు వ్యాఖ్యాన మొనర్చునో, దాని ననుష్ఠించుటయందు ప్రయత్నమాచరింపక యుండునో, అతఁడు జ్ఞానబంధు వనఁబడును.

కర్మస్పన్దేషు నో బోధః ఫలితో యస్య దృశ్యతే
బోధశిల్పోపజీవిత్వాజ్జ్ఞానబన్ధుః స ఉచ్యతే 4

ఎవనికి శాస్త్రాభ్యాసముచే లభించినట్టి శాబ్దబోధ నిత్యక్రియలందు (వ్యవహారమందు) వైరాగ్యాది ఫలితములతోఁ గూడినదై కానుపించకుండునో, ఎవఁడు తత్త్వకథలచే శిల్పివలెఁదన జీవికమాత్రము నుపార్జించుకొనునో యాతఁడు జ్ఞానబంధువని చెప్పఁబడును.

వసనాశనమాత్రేణ తుష్టాః శాస్త్రఫలాని యే
జానన్తి జ్ఞానబన్ధూంస్తాన్విద్యాచ్ఛాస్త్రార్థశిల్పినః. 5



ఎవరు భోజన, వస్త్రాదులమాత్రముచే సంతుష్టులై, తద్భోజనాదిలాభము ... ముగ నెంచుకొందురో, అట్టివారిని జ్ఞానబంధువులని యెఱుఁగవలెను. — (ఇంతవఱకుఁ దెల్పిన జ్ఞానబంధుత్వము త్యజింపఁదగినది.)

ప్రవృత్తిలక్షణే ధర్మే వర్తతే యః శ్రుతోచితే
అమారవర్తి జ్ఞానత్వాజ్జ్ఞానబన్ధుః స ఉచ్యతే. 6

ఎవఁడు శాస్త్రోక్తములగు అగ్నిహోత్రాది ప్రవృత్తిరూపధర్మమందు నిష్కాముఁడై ప్రవర్తించునో, అతఁడు (చిత్తశుద్ధిద్వారా) ఆత్మజ్ఞానమునకు సమీపవర్తి యగుటచే జ్ఞానబంధువనఁబడును. (ఈ జ్ఞానబంధుత్వము గ్రహింపఁదగినది.)

ఆత్మజ్ఞానం విదుర్జ్ఞానం జ్ఞానాన్యన్యాని యాని తు
తాని జ్ఞానావభాసాని సారస్యాఽనవబోధనాత్. 7

ఆత్మజ్ఞానమే నిజమైన జ్ఞానమని చెప్పఁబడును. తక్కిన పదార్థముల జ్ఞానములు జగజ్జీవులకధిష్ఠానమైనట్టి సారమగు బ్రహ్మమును బోధింపఁజాలనివగుటచే జ్ఞానాభాసములే యగును.

ఆత్మజ్ఞానమనాసాద్య జ్ఞానాన్తరలవేన యే
సంతుష్టాః కష్టచేష్టం తే తే స్మృతా జ్ఞానబన్ధవః. 8

ఆత్మజ్ఞానమును బొందక, ఇతర జ్ఞానముయొక్క లేశమాత్రముచే సంతుష్టులై, స్వర్గాదుల ప్రాప్తికొఱకై కష్టముతోడ ప్రయత్నించువారు, అశుభజ్ఞానబంధువులనఁబడుదురు.

జ్ఞానాది తజ్జ్ఞేయ వికాసశాన్త్యా
వినా న సంతుష్టధియేహ భావ్యమ్
త్వం జ్ఞానబన్ధుత్వముపేత్య రామ
రమస్వ మా భోగభవామయేషు. 9

ఓ రామచంద్రా! బాహ్యాభ్యంతర దృశ్యవృత్తి రూపజ్ఞానము, తద్వృత్తులకుఁ గారణమగు ప్రమాత, ప్రమాతకు జ్ఞేయములైన శబ్దాదివిషయములు, తద్విషయముల యనుభవము — వీనియన్నింటియొక్క, నిరతిశయానందస్వరూపమగు బ్రహ్మముతోటి యేకత్వమును శాంతి (సప్తమభూమిక)చేఁ దప్ప, తక్కిన యే భూమికచేతను ముముక్షువు సంతుష్టినొందరాదు. కావున, ఓ రామచంద్రా! నీ వెన్నఁడును జ్ఞానబంధువై రోగరూపములగు సంసారభోగములందు రమింపక నుండుము.

అత్రాహారార్థం కర్మ కుర్యాదనిన్ద్యం
కుర్యాదాహారం ప్రాణసంధారణార్థమ్
ప్రాణాః సంధార్యాస్తత్త్వజిజ్ఞాసనార్థం
తత్త్వం జిజ్ఞాస్యం యేన భూయో న దుఃఖమ్. 10

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు
నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే జ్ఞానవిచారో నామ
ఏకవింశతితమః సర్గః ॥21॥

ఈ ప్రపంచమున ముముక్షువగువాఁడు ఆహారముకొఱకై శాస్త్రానుకూలమగు అనింద్యమైన కర్మ నాచరింపవలయును; ప్రాణధారణకొఱకు మాత్రమే యాహారమును భుజింపవలయును; తత్త్వవిజ్ఞాన (బ్రహ్మము నెఱుఁగుట) కొఱకే ప్రాణములను ధరింపవలయును; దేనిచే మరల జననమరణాది దుఃఖము కలుగదో అట్టి యా బ్రహ్మతత్త్వమును అవశ్యమెఱుఁగవలయును.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున ఉత్త
రార్ధమున జ్ఞానవిచారమను నిరువదియొకటవ సర్గము ॥21॥

—o—

## ద్వావింశతిః సర్గః

[జ్ఞానినో లక్షణాన్యాదౌ కీర్త్యన్తేఽత్రోపపత్తిభిః
తథా జీవజగద్బ్రహ్మతత్త్వాదీని ప్రసఙ్గతః

ఇట ప్రథమమున యుక్తిసహితముగ జ్ఞానియొక్క లక్షణములు వర్ణింపఁబడి, పిదప, ప్రసంగానుసారము జీవజగద్బ్రహ్మతత్త్వములుకూడ వర్ణింపఁబడుచున్నవి.]

శ్రీవసిష్ఠఉవాచః—

జ్ఞానేన జ్ఞేయనిష్ఠత్వాద్యోఽచిత్తం చిత్తమేవ చ
న బుధ్యతే కర్మఫలం స జ్ఞానీత్యభిధీయతే. 1

శ్రీవసిష్ఠుఁడు:—ఓ రామచంద్రా! ఎవఁడు జ్ఞానముచే క్రమముగ జ్ఞేయమైన చిన్మాత్ర బ్రహ్మమున నిష్ఠగల్గియుండుటచే, చిత్తభిన్నములగు శబ్దాదివిషయసమూహమును, కర్మఫలమును, చిత్తరూపముగ నెఱుఁగుచు వానిని సత్యములుగ భావింపకుండునో, ఆతఁడు జ్ఞానియని చెప్పఁబడును.

జ్ఞాత్వా సమ్యగనుజ్ఞానం దృశ్యతే యేన కర్మసు
నిర్వాసనాత్మకం జ్ఞస్య స జ్ఞానీత్యభిధీయతే. 2

ఎవఁడు సమస్త శ్రోత్రాదీంద్రియములయొక్క వృత్తిజ్ఞానములందును, అంతఃకరణముయొక్క శబ్దాది విషయములందును సాక్షిరూపమున నున్నట్టి చిన్మాత్రమగు పరమాత్మను బాగుగ నెఱిఁగి బాధితమగు దృశ్యమును భాసనామాత్రముగఁ జూచి శేషింపకయున్నటుల గాంచునో, ఆతఁడు జ్ఞానియనఁబడును.

అన్తఃశీతలతేహాసు ప్రాజ్ఞైర్యస్యావలోక్యతే
అకృత్రిమైకశాన్తస్య స జ్ఞానీత్యభిధీయతే. 3



ఎవఁడు స్వాభావికమగు ఆత్మైకలాభముచే సంతుష్టుఁడై, శాంతుఁడై యుండునో, వ్యవహారములం దెవనియందు అంతఃకరణ శీతలత్వము విజ్ఞులచే గాంచఁబడునో, అట్టివాఁడు జ్ఞానియని పేర్కొనఁబడును.

అపునర్జన్మనే యః స్యాద్బోధః స జ్ఞానశబ్దభాక్
వాసనాశనదా శేషా వ్యవస్థా శిల్పజీవికా 4

ఏది మూలాజ్ఞానమును నశింపఁజేయుటద్వారా పునర్జన్మను గలిగింపకుండునో, అట్టిబోధయే (తత్త్వజ్ఞానమే) 'జ్ఞాన' శబ్దముచేఁ జెప్పఁబడును. తక్కిన శాబ్దజ్ఞానచాతుర్యము వస్త్రభోజనాదుల నొసంగునట్టి శిల్పజీవికయే యగును.

ప్రవాహపతితే కార్యే కామసంకల్పవర్జితః
తిష్ఠత్యాకాశహృదయో యః స పణ్డిత ఉచ్యతే. 5

యథాప్రాప్తములగు కార్యములందు, కామసంకల్ప వర్జితుఁడై, శరదాకాశము భంగి నిర్మలమైన హృదయముగల్గి యెవఁడు ప్రవర్తించునో, ఆతఁడు పండితుఁడని చెప్పఁబడును.

అకారణం ప్రవర్తన్త ఇవ భావా అకారణాత్
అవిద్యమానా అప్యేతే విద్యమానా ఇవ స్థితాః. 6

ఓ రామచంద్రా! జగదాదులు వాస్తవముగ లేకున్నను, ఉన్నవానివలె గోచరించుచున్నవి.
మఱియు కారణములేకయే యుత్పన్నమైనవిగావున నవి యథార్థముగ నుత్పన్నముకానివే యగును.

ఆవిర్భావతిరోభావైర్భావాభావభవాభవైః
పశ్చాత్కారణతాం యాన్తి మిథః కారణ కర్మభిః. 7

ఈ జగదాదులు సృష్ట్యాదియందు అవిద్యచే నుత్పన్నములై, తదుపరి ఆవిర్భావ, తిరోభావములద్వారా భావాభావములద్వారా, ఉత్పత్తినాశములద్వారా కారణవ్యాపారములచే పరస్పరము కారణత్వము నొందినవి.

అసతః శశశృఙ్గాదేర్మృగతృష్ణామ్భసో యథా
ఆలోకనాదలభ్యస్య కీదృక్ స్యాత్కిల కారణమ్ 8

శశశృంగాదులను, మృగతృష్ణాజలమును బోలినదియు, జ్ఞానప్రకాశముచే అలభ్యమున్నునగు ఈ యసత్తైన జగత్తునకు కారణత్వమెట్లుండఁగలదు?

అసతః శశశృఙ్గాదేః కారణం మార్గయన్తి యే
వన్ధ్యాపుత్రస్య పౌత్రస్య స్కన్ధమాసాదయన్తి తే. 9

అసత్తైన జగత్తునకు, శశశృంగాదులకు నెవరు కారణమును వెతకుచున్నారో, అట్టివారు వంధ్యయొక్క పుత్రపౌత్రాదుల భుజములపై నెక్కుచున్నవారే యగుదురు.

అసత్యప్రతిభాసానామేతదేవాశు కారణమ్
యదనాలోకనం నామ సమాలోకక్షణక్షయమ్. 10

అసత్యములును, ఆభాసరూపములునగు పదార్థములకు అజ్ఞానమే కారణమైయున్నది. జ్ఞానమను ప్రకాశముచే శీఘ్రముగ నవి నశించుచున్నవి.

పరమాత్మాయతే జీవో బుధ్యమాన స్త్వచేతనమ్
చేతనం బుధ్యమానస్తు జీవ ఏవావతిష్ఠతే. 11

అహంకార, దేహాదులను అచేతనములు (జగడములు)గను, (దృశ్యములగుటచే) ఆత్మకంటె భిన్నములుగను నెఱుఁగుటచే ఆ క్షణముననే జీవుఁడు పరమాత్మయగుచున్నాఁడు. కాని, వానిని చేతనములుగను, ఆత్మరూపముగను నెఱుఁగుటచే జీవుఁడు జీవుఁడుగనే యుండుచున్నాఁడు.

పరమాత్మైవ జీవోఽయం బుధ్యమాన స్త్వచేతనమ్
ఆమ్ర ఏవ రసాసక్తేః ప్రయాతి సహకారతామ్. 12

హేమంతర్తువందు సుప్తప్రాయముగనున్న ఆమ్ర, (మామిడి) వృక్షమే వసంతర్తువందు రసప్రాప్తిచే వృద్ధినొంది సహకారత్వము (సహకార, శబ్దయోగ్యత)ను బడయునట్లు, పైరీతి అహంకార దేహాదులను అచేతనములుగను, (దృశ్యములగుటఁబట్టి) ఆత్మకంటె భిన్నములుగను నెఱుఁగుచు, జీవుఁడు పరమాత్మయేయగుచున్నాఁడు.

చేతనం బుధ్యమానస్తు జీవ ఏవావతిష్ఠతే
జీవో జీవిత జీర్ణేషు జాతిజన్మసు జర్జరః. 13

అహంకార, దేహాదులను ఆత్మగను, చేతనములుగను, నెఱుఁగుటచే జీవుఁడు జీవరూపముగనే యుండుచున్నాఁడు. మఱియు, పలువిధయోనులందు జన్మించుచు జన్మించుచు శిథిలీభూతుఁడగుచున్నాఁడు.

యే పరాం దృష్టిమాయాతా విద్ధి తేషామపామివ
అరూపాలోకమననం స్పన్దమస్పన్దనం సదా. 14

ఎవరు బ్రహ్మదృష్టిని బొందుదురో, వారి క్రియలు సదా (రూప, సంకల్పాదుల) అభిమానరహితములై జలము పల్లమునకుఁ బోవువిధమున, ప్రారబ్ధమాత్రము ననుసరించునవై యుండును. అభిమానవర్జితములగుటచే నట్టి జ్ఞానులయొక్క క్రియలు అక్రియలే యగును.

యే పరాం దృష్టిమాయాతా దృశ్యశ్రీపారదర్శినః
న విద్యమానమప్యస్తి తేషాం వేదనమాతతమ్. 15

దృశ్యమునకు పరమైనట్టి బ్రహ్మమును గాంచినవారును, అట్టియుత్తమమగు బ్రహ్మదృష్టి సంప్రాప్తినొందినవారు నగు జ్ఞానులకు (దగ్ధపటన్యాయముగ) దృశ్యము విద్యమానమైయున్నను, బాధితమగుటచే నద్దాని దర్శనము ద్వైత దర్శనము కానేరదు. బ్రహ్మదర్శనమే యగును.

యే పరాం దృష్టిమాయాతా విద్ధి తేషామపామివ
స్పన్దమస్పన్దనం సర్వమవేదనవశాదిహ. 16



ఎవరు బ్రహ్మదృష్టిని బొందుదురో. వారి సమస్తక్రియలును అభిమానరహితములై, జలము పల్లమునకుఁబోవువిధమున ప్రారబ్ధమాత్రము ననుసరించునవై యుండును. అభిమానవర్జితములగుటచేతను, దృశ్యవేదనరహితములగుటవలనను అట్టి జ్ఞానుల సమస్త క్రియలు అక్రియలే యగును.

అరూపాలోకమననవేష్టితా ముక్తదామవత్
బుధాః కర్మసు చేష్టన్తే వృక్షపత్త్రేష్వివానిలః. 17

రూపరసాదివిషయముల చేతను, సంకల్పాదులచేతను జుట్టఁబడనివారగుటచే (దేహేంద్రియాదుల అభిమానము తొలఁగినవారై నందున) బంధనములనుండి విడువఁబడిన వృషభాదులవలె బంధనరహితులగు జ్ఞానులు, వృక్షపత్త్రములందు వాయువువలె, యథాప్రాప్తములగు కర్మలందు చేష్టసల్పుచుందురు.

యే పరాం దృష్టిమాయాతాః సంసృతేః పారదర్శినః
న తే కర్మ ప్రశంసన్తి కూపం నద్యాం వసన్నివ. 18

నదీతటమున వసించువాఁడు కూపమును ప్రశంసింపనట్లు, బ్రహ్మదృష్టిని బొందినవారును, సంసారపారదర్శులు నగువారు కర్మను ప్రశంసింపరు.

యే బద్ధవాసనా మూఢాః కర్మ శంసన్తి తేఽనఘ
శ్రుతిస్మృత్యుచితం తేన వినా బోధం ప్రయాన్తి తే. 16

పాపరహితుఁడవగు రామచంద్రా! వాసనలచే బద్ధులైనట్టి మూఢులే కర్మను బ్రశంసించుదురు, తత్త్వజ్ఞానాభావముచే నట్టివారు ఆకర్మచేతనే శ్రుతిస్మృత్యను సారమగు తత్కర్మఫలభోగమును బొందుచున్నారు.

ఇన్ద్రియాణి పతన్త్యర్థం భ్రష్టం గృధ్ర ఇవామిషమ్
తాని సంయమ్య మనసా యుక్త ఆసీత తత్పరః. 20

క్రిందపడిన మాంసముపై గద్ద దుముకునట్లు, ఇంద్రియములు సామాన్యముగఁ గ్రిందినైపునకే జనుచుండును. కావున బుద్ధిమంతుడగువాఁడు మనస్సుచే వానిని నిగ్రహించి ఆత్మతత్పరుఁడై యుండవలెను.

నాసన్నివేశం హేమాస్తి నాసర్గం బ్రహ్మ విద్యతే
కింతు సర్గాదిశబ్దార్థముక్తం యుక్తమతేః శివమ్. 21

ఆకారములేక సువర్ణముండనట్లు, సృష్టిలేక (మాయాశబలిత బ్రహ్మమును) నుండదు. కాని (దగ్ధవస్త్రముయొక్కయు, అదగ్ధవస్త్రము యొక్కయు ఆకారము సమానమే అయియున్నట్లు, సృష్ట్యాకారము జ్ఞానికిని అజ్ఞానికిని సమముగనున్నను) జ్ఞానికాసృష్టి సృష్ట్యాదిశబ్దార్థరహితమగు శివరూపమైన బ్రహ్మముగనే అనుభూతమగును.

ఏకాన్తకారే సంపన్నే వ్యవహారో యుగక్షయే
నిర్విభాగో నిరాభాసో యథా బ్రహ్మఘనే తథా. 22

కల్పాంతమందు ప్రళయాంధకారమున మాయాశబలితబ్రహ్మమందు జగత్తు నిర్విభాగమై, నిరాభాసమై, జగచ్ఛబ్దార్థరహితమై యుండునట్లు, వివేకవంతుని దృష్టికి ఇపుడున్న (సృష్టికాలమునను) నట్లే గోచరించును.

అభ్రోదరే భ్రమాజ్జానాం స్పన్దాస్పన్దమయీ యథా
స్వసంవిదాత్మికా సత్తా భూతానామీశ్వరీ తథా. 23

చలించు మేఘమునందు దానిని అవయవముల విభాగమైనచో వానిసత్త స్పందమయమైయు, అవిసమభాగమైనచో అస్పందమయమైయు-ఇట్లు స్వానుభవ జ్ఞానరూపమే విరుద్ధధర్మముచే నేకకాలమున సంభావితమగునట్లు, ప్రళయకాలమునను ఈశ్వరుని సత్త ప్రాణులకు సంభావింపదగియున్నది.

జలస్యాన్తర్జలాంశానాం ద్వైతాద్వైతమయో యథా
స్వసంవిదాత్మా సుస్పన్దస్తథా బ్రహ్మణి భూతదృక్. 24

(తటాకాదులయొక్క) ద్వైతాద్వైతమయమగు శాంతజలమున, ఆజలముయొక్కయు, దాని అంశములయొక్కయు భేదము అనిర్వచనీయమైనట్లు, బ్రహ్మమందున్న బ్రహ్మసంవిద్రూపులగు చిదాభాసులయొక్కయు యాబ్రహ్మము యొక్కయు భేదము అనిర్వచనీయమైయున్నది.

యథామ్బరేఽమ్బరాశానాం ద్వైతాద్వైతకృతాత్మని
అనన్యా సృష్టిరాభాతి తథా నవయవే శివే. 25

ద్వైతాద్వైతరూపమగు ఆకాశమందు దిక్కులభేదముచే నేర్పడిన ఆకాశావయవములు అభిన్నముగ భాసించునట్లు, అవయవరహితమగు బ్రహ్మమున సావయవమగు ఈజీవజగదాదిరూప సృష్టియు అభిన్నముగ భాసించుచున్నది..

జగతోఽన్తరహంరూపమహంరూపాన్తరే జగత్
స్థితమన్యోన్యవలితం కదలీదలపీఠవత్. 26

ఈ ప్రకారముగనే జగత్తునందు అహంకారము, అహంకారమునందు జగత్తు, అరటి పట్టలవలెఁ బరస్పర మొకదానినొకటి చుట్టుకొనియున్నవి.

రూపాలోకమనస్కారైరన్తర్బహిరివ స్థితమ్
సృష్టిం పశ్యతి జీవోఽన్తః సరసీమివ పర్వతః. 27

హిమాలయాది పర్వతములు తమ ఛిద్రములనుండి నిర్ఝరులు దేటిన జలమును బాహ్యమున మానస సరోవరాదులరూపమున గాంచునట్లు, జీవుఁడున్ను దనయందలి సృష్టినే, ఇంద్రియ మానసాదుల వృత్తులచే బాహ్యమున నున్నట్లు గాంచుచున్నాఁడు.

జీవో జగత్త్రయాత్మానం పశ్యత్యయమకారణమ్
హేమేవ కటకాదిత్వం తదపశ్యన్న పశ్యతి. 28

పర్యాలోచనముచే సువర్ణమందు కటక, కుండలాది, భూత భావికాల ఆకృతులు కన్పట్టునట్లును, సువర్ణమాత్ర దృష్టియందు నిశ్శేషముగా కన్పట్టనట్లున్ను, జీవుఁడున్ను దన స్వరూపమునే అకారణముగ జగద్రూపముగ గాంచుచున్నాఁడు.



జీవన్తోఽపి న జీవన్తి మ్రియన్తే న మృతా అపి
సన్తోఽపి చ న సన్తీవ పారావారవిదః శుభాః. 29

సంసారముయొక్క పారావారము (ఆవలితీరమును) దర్శించిన పవిత్రాత్ములగు జీవన్ముక్తులు జీవించుచున్నట్లున్నను, వాస్తవముగ జీవింపకయే (ప్రాణమును ధరింపకయే) యున్నారు. మరణించుచున్నట్లున్నను, మరణరహితులేయైయున్నారు, శరీరమును ధరించుచున్నట్లుండినను శరీరవర్జితులేయైయున్నారు.

ప్రబుద్ధః సర్వకర్మాణి కుర్వన్నపి న పశ్యతి
గృహకర్మాణి గేహస్థో గోష్ఠభాణ్డమనా ఇవ. 30

గోశాలయందాసక్తమైన చిత్తముగలవాఁడు గృహమందుండి గృహకర్మ లాచరించుచున్నను వానిని గాంచనట్లు, బ్రహ్మమం దాసక్తిగలజ్ఞాని శరీరయాత్రాది సమస్తకర్మ లాచరించుచున్నను వానిఁ గాంచకయుండును.

విరాడ్ హృది యథా చన్ద్రః ప్రతిదేహం యథా స్థితః
జీవో హిమకణాకారః స్థూలే స్థూలో లఘౌ లఘుః. 31

(సమష్టి శరీరమగు) విరాట్టుని హృదయమందు చంద్రుఁడున్నట్లు, ప్రతివ్యష్టి శరీరమందును మంచుబిందువువంటి యాకృతిగల వీర్యరూపుఁడగు జీవుఁడు స్థూలమందు స్థూలముగను, సూక్ష్మమందు సూక్ష్మముగను, నున్నాఁడు.

అహమాత్మా త్రికోణత్వముపగచ్ఛతి కల్పనమ్
అసదేవ సదాభాసం మన్యతే చేతనాద్వపుః. 32

తండ్రి దేహమున వీర్యరూపముననున్న అహంకారాత్మకుఁడగు జీవుఁడు తల్లియొక్క త్రికోణాకారమగు యోనియందుఁ బడుటచే త్రికోణ పరిచ్ఛిన్న రూపముయొక్క కల్పనను బొందుచున్నాఁడు. మఱియు నందలి రక్తముతోఁ గలిసి కలల, బుద్బుద, పిండాదిక్రమమున నావిర్భూతమగు అసత్తైన శరీరమును సత్తుగను, చేతనముగను భావించి, అందు 'అహం' (నేను) అను నభిమానమును గావించుచున్నాఁడు.

కర్మకోశే త్రికోణే చ శుక్రసారేఽవతిష్ఠతే
దేహే జీవోఽహమిత్యాత్మా స్వామోదః కుసుమే యథా. 33

త్రికోణాకారమగు మాతృగర్భమున, స్వకర్మనిర్మితమై, వీర్యమే సారముగఁగల్గినట్టి దేహమున ఈ జీవుఁడు ఆత్మాభిమానము గావించుచు, పుష్పమందు సుగంధమువలె నుండుచున్నాఁడు

అహమిత్యేవ శుక్రస్థా సంవిదాపాదమస్తకమ్
విసరత్యఖిలే జ్యోత్స్నా యథా బ్రహ్మాణ్డమణ్డపే. 34

చంద్రిక బ్రహ్మాండమండపమంతటను వ్యాపించునట్లు, వీర్యమందున్న చంద్రకళారూపమగు సంవిత్తు (జ్ఞానము) ఆపాదమస్తకము సంపూర్ణదేహమున వ్యాపించుచున్నది.

అక్షరన్ధ్రప్రణాలేన విస్సృతం వేదనోదకమ్
వ్యాప్నోతి త్రిజగద్ధామో వియన్మేఘతయా యథా. 35

పోగ ఆకాశమున మేఘరూపముగ వ్యాపించునట్లు, ఇంద్రియచ్ఛిద్రముల మార్గముగుండా బాహ్యమునకు నిఃసృతమగు జ్ఞానమను జలము ముల్లోకములందును వ్యాపించుచున్నది.

దేహే యద్యప్యశేషేఽస్మిన్బహిరన్తశ్చ వేదనమ్
విద్యతే తత్తథాప్యత్ర శుక్రేఽస్తి ఘనవాసనా. 36

సమస్తశరీరమున బాహ్యాభ్యంతరములందు అహంకారరూపజ్ఞానమున్నను, హృదయమందున్న వీర్యమున విశేషమైన 'అహం' రూపాభిమానము గలదు.

జీవః సంకల్పమాత్రాత్మా యత్సంకల్పోఽవతిష్ఠతే
హృది భూత్వా స ఏవాశు బహిః ప్రసరతి స్ఫుటమ్. 37

ఇక్కారణమున సంకల్పరూపుఁడగు జీవుఁడు హృదయమున నేది సంకల్పించుచున్నాఁడో శీఘ్రముగ ఆరూపముననే బాహ్యమునగూడ స్థితిగల్గియుండుచున్నాఁడు. (తత్సంకల్పపూర్వకముగనే బాహ్యమున వ్యవహరించుచున్నాఁడు).

యథాస్థితాం చ నిశ్చిత్తాం వర్జయిత్వా స్థిరోపమామ్
న కదాచిదపి స్థిత్యా శామ్యత్యహమితి భ్రమః. 38

కావున, స్వభావసిద్ధమై, చిత్తవర్జితమైనట్టి బ్రహ్మముతోటి అభేదజ్ఞానరూపమగు స్థితిఁ దప్ప మఱి యే యితరోపాయముచేతను అహంకారమను భ్రమ శమింపదు.

చిన్తాసుచిన్త్యమానాపి భావనీయామ్బరోపమా
అహంభావోపశమనే శమనేన క్రమేణ తే 39

ఓ రామచంద్రా! నీవు శ్రవణ, మనన, నిదిధ్యాసనములద్వారా బ్రహ్మచింతన గావించుచున్నను, అహంభావముయొక్క పూర్ణోపశమనముకొఱకై, సమాధ్యభ్యాసక్రమమున, ఆకాశమును బోలిన నిశ్చలమైనట్టి చరమ (సప్తమ) భూమికయందలి ఆత్మస్థితిని సంపాదింపవలయును. (అంతవఱకును ఆగవలదని భావము.)

తజ్జ్ఞా వ్యవహరన్తీహ భావ్యభావనవర్జితమ్
అరూపాలోకమననం మౌనం దారునరా ఇవ. 40

జ్ఞానులీప్రపంచమున బాహ్య, మానసిక దృశ్యదర్శనాభిమాన రహితులై, భావ్య, భావన వర్జితులై, కాష్ఠనిర్మిత మనుజునివలె మౌనముగ వ్యవహరింతురు.

అకించిద్భావనో యః స్యాత్స ముక్త ఇతి కథ్యతే
జీవన్నాకాశవిశదో బన్ధశూన్య ఇవ స్ఫుటమ్. 41

ఎవనికి సదా బ్రహ్మభావన గల్గియుండునో, అతఁడు జీవించియుండగనే ఆకాశమువలె నిర్మలుఁడై, నిక్కముగ బంధనరహితుఁడైనట్టి ముక్తుఁడని చెప్పఁబడును.



అహమిత్యేవ శుక్రస్థా సంవిదాపాదమస్తకమ్
విసరత్యఖిలే దేహే బ్రహ్మాణ్డేఽర్కప్రభా యథా. 42

సూర్యప్రకాశము బ్రహ్మాండమంతటను వ్యాపించునట్లు వీర్యమందున్న జీవసంవిత్తు, ఆపాదమస్తకము సమస్త దేహేంద్రియాదులందు, అహంభావరూపముతో వ్యాపించుచున్నది.

దృఙ్నేత్రం స్పదనం జిహ్వా శ్రుతిః శ్రోత్రం భవత్యసౌ
ఇత్యాద్యా వాసనాః పఞ్చ బద్ధ్వా తాసు నిమజ్జతి. 43

నేత్ర, జిహ్వా, శ్రవణాదీంద్రియముల ఛిద్రములందు వీర్యసంవిత్తు ప్రవేశించి, వానియందు అహంభావరూపమగు వాసనచే బద్ధమై, విషయముల దర్శన, స్పర్శన, శ్రవణాదులందు నిమగ్నమగుచున్నది.

చిద్భావోఽక్షతయోదేతి మనో భూత్వైకదేశతః
సర్వగోఽపి రసో భూమా యథాఙ్కురతయా మహా. 44

భూమిక్రింద రసమంతటను వ్యాపించియున్నను అంకురరూపముననే అభ్యుదయముఁ బొందునట్లు, (అజ్ఞానావృతమగు) చైతన్యము (సర్వత్ర వెలయుచున్నను,) ప్రథమమున మనస్సై, పిదప వీర్యమందు అహంభావనారూపమగు ఏకదేశముద్వారా, ఆయాయింద్రియరూపముగ నుదయించుచున్నది.

యో భావయతి భావేషు నేహ రూఢేష్వభావతామ్
తస్యాయత్నవతో దుఃఖమనన్తం నోపశామ్యతి. 45

ఎవఁడీప్రపంచమున రూఢములైన మనోహంకారదేహాది జగద్రూపములందు బ్రహ్మభావనద్వారా ("నేతి, నేతి; నేహ నానాస్తికిఞ్చన మున్నగు శ్రుతివాక్యములచే దర్శితమగు) అభావనను భావింపకుండునో, అట్టి ప్రయత్నరహితుఁడగు మనుజునకు అనంతమైన సంసారదుఃఖ మెన్నటికిని శమింపకుండును.

యేన కేనచిదాచ్ఛన్నో యేన కేనచిదాశితః
యత్ర క్వచనశాయీ హ స సమ్రాడివ రాజతే. 46

జ్ఞానామృతముచేఁ దృప్తుఁడగు మనుజుఁడేది (బొంతగాని, పట్టువస్త్రముగాని) ధరించినను, ఏది భుజించినను, ఎచట బరుండినను సర్వోత్తమమైన (ఆత్మ) సుఖముననే యనుభవించుచు చక్రవర్తివలె శోభించును.

వాసనాభిరుపేతోఽపి సమగ్రాభిరవాసనః
అన్తః శూన్యోఽప్యశూన్యాత్మా ఖమివ శ్వసనాన్వితః. 47

అనేక వాసనలతో (బ్రహ్మవాసనలతో, లేక దగ్ధవస్త్రతంతువుల యాకృతిఁ బోలిన ప్రారబ్ధసంస్కారమాత్రరూపములగు జగద్వాసనలతో) గూడియున్నను, అట్టి జ్ఞాని వాసనారహితుఁడే యగును. మఱియు, అంతఃకరణమున సాంసారికవృత్తి శూన్యుఁడైనను, అశూన్యమగు చిన్మాత్రరూపుఁడే యగుచు ఆకాశమువలె ప్రాణవాయువు ధరించియుండును.

ఆసనే శయనే యానే స్థితో యత్నైర్న బోధ్యతే
నిద్రాలురివ నిర్వాణమనోమనన నిర్వృతః. 48

మనస్సంకల్పరహితుఁడై, షష్ఠాది భూమికలం దారూఢుఁడై, అట్టి జ్ఞాని ఆసన, శయన వాహనములపైఁ గూర్చొని నిర్వాణదశను బొందియున్న వాఁడై నిద్రాళువువలె యత్నముల చేతనుగూడ మేల్కొలుపఁబడకుండును.

సంవిన్మాత్రం హి పురుషః సర్వగోఽపి స తిష్ఠతి
స్ఫుటసారే శరీరస్య యథా గన్ధోఽబ్జకేసరే. 49

సంవిన్మాత్రుఁడగు పురుషుఁడు సర్వవ్యాపియైనను, కమలకోశమున గంధమువలె శరీరమందు సారభూతమైనట్టి వీర్యమున స్థితి గల్గియుండును.

సంవిన్మాత్రం విదుర్జన్తుం తస్య ప్రసరణం జగత్
ఆత్మ నిష్ఠత్వమజగత్పర మేత్యుపదేశభూః. 50

జీవుఁడు సంవిన్మాత్రుఁ (జ్ఞానమాత్రుఁ) డనియే చెప్పఁబడెను. అతని యొక్క విస్తారమే యీ జగత్తు. ఆత్మనిష్ఠుఁడైనచో ఆతఁడు జగద్రహితుఁడై పరమాత్మపదము నొందును. ఇంతియే యుపదేశముయొక్క సారమంతయు.

నీరసో భవ భావేషు సర్వేషు విభవాదిషు
పాషాణం హృదయం కృత్వా యథా భవసి భూతయే. 51

ఓ రామచంద్రా! సమస్త సాంసారిక పదార్థములందును, విభవాదులందును, వైరాగ్యము గల్గి, హృదయమును శిలవలె ఇచ్ఛాదిరహితమొనర్చి, జ్ఞానమును ఐశ్వర్యమును బొందుటకొఱకై సన్నద్ధుఁడవుకమ్ము.

సాధో హృదయసౌషిర్యమసౌషిర్యమివాస్తు తే
అచిత్త్వవపుషోఽచిత్త్వాదుపలస్యేవ రాఘవ. 52

సాధువగు నో రాఘవా! జడమైనట్టి శిలయొక్క హృదయము ఛిద్రరహితమై యొప్పునట్లే, దహరాకాశరూపమగు నీయొక్క హృదయచ్ఛిద్రమున్ను, చైతన్య ప్రవేశనముచే, తచ్చైతన్య నివిడితమై, ఛిద్రరహితమై యొప్పుగాక! [లేక, సాంసారిక వాసనలకు అవకాశ మొసంగకుండుటకొఱకై, నీయొక్క హృదయము చైతన్యపూరితమై, జడమైన శిలవలె ఛిద్రరహితమైయుండుగాక!]

తజ్జాజ్ఞయోరశేషేషు భావాభావేషు కర్మసు
ఋతే నిర్వాసనత్వాత్తు న విశేషోఽస్తి కశ్చన. 53

జ్ఞానియొక్కయు, అజ్ఞానియొక్కయు సమస్త భావాభావములందును, కర్మలందును, (వ్యవహారమందు) ఏవిశేషమున్ను లేదు. కాని, జ్ఞాని యాపదార్థములందును, కర్మలందును వాసనారహితుఁడై (వానియందు సత్యత్వబుద్ధిలేక) యుండును. అజ్ఞాని వాసనాసహితుఁడై యుండును. ఇంతియే భేదము.



సత్తైవైషా విదో యత్నా భవత్యున్మిషితా జగత్
పరం తత్త్వం సమిషతా దృగివానామకం తతమ్. 54

(స్ఫటికశిలయందుఁ బ్రతిబింబించిన నగరముయొక్క (ద్రష్టయొక్క దృష్టివలె) చైతన్య సత్తయే, వాసనలచే స్ఫురించుటచే జగద్రూపమగుచున్నది. వాసనల అభావముచే ఆ జగద్రూపము శమింప, అపరిచ్ఛిన్నమై, నామరూపరహితమైనట్టి మోక్షస్వరూపమే యగుచున్నది.

దృశ్యం వినశ్యత్యఖిలం వినష్టం జాయతే పునః
యన్న నష్టం న చోత్పన్నం యత్సద్భవతి తద్భవాన్ 55

ఓ రామచంద్రా! ఈ దృశ్యజగత్తంతయు నశించుచున్నది. నశించి మరల యుత్పన్నమగుచున్నది. కావున నేది నశింపకయు, ఉత్పన్నముగాకయు నుండునో, అదియే సత్తు. ఆ సత్తే నీవు.

భావజ్ఞప్తిర్నిర్మూలా భావితాపి న విద్యతే
సలిలం మృగతృష్ణేవ న దదాతి భవాఙ్కురమ్. 56

ఇట్టి బోధచే మూలాజ్ఞానము నశింప నిర్మూలమైనట్టి జగద్భ్రాంతి అన్వేషించినను మరల యొచటను లభింపకుండును. మఱియు, మృగతృష్ణాజలము అంకురము నుత్పన్నమొనర్పనట్లు, మరల యది సంసారమను అంకురము నుత్పన్నమొనర్పకయుండును.

యథా భూతార్థసందర్శచ్ఛిన్నాఽహమితి భావనా
దృష్టాపి న కరోత్యన్తర్దగ్ధం బీజమివాఙ్కురమ్. 57.

ఆత్మపదార్థమును సందర్శించుటచే ఛిన్నమూలమగు అహంభావన మరల కానుపించినప్పటికిని దగ్ధబీజమంకురమును గలుగఁజేయనట్లు అంతఃకరణమున సంసారమును గలుగఁజేయకుండును.

కర్మ కుర్వన్న కుర్వన్వా వీతరాగో నిరామయః
నిర్మనా నిత్యనిర్వాణః పుమానాత్మని తిష్ఠతి. 58

వీతరాగుఁడును, మనోవికార రహితుఁడునగు జ్ఞాని కర్మలఁజేయుచున్నను, లేక, చేయకయున్నను, సదా అమనస్కుఁడై, నిత్యనిర్వాణరూపుఁడై, ఆత్మయందే స్థితి గల్గియుండును.

చిత్తోపశాన్తాః సంశాన్తాః శాన్తా యే భోగబన్ధవః
న స్వభావపరిక్షీణాచ్చిత్తమేషాం కిలాకరః. 59

ఎవరు తమ చిత్తమును శమింపఁజేయుదురో, వారే శాంతులైయుందురు. భోగములందు బంధించునవైన భోగవాసనలెవరికి సమూలముగ నశింపఁబడకయుండునో, అట్టివారియందా వాసనాదులకు ఆకరమైనట్టి చిత్తము విద్యమానమైయే యుండునుగాన వారు శాంతి నొందఁజాలరు.

అఘనః కేవలాలోకో బుద్ధో జీవః పరాయతే
స ఏవాన్యోఽప్యనన్యోఽన్తరపరాహ్ణ ఇవాతపః. 60

చిత్తదేహాది రూపమున ఘనీభావము నొందని (వానియం దహంభావము [illegible]) విజ్ఞుఁడగు జీవుఁడు కేవల చిన్మాత్రరూపుఁడగు పరమాత్మయే యగుచున్నాఁడు. అట్లుగాక, చిత్తాదులందు అహం

భావముతోఁ గూడియుండువాఁడు మధ్యాహ్నసూర్యుని తాపము వలెఁ దాపసంయుక్తుఁ డగుచున్నాఁడు.

ఏకదేశస్థితాత్పుంసో దూరాయాతస్య చేతసః
యద్రూపం సకలం మధ్యే తద్రూపం పరమాత్మనః. 61

ఏకదేశమందున్న మనుజుని చిత్తము దూరమందున్నట్టి సూర్యచంద్రమండలాదులకు జనునపుడా రెంటికిని (మనుజునకు, సూర్యాదులకు) మధ్యనున్న ప్రదేశమందు ఏచైతన్యస్ఫురణము గలదో, అదియే పరమాత్మయొక్క స్వరూపమగును.

చారుచిద్వ్యోమకర్పూరం యచ్చమత్కురుతే స్వయమ్
అనన్తమన్తరవ్యక్తం జగదిత్యేవ వేత్తి తత్. 62

మనోహరమైనట్టి అనంత చిదాకాశమను కర్పూరము తాను స్వయముగ ఏచమత్కారము గావించుచున్నదో, అద్దానినే వ్యక్తమైనట్టి జగత్తుగ దనయందు నెఱుంగుచున్నది.

గతభవభ్రమభాసు రక్షయం
శమముపేతము పేక్షితదీపవత్
స్థితమపీహ జనం జగదీశ్వరా
దనుగతం నను భాతి ముదా చఖే. 63

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే సుఖయోగోపదేశో నామ ద్వావింశః సర్గః ॥ 22 ॥

ఓ రామచంద్రా! జ్ఞానుల కీజగత్తు భ్రమరహితమై, ప్రకాశశీలమై, శమించిన దీపమువలె నిర్వాణసహితమైనట్టి అక్షయ పరబ్రహ్మముగనే భాసించును. అజ్ఞానులకో, నియంతయైన యీశ్వరుని యొక్క సమస్తనియతివ్యవస్థలతోఁగూడియున్నదిగను భోగాదియుక్తమైనదిగను గోచరించునేగాని, పరమార్థమున ఆకాశకోశమందు సద్రూపముగ వెలయుచున్నను నట్లువారికి గానుపించకుండును.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణ ప్రకరణమున నుత్తరార్ధమున సుఖయోగోపదేశమను నిరువది రెండవ సర్గము ॥22॥

---

## త్రయోవింశతిః సర్గః

[మఙ్కినో మరుకాన్తారే వసిష్ఠేనాత్ర సంగమః
నిర్వేదాత్తత్త్వజిజ్ఞాసోరుపదేశశ్చ వర్ణ్యతే.

ఒకానొక మరుభూమి యందలి మహారణ్యమున తత్త్వజిజ్ఞాసువైన మంకియను బ్రాహ్మణుని వసిష్ఠమునీంద్రుఁడు కలిసికొనుట, వైరాగ్యయుతుఁడగుటచే నాతని కుపదేశించుటయను విషయము లిచట వర్ణింపఁబడుచున్నవి.]



శ్రీవసిష్ఠ ఉవాచ:—

విరాగవాసనాపాస్తసమస్తభవవాసనః
ఉత్థాయ గచ్ఛ ప్రకృతేరస్యా మఙ్కిరివాఙ్కితః. 1

శ్రీవసిష్ఠుఁడు.— ఓరామచంద్రా! మంకివలె నీవున్ను సమస్త సంసారవాసనా రహితుఁడవై, తత్త్వబోధచే ఈసంసారమునుండి లేచి ఆత్మపదమును బొందుము.

మఙ్కిర్నామాభవత్పూర్వం బ్రాహ్మణః సంశితవ్రతః
స కథం శృణు నిర్వాణమాప్తవాన్మద్విబోధితః. 2

పూర్వము ఉత్తమవ్రతయుక్తుఁడగు మంకియను నొక బ్రాహ్మణుఁడుండెను. అతఁడు నాయుపదేశముచే మోక్షమెట్లు పొందెనో వినుము—

అహం కదాచిదాకాశకోశాదవనిమాగతః
భవత్పితామహార్థేన కేనాప్యుపనిమన్త్రితః. 3

నీ పితామహుఁడగు అజునిచే నొకానొక యజ్ఞకార్యమునకై పిలిపింపఁబడి నే నొకసమయమున ఆకాశమునుండి భూమిపైకి వచ్చితిని.

విహరన్భూతలం గచ్ఛంస్త్వత్పితామహపత్తనమ్
ప్రాప్తోఽస్మికామప్యాదీర్ఘామరణ్యానీం మహాతపామ్. 4

భూతలముపై సంచరించుచు నీపితామహుని పట్టణమగు అయోధ్యకు వచ్చుచుండఁ ద్రోవలో గొప్ప ఆతపము (ఎండ) తోఁగూడిన విశాలమైన యరణ్యమొకదానిని బొందితిని.

పాంసుప్రతర్దనహతాం ప్రకచత్తప్తసైకతామ్
అదృష్టపారపర్యన్తాం క్వచిద్గ్రామకిలాఙ్కితామ్. 5
అక్షుబ్ధఖానిలాలోకజలభూశాన్తిశాలినీమ్
తతాం శూన్యాం మహాకమ్ప్యాం బ్రహ్మసత్తామివామలామ్. 6
అవిద్యామివ సంమోహామ్మృగతృష్ణాం గతాం భ్రమాత్
జడతామాతతాం శూన్యాం దిఙ్మోహామిహికాకులామ్. 7

ఆ యరణ్యము ధూళియొక్క విస్తారముచే ధూసరమై, తప్తమైన యిసుకచేఁ బరిపూర్ణమై అపారమై, అచటచట దుష్టగ్రామములచే చిహ్నితమై, క్షోభరహితములైన ఆకాశ, వాయు, ఆతప, (మృగతృష్ణా)జల, తప్తభూములయొక్క శాంతిచే శోభాయమానమై, విశాలమై, శూన్యమై, దుర్గమమగుటచే పథికులయొక్క గొప్ప యత్నములతోఁగూడినదై, నిర్మలమైన బ్రహ్మసత్తవలె గోచరించుచున్నదై, భ్రమచే మోహదాయకమైనట్టి మృగతృష్ణాజలము గలదగుటచే అవిద్యను బోలియున్నదై, జడత్వమును బొందినదై, అతివిశాలమై, జనశూన్యమై, దిగ్భ్రమయను మంచుగల్గియున్నదై యొప్పుచుండెను.

అథ తస్యామరణ్యాన్యాం యావత్ప్రవిహరామ్యహమ్
తావత్పశ్యామి పురతో వదన్తం పథికం శ్రమాత్. 8

ఆ మహారణ్యమున నేను సంచరించుచుండ నింతలో శ్రమచే నిట్లు వచించుచున్నట్టి యొక పథికుని నచట గాంచితిని.

పాన్థ ఉవాచ:—

అహో ను పరిఖేదాయ ప్రౌఢప్రాయాతపో రవిః
పరితాపాయ పాపోఽయం దుర్జనేనేవ సంగమః. 9

పథికుఁడు.— ఆహా! పాపియొక్కయు, దుర్జనునియొక్కయు సాంగత్యము పరితాపమునే కలిగించునట్లు, మహాప్రచండమైన యాతపము (ఎండ)తోఁగూడిన యీసూర్యుఁడు దుఃఖమునే గలిగించుచున్నాఁడు.

సుగలన్తీవ మర్మాణి స్ఫురతీవాగ్నిరాతపే
సంకుచత్పల్లవాపీడాస్తాప్యన్తే వనరాజయః. 10

నా అవయవములన్నియుఁ గరఁగిపోవుచున్నవి. ఆతపమున అగ్ని ప్రజ్వలించుచున్నట్లున్నది. వృక్షముల యాకులు వాడిపోయి సంకుచితములగుచున్నవి. అరణ్యసమూహము లన్నియు సంతాపము నొందుచున్నవి.

తత్తావదేవమగ్రస్థం గ్రామకం ప్రవిశామ్యహమ్
శ్రమమత్రాపనీయాశు వహామ్యధ్వానమాశుగః. 11

కావున నెదుటనున్న యీ చిన్నగ్రామమునఁ బ్రవేశించి, అట శ్రమనీయ్చకొని మరల శీఘ్రముగ నాదారి నేగుదును.

ఇతి సంచిన్త్య సోఽగ్రస్థం కిరాతగ్రామకం యదా
ప్రవేష్టుమిచ్ఛతి తదా మయా ప్రోక్తమిదం వచః. 12

ఇట్లు విచారించి యెపుడాతఁడా కిరాతులగ్రామమునఁ బ్రవేశింపఁదలంచెనో, అపుడాతనితో నేనీవాక్యములఁ బల్కితిని—

అపరిజ్ఞాతనీరాగమార్గమిత్ర శుభాకృతే
మరుమార్గమహారణ్యపాన్థ స్వాగతమస్తు తే 13

రాగరహితులైన సజ్జనులుండు తావునకు మార్గమెఱుఁగని, శుభాకృతిగల యోమిత్రమా! మరుస్థలమందలి మహారణ్యముయొక్క పథికుఁడా! నీకు స్వాగతము!

చిరం మనుష్యదేశేఽస్మిన్నిర్జనగ్రామమధ్వని
అధరాధ్వగవిశ్రాన్తిం విశ్రాన్తోఽపి న లప్స్యసే. 14

నిమ్న మార్గమునఁజను ఓ పథికుఁడా! మార్గమున పూర్వగ్రామములం దొకింత విశ్రాంతిని బొందినప్పటికిని, ఇఁక అతిథిసత్కారులగు జనులులేని యీ మనుష్యదేశమున (దేహమున) చిరకాలము నీవు విశ్రాంతిని బొందనేరవు.



గ్రామే విశ్రమణం నైవ వర్తతే పామరాస్పదే
తృడ్వై లవణపానేన భూయ ఏవాభివర్ధతే. 15

పామరులకు నివాసస్థానమైనట్టి గ్రామమున (దేవమనుష్యాది దేహములందు) విశ్రాంతి లభించదు. ఉప్పునీటిని త్రాగుటచే (విషయసేవనముచే) దప్పిక (విషయేచ్ఛ) యింకను వృద్ధినొందునుగదా!

ఏతే గ్రామైకశరణాః పల్లవాః స్పన్దభీరవః
అయథాపథసంచారా హరిణా ఇవ జన్తవః. 16

అరణ్యగ్రామములందు వసించువారును, మహాత్ముల (వివేకముయొక్క) సమాగమము యెడ భీరువులును, కుమార్గములందు (అశాస్త్రీయమార్గమున) జనువారునగు ఈకోయజాతివారు (కామాదులు) పశుతుల్యులై యున్నారు.

న స్ఫురన్తి విచారేషు ప్రజ్వలన్త్యనుభూతిషు
న త్రస్యన్తి దురాచారాదశ్మయన్త్రిమయా ఇవ. 17

వీరు శిలావిగ్రహాదులవలె తత్త్వవిచారమున మూఢులైయున్నారు. మఱియు ఐశ్వర్యములందు (లేక, అనుభవములందు) మండిపడుచుందురు. దురాచారముయెడల నెన్నడును భయపడకయుందురు.

కామార్థరాగసద్వేష పరినిష్ఠిత పౌరుషాః
కర్మణ్యాపాతమధురే రమన్తే దగ్ధబుద్ధయః. 18

అర్థ, కాములకొఱకుగాను రాగద్వేషాదులందే వీరి పురుషార్థమంతయు సమాప్తి నొందును. మఱియు, విచారణలేమి రమణీయముగఁదోచు కర్మయందే యీ బుద్ధిహీనులు ప్రీతిఁగొనుచున్నారు.

ఆభిజాత్యాతతోదారా శీతలా రసశాలినీ
నేహ విశ్వసితి ప్రజ్ఞా మేఘమాలా మరావివ. 19

మరుస్థలమున మేఘమాల విశ్వసింపనట్లు, విశుద్ధకులత్వముచేఁ బూర్ణమై, శీతల, శాంతి రసముగు బ్రహ్మానందముచే శోభితమైనట్టి ప్రజ్ఞ యిట్టిజనులందు విశ్వాసమొనర్పక యుండును.

వరమన్ధగుహాహిత్వం శిలాన్తః కీటతా వరమ్
వరం మరౌ పఙ్గుమృగో న గ్రామ్య జన సంగమః. 20

అంధకారావృతమగు గుహయందు అజగరమైయుండుట మేలు; శిలయందు కీటమై యుండుట మేలు; మరుభూమియందు కుంటిదియైన హరిణమైయుండుట మేలు; కాని పామరజనుల (అజ్ఞానుల)తోటి సాంగత్యముమాత్రము మంచిదికాదు.

సిమేషాస్వాదమధురాః క్షణాన్తరవిరాగిణః
మారణైకాన్తనిరతా గ్రామ్యా విషకణా ఇవ. 21

నిమిషకాలముమాత్రము మంచిగఁ దోచువారును, మఱుక్షణమున నే స్నేహరహితులై పఱఁగు వారును సదా వధయందుఁ దత్పరులునగు గ్రామ్యజనులు మధురపదార్థమిశ్రిత విషకణములఁ బోలి యున్నారు.

వాని భస్మకణాకీర్ణా జీర్ణాః సంశీర్ణసద్మసు
తృణపర్ణవనవ్యగ్రా గ్రామ్యా ధార్మిక వాయవః. 22

ధూళికణములచే వ్యాప్తములై, శిథిలములై, తృణ, పత్ర, వనాదులందు వ్యగ్రములైనట్టి యీ అధార్మిక జనరూపమైన ప్రచండవాయువులు అతి జీర్ణములైన స్థలములందు సంచరించుచున్నవి.

ఏవముక్తేన తేనాహ మిదముక్తస్తతోఽనఘ
మద్వాక్యేన సమాశ్వాస్య స్నాతేనేవామృతామ్భసా. 23

పాపరహితుఁడవగు రామచంద్రా! నే నిట్లు వచింప నంత ఆ నా వాక్యములచే నాతఁ డూఱడిల్లి, అమృతమయమగు జలమున స్నానమొనర్పబడిన వానిచందమున నయి యిట్లుపల్కెను —

పాన్థ ఉవాచః —

భగవన్కోఽసి పూర్ణాత్మా మహాత్మా కథమాత్మవాన్
పశ్యస్యనాకులో లోకం గ్రామయాత్రామివాధ్వగః. 24

పాంథుఁడు:—మహాత్మా! తామెవరు? తాము పూర్ణాత్ములగు జ్ఞానులుగను, ఆత్మవంతులుగను గోచరించుచున్నారు. ఏలయనగాఁ బాటసారి గ్రామయాత్రను పరికించునట్లు తాము వ్యాకులరహితులై సాక్షిమాత్రముగ ఈప్రపంచమును వీక్షించుచున్నారు.

కిం త్వయా పీతమమృతం కిం త్వం సమ్రాడ్విరాడథ
సర్వార్థరిక్తోఽసి చిరం సంపూర్ణ ఇవ రాజసే. 25

తాము అమృతమునే మైన పానము చేసితిరా? లేక, తాము సర్వలోకేశ్వరులా? లేక విరాట్పురుషులా! ఏలయనిన సర్వపదార్థరహితులై యున్నను తాము పరిపూర్ణులుగ భాసించుచున్నారు.

శూన్యోఽసి పరిపూర్ణోఽసి ఘూర్ణోఽసీవ స్థిరోఽసి చ
న సర్వమపి సర్వం చ న కించిత్కించిదేవ చ. 26

తాము సంసారదోషశూన్యులై నిరతిశయ బ్రహ్మానందము చేతను, జీవన్ముక్తుని గుణముల చేతను బరిపూర్ణులై దేహాదుల సంధానముకూడ లేనందున మదోన్మత్తునిభంగి యున్నవారై, స్థిరచిత్తులై (అపవాదదృష్టిచే) ఏమియుఁగానివారై, (అధ్యారోపదృష్టిచే) అంతయుఁ దామై, పరిచ్ఛిన్నులుగఁ దోచుచున్నను వాస్తవముగ అపరిచ్ఛిన్నులై వెలయుచున్నారు.

ఉపశాన్తం చ కాన్తం చ దీప్తమప్రతిఘాతి చ
నివృత్తం చోర్జితం తాదృగ్రూపం కిమితి తే మునే. 27

ఓ మునీంద్రా! శాంతమై, రమణీయమై, ప్రదీప్తమై, ప్రతిఘాతరహితమై, సర్వనివృత్తమై, సర్వసామర్థ్యసహితమైనదిగ తమరూపము నాకు గోచరించుచున్నది.



భూసంస్థోఽపి సమస్తానాం లోకానాముపరీవ ఖే
సంస్థితోఽసి నిరాస్థోఽసి ఘనాస్థోఽసీవ లక్ష్యసే. 28

మహాత్మా! భూలోకమున నున్నను తాము సర్వలోకములపైన ఆకాశమున స్థితినొంది యున్నట్లు భాసించుచున్నారు మఱియు, తామెచటను స్థితినొందక నిరాకారులై యున్నను, మావంటి జనుల నుద్ధరించు నిమిత్తము స్థితిఁగైకొని రూపయుక్తులవలెఁ గాన్పించుచున్నారు.

ప్రసృతం న పదార్థేషు న పదార్థాత్మనాస్తి వై
తవేన్దోరివ శుద్ధస్య మనోఽమృతమయం స్థితమ్. 29

చంద్రునివలె శుద్ధమైనట్టి తమ మనస్సు (తచ్చంద్రకిరణములవలె) పదార్థములందు వ్యాపింపక, తత్పదార్థరూపముఁ బొందక, పరిపూర్ణమై, అమృతమయమై చెన్నొందుచున్నది.

కలావానకలఙ్కోఽన్తః శీతలో భాస్వరః సమః
రసాయనభరాపూర్ణః పూర్ణేన్దురివ రాజసే. 30

తాము సర్వకళాపరిపూర్ణులై, కళంకరహితులై అంతఃకరణమున శీతలస్వభావముగలవారై, ప్రకాశమయులై, సర్వత్ర సదా సమరూపమున నున్నవారై, అమృత పరివాహపూరితులై పూర్ణచంద్రునివలె శోభించుచున్నారు.

త్వదిచ్ఛాయాం తు సదసద్భావం పశ్యామి తే చితి
సంసారమణ్డలమిదం స్థితం ఫలమివాఙ్కురే. 31

మహాత్మా! అంకురమందు ఫలమువలె తమ ఆత్మయందే యీజగన్మండలమును నేను వీక్షించుచున్నాను. మఱియు, తత్సృష్టికొఱకైనట్టి సదసద్భావమును తమ యిచ్ఛయందే యెఱుఁగుచున్నాను.

అహం తావదయం విప్ర శాణ్డిల్యకులసంభవః
మఙ్కిర్నామ మహాభాగ తీర్థయాత్రాప్రసఙ్గతః. 32

గత్వా సుదూరమధ్వానం దృష్ట్వా తీర్థాని సంప్రతి
చిరకాలేన సదనమాత్మీయం గన్తుముద్యతః. 33

మహాభాగా! నేను శాండిల్యగోత్రోద్భవుఁడనగు మంకియను పేరుగల బ్రాహ్మణుఁడను, తీర్థయాత్రానిమిత్తము చాలదూరమేగి అనేక తీర్థములఁ గాంచి, చిరకాలమునకిపుడు గృహమునకుఁ జన నుద్యుక్తుఁడనైయున్నాను.

న చ మే గన్తుముద్యోగో విరక్తమనసో గృహమ్
దృష్ట్వా తడిత్సకాశాని భూతాని భువనోదరే. 34

మహాత్మా! మెఱుపువలె క్షణికమైనట్టి యీ భూతజాలమును బ్రహ్మాండకోశమున వీక్షించుటచే నామనస్సు వైరాగ్యయుక్తముకాఁగా నిపుడు గృహమునకేఁగుటకభిలాష పొడమకున్నది.

భగవన్సత్యమాత్మానం కథయేహానుకమ్పయా
గమ్భీరాణి ప్రసన్నాని సాధుచేతఃసరాంసి హి. 35

కావున మహాత్మా ! దయచేసి సత్యమగు ఆత్మనుగూర్చి వచింపుఁడు. సాధు మహాత్ముల చిత్తము గంభీరములై, నిర్మలములైనట్టి సరోవరములను బోలియుండును గదా!

దర్శనాదేవ మిత్రత్వం కుర్వతాం మహతాం పురః
కమలానీవ భూతాని వికసన్త్యాశ్వసన్తి చ. 36

తమవంటి మహాత్ములు దర్శనము చేతనే సర్వులను మిత్రులుగఁ జేసినవారై, మఱియు సూర్యుఁడు కమలములను వికసింపఁజేయునట్లు సమస్తప్రాణులను వికసింపఁజేయుచు, వారికి ఆశ్వాసము గొల్పుచు నుందురు.

మమేదం చ మనో మోహాత్సంసారభ్రమసంభవమ్
మన్యే హాతుం న సమర్థం స త్వం బోధానుకమ్పితైః. 37

స్వల్ప వివేకయుక్తమగు ఈ నామనస్సు కృపాళువగు గురువుయొక్క యుపదేశము లేకున్న సంసారభ్రమజనితమగు దుఃఖమును సమూలముగ నశింపఁజేయుటకు సమర్థము కాదని నా నిశ్చయము.

శ్రీ వసిష్ఠ ఉవాచః —

వసిష్ఠోఽస్మి మహాబుద్ధే మునిరస్మి నభోగృహః
కేనాప్యర్థేన రాజర్షేరిమం మార్గముపస్థితః. 38

శ్రీవసిష్ఠుఁడు;— ఓ మహాబుద్ధీ! నేను బ్రహ్మలోకనివాసినైన వసిష్ఠుఁడను మునిని. రాజర్షియైన అజుని యొకానొక కార్యము నిమిత్తము ఈ మార్గముగుండా పోవుచుంటిని.

మాగా విషాదం పన్థానమాగతోఽసి మనీషిణామ్
ప్రాయః ప్రాప్తోఽసి సంసారసాగరస్య పరం తటమ్. 39

విప్రుఁడా! నీవిఁక దుఃఖింపకుము. బుద్ధిమంతుల మార్గమును బొందితివి. ఏలయనిన, నీవిపుడు దాదాపు సంసారసాగరముయొక్క యావలి తీరమునకు వచ్చిచేరితివి.

వైరాగ్య విభవోదారా మతిరుక్తిరపీదృశీ
ఆకృతిః శాన్తరూపా చ న భవత్యమహాత్మనః. 40

జ్ఞానాధికారప్రాప్తియను భాగ్యములేని మనుజునకు, వైరాగ్యవిభవముచే నుదారమగు ఇట్టి బుద్ధిగాని, వచనములుగాని, శాంతరూపమగు ఆకృతిగాని యుండనేరవు.

మణిర్మధురకాషేణ యథైతి విమలాత్మతామ్
తథా కషాయపాకేన చిత్తమేతి వివేకతామ్. 41

సానపై నొరయుటచే మణి నిర్మలత్వము నొందునట్లు, (రాగద్వేషాది) కషాయముల పరిపాకముచే చిత్తము వివేకత్వమును బడయుచున్నది.

కిం జ్ఞాతుమిచ్ఛసి కథం సంసారం హాతుమిచ్ఛసి
ఉపదిష్టమహం మన్యే సంపాదయతి కర్మభిః. 42



విప్రుఁడా! నీవేది యెఱుఁగఁగోరుచున్నావు? సంసారము నెట్లు పరిత్యజింపఁ దలంచితివి? వచింపుము. ఏలయనిన, శిష్యుఁడు గురూపదిష్టమైన యర్థమును మరల మరల ప్రశ్నోత్తరాది కర్మలచే సఫలమొనర్చుకొనును. (కావున నీయొక్క జిజ్ఞాసాంశము నడుగుమని భావము)

విమలవాసన ఉత్తమమానసః
పరివివిక్తమతిర్ఘనతేజసా
పదమశోకమలం ఖలు యుజ్యతే
జనితితీర్షుమతేరిదముచ్యతే. 43

ఇత్యార్షే శ్రీ వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే
మోక్షోపాయేషు నిర్వాణ ప్రకరణే ఉత్తరార్ధే మఙ్క్యుపాఖ్యానే
మఙ్కినిర్వాణం నామ త్రయోవింశః సర్గః ॥ 23 ॥

ఓ ద్విజుఁడా! రాగాదిరహిత నిర్మలవాసనాయుక్తుడును, వైరాగ్యాది సాధనములతోఁ గూడినట్టి యుత్తమ మనస్సు గలవాఁడును, నిత్యానిత్యవివేచనా సమర్థమగు బుద్ధితోఁ గూడియుండువాఁడునగు మనుజుఁడే గురూపదేశమను తేజముచే శోకరహితుఁడై, ఆత్మప్రాప్తికి యోగ్యుఁడగును. గాని యన్యుఁడు కాదు. ఇక్కారణమున, జననమరణాదిదుఃఖములను దరింపనెంచునట్టి బుద్ధిగల యాధి. కారిగ నిన్నెంచిగిన పిదపయే నేను నీకుపదేశించెదను.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరమున నుత్తరార్ధమున
మఙ్క్యుపాఖ్యానమున మంకినిర్వాణమను నిరువదిమూఁడవ సర్గము ॥23॥

---

## చతుర్వింశతిః సర్గః

[దేహేన్ద్రియమనోబుద్ధిదోషాద్యైః సహ విస్తరాత్
సాంసారికం స్వదుఃఖౌఘం మఙ్కి నేహోపవర్ణ్యతే.

దేహేంద్రియమనోబుద్ధ్యాదుల దోషములతో సహా సాంసారిక దుఃఖసమూహమును మంకి యిట విస్తారముగ వర్ణించుచున్నాఁడు.]

శ్రీవసిష్ఠ ఉవాచః—

మమేత్యుక్తవతో మఙ్కిర్నిపత్య స పాదయోః
ఉవాచానన్దపూర్ణాక్షమిదం మార్గే వహన్వచః. 1

శ్రీవసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! నేనిట్లు వచింప నంత నాతఁడు (మంకి) నాపాదముల పైఁబడి యానందబాష్పపూరితలోచనుఁడై యమ్మార్గమున నాతో నిట్లనియె—.

మఙ్కిరువాచ:—

భగవన్భూరిశో భ్రాన్తా దిశో దశ దృశో యథా
మయా న తు పునః సాధు లబ్ధః సంశయనాశకృత్. 2

మంకి.— మహాత్మా! ఉపదేశమొసంగు గురువును వెతకుటకొఱకై నేను దృష్టివలె దశదిక్కులు సంచరించితిని. కాని, సంశయమును బోగొట్టునటువంటి మహాత్ముం డెవండును లభించలేదు.

సమస్తదేహసారాణాం సారస్యాద్య ఫలం మయా
ఖిన్నోఽస్మి భగవన్పశ్యన్దశాః సంసారదోషదాః. 3

నేఁడు తమ దర్శనముచే, సమస్త శరీరములలో నుత్తమమైనట్టి బ్రాహ్మణశరీరముయొక్క ఫలమును నేను బొందితిని. మహాశయా! దోషప్రదములగు సంసారదశలను జూచిజూచి నేను ఖిన్నుఁడనైతి.

పునర్గాతం పునర్నష్టం సుఖదుఃఖభ్రమః సదా
అవశ్యం భావిపర్యన్త దుఃఖత్వాత్సకలానపి. 4
సుఖాన్యేవాతిదుఃఖాని వరం దుఃఖాన్యతో మునే

మరల మరల జన్మము, మరల మరల మరణము— ఇట్టిరూపముతో గూడినదై యీ సంసారము సదా సుఖదుఃఖభ్రమమయమై యున్నది. మఱియు, చివరకు తప్పక దుఃఖమునే కలుగఁజేయునవి యగుటచే ఈ సమస్త సంసార సుఖములున్ను దుఃఖరూపములే అయియున్నవి. ఇక్కారణముననో మునీంద్రా! నేను సంసారసుఖములకంటె దుఃఖములనే యుత్తమముగఁదలఁచుచున్నాను.

దృఢదుఃఖ వదన్తత్వాద్దుఃఖయన్తి సుఖాని మామ్. 5
తథా రామ యథా దుఃఖమేవ మే సుఖతాం గతమ్

సౌమ్యుఁడవగు నో వసిష్ఠమునీంద్రా! చివరకు మహాదుఃఖమును గలుఁగఁజేయునవి యగుటచే ఈ సంసారసుఖములు నన్ను దుఃఖపెట్టుచున్నవి. కావున (ఈ సంసారసుఖములకంటె) దుఃఖమే నాకు సుఖముగఁ దోచుచున్నది.

వయోదశనలోమాన్త్రైః సహ జర్జరతాం గతమ్. 6
ఉచ్చైఃపదే పాతపరా బుద్ధిర్నాధ్యవసాయినీ

మఱియు, ఆంత్ర(ప్రేవులు) దంత, కేశాది సహితముగ నావయస్సిపుడు శిథిలమైపోయినది. కాని, ఉత్తరోత్తర వృద్ధినొందునట్టి భోగములందుఁ దత్పరమగు నా బుద్ధి పరమపురుషార్థ సాధనమందుచ్చపించుటలేదు.

సుప్రవాలం కుసంకల్పాద్గహనం న ప్రకాశతే. 7

నా మనసున్ను ఉత్తరోత్తర వర్ధమానములగు రాగములను పల్లవములచే పల్లవితమై, దుష్టసంకల్పముతోఁగూడి వివేకరహితమై యుండుటచే, సాక్షిచైతన్య వివేకముతోడ ప్రకాశించుటలేదు.

మనః పిప్పలపల్వాలై రివ కుగ్రామకోటరమ్
వాసనాజవహైర్గృధై ర్నిత్యం పాపీయసీ స్థితిః. 8

మహాత్మా! నామనస్సు, అశ్వత్థవృక్షముయొక్క శుష్కపత్రములఁ బోలిన సారహీనమైన పదార్థములను సంచయమొనర్చునదై దుష్టగ్రామముయొక్క మధ్యభాగమువలె నింద్యమాయెను. మఱియు, గద్దలవలె దుష్టవాసనలను దుర్గంధములను ధరించునట్టి యింద్రియములచే నా స్థితి దుష్టగ్రామమువలె నిత్యము పాపమయ మయ్యెను.



కణ్టకద్రుమవల్లీవ కరాల కుటిలా మతిః
ఆయురాయాసశాలిన్యా యామిన్యేవ తమోన్ధయా. 9
అక్షీవానాగతాలోకం క్షీణం సంతతచిన్తయా
న కించిద్రసమాదత్తే నష్టైవాపి న నశ్యతి. 10

కంటకలతవలె నా బుద్ధియు మహాభయంకరమై, కుటిలమై యొప్పుచున్నది. అజ్ఞానాంధకారముచే ఆవృతమై, నిరంతర విషయచింతనచే, బ్రహ్మప్రకాశములేకయే నా ఆయువు, దీపాదిప్రకాశరహితమగు అంధకారమయమైన రాత్రిని నేత్రమువలె, వ్యర్థముగ గడపివైచెను. మఱియు, శుష్కలతవలె నా తృష్ణయెకింతైనను వివేకరసమును బరిగ్రహించుటలేదు. కావున నది వ్యర్థత్వముచే నశించినదైనను నశింపకయే యున్నది.

న పుష్పితా న ఫలితా తృష్ణా శుష్కలతేవ నః
కర్మ కర్మణి నిర్మగ్నం వాసనాఖ్యమకర్మణేః. 11

ఈ నా తృష్ణ శుష్కలతను బోలినదై, పుష్పింపకయు, ఫలింపకయు (వివేకాదులఁగలుగఁజేయక) నున్నది. నేనాచరించిన కొలఁది నిత్యనైమిత్తికకర్మయు పూర్వపు దుష్కర్మరాశియందు నిమగ్నమైపోయెను. మఱియు భోగవాసనయను బీజము ఉత్తరోత్తర అనర్థముకొఱకై కామ్య, నిషిద్ధకర్మలంకుఁ బ్రవర్తించుచున్నది.

జీవితం చ జనే జీర్ణం నైవోత్తీర్ణో భవార్ణవః
దినానుదినముచ్ఛ్వానా భోగాశా భయదాయినీ. 12

నా జీవితమున్ను, పుత్ర మిత్ర కళత్రాదిజనులందలి యాసక్తిచే శిథిలమైపోయినది. కాని, నేనింకను సంసారసాగరమును దాటలేదు. భయప్రదమగు భోగాశ నాకు దినదినము వృద్ధియగుచునే యున్నది.

పూర్ణాపూర్ణాత్మని క్షీణాః శ్వభ్రకణ్టకవృక్షవత్
చిన్తాజ్వర వికారిణ్యో లక్ష్మ్యాః ఖలు మహాపదః. 13

గర్తమందు జనించిన కంటకవృక్షమువలె, పుత్ర మిత్ర పశుధనాదులచే నొకపుడు పూర్ణమై, ఒకపుడు అపూర్ణమైనట్టి గృహమందు, చింతయను జ్వరముచే వికారములఁ గల్గఁచేయునవైన ధనాదులయార్జనచే నుత్పన్నములగు గొప్పయాపదల ననుభవించితిని.

సంపన్న మఉతం సాపి విప్రలమ్భేన జృమ్భతే
అన్తః స్ఫురితరత్నేహం భాస్వరం వాన్ధకోటరమ్. 14

లోన అంధకారమయమైనట్టి తన బిలమున, సర్పము తనమణియొక్క ప్రకాశముచే మణిలోభియగు మనుజుని ఆకర్షించి, కఱచి, దుఃఖమును గలుగఁ జేయునట్లు, ఈ లక్ష్మి (సిరి) యు అధిక ధనాదులచే సంపన్నమై, శస్త్రాదులచే ఆఘాతమునొందని మనుజునిగూడ మరల మరల ప్రలోభనముచే నాకర్షించి, శత్రు, చోరాదుల ఆఘాతములద్వారా దుఃఖమునుగలుగ జేయుటకై విజృంభించుచున్నది.

కల్లోల కలిలం శూన్యం చేతః శుష్కాబ్ధిదుర్భగమ్
మామిన్ద్రియార్థైకపరం న స్పృశన్తి వివేకినః. 15

నా చిత్తమనేకములైన ఆశాతరంగములచే మలినమై, అంతటఁ బరువిడినను ప్రయోజన శూన్యమై, కనుకనే శుష్కసముద్రమువలె దుష్పూరమై యున్నది. అట్టి చిత్తముగలవాఁడనై, హతభాగ్యుఁడనై, ఇంద్రియములకు వశీభూతుఁడనైనట్టి నన్ను వివేకులు తమ చెంతకు రానిచ్చుటలేదు (ఉపేక్షించుచున్నారని భావము.)

సకణ్టకమమేధ్యస్థం శ్లేష్మాతకమివ ద్రుమమ్
అసదేవ మహారమ్భం చలదర్జునవాతవత్. 16

నా మనస్సు శ్లేష్మాతక వృక్షము (విరివిచెట్టు)వలె కంటకయుక్తమై, అపవిత్రస్థానమందున్నదై యొప్పుచున్నది. మఱియు, అసత్తైనను ననేకమహాకార్యారంభములతోఁగూడినదై, వాతరోగము వలె అతిచంచలమైయు నున్నది.

మనో మరణమప్రాప్తం శూన్యం దుఃఖాయ వల్గతి

ఈ మనస్సు నాయందనేకమారులు మరణించినప్పటికిని, మరణమును బొందక, అభిలషిత పదార్థశూన్యమై దుఃఖముకొఱకే విజృంభించుచున్నది.

శాస్త్రసజ్జనసంపర్కచన్ద్రతారకధారిణీ. 17
అహంభావోల్లసద్యక్షా క్షీణా నాజ్ఞానయామినీ
అజ్ఞానధ్వాన్తమత్తేభసింహః కర్మతృణానలః. 18
ఉదితో న వికారార్కో వాసనారజనీక్షయః
అవస్తువస్తువద్బుద్ధం మత్తశ్చిత్తమతంగజః. 19

శాస్త్ర, సజ్జనుల సంపర్కమను చంద్ర, నక్షత్రముల, ధరించినదియు, అహంకారమను ఉల్లసితుఁడగు కల్పిత యక్షునితోఁ గూడినదియునగు నా అజ్ఞానమను రాత్రి క్షయింపకయున్నది. ఏలయనఁగా, అజ్ఞానాంధకారమను మదించిన యేనుఁగునకు సింహమువంటిదియు, కర్మయను తృణమున కగ్నివంటిదియు; వాసనయను రాత్రిని క్షయింపఁజేయునదియునగు వివేకమను సూర్యుఁడింకను నాకు ఉదయింపలేదు. కావుననే నాచిత్తమను మదపుటేనుఁగు, అవస్తువునే వస్తువుగ నమ్మియున్నది.

ఇన్ద్రియాణి నికృన్తన్తి న జానే కిం భవిష్యతి
శాస్త్రదృష్టిరపి ప్రాజ్ఞైర్నాశ్రితా తరణాయ యా. 20

సాప్యదృష్టిరివాన్ధ్యాయ వాసనావేశకారిణీ
తదేనమతిసంమోహే యత్కార్యమిహదారుణే
ఉదర్కశ్రేయసే తాత తన్మే కథయ పృచ్ఛతే. 21

ఓ మునీంద్రా! ఇంద్రియములు నన్ను ఖండించుచున్నవి. ఏమగునో తెలియకున్నది! నేవాగ్వ్యాపారములచే నశీకృతులైన ప్రాజ్ఞులనుండి, సంసారసాగరమును దరింపఁజేయునట్టి శాస్త్రదృష్టిని



నేనాశ్రయించకుంటిని. కావున, ఆనాశాస్త్రదృష్టియు వాసనలం దాసక్తమొనర్చునదై నాయొక్క అంధత్వము కొఱకే యాయెను. మహాత్మా! ఈ ప్రకారము అజ్ఞానమందు నిమగ్నుఁడనైయున్న నేను శ్రేయముకొఱకు మోక్షముకొఱకు యేమి యాచరింపవలసియున్నదో సెలవీయుఁడు.

శామ్యన్తి మోహమిహికాః శరదీవ సాధో
ప్రాప్తే భవన్తి విమలాశ్చ తథాఖిలాశాః
సత్యేతివాగ్భవతు సాధుజనోపగీతా
మద్బోధనేన భవతా భవశాన్తిదేన. 22

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకియే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే మఙ్కుపాఖ్యానే మఙ్కివైరాగ్యం నామ చతుర్వింశః సర్గః ॥ 24 ॥

సాధూ! తమవంటి మహాత్ముఁడగు గురువు లభించుటచే శిష్యుని చిత్తమందలి అజ్ఞానమను మంచు, శరత్కాలాకాశమునందువలె క్షయించిపోవును. మఱియు సమస్త దిక్కులవలె మనోరథము లున్ను రాగాదులను ధూళిలేనివై నిర్మలముగఁ జెన్నొందునను ఈ సాధుజనుల వాక్కు నాయొక్క సంసారభ్రమను శమింపఁజేయునట్టి తమ యుపదేశముద్వారా నాయందు సత్యమగుగాతయని ప్రార్థించుచున్నాను.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున మంక్యుపాఖ్యానమున మంకివైరాగ్యమను నిరువది నాల్గవ సర్గము ॥24॥

---

## పఞ్చవింశతిః సర్గః

[సంవేదనాద్యవిద్యోత్థం బన్ధబీజచతుష్టయమ్
పరమాత్మని విద్యా చ తన్నిహన్త్ర్యత్ర వర్ణ్యతే,

దేహాదులందలి అహంకారరూపమగు అవిద్యచే నుత్పన్నములైన నాల్గు విధములగు బంధన బీజములు- ఆత్మజ్ఞానమను విద్యచే వాని వినాశము— ఇచట వర్ణింపఁబడుచున్నవి.]

**శ్రీవసిష్ఠ ఉవాచ:—**

సంవేదనం భావనం చ వాసనా కలనేతి చ
అనర్థాయేహ శబ్దార్థే విగతార్థోవిజృమ్భతే. 1

శ్రీ వసిష్ఠుఁడు.— ఓ ద్విజుఁడా! ఇంద్రియములచే విషయభోగరూపమగు అనుభవము, విషయములు లేనపుడు మరల వానిఁగూర్చిన భావన, చిత్తమందలి విషయవాసన, పునర్జన్మను గలుగఁజేయునదైన మరణకాలమందలి విషయస్మృతి - ఈ మిథ్యాభూతములైన నాల్గు పదార్థములున్ను అనర్థముకొఱకే యీ ప్రపంచమున 'అవిద్యచే' విజృంభించుచున్నవి.

వేదనం భావనం విద్ధిసర్వదోషసమాశ్రయమ్
తస్మిన్నేవాపదః సన్తి లతా మధురసే యథా. 2

విషయముల యనుభవము, వాని భావన – వీనినే నీవు సమస్త దోషములయొక్క యాశ్రయముగ నెఱుఁగుము. వసంతఋతు జనితమగు రసమునఁ బుష్పఫలాదిసహితమగు లత యుండునట్లు తద్విషయానుభవ, భావనలందే సమస్త ఆపదలున్ను వసించుచున్నవి.

సంసారమార్గగహనే వాసనావేశవాహినః
ఉపయాతి విచిత్రాఖ్యైర్వ్యాప్త వృత్తాన్తసంతతిః. 3

ఈ సంసారమను భయంకరమార్గమున వాసనలను సామగ్రిని మోయుచుఁ జనుచుండు మనుజుని చెంత కనేక విచిత్రములైన అనర్థసమూహములు వచ్చి చేరుచుండును.

వివేకినో వాసనయా సహసంసారసంభ్రమః
క్షీయతే మాధవస్యాన్తే శనైరివ ధరారసః. 4

వసంతఋతువుయొక్క చివర, భూమియందలి రసము మెల్లగ క్షయించిపోవునట్లు, బ్రహ్మచింతామగ్నుఁడును, విషయదోషదర్శియు నగు వివేకికి సంసారభ్రమ వాసనాసహితముగ క్షయించిపోవును.

అస్యాః సంసారసల్లక్యా వాసనోత్సేధకారిణీ
కదల్యా వనజాలిన్యా రసలేఖేవ మాధవీ. 5

వనమందలి యరఁటిచెట్ల సమూహమును వసంతకాలపురసము వృద్ధిపొందించునట్లు, ఈ సంసారమను కంటకయుక్తమైన గుల్మమును వాసన పరిపోషించి వృద్ధినొందించునదై యున్నది.

సంసారాస్థ్యతయోదేతి వాసనాత్మా రసశ్చితౌ
యథా వనతయా తస్థౌ మధుమాసరసః క్షితౌ. 6

వసంతర్తువుయొక్క రసము భూమియందు వనరూపమున నుదయించునట్లు, అజ్ఞానావృతమగు జీవచైతన్యమున వాసనారూపమగు రసము సంసారమను అంధత్వరూపమున నుదయించుచున్నది.

చిన్మాత్రాదమలాచ్ఛ్వాన్యాద్దృతే కించిన్న విద్యతే
నాన్యత్కించిదపర్యన్తే ఖే శూన్యత్వేతరద్యథా. 7

శూన్యత్వముకంటె వేఱుగ నాకాశమున నేమియు లేనట్లు, యథార్థముగ ఈ ప్రపంచమున అద్వైత, నిర్మల, చిన్మాత్ర బ్రహ్మముకంటె వేఱుగ నేమియును లేదు.

వేదనాత్మా న సోస్త్యన్య ఇతి యా ప్రతిభా స్థిరా
ఏషాఽవిద్యా భ్రమస్త్వేష స చ సంసార ఆతతః. 8

ఇట్లు చిన్మాత్రరూపమగు వేదనాత్మ సదా సర్వత్రస్ఫురించుచున్నను, దేహేంద్రియాదులకంటె అన్యముగ భాసించుటలేదు. మఱియు, దృశ్యరూపమగు ఏ అనాది భ్రాంతిగలదో, అదియే ఆవరణశక్తి ప్రాధాన్యముచే అవిద్యగను, విక్షేపశక్తి ప్రాధాన్యముచే భ్రమగను, ఉభయరూపముచే సంసారముగను వ్యాపించియున్నది.



అనాలోకనసంసిద్ధి ఆలోకేనైవ నశ్యతి
అసదాత్మా సదాభాసో బాలవేతాలవత్క్షణాత్. 9

అసత్తైనను, సత్తువలె భాసించు ఈజగత్తు, అజ్ఞానము (ఆత్మజ్ఞానములేమి) చేతనే సిద్ధించినది, జ్ఞానప్రకాశముచే నిత్యాది బాలుని బేతాళమువలె క్షణకాలములో నశించుచున్నది.

సర్వదృశ్య దృశో బాధే బోధసారతయైకతామ్
యాన్త్యశేషమహీపీఠ సరిత్పూరా ఇవార్ణవే. 10

భూమియందలి నదులన్నియు సముద్రమునఁబోయి కలిసి యేకమగు సముద్రరూపమేయగునట్లు, ఆత్మజ్ఞానముచే సమస్తదృశ్య, దృష్టులు బాధితములుకాఁగా, బోధమయమైన యేకమగు, ఆత్మరూపత్వమునే చెందుచున్నవి.

మృన్మయం తు యథా భాణ్డం మృచ్ఛూన్యం నోపలభ్యతే
చిన్మయాదితయా చేత్యం చిచ్ఛూన్యం నోపలభ్యతే. 11

మృణ్మయపాత్రయందు మృత్తికతప్ప అన్యమెద్దియు లభించనట్లు, చిన్మయమగుటఁ బట్టి జగద్రూప దృశ్యవిషయమున సచ్చిన్మాత్రమగు పరమాత్మతప్ప యన్యమెద్దియు లభించదు.

బోధావబుద్ధం యద్వస్తు బోధ ఏవ తదుచ్యతే
నాబోధం బుధ్యతే బోధో వైరూప్యాత్తేన నాన్యతా. 12

జ్ఞానముచే నేవస్తు వెల్లఁగబడుచున్నదో, అది జ్ఞానరూపమనియే చెప్పఁబడుచున్నది. ఏలయనిన, విరుద్ధరూపముయొక్క బోధకానేరదు. కావున జ్ఞాన జ్ఞేయములయొక్క యేకత్వము సిద్ధించుచున్నది.

ద్రష్టృదర్శన దృశ్యేషు ప్రత్యేకం బోధమాత్రతా
సారస్తేన తదన్యత్వం నాస్తి కించిత్ఖపుష్పవత్. 13

ద్రష్టృ దర్శన దృశ్యములందు కేవలము జ్ఞానమే సారమైయున్నది. కాన, తద్భిన్నమగునది ఆకాశపుష్పమువలె నేమియు లేనిదేయగును.

సజాతీయః సజాతీయే నైకతా మనుగచ్ఛతి
అన్యోన్యానుభవస్తేన భవత్యేకత్వనిశ్చయః. 14

సజాతీయ పదార్థము (జలాదులు) సజాతీయపదార్థమందే (జలాదులందే) కలియును; కనుక ఈ జగత్తు, చైతన్యములకు అనుభవరూపమగు ఏకత్వ ముండుటచే పరస్పర ఏకత్వము నిశ్చితమగుచున్నది.

యది కాష్ఠోపలాదీనాం న భవేద్బోధరూపతా
తత్సదానుపలమ్భః స్యాదేతేషామ సతామివ. 15

కాష్ఠ, శిలాదులకు సద్రూపమైన బోధరూపత్వముండనిచో, శశశృంగాదులవలె వాని యనుభవము లేకనే యుండవలసియుండును.

యదా త్వేషా ను దృశ్యశ్రీ ర్బోధమాత్రైకరూపిణీ
తదాన్యేవాప్యనన్యైవ సతీ బోధేన బోధ్యతే. 16

బోధ (జ్ఞానము)చే నెపుడు దృశ్యమంతయు కేవలము బోధరూపమే యగుచున్నదో, అపుడు అన్యముగ భాసించినప్పటికి అది బోధరూపమే యగును. ఎలయనఁగా నది బోధచే బోధిత మగుచున్నదిగదా!

సర్వం జగద్గతం దృశ్యం బోధమాత్రమిదం తతమ్
స్పన్దమాత్రం యథా వాయుర్జలమాత్రం యథార్ణవః. 17

వాయువు! స్పంద (చలన) మాత్రమున్ను, సముద్రము జలమాత్రమున్ను నైయున్నట్లు, ఈ వ్యాప్తమగు జగద్రూప దృశ్యమంతయు బోధమాత్రమైయున్నది.

మిశ్రీభూతా అపి హ్యేతే జతుకాష్ఠాదయో యథా
మిథోఽననుభవే మిశ్రా ఐక్యం హ్యనుభవే మిథః. 18

కొయ్య, లక్క మున్నగునవి సమవాయ, సంయోగాది సంబంధములచేఁ గలిసికొనినట్లు భాసించినను, వివేకానుభవముచే గలిసికొనకయే యున్నవగును. కావున బోధయం దట్టి సమవాయాది సంబంధములు సిద్ధింపనేరవు. సమస్తముయొక్క ఐక్యమే యట సిద్ధించును.

అన్యోన్యానుభవో హ్యైక్యమైక్యం త్వన్యోన్యవేదనమ్
యథామ్భసోః క్షీరయోర్వా న కాష్ఠజతునోరివ. 19

కొయ్య, లక్క మున్నగువానికి సంయోగమాత్రముచే ఏకత్వము కలదు. ద్రష్ట దృశ్యముల యేకత్వ మట్టిదికాదు. రెండుగోవుల క్షీరములవలెను, రెండునదుల జలములవలెను బోధ(ద్రష్ట)యందు, పదార్థముల ఏకత్వముగలదు. అట్లు, అన్యోన్యాత్మత్వానుభవమే నిజమైన యేకత్వమగును.

అహమిత్యేవ బన్ధాయ నాహమిత్యేవ ముక్తయే
ఏతావన్మాత్రకే బన్ధే స్వాయత్తే కిమశక్తతా. 20

దేహాదులందలి 'అహం భావనయే' బంధనమును కలిగించును. అందలి 'అనహం భావనయే' (అహంభావము లేక యుండుటయే) ముక్తిని కలుగఁ జేయును. ఇట్లు; తనయధీనమున నున్నట్టి యింత మాత్రమగు బంధవిముక్తి ప్రయత్నమున (అనహం భావనయందు) నేమి యశక్తత గలదు.

చన్ద్రద్వయప్రత్యయవన్మృగతృష్ణామ్బుబుద్ధివత్
కిమనుత్థిత ఏవాయమసదేవాహముత్థితః. 21

రెండుచంద్రులఁ గూర్చిన బుద్ధివలెను, మృగతృష్ణయందలి జలబుద్ధివలెను, అసత్తుగ ఏ అహంభావ మావిర్భవించినదో, అది యావిర్భవించనదే (లేనిదే) యగును.

మమేదమితి బన్ధాయ, నాహమిత్యేవ ముక్తయే
ఏతావన్మాత్రకే వస్తున్యాత్మాయత్తే కిమజ్ఞతా. 22



శరీర, గృహ, ధన, స్త్రీ, పుత్త్రాదులు నావి' యను మమత్వబుద్ధియే బంధనమును గలిగించును. వానియందు మమత్వము లేకయుండుటయే ముక్తిదాయకమగును. ఇట్లు, తనయధీనముననున్నట్టి యింతమాత్రమగు బంధవిముక్తి ప్రయత్నమున నేమి అజ్ఞత్వము గలదు!

యః కుణ్డబదరన్యాయో యా ఘటాకాశయోః స్థితిః
స సమ్బన్ధోఽపి నైవాన్యమైక్యం హ్యన్యోన్యవేదనమ్. 23

అసత్యమగు అహంకారముచే 'కుండబదర న్యాయమున' అంతఃప్రవేశముద్వారా సత్యమగు ఆత్మ కప్పఁబడుటగాని లేక ఘటాకాశ న్యాయమున పరిచ్ఛేదము నొందుట గాని సంభవింపదు. ఎలయనఁగా, కుండ బదరము (రేగుపండు)ల సంయోగమున్ను, ఘటాకాశముల సమవాయ సంబంధమున్ను అవిద్యచేఁ గల్పింపఁబడినవై యున్నవి. వాస్తవమగు ఐక్యమే అవిద్యచే అన్యోన్యానుభవముగ నగుచున్నది. కావున బోధ (అనుభవ) మాత్రమున సమస్తముయొక్క యేకత్వమే సిద్ధించుచున్నది.

అన్యోన్యావేదనం త్వైక్యం భాగశో గతమప్యలమ్
అజడం వా జడం వాపి నైకం రూపం విముఞ్చతి. 24

జైమినియొక్క మతానుయాయులు వాస్తవముగ జడ బోధల ఐక్యమునే ఆత్మరూపముగ నమ్ముచున్నారు. అనఁగా, ఆత్మ జడాంశమున జడమై, బోధాంశమున బోధమై, ఇట్టి రూపమును ద్యజింపకయుండును. అట్టిచో, ఆత్మ జడాంశమున స్ఫురింపకనేయుండును. బోధాంశమున స్ఫురించినను నిర్విషయముగనే యుండును. కావున నపుడు అన్యోన్యానుభవము లేమియే వారిమతమున నేకత్వమగును. అది సరికాదు. ఐక్యము పరస్పరబోధ (అనుభవ) రూపమే యగును గాని జడరూపముకాదు.

నాజడం జడతామేతి స్వభావా హ్యనపాయినః
యచ్చాజడం జడం దృష్టం ద్వైతి తత్రాస్తి నైకతా. 25

ఓ ద్విజుఁడా! స్వభావము నిత్యమగుటచే, అజడమెన్నటికిని జడము కానేరదు. మఱియు నీవు ఏ అజడమైన ఆత్మరూపమును జడాంశముయొక్క అంతర్గతముగ నెఱిఁగితివో, అది వాస్తవముగ జడము (ద్వైతము) కంటె భిన్నమైయేయున్నది. కావున నట బోధ (అజడము) యొక్క యేకత్వము సిద్ధింపనేరదు. 'అజడ' (బోధ) మాత్రముననే సమస్తముయొక్క యేకత్వము సిద్ధించుచున్నది.

వాసనావేశవలితాః కువికార శతాత్మభిః
వ్రజన్త్యధోధోధావన్తం శిలాః శైలచ్యుతా ఇవ 26

అనేక కువికారరూపములగు స్వస్వవాసనలచేతను, అభిమానముచేతను గప్పఁబడినవారైన అనేకాత్మవాదులు, పర్వతముపైనుండి జారిన శిలలవలె సదా క్రిందకే జనుచుందురు.

వ్యూఢానాం వాసనావాతైర్నృతృణానామితస్తతః
తాన్యాపతన్తి దుఃఖాని తత్ర వక్తుం న పార్యతే, 27

ఇక్కారణమున, వాసనలను వాయువుచే నిటునటు చలింపఁ బడునట్టి మనుష్యులను దృణములపై, వివిధయోనులందలి జనన మరణ, నరకాది దుఃఖములెవ్వి వచ్చిపడుచున్నవో, అవి లెక్కించుటకుఁగూడ సాధ్యముకాదు.

భ్రాన్త్వా భృశం కరతలాహతకన్దుకాభం
లోకాః పతన్తి నిరయేషు రసేన రక్తాః
క్లేశేన తత్ర పరిజర్జరతాం ప్రయాతాః
కాలాన్తరేణ పునరన్యనిభా భవన్తి. 28

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే మఙ్క్యుపాఖ్యానే మఙ్కిబోధనం నామ పఞ్చవింశః సర్గః ॥ 25 ॥

తమతమ వాసనాభిమానముల ననుసరించి రాగాదిరసములం దనురక్తులగు జనులు, చేతితోఁ గొట్టఁబడిన బంతివలె అనేకజన్మలందు పరిభ్రమించి నరకములందుఁ బడుచున్నారు. అట, చిరకాల మనేక క్లేశముల ననుభవించి మిగుల శైథిల్యమునొంది, కాలాంతరమున స్థావర, క్రిమి, కీటాదిజన్మలచే నన్యరూపములఁ బొందుచున్నారు. (మరల మనుష్యజన్మము వారికిదుర్లభమని భావము)

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణ ప్రకరణమున నుత్తరార్ధమున మంక్యుపాఖ్యానమున మంకిబోధనమను నిరువదియైదవ సర్గము ॥ 25 ॥

---

## షడ్వింశతిః సర్గః

[ఇహ ప్రపఞ్చ్యతేఽనర్థో భావనాద్రసరఞ్జనాత్
ఇచ్ఛాన్త్యాశ్యర్థసంశాన్తిర్వివేకాత్తత్త్వదర్శనాత్.

రాగద్వేషాదులచేఁ బూర్ణములగు భావనలచే ననర్థముల యుత్పత్తి, ఆత్మజ్ఞానమను వివేకముచే నట్టిభావనలు శమింప, అనర్థములును శమించుటయను విషయములిట వివరింపఁబడుచున్నవి.

శ్రీవసిష్ఠ ఉవాచ:—

సంసారమార్గగహనే పతితస్యాపతన్తి హి
వృత్తవృత్తాన్తలక్షాణి కీటా ఇవ ఘనాగమే. 1

శ్రీవసిష్ఠుఁడు:—ఓ బ్రాహ్మణుఁడా! ఈ ప్రకారముగ స్థావర, క్రిమి, కీటాది జన్మరూపమగు భయంకరమైన సంసారమార్గమున బడినట్టి జీవునిపై, వర్షర్తువందు కీట, పతంగాదులు పడునట్లు ఛేదనఁ భేదనములు, ఆకలిదప్పులు, జననమరణములు మున్నగు అనేకదుఃఖములు వచ్చిపడుచున్నవి.

సర్వ ఏవ త్విమే భావాః పరస్పరమసఙ్గినః
అటవ్యాముపలానీవ భావనైతేషు శృఙ్ఖలా. 2

అరణ్యమందలి శిలలవలె, ఈ సమస్తపదార్థములు పరస్పరము వేర్వేఱుగ నేయున్నవి. కాని 'భావన'యను గొలుసు వీనియన్నింటిని పరస్పరమేకముగ బంధించుచున్నది. (అదియే యన్నిటికి మూలమని భావము)



చిత్తమాన్ధ్యాయ వృత్తాన్తద్రుమైర్గహనవత్స్థితమ్
రసరఞ్జనయా లోకే వసన్త ఇవ కాననమ్. 3

వనము ప్రఫుల్లితమగుటకు వసంతఋతువు మూలమైయున్నట్లు, అవివేకమను అంధత్వముతోఁ గూడినదియు, పూర్వవృత్తాంత వాసనలను వృక్షములతో దట్టముగానున్నదివలె నొప్పునదియు, రాగద్వేషాదులను రసముచే రంజితమైనదియునగు చిత్తమే యా భావమునకున్ను మూలమైయున్నది.

అహో బత విచిత్రాణి వాసనావశతోఽవశైః
భూతకైరనుభూయన్తే సుఖదుఃఖాని జన్మసు. 4

ఆహా! ఎట్టి యాశ్చర్యకరమైన విషయము! వాసనలకు వశులైన జీవులు వివిధజన్మలందెట్టి విచిత్రములైన సుఖదుఃఖముల ననుభవించుచున్నారు.

అహో బతాతివిషమా వాసనా యద్వశాజ్జనైః
అవిద్యమానైరేవాయం భ్రమోఽన్తరనుభూయతే. 5

ఆహా! దేనియొక్క ప్రతాపముచే సమస్తప్రాణులును మిథ్యాభూతములైన త్రిపుటీరూప పదార్థములచేఁ దమయందీజగద్భ్రమ ననుభవించుచున్నారో, అట్టివాసన యెంత భయంకరమైనది.

ఆహ్లాదినోఽమృతవతః శుద్ధస్యాలోకకారిణః
శీతలస్యాఖిలార్థేషు జ్ఞస్యేన్దోశ్చ కిమన్తరమ్. 6

ఆత్మానందముచేఁ బ్రసన్నుఁడును, నిరంతరము ఆత్మానందామృతముచేఁ దృప్తుఁడును, శుద్ధుఁడును, జ్ఞానప్రకాశమును గలుగఁజేయువాఁడును, సమస్తపదార్థములందును శీతలాంతఃకరణయుతుఁడై మెలఁగువాఁడును నగు జ్ఞానికిని, చంద్రునకును నేమి భేదముగలదు?

పూర్వాపరమనాలోచ్య యత్కిఞ్చిదభివాఞ్ఛతః
నిర్మర్యాదస్య మూఢస్య బాలస్య చ కిమన్తరమ్. 7

పూర్వాపరములను విచారింపక అనుచితపదార్థములను గోరువాఁడును, శాస్త్రీయ మర్యాదా రహితుఁడును నగు మూఢునకును, బాలునకును నేమి భేదముగలదు?

లబ్ధమాప్రాణపర్యన్తం శుభాశుభమనుజ్ఝతోః
ఆమిషం కో విశేషోఽస్తి వదమాకరమూఢయోః. 8

శుభాశుభవిషయ రూపమగు (గాలమునందలి) మాంసమును ప్రాణముపోవువఱకుఁ ద్యజింపని మూఢులకును, మత్స్యములకును నేమి విశేషము గలదు?

సర్వ ఏవ త్విమే భావా దేహదారధనాదయః
క్షిప్రమాశుష్కసికతా గారావనిశరారవః 9

దేహేంద్రియ, స్త్రీ, పుత్రధనాది సమస్త పదార్థములున్ను ఎండిన యిసుకతోఁ జేయఁబడిన మూఁకుడువలె శీఘ్రముగ నశించునవైయున్నవి.

ఆబ్రహ్మస్తమ్బపర్యన్తమపి యోనిశతేషు తే
ఆకల్పం భ్రమతశ్చిత్తశాన్తిర్నాస్తి శమాదృతే. 10

పిపీలికాది బ్రహ్మపర్యంతముగల వేలకొలఁది యోనులందుఁ పరిభ్రమించు జీవునకు శమము (ఇంద్రియనిగ్రహము) చేఁదప్ప మఱిదేనిచేతను చిత్తశాంతి కలుగనేరదు.

పర్యాలోచనమాత్రేణ బన్ధగన్ధో న బాధతే
గచ్ఛతో మార్గవైషమ్యమివాలోకనకారిణః. 11

కాలిక్రిందఁజూచి నడచువానికి మార్గముయొక్క మిట్టపల్లములు బాధింపనట్లు, వివేకమాత్రముతోఁ గూడియుండుటచే బంధముయొక్క లేశమైనను మనుజుని బాధింపనేరదు.

తవ నావహితం చిత్తం కామః కవలయిష్యతి
సావధానస్య బుద్ధస్య పిశాచః కిం కరిష్యతి. 12

ఓ బ్రాహ్మణుఁడా! నీయొక్క అసావధానమైన (వివేకముతోఁగూడియుండని) చిత్తమును కామము గ్రసించివేయఁగలదు. జాగరూకుఁడైన జ్ఞానియొక్క సావధానచిత్తమును కామపిశాచ మేమి చేయఁగలదు?

యథేక్షణప్రసరణా రూపాలోకనమాత్రకమ్
సంవిత్ప్రసృతిమాత్రాత్మ తథా సాహం జగత్స్థితమ్. 13

మనస్సునందలి రూపాదుల గాంచునట్టి యిచ్ఛామాత్రమే నేత్రాదీంద్రియములయొక్క తత్తద్విషయములవైపునకు ప్రసరణమైనట్లు, వివేకరహితమగు అసావధాన సంవిత్తుయొక్క స్ఫురణమాత్రమే అహంకారసహితమగు ఈజగత్తుగ స్థితి నొందియున్నది.

యథాక్షిసంవృతిః సర్వరూపాలోకశమోఽరిహన్
సంవిత్సంవరణం నామ సర్వదృశ్యశమస్తథా. 14

కామాది శత్రువులను సంహరించు ఓ బ్రాహ్మణుఁడా! నేత్రముయొక్క మూయుటమాత్రమే సమస్తరూపజ్ఞానముయొక్క శమనమైనట్లు, బహిర్ముఖమైన సంవిత్తు (జ్ఞానము) అంతర్ముఖమై ఆత్మయందు లగ్నమగుటయే సమస్తదృశ్యముయొక్క శమనమగును.

అసదేవ జగత్సాహం శుద్ధా సంవిత్తనోతి ఖే
ఈషత్ప్రసరణేనాశు స్పన్దనం పవనో యథా. 15

వాయువు చలనమును విస్తరింపఁజేయునట్లు, శుద్ధచైతన్యమే యొకింత స్ఫురణమాత్రముచే అహంకారసహితమగు అసత్తైనట్టి యీ సమస్త జగత్తును, అవిద్యావృతమగు తన చిదాకాశమున విస్తరింపఁజేయుచున్నది.

సదివాసత్యమేవేదమకుర్వత్యన్యమేధతే
మృదా హేమ్నేవ కుమ్భత్వమపృథగ్లభ్యమాత్మగమ్. 16



యథార్థముగ బ్రహ్మసంవిత్తు తనకంటె వేఱుగ దేనిని రచింపకున్నను, అసత్యమే అయియుండియు సత్యమువలె భాసించు ఈజగద్రూపమున విజృంభించుచున్నది. కాని, మృత్తికచేగాని, సువర్ణముచేగాని, తనయందుఁ గల్పింపఁబడిన ఘటత్వమును నందుండి వేఱుచేసి పొందుట కెట్లు సాధ్యముకాదో, అట్లే జగత్తునున్ను బ్రహ్మచైతన్యమునుండి వేఱుచేసి పొందుటకు సాధ్యపడదు. [జగత్తు సత్యమైనచో నట్లు వేఱుగఁ బొందఁబడియుండెడిదే యని భావము.]

శూన్యమాత్రం యథా వ్యోమ స్పన్దమాత్రం యథానిలః
జలమాత్రం యథోర్మ్యాది సంవిన్మాత్రం తథా జగత్. 17

ఆకాశము శూన్యమాత్రమై వాయువు చలనమాత్రమై, తరంగాదులు జలమాత్రమై యున్నట్లు, ఈ జగత్తున్ను చిన్మాత్రమైయున్నది.

అవ్యవచ్ఛిన్ననిర్భాగసంవిన్మాత్రం జగత్త్రయం
విద్ధి శాన్తం తథా వ్యోమ యథా వారిణి పర్వతమ్. 18

ఓ ద్విజుఁడా! జలమందుఁ బ్రతిబింబించిన పర్వతము జలరూపమే అయినట్లు, ఈ ముల్లోకములను సజాతీయ, విజాతీయ, స్వగతభేదరహితమైన బ్రహ్మసంవిన్మాత్రముగనే యెఱుఁగుము.

నిర్వాణస్యోపశాన్తస్య జ్ఞస్య సోదేతి శీతతా
అన్తర్యత్రేన్దవోఽస్యైతే దీప్తజ్వాలనబిన్దవః. 19

ఈ ప్రకారముగ జగత్తత్త్వమెఱిఁగినట్టి యుపశాంతుఁడైన ముక్తుఁడగు జ్ఞానియొక్క యంతఃకరణమున, చంద్రులున్ను, అగ్నిబిందువువలెఁ దోచునట్టి అపూర్వమైన శీతలత్వ ముదయించును.

కిం కేన కథమేకాన్తశాన్తాతతశివాత్మని
నిరాలోకో పరాలోకః శూన్యేజగతి జన్యతే. 20

సర్వథా శాంతమై, వ్యాపకమై, దృశ్యశూన్యమైనట్టి బ్రహ్మమాత్రమగు ఈ జగత్తునందుఁ బ్రకాశరాహిత్యమునుగాని అన్యప్రకాశమునుగాని యెవఁడే సాధనచే నే క్రియద్వారా యెట్లు కలుగఁజేయఁగలఁడు?

యా సత్తా బ్రహ్మశబ్దాఖ్యా రూపం సర్వస్య తన్నిజమ్
న యత్ర కాచిద్బాధాస్తి సర్వం తన్మయమవ్యయమ్. 21

'బ్రహ్మ'శబ్దముచే ఏ చైతన్యసత్త చెప్పఁబడుచున్నదో, అదియే సమస్తపదార్థములయొక్క నిజరూపమైయున్నది. మఱియు నెచట ఏ బాధయున్ను లేదో, అట్టి యబాధ్యమై, అవ్యయమైనట్టి బ్రహ్మమయముగ ఈ సమస్తమున్ను వెలయుచున్నది.

యదిదం తు పదార్థత్వం యత్ర బాధానుభూయతే
యద్యచ్చ బాధనం ప్రేత్య తన్న విద్మ ఖపుష్పవత్. 22

దేనియొక్క బాధ అనుభూతమగుచున్నదో, అట్టిపదార్థముల నామరూపములను, వాని బాధాసాధనములను వాని యుత్పత్త్యాది వికారములను అన్నింటిని బాగుగ విచారించినప్పటికిని వాని నెఱుఁగఁజాలము. ఏలయనఁగా నవియాకాశపుష్పమువలె మిథ్యాభూతములై యున్నవి.

జ్ఞ ఏవాపగతస్వాన్తం శాన్తమాస్తే మహాశ్మవత్
అసౌ న మననం మౌనమనన్తమజమవ్యయమ్. 23

విప్రుఁడా! మనస్సును రహితమొనర్చి శేషించు జ్ఞానరూపముచే మహా శిలవలె నిశ్చలముగ స్థితినొందియుండుము. ఈ జ్ఞానరూపము మనోవికల్పరహితమై, నేత్రాదీంద్రియవర్జితమై, అనంతమై అజమై, అవ్యయమైనట్టి బ్రహ్మరూపమే అయి యున్నది.

ఆకాశకల్పే స్వే భావే తిష్ఠతోఽజ్ఞానివేదనమ్
భవత్యభ్యాసదార్ఢ్యేన వినా స్వప్న వికారవత్. 24

ఓ ప్రియుఁడా! ఆకాశమును బోలిన శుద్ధమైనట్టి తన యాత్మరూపమున స్థితినొందియుండు జ్ఞానికి నామరూపములయొక్క ప్రతీతి కానేరదు. అట్టి ఆత్మస్థితియొక్క యభ్యాస దార్ఢ్యములేని వానికి శరీరయాత్రాది కార్యములకొఱకై స్వప్న వికారములవలె నామరూపాదులు మనస్సునందు యుదయించును.

నిరూపాదానసంభారమభిత్తావేవ చేతతి
బ్రాహ్మం కర్తృ జగచ్చిత్రం న కశ్చిద్వా న కించన. 25

హిరణ్యగర్భుని మనస్సే ఉపాదాన నిమిత్తకారణములు లేకనే సంకల్పమాత్రముచే నిరాశ్రయమగు యీ జగద్రూప చిత్రమును గాంచుచున్నది. కావున ఈ జగన్నిర్మాణమున మనస్సుతప్ప, అన్యమగు కర్తగాని, కార్యముగాని యేమియును లేదు.

తనోతి యత్తదాత్మైవ తస్య తత్ర తథా స్థితమ్
దృశ్యాభావాదసద్దృశ్యం తేన కః క్వ కరోతి కిమ్. 26

మనస్సు దేనిదేనిని విస్తరింపఁజేయుచున్నదో, అట నాయా రూపమున ఆత్మయే (తత్తద్వస్త్వాభాసముచే) స్థితినొందియున్నది. ఇట్లు, ఆత్మకంటె వేఱుగ దృశ్యము లేనందున దృశ్యము అసత్తగుటచే నిఁక దేనిచే నెవఁడెద్దాని నెచట నిర్మించుచున్నాఁడు ?

అహం సుఖీతి సుఖితా అహం దుఃఖీతి దుఃఖితా
సర్వ ఏవ సరూపస్థా వ్యోమాత్మానోఽపి పార్థివాః. 27

కావున 'నేను సుఖవంతుఁడను, నేను దుఃఖవంతుఁడను' అను ఈ సుఖదుఃఖరూపత్వమును తత్సాధనభూతములగు శబ్దాది విషయములున్ను, సమస్తము చిదాకాశరూపమగు ఆత్మస్వరూపమే అయి యున్నది.

సర్వేషామేవ భావానాం చిదాకాశాత్మనామపి
మిథ్యైవ స్వప్నశైలానామివ పార్థివతా స్థితా. 28

సమస్తపదార్థములు చిదాకాశరూపములై యున్నను, వానియొక్క పార్థివ(దృశ్య) రూపత్వమెయ్యది గోచరించుచున్నదో, అది స్వప్నమందలి పర్వతాదులవలె మిథ్యయే అయియున్నది.

అహంతోల్లేఖతః సత్తా భ్రమ భావ వికారిణీ
తదభావాత్స్వభావైకనిష్ఠతా శమశాలినీ. 29



అహంభావముయొక్క స్ఫురణమాత్రముచేతనే ఆత్మసత్త భ్రమమయమగు పదార్థముల వికారములతో గూడియున్నదగును. అట్టి అహంభావము శమించుటచే శాంతిచే శోభితమగు కేవల ఆత్మస్వభావరూపమగు సత్తగనే యది శేషించును.

హేమ్నః కటకశబ్దార్థో వ్యతిరిక్తో యథాసి తే
వ్యతిరిక్తా తథా సత్యా నాహన్తాస్తి శమాత్మనః. 30

ఓ బ్రాహ్మణుఁడా! సువర్ణముకంటె వేఱుగ 'కటక' శబ్దార్థములు మిథ్యయైనట్లు, శమాత్మరూపుఁడవగు నీకంటె వేఱుగ అహంభావముయొక్క సత్తయు మిథ్యయై యున్నది.

నిర్వాణో నిర్మనా మానీ కర్తాఽకర్తా చ శీతలః
జ్ఞఏవ శాన్త ఏవాస్తే శూన్య ఏవాభిపూరితః. 31

మోక్షస్వరూపుఁడై, మనోరహితుఁడై, క్రియాశూన్యుఁడై, కర్తయై, అకర్తయై, ఆనందస్వరూపుఁడై, శాంతరూపుఁడై, దృశ్యవర్జితుఁడై ఇట్లు కేవలము పరబ్రహ్మరూపుఁడే యగుచు జ్ఞాని యంతటను పరిపూర్ణుఁడై వెలయుచుండును.

నిర్వాసనాస్పన్దపరో యన్త్రపుత్రకగాత్రవత్
స యథాస్థితమేవాస్తే జ్ఞః సంవ్యవహరన్నపి. 32

వాసనారహితుఁడగు జ్ఞాని లెస్సగవ్యవహరించినను, యంత్రనిర్మితములగు శిలాదివిగ్రహముల శరీరమువలె, నిశ్చలుఁడై (క్రియలాచరించినను, తదభిమానవర్జితుఁడై) తన యాత్మస్వరూపముననే స్థితిగల్గియుండును.

యథా మఞ్చక సంస్థస్య స్పన్దతే నైవ వా శిశోః
అజ్ఞాని స్వానుసంధానం విన్నైవం విదితాత్మనః. 33

"ఊగుచున్న యూయెలయందు నిద్రించుచున్నట్టి శిశువుయొక్క అవయవములు చలింపకయే యుండునట్లు శరీరాదుల అనుసంధానములేని ఆత్మజ్ఞుఁడగు జ్ఞానికిఁ తన అవయవముల చేష్టలును గోచరింపకయే యుండును.

నిఃసంబోధైకబోధస్య నిరాశేహైషణాశిషః
శాన్తానన్తాత్మరూపత్వాదనుసంధానతా కుతః. 34

బహిర్ముఖ చిత్తవృత్తిరహితుఁడును, అఖండబోధస్వరూపుఁడును, ప్రాప్తించనివిషయములం దాశగాని, పాప్తించిన విషయములందు రాగముగాని లేనివాఁడును, శాంతుఁడును, అనంతాత్మరూపుఁడు నగుటచే జ్ఞానికి శరీరాదుల అనుసంధాన మెట్లుండఁగలదు.

అద్రష్టురపదృశ్యస్యాదృగ్రూపస్యాపరూపిణః
కుతః కిలానుసంధానమనపేక్షస్య పశ్యతః. 35

ద్రష్టృదర్శన దృశ్యరహితుఁడును, స్వయముగ నిరాకారుఁడును, అపేక్షావర్జితుఁడును, ఆత్మదర్శియునగు గాంచునట్టి జ్ఞానికిఁక శరీరాదుల అనుసంధానమెచట?

అపేక్షైవ ఘనో బన్ధ ఉపేక్షైవ విముక్తతా
సర్వశబ్దాన్వితా తస్యాం విశ్రాన్తేన కిమీహ్యతే. 36

పదార్థములయొక్క అపేక్ష (కోరిక)యే పృథమైన బంధనము; వాని యుపేక్ష (కోరిక లేకయుండుట)యే విముక్తి. పూర్ణకాముఁడై, ఆత్మయందు విశ్రమించునట్టి జ్ఞాని యిఁక నేపదార్థమును గోరును!

పార్థివత్వే శరీరేఽస్మిన్స్వ స్వప్నాఙ్గ ఇవాసతి
భ్రమమాత్రాత్మని కుతః క్వ కస్య కిమపేక్షణమ్. 37

ఈ పార్థివ దేహము భ్రమమాత్రమని తెలియుటచే నయ్యది స్వప్నశరీరమువలె బాధితము కాఁగా నిఁక నెవఁడెచట నే పదార్థమును గోరును?

ఉపశాన్తసమస్తేహం విగతాఖిలకౌతుకమ్
నిరస్తవేదనం జ్ఞేన విదా కేవలమాస్యతే. 38

సమస్తకోరికలు నశించినవాఁడును, సర్వ కౌతుక వర్జితుఁడును, దేహాదుల యభిమానము లేనివాఁడు (లేక, దృశ్యవేదనయంతయు తొలగినవాఁడు)నగు మహాత్ముఁడైన జ్ఞాని కేవలము తన ఆత్మయందే నెలకొనియుండును.

మఙ్క్షనేతి శ్రుతవతా తతో మోహో మహానపి
అశేషేణ పరిత్యక్తస్తత్రైవ త్వగివాహినా. 39

ఓ రామచంద్రా! మంకిబ్రాహ్మణుఁడిట్లు నా యుపదేశమును వినఁగనే సర్పము కుబుసమును విడుచునట్లు, గొప్పదైన సంసార మోహమును నవుడచ్చోటనే సంపూర్ణముగఁ ద్యజించివైచెను.

ప్రవాహాపతితం కార్యం కుర్వతాపాస్తవాసనమ్
తేన వర్షశతస్యాన్తే స్థితమద్రౌ సమాధినా. 40

వాసనారహితుఁడై, యథాప్రాప్తములగు కర్మల నాచరించుచు నూఱువత్సరములైన పిదప యాతఁడొకానొక పర్వతముపై సమాధి నవలంబించి యుండెను.

తత్రాద్య యావత్పాషాణసమధర్మా స తిష్ఠతి
స శాన్తకరణో యోగీ బోధ్యమానః ప్రబుధ్యతే. 41

మనస్సు, ఇంద్రియములు మున్నగునవన్నియు శమించినట్టి యా యోగి శిలవలె నిశ్చలముగ సమాధియందు మగ్నుఁడై యున్నవాఁడై నేఁటికిని నచటనే యుండియున్నాఁడు. ఎవరైన మేల్కొలిపినచో సమాధినుండి లేచును.

ఏతేన రాఘవ వివేకపదేన శాన్తి
మాసాదయోదయవతా మనసా విహారమ్
మా దీనతాం వ్రజతు రాగమయీ మతిస్తే
క్షీణా క్షణాదసలిలేవ శరద్ఘనాలీ. 42



ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే మఙ్క్యుపాఖ్యానే నిర్వాణసమాప్తిర్నామ షడ్వింశః సర్గః ॥ 26 ॥

ఓ రాఘవా! మంకి పరిగ్రహించిన యీ యుపాయముచే, జ్ఞానమనందుత్సాహముగల మనస్సుచే వివేకముద్వారా, స్వాత్మానందమున విహరించుటకై, నీవు శాంతిని సముపార్జింపుము. మఱియు, నీబుద్ధి రాగమయమై జలరహితమగు శరత్కాలమేఘ సమూహమువలె క్షణకాలములో వివేకము క్షయించినదై దీనత్వమును బొందకుండుగాక!

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున మంక్యుపాఖ్యానమున మంకినిర్వాణమను నిరువదియాఱవ సర్గము ॥26॥

---

## సప్తవింశతిః సర్గః

[చిత్తస్పన్దే చితః స్పన్దభ్రమాద్విశ్వవిభూతయః
చిత్తశాన్త్యైవ తచ్ఛాన్త్యా స్వరూపస్థితిరీర్యతే.

చిత్తముయొక్క చలనమున, చిత్తుయొక్క చలనమును కూర్చిన భ్రమచే ఈ జగద్విభూతులు కలుగుటయు, చిత్తముయొక్క శమనముచే జగత్తున్ను శమింప, స్వాత్మరూపమున స్థితి సంభవించుటయు నిట వర్ణింపఁబడుచున్నవి.]

శ్రీవసిష్ఠ ఉవాచ:—

నిర్వాణో భవ శాన్తాత్మా యథాప్రాప్తానువృత్తిమాన్
సన్నేవాసత్సమః సౌమ్య స్ఫటికాదివ నిర్మితః. 1

శ్రీ వసిష్ఠుఁడు.—సౌమ్యుఁడవగు నో రామచంద్రా! స్ఫటికాదులచే నిర్మింపఁబడిన మనుజ విగ్రహమువలె, శరీరము విద్యమానమైయున్నను, లేనిదానివలెనే యున్నవాఁడవై, యథాప్రాప్తములగు కార్యముల నాచరించుచు, శాంతాత్ముఁడవై, నిర్వాణ (మోక్ష)రూపుఁడవుకమ్ము.

ఏకస్మిన్నేవ సర్వస్మిన్సంస్థితే వితతాత్మని
నైకస్మిన్న చ సర్వస్మిన్నానాతాకలనా కుతః. 2

(ప్రబోధమొందుటకుఁ బూర్వము) ఏకమగు వ్యాపకమైనట్టి ఆత్మయే యేకమందును, సమస్తమందును గూడ నుండియుండుటచేతను, (ప్రబోధానంతరము) సమష్టి వ్యష్టి శరీరములు బాధితములగుటచే ఆ యాత్మయే యేకమందుగాని, సమస్తమందుగాని లేకయుండుటచేతను నిఁక ఆ యాత్మయం దనేకత్వమును గూర్చిన కల్పన యెట్లుండగలదు?

ఆద్యన్తరహితం సర్వం వ్యోమ చిత్తత్త్వనిర్భరమ్
శరీరోత్పత్తినాశేషు కా చిత్తత్త్వస్య ఖణ్డనా. 3

చిద్వస్తువు ఆద్యంతరహితమై, సర్వవ్యాపకమై, చిదాకాశరూపమై, నాశవర్జితమైయున్నది అట్టిచో, శరీరాదుల యుత్పత్తి, నాశములచే ఆచిత్తత్త్వ మెట్లు ఖండింపఁబడును. (పరిచ్ఛేదయుక్తమగును.)

స్ఫురన్తి హి జడక్రీడాశ్చిచ్చమత్కారచాపలాత్
అచాపలాత్ప్రతీయన్తే తరఙ్గా ఇవ వారిణి. 4

చిత్తుయొక్క చమత్కారరూపమైన మనస్సుయొక్క చంచలత్వముచేఁ జడమైన యీ సృష్ట్యాదులను క్రీడలు స్ఫురించుచున్నవి. మనస్సుయొక్క చంచలత్వ ముడుగుటచే ఈ సమస్త సృష్ట్యాదులున్ను జలమందుఁ దరంగములవలె ఆత్మయందు ప్రతీతములగును.

యథా శుభ్రామ్బుదే వస్త్రశఙ్కా న ఫలభాగినీ
దేహోఽయమిత్యేషా తథా శఙ్కా న వాస్తవీ. 5

తెల్లని మేఘమున వస్త్రమునుగూర్చిన భ్రాంతి నిష్ఫలమైనట్లు, దేహాదులందీ 'అహం (నేను) అను భ్రాంతియు వాస్తవముగానిదై, నిష్ఫలమై యున్నది.

మా వస్తుని నిమగ్నస్త్వం భవ భూరిభవప్రదే
వస్త్వనన్తసుఖాయాద్యం భవ్యం భావయ భూతయే. 6

ఓ రామచంద్రా! అనేక సంసారరూప ఐశ్వర్యముల నొసంగునట్టి మిథ్యాభూతములైన దేహాదులందు (అహంభావముతో) నీవు నిమగ్నుఁడవు గాకుము. అనంతసుఖప్రదమగు మోక్షముకొఱకై, ఆద్యమై, భవ్యమై సత్యమై నాశరహితమైనట్టి ఆత్మవస్తువునే భావింపుము.

చిద్వ్యోమానన్తమేవాస్మిన్నేయత్తాస్తి సమాత్మనః
ఇత్యేవ పరమం వస్తు వస్తు తత్పరమస్తు తే. 7

చిదాకాశము అనంతమై, పరిమితిలేనిదై, సమరూపమై యున్నది. ఇదియే పరమమగు ఆత్మవస్తువు. ఇట్టి పరమవస్తువునందే నీ మనస్సు తత్పరమై యుండుగాక!

ఏవం నిశ్చయవాన్రామ త్వమేవాసి నిరఞ్జనః
ధ్యాతా ధ్యేయం తథా ధ్యానం సత్యం చాపి న కించన. 8

ఈ ప్రకారమగు నిశ్చయముగలిగియుండుటచే నిరంజనమైన (దోషరహితమైన) ఆత్మ నీవే యగుదువు. ఏలయనఁగా, ధ్యాత, ధ్యానము, ధ్యేయము—ఇవియొకింతైనను సత్యములుకావు.

ద్రష్టా దృశ్యం దర్శనం చ చిత ఏవ విభూతయః
అతస్తత్సంవిదో నాన్యద్ధ్యానం ధ్యేయమస్తి చ. 9

ద్రష్టృ దర్శన దృశ్యములన్నియుఁ చైతన్యము(చిత్తు)యొక్క విభూతులేయైయున్నవి. ఏలయనఁగా, జడవస్తువు చైతన్యము (సచ్చిదాత్మ) లేనిచో నెచటను అనుభూతముకానేరదు. కాని ధ్యేయమగు చిద్రూపము ధ్యానము లేకున్నను స్ఫురించును.

ఉద్యతి ప్రతిపచ్చన్ద్రే వహతి ప్రలయానిలే
ఆత్మతత్త్వం సమం సౌమ్యం న క్షుభ్యతి న శామ్యతి. 10



సముద్రమెట్లు ప్రతిపద (పాడ్యమి) చంద్రోదయముచే క్షోభనొందునో, ప్రళయవాయువు వీచుటచే శుష్కించిపోవునో, అట్లు—సదా యేకరూపమై, సమమై, సౌమ్యమైనట్టి ఆత్మతత్త్వమెపుడును సంక్షోభమొందదు, శమింపదు.

యథా నౌయాయినః స్థాణుతరుశైలాదివేపనమ్
యథా శుక్తౌ రజతధీస్తథా దేహాది చేతసః. 11

నౌకయందుఁ జనువానికి స్థాణు, వృక్ష, పర్వతాదుల చలనమువలెను, శుక్తి(ముత్తెపుచిప్ప)యందలి రజతబుద్ధివలెను, చిత్స్వరూపమున దేహాదులుగోచరించుటయు, చిత్తముయొక్క భ్రమమాత్రమేయై యున్నది.

యథా దేహాది చిత్తస్య తథా దేహస్య చిత్తకమ్
తథైవ జీవః పరమే పదే ద్వైతమతః కుతః. 12

చిత్తదృష్టిచే దేహాదులు కల్పితములైయున్నట్లు దేహదృష్టిచే చిత్తమున్ను కల్పితమైయున్నది. మఱియు దేహ చిత్తదృష్టులచే జీవుఁడున్ను కల్పితుఁడైయున్నాఁడు. అట్లే జీవదృష్టిచే ఆ దేహచిత్తములు రెండును కల్పితములైయున్నవి. కావున నిఁక ఆపరమపదమున ద్వైత మెచట? (ఆ దేహాదులన్నియు శుద్ధచైతన్యమున, గల్పితములే యని భావము)

సర్వమేకమిదం శాన్తం బ్రహ్మ బృంహితవేదనాత్
న కించిజ్జగదాద్యస్తి భ్రాన్తిరన్యా న విద్యతే. 13

బ్రహ్మదృష్టిచే సమస్తమున్ను ఏకమై, శాంతమైనట్టి బ్రహ్మరూపమే యైయున్నది. అట ఈజగదాదులుగాని, లేక ఇతరమైన మఱి యేభ్రమగాని యొకింతైనను లేవు.

న విద్యతే యథా వ్యోమ్ని వనం స్నేహాశ్చ సైకతే
విద్యుచ్ఛశాఙ్కబిమ్బే చ తథా దేహాది చేతసి. 14

ఆకాశమున వనములేనట్లును, ఇసుకయందు తైలములేనట్లును, చంద్రబింబమున మెఱుపు లేనట్లును, తత్త్వదృష్టియందు దేహాదిపదార్థములున్ను లేవు.

అవిద్యమాన ఏవాస్మిన్మాబిభీహి జగద్భ్రమే
ఏతదేవ పరం సత్యం విద్ధి సత్యవిదాంవర. 15

సత్యము నెఱుఁగువారిలో శ్రేష్ఠుఁడవగు రామచంద్రా! లేనిదియగు ఈ జగత్తుయొక్క భ్రమయందు నీవు భయమును బొందకుము. ఈ జగత్తు వాస్తవముగ లేదు - ఇదియే పరమసత్యమని యెఱుఁగుము.

జగదస్తి న సత్తేతి యాసీద్భ్రాన్తిస్తవాద్యసా
శాన్తా మదుపదేశేన కిమన్యద్బన్ధకారణమ్. 16

ఓ రామచంద్రా! 'జగత్తే గలదు అద్వితీయమైనట్టి, బ్రహ్మసత్తే లేదను' భ్రాంతి యెయ్యది నీకుండియుండెనో అది యిపుడు నా యుపదేశముచే నశించినది. ఇఁక బంధమునకుఁ గారణము వేఱేమి గలదు!

స్థాల్యాదఙ్గునకుమ్భాది యథా మృన్మాత్రకం తథా
చిత్తమాత్రం జగదిదం క్షీణం తచ్చ విచారణాత్ 17

కుండ, మూకుఁడు, చట్టి మున్నగునవి మృత్తికామాత్రములే యగునట్లు, ఈజగత్తు చిత్తమాత్రమే అయియున్నది. ఆ చిత్తమున్ను విచారణచే క్షయించిపోవుచున్నది.

ఆపత్సు సంపత్సు భవాభవేషు
శాన్తైషణా హర్షవిషాదసంవిత్
సామ్యాదహంభావవిదా విముక్తో
యథాస్థితం తిష్ఠ విలీయమానః. 18

ఓ రామచంద్రా! నీవు శాంతమగు నా యుపదేశముచే అహంభావరహితుఁడవై, సంపదలందు హర్ష వాంఛాదులు గాని, విపత్తులందు ఖేదము గాని లేనివాఁడవై, పదార్థములయొక్క యుత్పత్తి వినాశములందు సుఖదుఃఖములఁ బొందక సమరూపమున ఆత్మయందు స్థితిగల్గియుండుము. మఱియు ఎన్నటికిని యుపదేశమును మఱచి స్వరూపస్థితి దార్ఢ్యమును గోల్పోయి యుండకుము.

యథాస్థితం వస్త్వధిగమ్య రామ
స్థితోఽసి చేద్వా స్వకులామ్బరేన్దో
తద్ధర్షశోకైషణదూషణాది
విముచ్య వా తిష్ఠ యథేచ్ఛమాస్స్వ. 19

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు
నిర్వాణ ప్రకరణే ఉత్తరార్ధే ముఖ్యయోగోపదేశో
నామ సప్తవింశతిః సర్గః ॥ 27 ॥

రఘుకులాకాశమునకుఁ జంద్రుఁడవగు నో రామచంద్రా! నీవు యథాస్థితమగు. ఆత్మవస్తువును అపరోక్షముగ లెస్సగ సాక్షాత్కరించుకొనినచో నిక హర్ష శోకేచ్ఛారూపములగు చిత్త సంతాపక కార్యములను త్యజించియైన యుండుము. లేక యథేచ్ఛముగ వాని ననువర్తించుచునైన యుండుము. ఎట్లున్నను అపుడు నీ ముక్తి యందు సందేహమేమియు నుండదు.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున ఉత్తరార్ధమున
ముఖ్యయోగోపదేశమను నిరువదియేడవ సర్గము ॥ 27 ॥

---

## అష్టావింశతిః సర్గః

[బీజాంకురాణాం పురుషకర్మణాం జన్మకారిణామ్
దైవశబ్దార్థయుక్తానాం తత్త్వం భూయోఽత్ర వర్ణ్యతే.

దైవ (అదృష్ట) శబ్దార్థయుక్తములును, జననమరణహేతువులును, బీజాంకురతుల్యములునగు పురుష (కర్తృ) కర్మలయొక్క తత్త్వ మిట మరల వర్ణింపఁబడుచున్నది.]



శ్రీరామ ఉవాచః—

బీజాఙ్కురాణాం పురుషకర్మణాం జన్మకారిణామ్
దైవశబ్దార్థయుక్తానాం తత్త్వం వద విభో పునః. 1

శ్రీరాముఁడు:— ప్రభూ! మరల మరల జననమరణములను గలుగఁజేయునవియు, దైవ (అదృష్ట) శబ్దార్థయుక్తములును, బీజాంకురతుల్యములునగు పురుష (కర్తృ) కర్మలయొక్క తత్త్వమును మరల తెలియఁజేయ ప్రార్థన.

శ్రీవసిష్ఠ ఉవాచః —

దైవకర్మాది పర్యాయం ఘటాది ఘటతావధి
సంవిత్స్పన్దనమేవేదం లోకే పురుషతాం గతమ్. 2

శ్రీ వసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! దైవ, కర్మాది కారణరూపము, ఘట, పటత్వాది కార్యరూపము, పురుషరూపము— ఈ మొదలగునవన్నియు వాస్తవముగ, చిత్-స్పందముయొక్క పర్యాయములేయగును; ఆ చైతన్యస్పందమే లోకమున ఆ యారూపములను బొందినదగును. [ఎట్లనఁగా, తాదాత్మ్యయే ప్రాథమిక సంకల్పరూపమగు చిత్—స్పందనముచే సమష్టి, వ్యష్టి మనస్సగుచున్నది. పిదప దేహాకారాధ్యాసముచే, పురుషుఁడై, అభిమానముఁ గర్మలఁజేయుచు, పుణ్యాపాదృష్టరూప దైవత్వమును బొంది యద్దాని ననుభవించుటకొఱకై ఘటాదిపదార్థరూపముగను, తద్గత ఘటత్వాదిగుణక్రియారూపముగనునై, ఇట్లు జగద్రూపమున వివర్తమొందుచున్నది ]

సంవిత్స్పన్దాదృతే పుంస్త్వం కర్మ వా కీదృశం భవేత్
ఘటావటపటాద్యాత్మా హ్యేతేనైవ జగత్కృతమ్. 3

చైతన్యసత్తయొక్క స్పందము (స్ఫురణ) లేనిచోఁ బురుషుఁడుగాని, కర్మగాని యెట్టిదై యుండును? (అసద్రూపములే యగునని భావము) ఈ చైతన్యసత్తయే ఘటపటాదిరూపమగు సమస్త జగత్తును రచించినది.

ప్రవర్తతే జగల్లక్ష్మీః సంవిత్స్పన్దాత్సవాసనాత్
నివర్తతే హి సంసారః సంవిత్స్పన్దాదవాసనాత్. 4

వాసనాసహితమగు చైతన్యముయొక్క స్పందముచేతనే జగత్తు ప్రవర్తించుచున్నది. వాసనారహితమగు చైతన్యముయొక్క స్పందముచే (శుద్ధాత్మాకార జ్ఞానముచే) జగత్తునివర్తించుచున్నది.

అవాసనం హి సంవిత్తేః స్పన్దమస్పన్దనం విదుః
సస్పన్దోఽప్యస్ఫురత్స్పన్దో యేనావర్తాదినోహ్యతే. 5

వాసనారహితమగు చైతన్యముయొక్క స్పందము అస్పందమనియే చెప్పఁబడుచున్నది. ఎలయనఁగా, చంచలములైనను సముద్రమందలి ఆవర్తాదులు సముద్రదృష్టిచే నిశ్చలమగు సముద్రరూపముగనే యెంచఁబడుచున్నవి.

మనాగపి న భేదోఽస్తి సంవిత్స్పన్దమయాత్మనోః
కల్పనాంశాదృతే రామ స్పృష్టౌ పురుషకర్మణోః. 6

ఓ రామచంద్రా! ఈ సృష్టియందు, కల్పనాంశమునుచేదప్ప, చైతన్య స్పందరూపములగు పురుషకర్మల కొకింతైనను భేదములేదు.

జలవీచ్యోర్యథా ద్విత్వం సంకల్పోత్థం న వాస్తవమ్
తథేహ చిత్పరిస్పన్దరూపయోర్జన్తుకర్మణోః. 7

జల, తరంగములయొక్క భేదము సంకల్పమాత్రజనితమేగాని వాస్తవముగానట్లు, చైతన్యముయొక్క స్పందరూపములగు పురుష కర్మలయొక్క భేదమున్నవాస్తవము కాదు.

కర్మైవ పురుషో రామ పురుషస్యైవ కర్మతా
ఏతే హ్యభిన్నే విద్ధి త్వం యథా తుహినశీతతే. 8

ఓ రామచంద్రా! కర్మయే పురుషుఁడు, పురుషునిదే కర్మత్వము. హిమ, శీతలత్వములు వేఱుగానట్లు, ఈ పురుష, కర్మలు రెండును వేఱుగానివైయున్నవని నీ వెఱుఁగుము.

హిమం యత్తద్యథా శైత్యం యచ్ఛైత్యం తద్యథా హిమమ్
యత్కర్మాసౌ తథా జన్తుర్యో హి జన్తుః కర్మ తత్తథా. 9

మంచు యెట్టిదో, శీతలత్వమున్న నట్టిదయైనట్లున్ను, శీతలత్వమెట్టిదో మంచున్న నట్టిదే యైనట్లున్ను, కర్మయెట్టిదో పురుషుఁడున్న నట్టివాఁడే, పురుషుఁడెట్టివాడో, కర్మయునట్టిదే.

సంవిత్స్పన్దరసస్యైవ దైవకర్మ నరాదయః
పర్యాయశబ్దా న పునః పృథక్కర్మాదయఃస్థితాః. 10

చైతన్యస్పందమను రసమే దైవము. కర్మ, మనుష్యాదులున్ను, ఇవి యన్నియు ఆ చైతన్య స్పందముయొక్క పర్యాయశబ్దములే యగును. కావున వేర్వేరు కాదనికంటె వేఱుగారయున్నవి.

స్పన్దాత్సంవిజ్జగద్బీజమస్పన్దాద్యాత్యబీజతామ్
అఙ్కురస్య తదేవాన్తః స్థితత్వాదఙ్కురశ్రియః. 11

చైతన్యము స్పందయుక్తమగుటచే జగత్తుయొక్క బీజమగుచున్నది. స్పందరహితమగుటచే బీజముకాకయున్నది. బీజమే లోన సూక్ష్మావయవరూపమున నున్నదై, క్రమముగ అంకుర రూపమున స్ఫురించుచున్నది.

చిత్త్వం చ క్వచిదస్పన్దం క్వచిత్స్పన్దం స్వభావతః
అనన్తమేకార్ణవవద్దిక్కాలక్రమసంస్థితమ్. 12

అనంత మహాసముద్రమువలె ఈ చైతన్యము స్వభావతః దేశకాలక్రమయుక్తమగు ఈ స్పందము నొకచోట ధరించుచున్నది. ఒకచోట ధరింపకయే యున్నది.

సంవిత్స్పన్దో వాసనావానిహా బీజమకారణమ్
భూత్వా కారణతామేతి దేహాదేరఙ్కురావలేః. 13

అకారణమైనను, చిత్-స్పందము వాసనాసహితమై దేహేంద్రియాదులను అంకురసమూహమునకుఁ గారణమగుచున్నది.



తృణవల్లీలతాగుల్మబీజాన్తరగతేరపి
బీజం సంవిత్స్పన్ద ఏవ తస్య బీజం న విద్యతే. 14

తృణ, లతా, గుల్మ, వృక్షాదుల బీజములందు వ్యవస్థితమైయున్న అంకురాది కార్యప్రవృత్తికి బీజము చైతన్యముయొక్క స్పందమే అయియున్నది. ఆ చైతన్యమునకు బీజముమరేదియును లేదు.

న బీజాఙ్కురయోర్భేదో విద్యతేఽగ్న్యౌష్ణ్యయోరివ
బీజమేవాఙ్కురం విద్ధి విద్ధి కర్మైవ మానవమ్. 15

ఓ రామచంద్రా! అగ్ని, ఉష్ణత్వములకు భేదములేనట్లు, బీజాంకురములందు భేదమేమియును లేదు. బీజమునే అంకురముగను, కర్మనే మనుజునిగను నీవెఱుఁగుము.

చిత్స్ఫురన్తీ భూమికోశే కరోతి స్థావరాఙ్కురమ్
స్థూలాన్సూక్ష్మాన్మృదుక్రూరాన్పయోబుద్బుదకానివ. 16

పృథివియొక్క కోశమున స్ఫురించుచు, చైతన్యము - జలము బుద్బుదములను రచించునట్లు - (వటాది) స్థావరముల అంకురముల నొకచోట స్థూలముగను, ఒకచోట సూక్ష్మముగను, ఒకచోట మృదువుగను, ఒకచోట కఠినముగను రచించుచున్నది.

చితా వినా ధరాకోశాదత్యన్తపరిపేలవాత్
అఙ్కురాన్వజ్రసారాంశ్చ క ఉల్లాసయితుం క్షమః. 17

చైతన్యముతప్ప యన్యమెద్ది భూకోశమునుండి అతికోమలమైన అంకురముద్వారా వజ్రమువలెఁ గఠినమైనట్టి పగడము మన్నగువానిని రప్పింప సమర్థమగును?

ప్రాణివీర్యరసాన్తస్థా సంవిజ్జంగమమాతతమ్.
తనోతి లతికాన్తస్థో రసః పుష్పఫలం యథా. 18

లత యందున్న రసము పుష్పఫలాదులను విస్తరింపఁజేయునట్లు, ప్రాణియొక్క వీర్యరసమందున్న చైతన్యము జంగమరూపజీవులను విస్తరింపఁజేయుచున్నది.

యది సర్వగతా సంవిద్భవేన్నాతిబలీయసీ
తత్క ఉల్లాసనే శక్తః స్యాద్దేవాసురభూభృతామ్. 19

సర్వవ్యాపకమగు చైతన్యము అతి బలవత్తరమైనది గానిచో అసురులను, పర్వతములను దొలగించుటయందెవరు సమర్థులగుదురు?

జంగమానాం స్థావరాణామేతదాద్యం చ బీజకమ్
సంవిద్విస్ఫురణమాత్ర మస్య బీజం న విద్యతే. 20

సమస్త స్థావర, జంగమ పదార్థములయొక్క ఆది బీజము చైతన్యముయొక్క స్ఫురణమాత్రమే అయియున్నది, ఆ చైతన్యమునకు బీజము మఱెద్దియును లేదు.

బీజాఙ్కురవికల్పానాం క్రియాపురుషకర్మణామ్
ఊర్మివీచితరఙ్గాణాం నాస్తి భేదో న వస్తుని. 21

వికల్పమయములగు బీజాంకురములకును, క్రియా, పురుష, దైవ(అదృష్ట)ములకును, ఊర్మి, వీచి (అల), తరంగములకును, బరస్పరమే భేదమున్ను లేదు! మఱియు (వీని) యధిష్ఠానమగు చైతన్యమందును నే భేదమున్ను లేదు.

ద్విత్వం నృకర్మణోర్యస్య బీజాఙ్కురతయా తయోః
విపశ్చిత్పశవే తస్మై మహాత్మేఽస్తు సదా నమః. 22

ఎవనియొక్క దృష్టియందు, బురుష కర్మలకును, బీజాంకురములకును భేదము గలదో, అట్టి గొప్ప బుద్ధిమంతుఁడగు మనుజరూప పశువునకు సదా నమస్కారము,

సంవిత్తేర్జన్మబీజస్య యోఽన్తస్థో వాసనారసః.
స కరోత్యఙ్కురోల్లాసం తమసఙ్గాగ్నినా దహ. 23

ఓ రామచంద్రా! జన్మకు బీజభూతమగు చైతన్యమందు ఏ వాసనారూపమగు రసముగలదో, అదియే (జన్మరూపమగు) అంకురమును బ్రకటమొనర్చుచున్నది. అట్టి వాసనారూపమగు రసమును అసంగత్వమను అగ్నిచే దహింపఁజేయుము.

కుర్వతోఽకుర్వతశ్చైవ మనసా యదమజ్జనమ్
శుభాశుభేషు కార్యేషు తదసఙ్గం విదుర్బుధాః. 24

చేయుచున్నను, లేక చేయకయున్నను, శుభాశుభకర్మములందు మనస్సుచేఁ దగుల్కొనక యుండుట యేది గలదో, అదియే 'అసంగమ'ని విజ్ఞులు బల్కుదురు.

అథవా వాసనోత్సాద ఏవాసఙ్గ ఇతి స్మృతః
యయా కయాచిద్యుక్త్యైనం సంపాదయ తమేవ హి. 25

లేక, వాసనయొక్క నాశమే అసంగమనియుఁ జెప్పఁబడెను. కావున నో రామచంద్రా! ఏదో యొక యుపాయముచే నీవు అసంగమును సముపార్జింపుము.

యయైవ వేత్సి తతయా యుక్త్యా పురుషయత్నతః
వాసనాఙ్కురనిర్మూలమేతదేవ పరం శివమ్. 26

పూర్వోక్తములగు రాజయోగ, హఠయోగాదిరూపములగు యుక్తులలో దేనిని నీవు సులభమని తలంచెదవో, దాని నవలంబించి, పురుషప్రయత్నముద్వారా వాసనయను అంకురమును నిర్మూలన మొనర్చుము. ఏలయనఁగా నట్టి వాసనాత్యాగమే పరమమంగళమైయున్నది; (లేక, అట్టి వాసనారహితస్థితియే ప్రత్యగాత్మస్వరూపమైయున్నది.)

పౌరుషేణ ప్రయత్నేన యథా జనాసి వా తథా
నివారయాహంభావాంశమేషోఽసౌ వాసనాక్షయః. 27

(అహంభావమే సమస్తవాసనలకును మూలము గాన) ఏరీతిగ నీవెఱుఁగుదువో, ఆ రీతిగ బురుష ప్రయత్నముద్వారా 'అహంభావము'ను నాశమొనర్చుము. ఇదియే వాసనాక్షయము.



నాస్త్యేవ పౌరుషాదన్యా సంసారోత్తరణే గతిః
నిరహంభావరూపేఽస్మిన్వాసనాక్షయనామని. 28

నిరహంభావ (అహంభావరహిత) రూపమైనదియు, వాసనాక్షయమను పేరుగలదియునగు సంసారోత్తరణమున పురుషప్రయత్నముతప్ప అన్యమగు ఏయుపాయమున్ను లేదు.

అద్వైవ సంవిదస్తీహ సోఽఙ్కురో బీజమస్తి తత్
తత్కర్మ తచ్చ పురుషస్తద్దైవం తచ్ఛుభాశుభమ్. 29

అనాదియై, అనంతమైనట్టి చైతన్యమేది గలదో, అదియే అంకురము. అదియే బీజము, అదియే కర్మ, అదియే పురుషుఁడు, అదియే శుభాశుభదైవము (అదృష్టము).

న బీజమాదావస్త్యన్యన్నాఙ్కురో న చ వా నరః
న కర్మ న చ దైవాది కేవలం చిదుదేతి హి. 30

సృష్ట్యాదియందు, చైతన్యమున కన్యముగ అంకురముగాని, బీజముగాని, పురుషుఁడుగాని, కర్మగాని, దైవముగాని లేవు. కేవలము చైతన్యమే సర్వరూపముచేఁ బ్రకటమగుచున్నది.

నో బీజమస్తి న కిలాఙ్కురకోఽపి వాస్తి
నాప్యస్తి కర్మ పురుషశ్చ న వాస్తి సాధో
ఏకం తు చిత్త్వముదితం హ్యావయాభిధాన
లక్ష్మ్యా నటః సురనరాసుర శోభయేవ. 31

ఓ సాధూ! వాస్తవముగ బీజముగాని, అంకురముగాని, పురుషుఁడుగాని, కర్మగాని లేవు. చైతన్య మొకటియే సురాసుర మనుష్యాది వేషములను ధరించి, ఈజగత్తుయొక్క నామరూపశోభతో గూడి యుదితమై నటునివలె నృత్యమొనర్చుచున్నది.

ఇత్యేవ నిశ్చయమనామయ భావయిత్వా
త్యక్త్వా భృశం పురుషకర్మ విచారశఙ్కామ్
నిర్వాసనః సకలసంకలనావిముక్తః
సంవిద్వపుర్నను యథాభిమతేచ్ఛమాస్స్వ. 32

శుద్ధుఁడవగు రామచంద్రా! ఈ ప్రకారమగు సందేహరహితమైన సర్వరూపమగు బ్రహ్మము (చైతన్యము)ను భావించుచు, అసత్యములగు పురుష కర్మాదుల విచారమును గూర్చిన శంకను బారద్రోలి, సమస్త కల్పనావర్జితమై, వాసనావినిర్ముక్తమైనట్టి చిన్మాత్రశరీరమును ధరించి, సమాధియుందుండుము, లేక వ్యవహరింపుము.

ప్రశాన్తసర్వేచ్ఛమశఙ్కమచ్ఛ
చిన్మాత్రసంస్థోఽఖిలకార్యకారీ
ఆత్మైకరామః పరిపూర్ణకామో
భవాభయో రామ శమాభిరామః. 33

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే శఙ్కాతత్త్వ సిద్ధాన్తప్రతిపాదనం నామాష్టావింశతిః సర్గః ॥ 28 ॥

ఓ రామచంద్రా! సమస్త కోరికలను, సంశయములను విడనాడి, నిర్మలమైనట్టి చిన్మాత్రమున స్థితిగల్గియున్నవాఁడవై సర్వకార్యముల నాచరింపుము. మఱియు కేవలము ఆత్మారాముఁడవై పూర్ణకాముఁడవై, శాంతిచే మనోహరుఁడవై, నిర్భయుఁడవై చెన్నొందుము.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున శంకాతత్త్వ సిద్ధాంతప్రతిపాదనమను నిరువదియెనిమిదవ సర్గము ॥28॥

---

## ఏకోనత్రింశః సర్గః

[వ్యవహారే యథా ప్రాప్త లోకచర్యానువర్తనమ్
స్వరూపే తు సదా స్థైర్యం రామాయాత్రోపదిశ్యతే.

వ్యవహారమున యథాప్రాప్తములగు లోకకార్యములఁ జేయుచునే సదా ఆత్మస్వరూపమున స్థిరముగ నుండుటను, శ్రీరామచంద్రుని కొఱకు వసిష్ఠమునీంద్రుఁడిట నుపదేశించుచున్నాఁడు.]

శ్రీవసిష్ఠ ఉవాచ:—

నిత్యమన్తర్ముఖస్తిష్ఠ వీతరాగో వివాసనః
చిన్మాత్రమమలం శాన్తం కర్మ సర్వత్ర భావయన్. 1

శ్రీవసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! యథాప్రాప్తమగు కర్మను శత్రు, మిత్ర, ఉదాసీనులందంతట యథా యోగ్యముగ నాచరించుచున్నప్పటికిని సదా అంతర్ముఖుఁడవును, వాసనారహితుఁడవును, రాగవర్జితుఁడవునై, నిర్మలమై, శాంతమై, చిన్మాత్రమైనట్టి ఆత్మస్వరూపముతో నుండుము.

ఆకాశవిశదః ప్రాజ్ఞశ్చిన్మాత్రైకఘనస్థితిః
సమః సౌమ్యః సమానన్దః స బ్రహ్మబృంహితాశయః. 2

ఆకాశమువలె నిర్మలమైన స్వరూపముగలవాఁడై, ప్రాజ్ఞుఁడవై, కేవలము చిన్మాత్రమైన ఆత్మయందే సదా స్థితిగలిగియున్నవాఁడవై, సమరూపుఁడవై సౌమ్యుఁడవై, సమమగు ఆనందముతోఁ గూడియున్నవాఁడవై, బ్రహ్మముతోటి అభేదముచే విస్తరింపఁబడిన ఆశయముగలవాఁడవై యుండుము.

శోకేష్వాపత్సు ఘోరేషు సంకటేష్వవటేషు చ
యథాప్రాప్తేషు సర్వేషు ఖర్వేషూన్నతిమత్సు చ. 3
యథాక్రమం యథా దేశం కురుదుఃఖమదుఃఖితః
బాష్పకన్దాది పర్యన్తం ద్వన్ద్వయుక్తసుఖాని చ. 4



యథాప్రాప్తములగు సమస్త అల్పకార్యములందును, మహత్తరకార్యములందును, శోకములందును, ఆపదలందును, భయంకరములైన సంకటములందును, నిమ్నస్థితులందును ఆభ్యంతరమున దుఃఖములేనివాఁడవై, ఆ యా దేశధర్మముల ననుసరించి యథాక్రమముగ బాష్పరోదనాదుల వలన దుఃఖమును నటించుచు, శీతోష్ణాది ద్వంద్వసహితములగు వస్త్ర, చందనాది సుఖభోగముల ననుభవింపుము.

సమాగమేషు కాన్తానాముత్సవేషూదయేషు చ
ఆనందం భజ సౌమ్యాత్మా వాసనాక్రాన్తమూఢవత్. 5

అంతరంగమున సౌమ్యుఁడవై, వనితల సమాగమములందును, ఉత్సవములందును, అభ్యుదయ కార్యములందును, వాసనాగ్రస్తుఁడగు మూఢునివలెనే నీవున్ను ఆనందము ననుభవించుము.

భూతాని మృత్యుకార్యేషు సంగ్రామాదిషు నిర్దహ
దావానలతృణానీవ వాసనాక్రాన్తమూఢవత్. 6

వాసనాగ్రస్తుఁడగు మూఢునివలెనే నీవున్ను - దావాగ్ని తృణములను భస్మమొనర్చునట్లు - ఆధార్మికులగు దండనీయ జనులను యుద్ధాదులందు దహించివేయుము.

క్రమాగమేష్వఖిన్నోఽర్థం బకవచ్చిన్తయార్జయ
అర్థోపార్జన కార్యేషు వాసనాక్రాన్త మూఢవత్. 7

దుఃఖరహితుఁడవై, ధర్మవిరుద్ధము కానిరీతి ధనోపార్జనాది కార్యములందు బకమువంటి చింతతోఁ గూడి, వాసనాయుక్తుఁడగు మూఢునివలెనే నీవున్ను ధనము నార్జింపుము.

బలాద్విదలయాశేషానరీనరి నిషూదన
వాతోరిక్తానివామ్భోదాన్వాసనాక్రాన్తమూఢవత్. 8

శత్రునాశకుఁడవగు రామచంద్రా! జలరహితములగు మేఘములను వాయువు ఖండించివేయునట్లు, నీవున్ను వాసనాగ్రస్తుఁడగు మూఢునివలెనే నీయొక్క శత్రువులను బలాత్కారముగ ఖండించివేయుము.

జనేషు కరుణాశ్లేష ధైర్యం కురు మహాత్మసు
ఆత్మారామమనా మానీ వాసనాక్రాన్తమూఢవత్. 9

ఆత్మారాముఁడవై, గర్వాభిమాన వర్జితుఁడవై, వాసనాసహితుఁడగు మూఢునివలెనే నీవున్ను కరుణాయోగ్యులగు దీనజనులందును, మహాత్ములందును ఉదారత్వ, ధీరత్వాదులఁ బ్రకటింపుము.

ముదితో భవ హర్షేషు దుఃఖేషు భవదుఃఖితః
కరుణాం కురు దీనేషు భవ వీర్యేషు వీర్యవాన్. 10

హర్షస్థానములందుఁ బ్రసన్నుఁడవై, దుఃఖకార్యములందు దుఃఖివై, దీనులందు కరుణాయుతుఁడవై, వీరులందు, బరాక్రమశీలుఁడవై యుండుము.

అన్తర్ముఖః సదానన్దః స్వాత్మారామతయాన్వితః
యః కరోతి శమోదార స్తత్ర కర్తాసి నానఘ. 11

పాపరహితుఁడవగు రామచంద్రా! అంతర్ముఖుఁడవై, సదా ఆత్మానందయుతుఁడవై, స్వాత్మారామత్వముతోఁగూడి శమముచేఁ బరిపూర్ణుఁడవై, ఉదారచిత్తుఁడవగుచు ఏకార్యమునుఁ జేయుదువో, అటనీవు కర్తవుగానేరవు.

ఆత్మభావనయా సాధో నిత్యమన్తర్ముఖస్థితేః
వజ్రధారాపి తే రామ పతితా యాతి కుణ్ఠతామ్. 12

సాధువగు రామచంద్రా! ఆత్మభావనచే నెవనియొక్క వృత్తి నిత్య మంతర్ముఖమైయుండునో, అట్టివానిపై ఇంద్రుని వజ్రధారయు నిష్ఫలమైపోవును.

సంకల్పకలనోన్ముక్తే స్వసంవిన్మాత్రకోటరే
య స్తిష్ఠత్యాత్మనిస్వైరమాత్మారామో మహేశ్వరః. 13

సంకల్ప కల్పనావినిర్ముక్తమైనట్టి స్వహృదయాకాశమున నెవఁడు యథేచ్ఛగ ఆత్మయందు స్థితిగల్గియుండునో, అట్టిఆత్మారాముఁడే మహేశ్వరుఁడగును.

న తం భిన్దన్తి శస్త్రాణి న దహన్తి హుతాశనాః
న క్లేదయన్తి వారీణి శోషయన్తి న మారుతాః. 14

అట్టి చిన్మాత్రనిష్ఠుఁడగు ఆత్మారాముని శస్త్రములు ఛేదింపజాలవు, అగ్ని దహనమొనర్పఁజాలదు, జలము తడుపఁజాలదు, వాయువెండింపఁజాలదు.

సుస్తమ్భమజమాలిఙ్గ్య స్వాత్మాన మజరామరమ్
తిష్ఠావష్టభ్య ధీరాత్మా సుస్తమ్భమివ మన్దిరమ్. 15

ఓ రామచంద్రా! జన్మ, జరా, మరణములులేని నిత్యనిరతిశయానందరూపమైన స్వాత్మయను నుత్తమస్తంభమును దృఢముగ నవలంబించి, ధీరుఁడవై దృఢస్తంభయుక్తమగు మందిరమువలె నిశ్చలముగ నుండుము.

జగద్వృక్షపదార్థౌఘపుష్పామోదశ్రియం పరామ్
సంవిదం సంవిదః స్వస్థామాస్స్వాన్తర్ముఖమచ్యుతమ్. 16

జగత్తను వృక్షముయొక్క పదార్థసమూహమను పుష్పములయొక్క, సుంధమువలె సారభూతమైనట్టి యుత్తమమైన శాంతిమగు బ్రహ్మచైతన్యము నాశ్రయించి, బాహ్యవృత్తులన్నింటిని చ్యుతిలేకుండునటుల అంతర్ముఖముగానొనర్చి ఆనందముతో నుండుము.

అన్తర్ముఖతయా నిత్యం కార్యమాహరతాం బహిః
జీవతామపి నోదేతి వాసనా దృషదామివ. 17

నిత్యము అంతర్ముఖత్వము (ఆత్మపరాయణత) గల్గి, బాహ్యమున యథాప్రాప్తములగు కార్యముల నాచరించుచుండు ప్రాణధారులైన జీవులకును, శిలలందువలె, వాసన యుదయించకుండును.



పునః ప్రసరణోన్ముక్తమన్తః సుప్తం మనః కురు
కుర్వన్సర్వాణి కర్మాణి గూఢాన్మాఙ్గవదవృత్తిమాన్. 18

సాంసారిక పదార్థములందు మరలమరల నిమగ్నమగు ఈ మనస్సును, తాఁబేటి అవయవముల వలె అంతర్ముఖమొనర్చి, ఆత్మయందు లయింపఁజేసి, వృత్తిరహితుఁడవై, బాహ్యమున సమస్తకర్మల నాచరింపుము

అన్తర్వృత్తి విహీనేన బహిర్వృత్తిమతేవ చ
సుప్తప్రబుద్ధప్రాయేణ కార్యమాచర చేతసా. 19

ఆభ్యంతరమున వృత్తిరహితుఁడవై, బాహ్యమున వృత్తిసహితునివలె నున్నవాఁడవై, అర్ధజాగ్రతుని భంగి చిత్తముతోటి ప్రపంచమునఁ గార్యముల నొనర్పుము.

బాలమూకాదివిజ్ఞానవదన్తస్త్యక్తవాసనమ్
భవతః కుర్వతః కార్యం ఖవచ్చిత్తం న లిప్యతే. 20

బాల, మూకాదుల విజ్ఞానమువలె ఆభ్యంతరమున వాసనలన్నింటిని ద్యజించి, బాహ్యమునఁ గార్యముల నాచరించుచు నపుడాకాశమువలె చిత్తము నీకంటనేరదు.

వృత్తిత్యాగవిలీనేన కించిత్ప్రసరతా బహిః
అన్తరత్యన్తసుప్తేన చేతసా తిష్ఠ విజ్వరః. 21

సదా నిర్వికల్పసమాధియొక్క యభ్యాసముచే బాధితమై నదియు, దగ్ధవస్త్రాకారమువలె, ప్రతిభాసమాత్రముచే బాహ్యమున నొకింత ప్రసరించినదియు, ఆభ్యంతరమున అత్యంతసుప్తముగ నున్నదియునగు చిత్తముతోఁగూడినవాఁడవై, సంతాపరహితుఁడవై యుండుము.

అసంకల్పకలఙ్కాయాం జ్ఞానాచ్చిత్తక్షయోదయే
శుద్ధాయాం సంవిది స్థిత్వా కురు మా కురు వానఘ. 22

పాపరహితుఁడవగు రామచంద్రా! జ్ఞానముచే చిత్తము క్షయింప, సంకల్పకళంకవర్జితుఁడవై, శుద్ధబ్రహ్మచైతన్యమున స్థితిగల్గియున్నవాఁడవై, వ్యవహరింపుము. లేక వ్యవహరింపకయుండుము.

సుషుప్తసమయా వృత్త్యా జాగ్రద్వ్యవహరన్నిజన్
గృహాణ మా కించిదపి మా వా కించిత్పరిత్యజ. 23

ఓ రామచంద్రా! నీవు మేలుకొనియున్ననను, వ్యవహరించుచున్నను, నడచుచున్నను, సుషుప్తిసమయమందలి వృత్తితోఁ గూడుకొనినవాఁడవై, ఇష్టవస్తువొకింతేని గ్రహింపకయు, అనిష్టవస్తువొకింతేని త్యజింపకయు నుండుము.

జాగ్రత్యపి సుషుప్తశ్చేజ్జాగర్షి చ సుషుప్తకే
జాగ్రత్సుషుప్తయోరైక్యాత్తదస్యసినిరామయః. 24

ఓ రామచంద్రా! జాగ్రదవస్థయందు స్థూలసూక్ష్మోపాధులు బాధితములగుటచే నీవు సుషుప్తుఁడవే యగుచో, సుషుప్తియందును అజ్ఞానరూపావరణముయొక్క అభావముచే నీవు జాగ్రతుఁడవే యగు

దువు. మఱియు, ఇట్లు జాగ్రత్సుషుప్తుల భేదకమగు అజ్ఞానమున్ను, దాని కార్యములున్ను బాధింపఁబడుటచే ఆ రెంటియొక్క యేకత్వము సిద్ధింప శేషించిన దేదియో, అట్టి నిర్వికారమైన సచ్చిన్మాత్రమే నీవు.

ఏవమాద్యన్తరహితమభ్యాసేన శనైః శనైః
పదమాసాదయాద్వన్ద్వమతీతం సర్వవస్తుతః. 25

ఈ ప్రకారము అభ్యాసముచే మెల్ల మెల్లగ ఆద్యంతరహితమై, ద్వంద్వవర్జితమై, సమస్త వస్తువులకును పరమైనట్టి ఆత్మపదమును బొందుము.

న చ ద్వైతం న చైవైక్యం జగదిత్యేవ నిశ్చయీ
పరమామేహి విశ్రాన్తిమాకాశ విశదాశయః. 26

ఓ రామచంద్రా! 'ద్వైతముగాని, ఏకత్వముగాని, జగత్తుగాని లేవను' నిట్టి నిశ్చయముతోఁ గూడుకొనియున్నవాఁడవై, ఆకాశమువలె నిర్మలమైనట్టి యంతఃకరణముగల్గి పరమవిశ్రాంతిని బొందుము.

శ్రీరామ ఉవాచ:—

యద్యేవం మునిశార్దూల తదహం ప్రత్యయాత్మకః
భవానేవేహ కిం తావద్వసిష్ఠాఖ్యః స్థితో వద. 27

శ్రీరాముఁడు:— ఓ మునీంద్రా! సమస్త వస్తువులు మిథ్యయగుచోనిఁక 'అహం' ప్రత్యయరూపుఁడనైన రాముఁడను నేనెచట? వసిష్ఠుఁడను పేరుగల్గియున్న తామెచట వచింపగోరెద! [సమస్తముమిథ్యయగుచో నిఁకప్రశ్నోత్తరాది వ్యవహారమున్ను సంభవింపఁజాలదుగదా? యనిభావము]

శ్రీ వాల్మీకి రువాచ:—

రాఘవేగదతీత్యేవం వసిష్ఠో వదతాం వరః
తూష్ణీమేవ ముహూర్తార్ధమతిష్ఠత్స్పష్టచేష్టితః. 28

శ్రీవాల్మీకి:— ఓ భరద్వాజా! శ్రీరామచంద్రుఁ డిట్లు ప్రశ్నింప, వక్తలలో శ్రేష్ఠుఁడగు శ్రీవసిష్ఠమునీంద్రుఁ డపుడొకగడియ కాలమువఱకు స్పష్టముగ మౌనమును ధరించెను.

తస్మింస్తూష్ణీం స్థితే కిం స్యాదితి సభ్యే మహాజనే
పతితే సంశయామ్భోధౌ రామః పునరువాచ హ. 29

అట్లు వసిష్ఠమునీంద్రుఁడు మౌనము ధరింప 'ఇపుడేమగునో' యనుసందేహముచే సభ్యులగు మహాజనులు సంశయసాగరమున నిమగ్నులు కాఁగా నపుడు శ్రీరామచంద్రుఁడు మరల యమ్మునీంద్రుని యిట్లడిగెను-

కిమర్థం భగవంస్తూష్ణీం భవానహమివ స్థితః
న సోఽస్తి జగతాం న్యాయః సతాం యో నోత్తరక్షమః. 30



మహాత్మా! తాము నావలెనే యేల మౌనముగ నున్నారు? విద్వాంసులగు గురుజనులు ప్రత్యుత్తరమివ్వలేని తర్కమెద్దియు లోకమున లేదు కదా!

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

న మే వక్తుమశక్తత్వాదుక్తిక్షయ ఉపస్థితః
కింతు ప్రశ్నస్య కోట్యాస్య తూష్ణీమేవానఘోత్తరమ్. 31

శ్రీవసిష్ఠుఁడు:— పాపరహితుఁడవగు రామచంద్రా! చెప్పుట కసమర్థుఁడనగుటచే నిట యుక్తియొక్క అభావ మేర్పడ లేదు. ఈప్రశ్నయొక్క పరమావధియగుటచే మౌనమే దీనికి ప్రత్యుత్తరమైయున్నది.

ద్వివిధో భవతి ప్రష్టా తత్త్వజ్ఞోఽజ్ఞోఽథవాపి చ
అజ్ఞస్యాజ్ఞతయా దేయో జ్ఞస్య తు జ్ఞతయోత్తరః. 32

అజ్ఞానియని, జ్ఞానియని ప్రశ్నకర్తలిరు తెఱఁగులుగా నుందురు. అం దజ్ఞానికి అజ్ఞానత్వము చేతను, జ్ఞానికి జ్ఞానత్వము చేతను ప్రత్యుత్తర మీయవలసి యుండును.

ఏతావన్తమభూత్కాలం భవానజ్ఞాతతత్పదః
భాజనం సవికల్పానాముత్తరాణాం మహామతే. 33

ఓ మహామతీ! ఇంతకాలమువఱకు నీవాత్మపదము నెఱిఁగి యుండలేదు. కావుననే వికల్పసహితములగు ప్రత్యుత్తరములకుఁ బాత్రుఁడవైతివి.

తత్త్వజ్ఞస్త్వధునా జాతో విశ్రాన్తః పరమే పదే
యోగ్యో న సవికల్పానాముత్తరాణామసి స్ఫుటమ్. 34

కాని యిపుడు నీవు 'తత్త్వజ్ఞుడవై' పరమపదమున (ఆత్మయందు) విశ్రాంతి నొందితివి. అందుచే వికల్పసహితములగు ప్రత్యుత్తరముల కెన్నటికిని నీవిఁక పాత్రుఁడవుగా నేరవు

యావాన్కశ్చిత్కిలోల్లేఖో వాఙ్మయో వదతాంవర
సూక్ష్మార్థః పరమార్థో వా బహురల్పతరోఽపి వా 35
ప్రతియోగివ్యవచ్ఛేదసంఖ్యాతీతాదిభిర్భ్రమైః
స చ సర్వోఽన్వితః సాధో భా ఇవ త్రిసరేణుభిః. 36

సాధువును, వక్తలలో శ్రేష్ఠుఁడవునగునో రామచంద్రా! వాక్కునకు విషయ మెద్ది గలదో అది సూక్ష్మార్థమైనను, పరమార్థమైనను, అధికమైనను, అల్పమైనను-సమస్తము (కిటికీగుండా ప్రసరించు) సూర్యకిరణప్రకాశము త్రసరేణువులచే వ్యాప్తమైయుండునట్లు, నిరూపక, వ్యావృత్తి, సంఖ్యా 'పరమార్థములు' తత్సాధనములగు ప్రమాణాదులు, అనునిట్టి కల్పనాకళంకములచే వ్యాప్తమైయున్నది.

ఉత్తరం సకలజ్ఞం చ తజ్జ్ఞో నార్హతి సున్దర
నాకలఙ్కా చ వాగస్తి త్వం చ తజ్జ్ఞతరః స్థితః. 37

ఓ సుందరుఁడా! జ్ఞాని కళంకసహితమగు ఉత్తరమునకుఁ బాత్రుఁడు కానేరఁడు మఱియు వాక్కు (వికల్పరూప) కళంకముచే ముక్తమున్ను గాదు. నీవైతే జ్ఞానులలో శ్రేష్ఠుఁడవై యిపుడు వెలయుచున్నావు.

యథాభూతం చ వక్తవ్యం జ్ఞప్త్యాన్తేవాసినో మయా
యథాభూతం విదుః కాష్ఠమానమన్తవివర్జితమ్. 38

జ్ఞానియగు శిష్యుని యెదుట యథార్థమగు సత్యవస్తువునే నేను జెప్పవలసియున్నది. అట్టి యథార్థమగు సత్యవస్తువు (ఆత్మ) పరిచ్ఛేదమను కళంకముచే రహితమైనట్టి, కాష్ఠమువంటి మౌనమే యగును.

అవిచారాత్ససంకల్పం మౌనమాహుః పరం పదమ్
తదేవ తవ తజ్జ్ఞస్య దత్తః సున్దర ఉత్తరః. 39

జ్ఞానోదయమునకుఁ బూర్వము అజ్ఞానకారణమున వాగ్వ్యవహారరూపమగు సంకల్పమయ విషయముగలదు. తత్త్వవిచారముచే సత్యమెఱుఁగబడ నీక ఆ పరమపదము వాక్కునకు అవిషయమగు మౌనమే అయియున్నది. కావున ఆ సుందరమైనట్టి మౌనరూప ప్రత్యుత్తరమును జ్ఞానివగు నీకు నేనొసంగితిని.

యన్మయో హి భవత్యజ్ఞ పురుషో వక్తి తాదృశమ్
జ్ఞేయమాత్రమయశ్చాహం వాగతీతే పదే స్థితః. 40

ప్రియుఁడా! మనుజుఁడెవ్విధమున నుండునో, అవ్విధముగనే యాతఁడు వచించును. నేనైతే జ్ఞేయమాత్రమయుఁడనై, వాక్కునకతీతమైన ఆత్మపదమున స్థితినొంది యున్నాను. (కావున మౌనమునే ప్రత్యుత్తరమున నొసఁగితిని.)

వాగతీతపదస్థో హి కథం గృహ్ణాతి వాఙ్మలమ్
అవాచ్యం వచ్మి నో తేన వాగ్ఘి సంకల్పనాఙ్కితా. 41

వాక్కునకతీతమైన ఆత్మపదమున నున్నవాఁడు వాగ్రూపమలము నెట్లుపరిగ్రహించును? కాఁబట్టి నేను అవాచ్యమును వచింపకయున్నాను. వాక్కు (నిరూపక, వ్యావృత్త్యాది) అనేక వికల్పరూప కళంకములచే యుక్తమైయున్నది గదా.

శ్రీరామ ఉవాచ:—

వాచి యే యే ప్రవర్తన్తే తానసాదృశ్య దోషకాన్
ప్రతియోగివ్యవచ్ఛేదిపూర్వకాన్వద కో భవాన్. 42

శ్రీరాముఁడు:- మహాత్మా! నిరూపక, వ్యావృత్త్యాది యేయే దోషములు వాక్కునందుఁ బ్రవర్తించుచున్నవో, వానినన్నింటిని వదలి, భాగత్యాగలక్షణోపాయముచేఁ దామెవరో వచింపుఁడు?

శ్రీవసిష్ఠ ఉవాచ:—

ఏవం స్థితే రాఘవ హే యథాభూతమిదం శృణు
కస్త్వం కోఽహం జగద్వా కిమితి తత్త్వవిదాంవర. 43



శ్రీవసిష్ఠుఁడు:- తత్త్వజ్ఞులలో శ్రేష్ఠుఁడవగు నో రామచంద్రా! అట్లడిగచో, నీ వెవరో నేనెవరో, ఈ జగత్తేమియో - దీని యథార్థమును వినుము.

అహం తావదయం తాత చిదాకాశో నిరామయః
చేత్య సంవేద్యరహితః సర్వసంకల్పనాతిగః. 44

ప్రియుఁడా! విషయవర్జితమైనదియు, సమస్తకల్పనలకుఁ బరమైనదియు, నిర్వికారమైనదియు నగు చిదాకాశమే నేను.

స్వచ్ఛం చిదాకాశమహం భవానాకాశమేవ చ
జగచ్చాకాశమఖిలం సర్వమాకాశమాత్రకమ్. 4

నేనున్ను, నీవున్నుఁ చిదాకాశరూపులమే, యీ సమస్తజగత్తున్ను చిదాకాశరూపమే; ఇట్లు సర్వము చిదాకాశమాత్రమే అయియున్నది.

శుద్ధజ్ఞాత్రేకరూపాత్మా శుద్ధజ్ఞానమయాత్మని
అన్యసంవిద్ధ్రశోన్మ్ముక్తః స్వాన్యద్వక్తుం న వేద్మ్యహమ్. 46

శుద్ధజ్ఞానమయమగు ఆత్మయందు, శుద్ధజ్ఞాతైకరూపుఁడను, అన్యవిషయజ్ఞానవిముక్తుఁడను నగు నేను నాకంటె (ప్రత్యగాత్మకంటె) వేఱుగ అణుమాత్రమైనను వచింపఁజాలను.

స్వపక్షోద్భావనపరా అహన్తాత్మైకవర్ధనమ్
మోక్షార్థమప్యుద్యమినో నయన్తి శతశాఖతామ్. 47

శిష్యుల మోక్షముకొఱకును, వారి సందేహనివారణముకొఱకును, ప్రతివాది విజయము కొఱకును, తమయొక్క అద్వైతపక్షస్థాపనమందుఁ దత్పరులగు ప్రయత్నశీలురగు జ్ఞానులు, బాధితమైనను 'అహంభావము'ను వృద్ధిపఱచుచు, దానిని అనేకశాఖాయుక్తముగఁ జేయుచున్నారు. (అంతేగాని, అజ్ఞానులవలె విమోహమొందుటకుఁ గాదు.)

జీవితోఽప్యుపశాన్తస్య వ్యవహారవతోఽపి చ
శవవద్యదవస్థానం తదాహుః పరమం పదమ్. 48

జీవించియున్నను, లేక వ్యవహారమందుఁ దత్పరమైయున్నను, ప్రశాంతుఁడగు జ్ఞానియొక్క శవమువంటి అభిమానరహితమగు స్థితి యేదిగలదో, అదియే పరమపదమని వచింపఁబడెను.

అబహిఃసాధనం శాన్తమనన్తఃసాధనం సమమ్
న సుఖం నాసుఖం నాహం నాన్యదిత్యాది తం శివమ్. 49

అట్టిపరమపదము (ఆత్మస్థితి) బాహ్యాభ్యంతరసాధనరహితమై, శాంతమై, అనంతమై, సుఖదుఃఖవర్జితమై, అహంత్వ, తదితర పదార్థశూన్యమై, కేవల శివరూపమే అయియున్నది.

ముక్తతాయా అహన్తేయమభావో భావనం క్వ చ
తయైవాన్విష్యతే నేతి జాత్యన్ధశ్చిత్రమీక్షతే. 50

'అహంత్వము' ముక్తియొక్క అభావమైయున్నది. అట్టిచో ఆ 'అహంత్వము'చే ముక్తియొక్క యనుభవమెచట? కావున, అహంభావనచే ముక్తిని వెదకువాఁడు, జన్మాంధుఁడై చిత్రమును గాంచువాఁడే యగును.

స్పన్దనేఽస్పన్దనే చైవ యత్పాషాణవదాసితమ్
అజడస్యైవ తద్విద్ధి నిర్వాణమజరం పదమ్. 51

చేష్టయందును, తదభావమందును శిలవలె నిశ్చలమైనట్టి చైతన్యముయొక్క ప్రశాంతస్థితి యేదగలదో, అద్దానినే నీవు అజరమైన నిర్వాణపదమని యెఱుఁగుము.

తచ్చ నాన్యో విజానాతి స్వయమేవానుభూయతే
లోకైషణావిరక్తేన జ్ఞేనజ్ఞత్వమివాత్మని. 52

అజ్ఞాని తనయందు ఘటాదుల స్ఫురణరూపఫలము ననుభవించునట్లు, లోకైషణారహితుఁడగు జ్ఞాని యట్టి చిద్రూప, స్వప్రకాశమయమగు ఆత్మను స్వయముగనే తనయందనుభవించుచున్నాఁడు. మఱియుదానిని తనకంటె నన్యముగ నెఱుఁగుటలేదు.

తత్రాహన్తా న చ త్వత్తా నానహన్తా నచాన్యతా
కేవలం కేవలీ భావో నిర్వాణమమలం శివమ్. 53

ఆ ఆత్మపదమున 'అహం'త్వము (నేననుభావము) గాని, 'త్వం'త్వము (నీవనిభావము) గాని, అనహంత్వముగాని అన్యత్వముగాని లేవు. కేవలము కేవలీభావమైన నిర్వాణరూపమైట్టి నిర్మలమగు శివరూపమైన ఆత్మయేగలదు.

చేతోఽర్థోన్ముఖత్వమేవాహుశ్చేతనస్యాస్య చేతనమ్
ఏష ఏవ చ సంసారో బన్ధః క్లేశాయ భూయసే. 54

విషయోన్ముఖమగుటయే చైతన్యముయొక్క విషయములందలి వ్యాప్తిరూపమగు క్రియయని చెప్పఁబడినది. అదియే సంసారము. అదియే మహత్తరక్లేశము గల్గించునట్టి బంధనమున్ను.

చేతనస్యాచేతనత్వమచేతోఽర్థోన్ముఖాత్మకమ్
మోక్షం విద్ధి పరం శాన్తం పదమవ్యయమేవ చ. 55

అట్లు చైతన్యము విషయోన్ముఖము గాకుండుటయే పరమశాంతమైన అవ్యయపదమగు మోక్షమని యెఱుఁగుము.

దిక్కాలాద్యనవచ్ఛిన్నే శాన్తే శాన్తాత్మని స్థితే
చేత్యం న సంభవత్యేవ కః కిం చేతయతే కథమ్. 56

దేశకాలాదులచే పరిచ్ఛిన్నముకానిదై, శాంతమై, నిజశాంతస్వరూపమున స్థితిగల్గియున్నదైనట్టి చైతన్యమున విషయమే సంభవింపక యుండనీక ఆ పరమార్థస్థితియందేది దేని నెట్లు ప్రకాశింపఁ జేయఁగలదు?

సంకల్పః స్వప్నదృశ్యేఽన్తః సంవిన్మాత్రాత్మతాం వినా
యథాన్యవద్భవేన్మ్యాభాపాస్తథైవాస్మిన్బహిర్గతే. 57



ఓ శ్రోతలగు, భూపతులారా! స్వప్న జగత్తునందు చైతన్యాంతర్గతమగు వాసనారూపమైన సంకల్పము, చైతన్యమాత్రముమైయున్నను ఎట్లు ఆచైతన్యాత్మత్వమును వదలి అన్యమువలె నగుచున్నదో, అట్లే జాగ్రదవస్థయందును, ఆత్మ బహిర్ముఖమైనప్పుడు స్వాత్మయందే అన్యమువలె జడజగద్రూపమువలె నగుచున్నది. కావున వాస్తవముగ ఈజగత్తు, ఆత్మకంటె భిన్నముకానిదై యున్నది.

మనోబుద్ధ్యాదయశ్చైతే సంవిన్మాత్రానురూపిణః
మనోబుద్ధ్యాదిశబ్దార్థభావితాస్తు జడాత్మకాః. 58

ఈ ప్రకారముగ మనోబుద్ధ్యాదులున్ను బహిర్ముఖత్వముచే, జడాత్మకములును, అంతర్ముఖత్వముచే చిద్రూపములును నగుచున్నవి.

సంవిన్మాత్రే సమే స్వచ్ఛే సబాహ్యాభ్యన్తరే తతే
అభిన్నే భేదబుద్ధిర్వా కిమనర్థాయ జృమ్భతే. 59

బాహ్యాభ్యంతరము లందంతటను నిర్మలమై, సమమై, అభిన్నమైనట్టి చైతన్యమాత్రమే వ్యాపించియుండ నీక, చైతన్యమున బహిర్ముఖత్వరూపమగు భేదబుద్ధి యేల గావింపఁబడుచున్నదో, అది యనర్థమునే గలిగించుచున్నది.

సంవిన్మాత్రస్య శుద్ధస్య శూన్యస్య చ కిమన్తరమ్
యచ్ఛాన్తం తద్విబుధా విదన్త్యేతి న వాగ్గతిమ్. 60

శుద్ధమైన చైతన్యమాత్రముయొక్కయు, శూన్యత్వముయొక్కయు భేదమును విజ్ఞులు తమయందుఁగను గొనుచున్నారు. * స్వానుభవైక వేద్యమగు అట్టి చిన్మాత్రరూపమైన నిత్యనిరతిశయానందము వాక్కునకు గోచరముకానిదైయున్నది. (యతో వాచో నివర్తన్తే -- ఇత్యాదిశ్రుతులే యిందులకుఁ బ్రమాణము)

సదసద్రూప ఆభాసో యథా కిమపి లక్ష్యతే
తమసీక్షితయత్నేన బ్రహ్మణీదం తథా జగత్ 61

అంధకారమందు నేత్ర ప్రణిధానరూపమగు యత్నముచే నొకింత సదసద్రూపమగు ఆభాసమేరీతి లక్షితమగుచున్నదో, ఆరీతిగనే బ్రహ్మమందును ఈ జగత్తు లక్షితమగుచున్నది.

అయమాకాశమేవాహం యది శామ్యామ్యవాసనమ్
వాసనాం తు న బధ్నాసి స్థిత ఏవాసి చిన్నభః. 62

వాసనారహితుఁడను, శాంతుఁడను నగుటచే నేను 'చిదాకాశ' రూపుఁడనే అయియున్నాను. నీవున్ను వాసనలను ధరింపకున్నచో, చిదాకాశ రూపుఁడవే యగుదువు.

ఇతి నిశ్చయవానన్తస్సజ్జోఽజ్ఞ ఇవ సంజ్ఞయా
చిద్వపుర్విద్యమానోఽపి శామ్యత్యసదివ స్వయమ్. 63

* దృశ్యమంతయు బాధితముకాఁగా, శేషించు ఆత్మస్థితి శూన్యత్వముకాదని యిట వచింపఁబడినది.

అట్లే, అన్యమనస్కుఁడున్ను 'నే నిశుద్ధ చిదాకాశమాత్రుఁడ నే' అను నిశ్చయము లోన గల్గియున్న చో, అతఁడున్ను చిద్రూపుఁడేయగును. మఱియు వ్యవహారదృష్టియందు 'అజ్ఞు'నివలె నున్నను నాతఁడు చిన్మాత్ర శరీరధారియైయే యుండును. అట్టివాని దేహాదులన్నియు విద్యమానములై యున్నప్పటికి, అసత్తుల్యములై, స్వయముగ నే శమన మొందును.

జీవానాం జ్ఞప్తిగుప్తేన జ్వలన్నజ్ఞానవాయునా
అవిద్యాగ్నిః ప్రబుద్ధానాం పునస్తేనైవ శామ్యతి. 64

'నేను అజ్ఞుఁడను, అను ప్రకారమగు నీ జీవులయొక్క సంసారరూపమగు అవిద్యాగ్ని సాక్షి చైతన్యరక్షితమగు అజ్ఞానవాయువుచే, ప్రజ్వలితమైయున్నను, మరల, ప్రబుద్ధులగునపుడు వారియొక్క 'అహం బ్రహ్మాస్మి' (నేను బ్రహ్మనైయున్నాను) యను నిట్టి ఆత్మసాక్షాత్కార చరమవృత్తిరూపముగ పరిణతమైన, ఆ అజ్ఞానవాయువు చేతనే ఆ సంసారరూపాగ్ని శమించిపోవుచున్నది.

అజడానాం యదజ్ఞానం స్థాణూనామివ శామ్యతామ్.
తన్మహాత్మోక్షమత్యుద్భమాసితం పదమక్షయమ్. 65

నిత్యనిరతిశయానందరూపులును, స్థాణువువలెఁ బ్రశాంతులును నగు ముక్తపురుషులయొక్క సాంసారికజ్ఞానరహితమై, దుఃఖశోభవర్జితమైనట్టి ఆత్మయందలి స్థితి యేది గలదో, అదియే, అక్షయమైన మోక్షపదమని చెప్పఁబడినది.

జ్ఞత్వేన జ్ఞత్వమాసాద్య మునిర్భవతి మానవః
అజ్ఞత్వాదజ్ఞతామేత్య ప్రయాతి పశువృక్షతామ్. 66

ఆత్మజ్ఞానముచే ఆత్మరూపత్వము నొంది మానవుఁడు సాక్షాత్ మునియే యగుచున్నాఁడు. ఆత్మ నెఱుఁగమి, అజ్ఞానదశనొంది పశు, వృక్షాది జన్మలను బడయుచున్నాఁడు.

అహం బ్రహ్మ జగచ్చేదమిత్యవిద్యామయో భ్రమః
అసత్యః ప్రేక్షయా ధ్వాన్తం దీపేనేవ న లభ్యతే. 67

'నేను, బ్రహ్మము, ఈజగత్తు' ఇత్యాదిరూపమగు మిథ్యయైన అవిద్యామయమగు భ్రమ, ఆత్మదర్శనమాత్రముచే, దీపముచే నంధకారమువలె నశించుచున్నది.

సమగ్రకరణగ్రామోఽప్యసంకల్పో వివేదనః
న కించిదప్యనుభవత్యన్తర్బాహ్యే చ శాన్తధీః. 68

సంకల్పరహితుఁడును, దృశ్యవేదన లేనివాఁడును, అహంకార, వాసనావర్జితుఁడును, ప్రశాంతచిత్తుఁడు నగు జీవన్ముక్తుఁడు, సమస్త ఇంద్రియసమూహమును, బాహ్యపదార్థములను దనయందు దాకినను ననుభవింపకుండును. అనఁగా వానిని మిథ్యగా నెఱుఁగును.

సుషుప్తత్వ ఇవ స్వప్నః సమాధౌ ప్రవిలీయతే
దృశ్యం సర్వం జ్ఞబోధేఽన్తః పునః స్వాత్మేవ లక్ష్యతే. 69



జ్ఞానికి సమాధియందొక్కపర్యాయము ఆత్మసాక్షాత్కారముకాఁగానే, సుషుప్తియందు స్వప్నము లయించునట్లు, సమస్తదృశ్య సమూహమున్ను ఆత్మయందు లయించిపోవును. మరల వ్యుత్థానదశయందే జగత్తు గోచరించునో, అది స్వాత్మరూపముగనే భాసించును.

నీలత్వం చ యథా వ్యోమ్ని తథా పృథ్వ్యాదితా శివే
భ్రాన్తిమాత్రాదృతే నాన్యద్యథా వ్యోమ తథా శివః. 70

ఆకాశమందు నీలత్వమువలె, బ్రహ్మమందు పృథివ్యాది పదార్థములు భ్రాంతిమాత్రములే కన్య అన్యముగా నేరవు. ఆకాశము వాస్తవముగ నీలత్వరహితమై, స్వచ్ఛమై యున్నట్లు, బ్రహ్మమున్ను దృశ్యపదార్థరహితమై, వినిర్మలమైయున్నది.

వాసనాభిరుపేతోఽపి సమస్తాభిరవాసనః
భవత్యసావసత్సర్వమిదమిత్యేవ యస్య ధీః. 71

ఈ సమస్తజగత్తున్ను 'అసత్తను' బుద్ధి యెవనికి గలదో, ఆతఁడు సమస్తవాసనలతోఁగూడియున్నను, వాసనారహితుఁడే యగును, (బాధితపదార్థవాసన వాసనగా నెంచఁబడదనుట.)

సంకల్పేష్వద్భుతం భవ్య స్వప్నమాయేన్ద్రజాలకమ్
యద్వత్సంస్మృతయస్తద్వద్దృష్టేష్వాస్థా కిమత్ర వై. 72

భవ్యరూపుఁడవగు నో రామచంద్రా! స్వప్న, సంకల్ప, ఇంద్రజాలాదులందలి సమస్త అద్భుత సృష్టియు మాయామయమై, అసత్తైనట్లే, ఈ సృష్టులన్నియుఁగూడ నసత్యములై యున్నవి. కావున ప్రత్యక్షముగా, గానుపించినను, స్వప్నాదిపదార్థములందువలె, వీనియందు వివేకుల కేమి విశ్వాసము జనించును?

న దుఃఖమస్తి న సుఖం న పుణ్యం న చ పాతకమ్
న కించిత్కస్యచిన్నష్టం కర్తృభోక్త్రసంభవాత్. 73

పదార్థములందు కర్తయొక్కయు, భోక్తయొక్కయు అసంభవమగుటచే నిఁక సుఖముగాని దుఃఖముగాని, పుణ్యముగాని, పాపముగాని లేనివైయున్నవి. మఱియు నెవనికిని నేదియు నశించుట లేదు. ఉత్పన్నమగుట లేదు,

సర్వం శూన్యం నిరాలమ్బం మమతాప్రత్యయోఽప్యయమ్
ద్విచన్ద్రస్వప్నపురవద్యస్యాసౌ సోఽపి నాస్తి నః. 74

సమస్త జగత్తున్ను, దృశ్యశూన్యమై, నిరాధారమైనట్టి ఆత్మరూపమే అయియున్నది. ఏలయనఁగా, ఏ యహంకారమునకీ మమత్వము ప్రతీతమగుచున్నదో, అదియును రెండు చంద్రులవలెను, స్వప్ననగరమువలెను, లేనిదేయైయున్నది.

కేవలో వ్యవహారస్థః కాష్ఠమౌనగతోఽథ వా
కాష్ఠపాషాణవత్తిష్ఠన్బ్రహ్మతామధిగచ్ఛతి. 75

ద్వైతవాసనారహితుఁడగు తత్త్వజ్ఞాని వ్యవహారమందున్నను, లేక, కాష్ఠశిలాదులవలె నిశ్చలముగ సమాధియందుండి కాష్ఠమౌన మవలంబించియున్నను, బ్రహ్మత్వమునే పొందును

శాన్తత్వే చిత్తత్వే నానానానాత్మనీహ శివే
అవయవినోఽవయవిత్వేత్త్విహ యుక్తిర్విద్యతే నాన్యా. 76

ఇట్లు, శాంతమై, నిర్వికారమైనట్టి కూటస్థ బ్రహ్మము జగత్కారణముగ నిశ్చయింపఁబడ, సృష్ట్యనుకూలసంకల్పాత్మకమగు చిత్తత్త్వముయొక్కయు, తత్కార్యమగు ఏకరూపముగను, అనేకరూపముగను నున్నట్టి సమస్త బ్రహ్మాండరూప ప్రపంచముయొక్కయు, తదంతర్గతములగు పృథివ్యాది అవయవీ, అవయవములయొక్కయు స్థితియందు వివర్తవాదము తప్ప మఱియొక యుక్తి (ఉపపత్తి) యేదియును లేదు. అనఁగా అజ్ఞానముచే రజ్జువు సర్పాదిరూపమున భాసించునట్లు, తత్త్వజ్ఞానము లేమి బ్రహ్మమున్ను జగద్రూపముగ భాసించుచున్నది.

అర్థాగతస్వభావస్య చ నైవ చ సంభవాదమలే
ఏతస్మిన్సర్వగతే బ్రహ్మణి నాస్తి స్వభావోక్తిః. 77

సర్వవ్యాపకమై, నిర్మలమైనట్టి యీ బ్రహ్మమున అన్యములగు పదార్థములచేఁ బొందఁబడు స్వభావము అసంభవమగుటచే, స్వభావమును గూర్చిన వచన మిట (బ్రహ్మమున) యుక్తము గానేరదు.

నచ నాస్తికోపలమ్భాత్సంవిత్తేర స్తితా చ నైవాజే
గ్రాహ్యగ్రాహకదృష్టేరసంభవాదస్తి కించిదపి. 78

ప్రకాశ్యమగు జగత్తు మిథ్యయైనట్లు ప్రకాశకమగు చైతన్యమున్ను మిథ్యయని నాస్తికుఁడు (శూన్యవాది) అనినచో నిది సరికాదు. ఏలయనఁగా, సమస్తముయొక్క అభావమును వచించు ఆ నాస్తికుని ఆత్మ విద్యమానమైయే యున్నది. కావున, గ్రాహ్యగ్రాహకదృష్టి అసంభవమని నాస్తికుఁడనినచో, తదును సారమున్న సర్వ నిషేధముల కవధిభూతమగు (వాని) యాత్మయొకింత కలదనియే యాతఁడున్ను నొప్పుకొన వలసియుండును. అదియే బ్రహ్మము.

శమమమలమహార్యమార్యజుష్టం
శివమజమక్షయమాసితం సమం యత్
తదవితథపదం తదాస్స్వ శాన్తం
పిబ లల భుఙ్క్ష్వ భవానయం హి నాస్తి. 79

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే భావనాప్రతిపాదనం నామైకోనత్రింశః సర్గః ॥ 29 ॥

ఓ రామచంద్రా! బ్రహ్మజ్ఞానులచే సేవింపఁబడునదియు, అన్యులచే నపహరింప నశక్యమైనదియు, శాంతమును, నిర్మలమును, అజమును, సమమును, అక్షయము నైనదియు, నిత్యసిద్ధమై యొప్పునదియు, నగు పరమార్థసత్యమైన శివ (ఆత్మ) పదరూపుఁడవై యుండుము. వ్యవహారదశయం దితరులవలె నీవున్ను భోజన, పాన, క్రీడాదులను సల్పుము. అట్లయినను నీవు ముక్తుఁడవే యగుదువు. ఏలయనఁగా ఈ దృశ్యబంధము నీకు లేదుకదా!

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున భావనాప్రతిపాదనమను నిరువదితొమ్మిదవ సర్గము ॥29॥

---



## త్రింశః సర్గః

[యయాహన్త్వాద్యవిద్యోత్థనానాత్వభ్రాన్తిశాన్తితః
స్యాద్బ్రహ్మణి స్థిరో ధీరః సా దృష్టిరిహ సాధ్యతే.

ఏ దృష్టిచే అహంభావనారూపమగు అవిద్యచే నుత్పన్నమగు వివిధప్రకారమగు భ్రాంతి శమించుటచే ధీరుఁడగు మనుజుఁడు బ్రహ్మమందు, స్థిరముగ వెలయఁగలఁడో, ఆ దృష్టి యిచట వర్ణింపఁబడుచున్నది]

శ్రీవసిష్ఠ ఉవాచ:—

అహన్తైవ పరా విద్యా నిర్వాణపదరోధినీ
తయైవాన్విష్యతే మూఢైస్తదిత్యున్మత్తచేష్టితమ్. 1

శ్రీవసిష్ఠుఁడు.— ఓ రామచంద్రా! అహంభావమే సమస్త కార్యములకును, అవిద్యకును మూలభూతమై, మోక్షపదమును నిరోధించునదై యున్నది. కావున, అద్దానిచే నెవరు ముక్తిని వెతకుదురో, అట్టి మూఢుల యత్నము, ఉన్మత్తుని క్రియయే యగును.

అహన్తైవాలమజ్ఞానాదజ్ఞత్వస్య నిదర్శనమ్
న హి తజ్జ్ఞస్య శాన్తస్య మమాహమితి విద్యతే. 2

అజ్ఞానముచే నుత్పన్నమగు ఈ 'అహంభావమే, అజ్ఞానత్వమునకు నిదర్శనమై యున్నది. ఏలయనగా, శాంతుఁడగు జ్ఞానికి 'అహం, మమ, (నేను, నాది) యను నీయభిమానముండదు.

అహన్తామలముత్సృజ్య నిర్వాణః ఖమివామలః
సదేహమపదేహం వా జ్ఞస్తిష్ఠతి గతజ్వరః. 3

ఈ అహంభావమను మాలిన్యమును బూర్ణముగఁ ద్యజించి, ఆకాశమువలె నిర్మలుఁడై మోక్షరూపుడై వెలయు జ్ఞాని దేహముతోఁగూడియున్నను, లేక, దేహరహితుఁడై యున్నను సదా సంతాపవర్జితుఁడైయే వెలయును.

న తథా శరదాకాశం న తథా స్తిమితోఽర్ణవః
పూర్ణేన్దుమధ్యం న తథా యథా జ్ఞః పరిరాజతే. 4

అహంభావరహితుఁడగు జ్ఞాని శోభించువిధమున శరత్కాలాకాశముగాని, శాంతసముద్రముగాని, పూర్ణచంద్రుని మధ్యభాగముగాని, శోభింపనేరవు.

చిత్రసంగరయుద్ధస్య సైన్యస్యాక్షుబ్ధతా యథా
తథైవ సమతా జ్ఞస్య వ్యవహారవతోఽపి చ. 5

చిత్రమందుఁ జిత్రింపఁబడిన యుద్ధమునందలి సైన్యమెట్లు సంక్షోభవర్జితమై యుండునో, అట్లే వ్యవహార నిమగ్నుఁడైనను జ్ఞాని సదా సమత్వముతోఁ గూడియేయుండును.

నిర్వాణైకతయా జ్ఞస్య వాసనైవ న వాసనా
రేఖాదామోపమా త్వబ్ధేరూర్మ్యాది న జలేతరత్. 6

నిర్వాణరూపమగు ఆత్మతో ఏకత్వము నొందియుండుటచేతను, దగ్ధరజ్జువవలె బాధితమగుటచేతను, తరంగాదులు సముద్రజలముకంటె అన్యముకానట్లు, జ్ఞానియొక్క వాసనయున్ను ఆత్మకంటె వేఱుగాకయున్నది. గాన నది వాసనగా నేరదు.

తత్ర తరఙ్గో జలధిర్జలమేవ యథాఖిలమ్
దృశ్యోచ్ఛూనమపి బ్రహ్మ తథా బ్రహ్మైవ నేతరత్. 7

చంచలములైన తరంగములతోఁ గూడియున్నను సముద్రమంతయు జలమే అయియున్నట్లు, దృశ్యముచే దట్టమైయున్నను, బ్రహ్మము బ్రహ్మమేగాని యన్యముగా నేరదు.

అత్ర సరఙ్గితోఽక్షుబ్ధో బహిరన్తంగతః శమీ
విద్యతే చోదితో యస్య స ముక్త ఇతి కథ్యతే. 8

తరంగములచే బాహ్యమున క్షోభాయుతముగ నున్నను, సముద్రములోనఁ బ్రశాంతముగ నుండునట్లు, బాహ్యమున క్షుబ్ధునివలెఁ దోచినను అభ్యంతరమున శాంతముగను, సదా ప్రసన్నముగను నుండువాఁడు ముక్తుఁడని చెప్పఁబడును.

అహన్త్వసర్గరూపేణ సంవిత్సంవిన్మయే పరే
స్ఫురత్యమ్భమ్బునీవాతో నానాతేయం కిమాత్మికా. 9

జలమందు, తరంగరూప జలము స్ఫురించునట్లు, చైతన్యమగు ఆత్మయందు అహంకారాది సృష్టిరూపముచేఁ చైతన్యమే స్ఫురించుచుండ నిఁక, పదార్థముల యనేకత్వమేమి! (మిథ్యయని భావము.)

ధూమస్య స్ఫురతో వ్యోమ్ని యథా గజరథాదయః
వ్యూహా ధూమాన్న తే భిన్నాస్తథా సర్గాః పరే పదే. 10

ఆకాశమున ధూమము (పొగవంటిమంచు) మేఘరూపమున స్ఫురించుచు, గజ, రథాది ఆకారములను రచించినను ఆ యాకృతులాధూమముకంటె వేఱుకానట్లు, ఈ సృష్టులున్ను పరమపదము (ఆత్మ)కంటె వేఱుకావు.

సంవిద్భ్రాన్తి విచారేణ భ్రాన్త్యలాభవిలాసినః
విజయధ్వం విషాదంమాగతా జ్ఞాసజ్ఞతా హి వః. 11

విజ్ఞులగు ఓసభ్యులారా! మీరు విషాదమునొందకుఁడు. నేను వచించినరీతి, సమస్త విషాదహేతువగు ఈ ప్రపంచము చైతన్యముయొక్క వివర్తమాత్రమే యని విచారణచే నెఱిఁగి, ఈ ప్రపంచభ్రాంతియొక్క అలాభముచే విలాసశీలురై సర్వోత్తమత్వముచే విరాజిల్లుఁడు. ఏలయనిన, నా యుపదేశముచే మీరిందఱును జ్ఞానులేయైతిరి గాన మీకు అజ్ఞత్వమిక లేదు.

అఙ్కురోఽనుభవత్యన్తర్వృక్షపత్రఫలం యథా
తథా జగదహన్త్వజ్ఞః స్వాత్మా స్వాత్మఖమప్యలమ్. 12



అంకురము తనయందు వృక్ష పత్ర ఫలాదుల ననుభవించునట్లు, అజ్ఞానియు, తనఆత్మ ఆకాశమువలె నిర్మలమును, విశాలమునైనను, అద్దానిని జగదహంకారాది రూపములుగ ననుభవించుచున్నాఁడు.

రూపాలోక మనః సత్తా జ్వాలార్చిష్వివ దణ్డతా
సత్యోఽపి చ న సన్త్యేతా భ్రాన్తేశ్చిత్రాబలా ఇవ. 13

చలించు ఆలాతము (కొఱవి) యొక్క జ్వాలయందలి దండ, చక్రాదులవలెను, కాముకుని చిత్తముచేఁ గల్పితమగు కామినివలెను, బాహ్యమందలి రూప, ప్రకాశాదుల సత్తయు, అభ్యంతరమందలి మానసాదుల సత్తయు, అధిష్ఠాన (ఆత్మ) రూపముచే సత్యములైనను, నిజరూపముచే అసత్యములైయున్నవి.

యథాసుఖం యథారమ్భం యథానాశం యథోదయమ్
యథాదేశం యథాకాలమజరాః శాన్తమాస్యతామ్. 14

కావున ఓ శ్రోతలారా! ఈ జగత్తంతయు నెట్లుత్పన్నమగుచున్నదో, ఎట్లుస్థితిగలిగియున్నదో, ఎట్లు తన కార్యముల నారంభించుచున్నదో, సుఖదుఃఖముల నెట్లనుభవింపఁజేయుచున్నదో, ఎట్లు నశించుచున్నదో, దీని దేశకాలము లెట్టివో ఈ మొదలగు విషయముల నన్నింటిని 'ఉత్పత్తి, స్థిత్యాది' ప్రకరణములందుఁ జెప్పఁబడిన యుక్తులచే విమర్శించి, మిథ్యగా నిశ్చయించి, జరామరణరహితులై, శాంతముగా నుందురుగాక!

ఇష్టానిష్టోపలమ్భేషు శాన్తో వ్యవహరన్నపి
శవవన్నాన్యతామన్తర్నిర్వాణోఽనుభవత్యలమ్. 15

ఎవఁడు ఇష్టానిష్టముల సంప్రాప్తియందు శవమువలె శాంతచిత్తుఁడై, సమముగ నుండునో అట్టివాడు (జీవన్ముక్తుఁడు) వ్యవహరించుచున్నను భిన్నత్వము నొకింతైనను దనయందనుభవింపకుండును.

అమనోవాసనాహన్తా ధత్తే యచ్చ జగచ్చిరమ్
జీవతోఽజీవతశ్చైవ చిజ్జీవః స పరం పదమ్. 16

దేహపతన పర్యంతము జగత్తును ధరించునట్టి, మనో వాసనారహితమగు జీవన్ముక్తులయొక్క 'అహంత్వమున్ను' అంతకాలమువఱకు ప్రాణధారణయొనర్చియుండు తద్భోక్తయగు జీవుఁడున్ను, రెండును పరమపద (చైతన్య) రూపములే యగును. మఱియు ఆజీవుఁడు ప్రాణధారణ యొనర్చియున్నను అట్లొనర్పకయున్నవాఁడేయగును, (చిద్రూపుఁడు గాన).

సత్తైవ జడవాహేన దుఃఖభారాయ కేవలమ్
నృణాం పాశావబద్ధానాం పోతకానామివార్ణవే. 17

సముద్రమున జలము నాధారముగఁ గొని పోవు ఓడలు భారము వహించుటకొఱకేయగునట్లు అహంకార, వాసనాది పాశములచే బంధింపఁబడిన మనుజులకు, జీవజగత్తుల జడప్రవాహరూప సత్త కేవలము దుఃఖభారము కొఱకే యగుచున్నది.

మోక్షసత్తాశ్రయతి తం నాజ్ఞానానుభవాదివ
మృతేన యత్కిల ప్రాప్యం జీవన్నాప్నోతి తత్కథమ్. 18

(యుద్ధాదులందు) మృతినొందినవానిచేఁ బొందఁబడు స్వర్గాదులు జీవించియుండువాని నాశ్రయించనట్లు, అజ్ఞానము (జడత్వము)యొక్క అనుభవమను నపరాధముచే మోక్షసత్త అజ్ఞానుల నాశ్రయింపకుండును

యద్యత్సంకల్ప్యతే తత్తత్సంకల్పాదేవ నాశభాక్
న సంభవతి యత్రైతత్తత్సత్యం పదమక్షయమ్. 19

ఏయే పదార్థము సంకల్పముచే సిద్ధించుచున్నదో, ఆయాపదార్థము సంకల్పముచేతనే నాశమున్ను బొందుచున్నది. కావున నెచట సంకల్పము సంభవింపదో, అదియే సత్యమై, నాశరహితమైనట్టి మోక్షపదమగును.

నాన్యో న చాహమస్మీతి భావనాన్నిర్భయో భవ
సత్యం యుక్తం భవత్యేతద్విషమప్యమృతం యథా. 20

ఓ రామచంద్రా! నేనుగాని, అన్యముగాని లేదను ఈ భావనచే నిర్భయుఁడవు కమ్ము. మూఢుఁడు అమృతమును విషమని తలంచి యుపేక్షించినను, విజ్ఞుఁ డద్దానిని గ్రహించుట యుక్తమైనట్లు, ఈ 'అనహంభావన' అజ్ఞాని దృష్టియందు భయావహత్వకారణమున గ్రహించుట కయుక్తమైనను, జ్ఞానిదృష్టియందు పరమార్థ సత్యముగుటచే గ్రహించుటకు యుక్తమైయే యున్నది.

జడం దేహాది చిత్తాన్తం విచార్య సకలం వపుః
లభ్యతే నాహమస్మీతి తస్మాన్నాస్మీతి సత్యతా. 21

దేహము మొదలుకొని చిత్తమువఱకుగల యీజడమైన యుపాధినంతయు విచారించి చూచిన 'నేను' అనుదానికి స్థానమెచటను లభించుటలేదు. కాఁబట్టి, ఈ జడమైన దేహాదులు నేను గానను నదియే సత్యమైనది.

శాన్తాశేషవిశేషాణామహన్తానావిచారణాత్
కేవలం ముక్తతోదేతి న తు కించిద్వినశ్యతి. 22

ఆత్మవిచారణచే నెవరియొక్క చిత్తాదులన్నియుఁ సంపూర్ణముగ శమించిపోవునో, అట్టివారికి 'అహంత్వము'ను గూడ నశింపఁజేయునట్టి కేవల ముక్తత్వ ముదయించును. (అహంకారము అవధిఁగాగల చిత్తాది సమస్తవిశేషములయొక్క శమనమే ముక్తియని భావము.) కాని, యథార్థముగ నేమియు నశించుటలేదు.

భోగత్యాగవిచారాత్మ పౌరుషాన్నాన్యదత్ర హి
ఉపయుజ్యత ఇత్యజ్ఞాః స్వాత్మైవాశు ప్రణమ్యతామ్. 23

ఈ ముక్తియొక్క ప్రాప్తియందు, భోగత్యాగము, ఆత్మవిచారము, ఇంద్రియ, మానసాదుల నిగ్రహరూపమగు పురుషప్రయత్నము—అను నీ మూఁటిని దప్ప మఱేదియు నుపయుక్తము కాదు. కావున, ఓ అజ్ఞులగు ముముక్షువులారా! ఇవ్విధమున నిశ్చయించినవారై అనాత్మ వస్తువునంతయుఁ బరిత్యజించి స్వాత్మనే శరణుబొందుఁడు!



నిర్వాసనం మననమేవముదాహరన్తి
మోక్షం వినా భవతి తన్న చ జాతు బోధాత్
సన్నోఽ జగద్భ్రమ ఇతీహ పరః ప్రబోధో
న ప్రత్యయోఽత్రయదతః సుచిరాయ బన్ధః. 24

సర్వవాసనలు క్షయింప, మనస్సుయొక్క బ్రహ్మరూపముతోటి గల స్థితియే మోక్షమని శ్రుతులున్ను, విద్వాంసులున్ను బల్కుచున్నారు. అట్టి మోక్షము తత్త్వజ్ఞానము లేక యెపుడును సంభవింపదు. 'ఆత్మ సత్యము, ఈ జగద్భ్రమ యసత్యమనునదియే మోక్షశాస్త్రమున నుత్తమజ్ఞానమై యున్నది. కాని, రాగాదుల ప్రాబల్యముచేతను, జగత్సత్యత్వమునుగూర్చిన భ్రమయొక్క దృఢత్వముచేతను నిట్టిజ్ఞానమందు జనులకు విశ్వాసము గలుగుటలేదు. కావుననే చిరకాలమువఱకు జీవులకు సంసారబంధము అను వర్తించుచునేయున్నది.

జగదహమసదిత్యవేత్య సమ్య
గ్జనధనదార శరీర నిర్వ్యపేక్షః
భవతి హి స చ చేతన స్వరూపః
పరిమితఖం ఖలు నాన్యథాస్తి ముక్తిః 25

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే పరమార్థోపన్యాసయోగో నామ త్రింశః సర్గః ॥ 30 ॥

అందుచేత, జగత్తు, అహంభావము – ఇవి అసత్తని లేవనియే బాగుగ నెఱిఁగి, గృహ, ధన, బంధు, దారాదులందును, స్వ శరీరాదులందును మమత్వమును వీడి, పరిచ్ఛిన్నుఁడగు జీవుఁడు చిదాకాశరూపమగు బ్రహ్మమేయగుచున్నాఁడు. ఇదియే జీవునిముక్తి. ఇట్టిజ్ఞానముకంటె వేఱుగ ముక్తికొఱకు మఱియే యుపాయమున్ను లేదు.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్థమున పరమార్థోపన్యాసయోగము ముప్పదవ సర్గము. ॥ 30 ॥

---

## ఏకత్రింశః సర్గః

[చిత్తాగ్రస్తమచిద్రూపమసదేవ సదేవ వా.
న కించిన్నష్టమిత్యత్ర నిర్వాణస్థితిరీర్యతే.

అసత్తైనను, సత్తైనను, అచిద్రూపము చిత్తుయొక్క అంతర్గతమే అయియున్నది. కావున వాస్తవముగ నేమియు నశించుటలేదను ఈ నిర్వాణస్థితి యిచటఁ జెప్పఁబడుచున్నది.]

శ్రీవసిష్ఠ ఉవాచ: —

సర్వాత్మని చిదాభాసే తదేవాశ్వనుభూయతే
సంవేద్యతే యదేవాన్తరసత్యం వస్త్వవస్తు వా. 1

శ్రీ వసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! స్వరూపమగు చైతన్యము సత్తుగాని, అసత్తుగాని యగు యే వస్తువును తనయందు సంకల్పించుచున్నదో, అద్దానినే శీఘ్రముగ ననుభవించుచున్నది,

తదేవాభ్యాసతః పూర్వం బాహ్యార్థానుభవాత్మనా
స్ఫురతీవ బహిః స్వైన స్వస్వాప్నేఽత్ర సిదర్శనమ్. 2

ఆ చైతన్యమే బాహ్యపదార్థముల యనుభవరూపమగు దృఢమైన యభ్యాసముచే బాహ్యమున జగదాకారముగ స్ఫురించుచున్నది. ఇట, నిజస్వప్నమే దృష్టాంతము.

చిద్రూపం సర్వమేతచ్చ చిదచ్ఛా గగనాదపి
చిచ్చినోతి చిదేవాతో నైతత్కించన కుత్రచిత్. 3

ఈ సమస్త జగత్తు చిత్తు(చైతన్యము) యొక్క కల్పితరూపమైయున్నది. చిత్తు, ఆకాశముకంటెను నిర్మలమై పఱఁగుచున్నది. కావున ఘృతము తనయందుఁ గాఠిన్యమును విస్తరింపఁజేయునట్లు చిత్తున్ను దనయందీ సమస్తమున్ను విస్తరింపఁజేయుచున్నది. అందుచే సర్వము చిత్తే యగును. చిత్తున కన్యముగ నెచటను నేమియును లేదు.

న నాశో నాస్తి నానర్థో న జన్మమరణే న ఖమ్.
న శూన్యతా న నానాస్తి సర్వం బ్రహ్మైవ నైవ చ. 4

యథార్థముగ, నాశముగాని, అనేక పదార్థములుగాని, జననమరణములుగాని, ఆకాశముగాని, శూన్యత్వముగాని, అనేకత్వముగాని లేవు. అధిష్ఠానరూపముచే సమస్తము బ్రహ్మమే యగుచు పదార్థరూపముచే నేమియుఁ గానిదై(మిథ్యయై)యున్నది.

నాశే జగదహన్త్వాదేర్న కించిదపి నశ్యతి
అసతః కిల నాశోఽపి స్వప్నాదేః కిం ను నశ్యతి. 5

అసత్తగు జగత్తు, 'అహంత్వము' మున్నగువాని నాశముచే వాస్తవముగ నేమియు నశించుటలేదు. ఏలయనఁగా, స్వప్నాదులందలి పదార్థముల నాశముచే నేమి నశించుచున్నది.

మిథ్యావభాసే సంకల్పనగరేకైవ నష్టతా
తథా జగదహన్త్వాదౌ నాశో నాసతి విద్యతే. 6

మిథ్యయై భాసించు సంకల్పనగరాదుల నాశముచే నేమి నశించుచున్నది? అట్లే, అసత్తగు జగదహంత్వాదుల నాశముచేతను నేమియు నశించుటలేదు.

కుతో జగదుపాలమ్భ ఇతి చేత్తదవస్తుని
న నిర్ణయః సంభవతి ఖపుష్పాణాం కిముచ్యతే. 7



జగత్తు అసత్తే యగుచో, దానిఁ ద్యజించుటకొఱకు నిందయు, దానిఁగూర్చిన నిర్ణయమున్ను శాస్త్రములందేల గావింపఁబడిన దనినచో నిజమే. అసత్తైనట్టి వస్తువునుగూర్చిన నిందగాని నిర్ణయముగాని సంభవింపనేరదు. ఆకాశపుష్పములయొక్క నిందగాని, నిర్ణయముగాని యెవనిచేఁ జేయఁబడుచున్నది?

నిర్ణయ ఏష ఏవాత్ర యదశేషమభావయన్
యథాస్థితం యథాచారం పాషాణ ఇవ తిష్ఠసి. 8

కాని, ఆత్మస్వరూపసిద్ధికొఱకై, అసత్తును, సత్తువలెఁ గల్పించి, శాస్త్రములు జగన్నిందాదులద్వారా వైరాగ్యవివేకాదుల మొదలు తత్త్వసాక్షాత్కారమువఱకు నుపాయమును గల్పించినవి. ఇదియే యీ సృష్టియొక్క నిర్ణయము. (సిద్ధాంతము) కావున నో రామచంద్రా! శాస్త్ర, ఆచార, సాంప్రదాయాదుల కనుకూలముగ భూమికాక్రమము నభ్యసించి, సమస్తమును మిథ్యగా నెఱిఁగుచు, శిలవలె క్షోభ, వాసనాది వర్జితుఁడవై యుండుము.

జగత్సంకల్పమాత్రాత్మ తత్ర తేఽర్థయుతం క్షణాత్
శామ్యత్యశేషేణేత్యేవ నిర్ణయః సర్గవిభ్రమే. 9

అపుడు సాంసారికపురుషార్థముయొక్క ఆభాసముతోఁగూడిన సంకల్పమాత్రమైన యీ జగత్తు క్షణకాలములో నిశ్శేషముగ నీకు శమించిపోవును. ఇదియే యీ భ్రమరూపమగు సృష్టినిగూర్చిన నిర్ణయముయొక్క ఫలమైయున్నది.

సర్గేఽసర్గ ఏవాయం బ్రహ్మాత్మకతయాక్షయః
అన్యథా తు న సర్గోఽయమస్తి నాస్తి చ సన్తివా. 10

ఈ సృష్టియొక్క మూలచ్ఛేదనము బ్రహ్మజ్ఞానముచేతనే యగుచున్నది. అపుడది మరల యుత్పన్నముగాక యుండును. అట్లుగానిచో, సుషుప్తి, ప్రళయాదులందలి క్షయమందీజగత్తు బీజరూపముగ నుండియే యుండును. కార్యరూపముచే మాత్రము యుండదు. లేక, ప్రళయమందును, ఐందవోపాఖ్యానరీతి కార్యరూపముచే ననేక బ్రహ్మాండములుండియే యుండును.

యేషాం చ విద్యతే స్వర్గః స్వప్నపుంసామివాసతామ్
స సర్గః పురుషాస్తే చ మృగతృష్ణామ్బువీచివత్. 11

స్వప్నపురుషులవలె అసద్రూపులగు ఏ మనుజుల దృష్టియందు సృష్టి విద్యమానమైయున్నదో, ఆ సృష్టియు, ఆ మనుజులున్ను మృగతృష్ణాజలముయొక్క తరంగముల వంటివారే యగుదురు.

అసతామేవ సద్భావమివ యేషాముపేయుషామ్
న వయం నిర్ణయం విద్మో వన్ధ్యాపుత్రగిరామివ. 12

అసత్పదార్థములకును సద్భావము నెవరంగీకరింతురో, వంధ్యాపుత్రుని వాక్కులయొక్క నిర్ణయమువలె అట్టివారి వాక్కుల నిర్ణయము మేమెఱుఁగజాలము. అనఁగా, జీవజగదాది పదార్థములు అనిర్వచనీయములని భావము.

పరిపూర్ణార్ణవప్రఖ్యా కాప్యపూర్వైవ పూర్ణతా
తజ్జ్ఞానాం ద్రష్టృదృశ్యాంశదృష్టౌ న హి పతన్తి తే. 13

కావుననే పరిపూర్ణసముద్రమువలె, జ్ఞానులకద్వితీయ చిదానందముయొక్క అపూర్వమైన పూర్ణత్వము సదా యుండుచుండును. ఏలయనఁగా వారు ద్రష్టృ, దృశ్యముల దృష్టియందెన్నటికిని బడరు.

అచలా ఇవ నిర్వాత దీపా ఇవ సమత్విషః
సాచారా వా నిరాచారా స్తిష్ఠన్తి స్వస్థమేవ తే. 14

పర్వతమువలె అచంచలురై, గాలిలేని స్థలమందలి దీపమువలె సమముగఁ బ్రకాశించువారై, ఆచారరహితులైనను ఆచారసహితులవలెఁ దోఁచువారై, జ్ఞానులు సదా స్వస్థచిత్తులై యుందురు.

అపూర్ణైకార్ణవప్రఖ్యా కాప్యన్తః పూర్ణతోదితా
అన్తఃశీతలతా జ్ఞప్తిజ్ఞస్యాపూర్వైవ లక్ష్యతే. 15

జ్ఞానియొక్క హృదయమున, పూర్ణసముద్రమువంటి అపూర్వమైన పూర్ణత్వముదయించుచున్నది. మఱియు, జ్ఞానరూపమగు అపూర్వమైన శీతలత్వమున్ను వానియందు గానుపించుచున్నది.

వాసనైవేహ పురుషః ప్రేక్షితా సా న విద్యతే
తాం చ న ప్రేక్షతే కశ్చిత్తతః సంసార ఆగతః. 16

అజ్ఞాని వాసనారూపుఁడేయగును. విచారణముచే గాంచినచో ఆ వాసన యుండనేరదు. కాని యెవఁడును నట్లు గాంచుటలేదు కావుననే యీ సంసారము ప్రత్యక్షమగుచున్నది.

అనాలోకనసిద్ధం యత్తదాలోకాన్న విద్యతే
కృష్ణాద్యనుపలమ్భోఽత్ర దృష్టాన్తః స్పష్టచేష్టితః. 17

ఏ వస్తువు ప్రకాశము (ఆత్మప్రకాశము) లేమి సిద్ధించునో, అయ్యది ప్రకాశముచే సిద్ధింపదు. ఇట ప్రత్యక్షదృష్టాంతము, పగటియందు అంధకార, యక్ష, చోరాదుల అభావమై యున్నది.

భూతాని దేహమాంసాది తచ్చాసద్విభ్రమో జడః
బుద్ధ్యహంకారచేతాంసి తన్మయాన్యేవ నేతరత్. 18

దేహమాంసాదిరూప స్థూలశరీరము పంచీకృతభూత సముదాయమే యగుచు, అసత్తై, భ్రమరూపమై, జడమై యొప్పుచున్నది. అట్లే బుద్ధ్యహంకారచిత్తాదిరూప సూక్ష్మశరీరమున్ను, అపంచీకృతభూతమయమై, వికారవంతమై, అసత్తై, జడమై యే యున్నదిగాని యన్యముగ లేదు.

భూతాదిమయతాం త్యక్త్వా బుద్ధ్యహంకారచేతసామ్
అత్యన్తం స్థితిరభ్యేతి యది తన్ముక్తతోదితా. 19

బుద్ధ్యహంకార చిత్తాదుల పంచభూతరూపత్వమును వదలి, అనఁగా వాని నామరూపములను మిథ్యయని నిశ్చయించి, అత్యంత స్వప్రకాశమగు చిన్మాత్రమందు స్థితిఁ బొందినచో నిఁక ముక్తి యుదయించినట్లే యగును.



చిచ్ఛిష్టా చేత్యనిష్టత్వాత్తాదృశ్యేవాత్ర కాస్తితా
తస్మాత్క్వైవ కుతః కుత్ర వాసనా కిం స్వరూపిణీ. 20

లింగ శరీరమందు, తాదాత్మ్యాధ్యాసముచే ఆత్మచైతన్యము సమ్మిళితమైనచో, అపుడు విషయోన్ముఖత్వముచే దానియొక్క వాసనయున్ను, తచ్ఛరీర సదృశమైయే యుండును. కాని ముక్తి దశయందు ఆ లింగశరీరము బాధితమగుటచే నిఁక వాసన యేది, ఎచట, ఏ ప్రకార మెట్లుండగలదు.

యస్య త్వేష భ్రమః సోఽసన్న్యేన యాసన్న లక్ష్యతే
మృగతృష్ణామ్బువత్తేన సంసారః కస్య కః కుతః. 21

ఈ సంసారభ్రమ అలీకమై (మిథ్యయై) యున్నది. ఏలయనఁగా, ఎవనికిభ్రమ గలదో, ఆతనికే తత్త్వదృష్టిచే నయ్యది మృగతృష్ణాజలములవలె అసత్తుగ గోచరమగుచున్నది. కావున నిఁక సంసారబంధ మేదియెవని కెచటగలదు.

తదేవం త్వస్తి తస్య స్యాదితి చిత్తోదయో హి యః
పునః స ఏవ సంసారవిభ్రమః సంప్రవర్తతే. 22

అట్టిఆత్మజ్ఞానమునఁ బ్రవృత్తుఁడైనను, మరల విషయస్మరణము గావించినచో, చిత్తమెయ్యది యుదయించునో, అదియే తిరిగి సంసారభ్రమను గలుగఁజేయును.

తస్మాత్సర్వమనాశ్రిత్య వ్యోమవత్సముపాస్యతామ్
అపునఃస్మరణం శ్రేయ ఇహ విస్మరణం పరమ్. 23

కావున సమస్తము త్యజించి, ఆకాశమువలె నిర్మలమైనట్టి ఆత్మ నుపాసింపవలయును. ఏలయనఁగా, మరల స్మరణము గాకుండుటకొఱకై, ఈ సంసారముయొక్క పూర్ణవిస్మరణమే హితకు విషయమున నాశ్రయింపఁ దగియున్నది.

నేహ ద్రష్టా న భోక్తాస్తి నాఽస్తితా నచ నాస్తితా
యథాస్థితమిదం శాన్తమేకం స్పన్ది సదాబ్ధివత్. 24

వాస్తవముగ నిట ద్రష్టగాని, భోక్తగాని, అస్తిత్వముగాని, నాస్తిత్వముగాని లేవు. సముద్రమువలె సదాపరిపూర్ణమై, శాంతమై, ఏకమై, ప్రారబ్ధప్రాప్త వ్యవహార నిమిత్తమైనట్టి ఆత్మమాత్రమే గలదు.

సర్వం దృశ్యం జగద్బ్రహ్మ సదిత్యవగతో స్ఫుటమ్
జలశోషాదివోదేతి బిమ్బ బిమ్బిక్షయే శివమ్. 25

జలమెండిపోవ, అంజలి ప్రతిబింబాదులు నశించి బింబరూప ముదయించునట్లు సమస్త దృశ్యజగత్తున్ను, సద్రూపమగు బ్రహ్మమే యను విషయము స్పష్టముగ నెఱుఁగుటచే, జీవునకు చిదాభాస, ఉపాధులు నశింప శివరూప ముదయించును.

శాన్తతావ్యవహారో వా రాగద్వేష వివర్జితః
విశ్రాన్తస్య పరే తత్త్వే దృశ్యతే సమదర్శినః. 26

పరతత్త్వమగు ఆత్మయందు విశ్రాంతి నొందినవాఁడును, సమదర్శియైనట్టి జ్ఞానికి సమాధి, వ్యవహారములు రెండును రాగద్వేషవర్జితములై భాసిల్లును.

అథవా శాన్తతైవాస్య నిర్వాణస్యావశిష్యతే
నిర్వాసనః కిల మునిః కథం వ్యవహరత్యసౌ. 27

లేక సప్తభూమికను బొందినట్టి జ్ఞానికిఁ గేవలము శాంతత్వమే శేషించును. ఏలయనఁగా, వాసనారహితుఁడగు ఆ ముని యెట్లు వ్యవహరింపఁగలడు?

యావత్తస్య న నిర్వాణం పరిపోషముపాగతమ్
తావద్వ్యవహరత్యస్తరాగద్వేషభయోదయః. 28

సప్తమ భూమికా పర్యంతము విశ్రాంతియొక్క దృఢత్వ మెంతవరకు సంప్రాప్తింపలేదో, అంతవఱకు జ్ఞాని రాగ, ద్వేష, రహితుఁడై, సంసారోదయవర్జితుఁడై వ్యవహారము సల్పుచుండును.

వీతరాగభయక్రోధో నిర్వాణః శాన్తమానసః
శిలేవాప్యశిలీభూతో మునిస్తిష్ఠతి నిత్యశః. 29

(సప్తమ భూమికను బొందినట్టి) మునీశ్వరుఁడు రాగ, ద్వేష, భయ, క్రోధవర్జితుఁడై, సాక్షిరూపుఁడై, శాంతమనస్కుఁడై, నిత్యము శిలవలె నిశ్చలముగనున్నను కేవలము చిద్రూపుఁడైయే వెలయుచుండును.

కోశేఽస్తి పద్మబీజస్య యథా సర్వాబ్జినీ తథా
అనన్యా స్వప్నవిభ్రాన్తిరాత్మన్యస్తి న బాహ్యతా. 30

కమల బీజముయొక్క కోశమున, కమలమంతయు అభిన్నరూపముగ నుండునట్లు స్వప్న భ్రాంతివంటి యీ జగత్తుయొక్క బాహ్యత్వమున్ను ఆత్మయందు వేఱుగ లేదు.

బాహ్యతాభావనాద్బాహ్యమాత్మైవాత్మత్వభావనాత్
భవతీదం పరే తత్త్వే భావనం తత్తదేవ హి. 31

ఆత్మయే బాహ్యత్వభావనచే బాహ్యరూపమగుచున్నది. మఱియు, ఆత్మత్వభావనచే ఆత్మరూపమేయగుచున్నది. కావున, పరతత్త్వమగు ఆత్మయందు బాహ్యత్వ, అభ్యంతరత్వములు తత్తద్భావనారూపములేయైయున్నవి.

యాన్తః స్వప్నాదివిభ్రాన్తిః సైవేయం బాహ్యతోదితా
మనాగప్యన్యతా నాత్ర ద్విభాణ్డపయసోరివ. 32

అంతఃకరణమున స్వప్నాదిరూపభ్రాంతి యేది గలదో, అదియే బాహ్యజగద్రూపమున నుదయించినది. పాత్రద్వయమున నున్న క్షీరమువలె, జాగ్రత్స్వప్నములం దొకింతైనను భేదము లేదు.

స్థైర్యాస్థైర్యే తథైవాత్ర భ్రాన్తిమాత్రమయే తతే
ఆధారాధేయుతే తే ద్వే యథా జలతరఙ్గతే. 33



జాగ్రత్తునందలి పదార్థములయొక్క స్థిరత్వము, స్వప్నమందలి పదార్థములయొక్క అస్థిరత్వమేది భాసించుచున్నదో, అదియున్ను భ్రాంతిమాత్రమేయైయున్నవి. స్వప్నమందలి శరీరాదులకు జాగ్రత్తు ఆధారము. స్వప్నమాధేయము. ఈ ఆధారాధేయత్వములు జల తరంగములవలె అభిన్నములైయున్నవి,

స్వప్నాదావాత్మనోఽన్యత్వజ్ఞానాదన్యత్వవేదనమ్
అనన్యతావబోధే తు తదనన్యత్వచోదయి. 34

మనుజునకు స్వప్నపదార్థములు తనయొక్క అజ్ఞానముచేతనే యెట్లు భాసించుచున్నవో, తన్నెఱుఁగుటచే వెంటనే జాగ్రదవస్థ సంభవించుటచే వానియొక్క నిజరూపమెట్లు శేషించుచున్నదో అట్లే శుద్ధాత్మజ్ఞానముచే జాగ్రత్పదార్థములున్ను ఆత్మరూపమగుచున్నవి.

కలనారహితం శాన్తం యద్రూపం పరమాత్మనః
భవత్యసౌ తత్తద్భావాదతద్భావాన్న తద్భవేత్. 35

కల్పనారహితమై, శాంతమైనట్టి పరమాత్మయొక్క రూపమే, ఆయా పదార్థముల భావనచే నాయారూపమగుచున్నది. అట్లాయా పదార్థముల భావింపకుండినచో నాయారూపమది పొందకయే యుండును.

స్వప్నాదిజ్ఞానసంశాన్తౌ యద్రూపం శుద్ధమైశ్వరమ్
న తదస్తి న తన్నాస్తి న వాగ్గోచరమేవ తత్ 36

స్వప్నాదుల జ్ఞానము శమింప, శుద్ధమైన యీశ్వరరూపమెయ్యది శేషించునో, అది, (దేశకాలాదుల అభావమువలన) కలదనిగాని, (స్వరూపముయొక్క అబాధవలన) లేదనిగాని, చెప్పఁజాలము. కావున నది వాక్కునకు విషయము కానిదేయగును.

అత్యన్తిక భ్రాన్తిలయే యుక్త ఏవావగచ్ఛతి
స్వరూపం నోపదేశస్య విషయో విదుషో హి తత్. 37

భ్రమయొక్క సంపూర్ణవినాశమును సమాధియందుండు యోగియే యెఱుఁగును. ఏలయనఁగా సర్వభ్రమనాశరూపమగు ఆత్మసాక్షాత్కారము ఉపదేశముయొక్క విషయము కాదు. అది విజ్ఞులయొక్క అనుభవమునకు మాత్రమే విషయమగును. అద్దానియందు శిష్యుని బుద్ధిని ప్రవృత్తమొనర్చుటయే ఉపదేశముయొక్క ఫలమైయున్నగి,

శాన్తం నిరస్త భయమాన విషాదలోభ
మోహాత్మదేహమనసేన్ద్రియచిత్తజాడ్యమ్
త్యక్త్వాహమక్షయమపాస్త సమస్త భేదం
నిర్వాణమేకమజమాసి తు మేవ యుక్తమ్. 38

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు
నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే నిర్వాణయుక్త్యుపదేశ వర్ణనం నామ
ఏకత్రింశః సర్గః ॥ 31 ॥

ఓ రామచంద్రా! కావున, అహంకారమును త్యజించి భయ, అభిమాన, విషాద, లోభ, మోహములను పారద్రోలి, దేహేంద్రియమనశ్చిత్తాదుల జడత్వము లేక, శాంతుఁడై, సమస్తభేదశూన్యమై, అక్షయమై, ఏకమై, అజమై, నిర్వాణరూపమైనట్టి బ్రహ్మమై సమాధియందుండుటయే యుక్తమైనది

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున నిర్వాణయుక్త్యుపదేశ వర్ణనమను ముప్పదియొకటవ సర్గము ॥31॥

---

## ద్వాత్రింశః సర్గః

[సాధుసంఘమసచ్ఛాస్త్ర విచారాభ్యాసశాలినః,
మోక్షోఽత్రావశ్య భావిత్వాత్స్వాయత్త ఉపపాద్యతే.

సాధుసంగము, సచ్ఛాస్త్రముల విచారణ, తదను సారము అభ్యాసము గల మనుజునకు మోక్షము తప్పక తనయధీనమే యైయుండునని యిచట వర్ణింపఁబడుచున్నది.]

శ్రీవసిష్ఠ ఉవాచ:—

యదా చితిః ప్రసరతి తదాహన్తా జగద్భ్రమః
అసదేవాభ్యుదేతీవ స్పన్దాదపి చ వాయుతా. 1

శ్రీవసిష్ఠుఁడు.- ఓ రామచంద్రా! అవిద్యావృతమగు చైతన్యమెపుడు విషయములందు వ్యాపించుచున్నదో, అపుడు, చలనముచే వాయువువలె, అసద్రూపమేయగు అహంకారాది జగద్భ్రమ ముదయించుచున్నది.

ఉదితోఽపి న ఖేదాయ బ్రహ్మరూపత్వవేదనాత్
పరమాయ త్వనర్థాయ జగచ్ఛబ్దార్థభావనాత్. 2

అట్లుదయించినప్పటికిని,బ్రహ్మరూపభావనచే ఆజగద్భ్రమ దుఃఖమును గలిగింపకయుండును. కాని జగత్తుయొక్క శబ్దార్థభావనచే నది మహానర్థమును గలుగఁజేయును.

రూపానుభవమాదత్తే చక్షుఃప్రసరణాద్యథా
చితిః ప్రసరణాత్తద్వజ్జగద్విభ్రమమాస్థితా. 3

నేత్రము ప్రసరించినమాత్రముచే రూపానుభవమును గ్రహించునట్లు, చైతన్యము ప్రసరణమాత్రముచే జగద్భ్రమరూపమున స్థితినొందియున్నది.

యాసౌ ప్రసరతి వ్యర్థం చేత్యాభావాన్న సా సతీ
అసత్కథం ప్రసరతి వన్ధ్యాపుత్రః క్వ నృత్యతి. 4

యథార్థముగ, కూటస్థచైతన్యమునకు గమనాగమనములు లేకపోవుటచేతను, పరమార్థమున విషయములయొక్క అభావముచేతను, చైతన్యముయొక్క అభావముచేతను, చైతన్యముయొక్క యీ విషయములందలి వ్యర్థమగు ప్రసరణ యేదిగలదో, అది, అసత్తేయైయున్నది. ఏలయనిన, వంధ్యాపుత్రుఁ డెచట నాట్యమాడుచున్నాఁడు!



అయం త్వనుభవాదేవ ముధైవానుభవస్థితః
అసదేవాననుభవన్స్వయమర్భకయక్షవత్. 5

ఈ చిత్తుయొక్క ప్రసరణము అనుభవముచేతనే సిద్ధించుచున్నది. కాని, ఆ యనుభవము విద్యచే బాధితమగుటచేతను, అసత్పదార్థమును గూర్చిన అనుభవముయొక్క అభావముచేతను, బాలుని యొక్క పిశాచమునుగూర్చిన యనుభవమువలె ఆ చైతన్యప్రసరణము మిథ్యయే యైయున్నది.

అహంభావోఽపి దుఃఖార్థమహమిత్యేవ వేదనాత్
అవేదనాన్నాహమతః స్వాయత్తే బన్ధముక్తయే. 6

ఈ ప్రకారముగనే లోన 'అహంభావ'ముయొక్క ప్రసరణమునుగూర్చియు నెఱుఁగవలెను. ఎట్లనిన అహంభావముయొక్క యనుభవము దుఃఖమునే గలిగించుచున్నది. అనహంభావనచే ఆ అహంభావము నశింప మోక్షసుఖము జనించుచున్నది. ఇవ్విధమున బంధమోక్షములు జీవునకుఁ దన యధీనముననే యున్నవగును.

తద్ధ్యానం స సమాధిర్వా యదవేదనమాసితమ్
అజడానాం జడమివ సమం శాన్తమనామయమ్. 7

అజడములగు మనోబుద్ధ్యాది సమస్తపదార్థములయొక్క, జడమైన శిలాదులవలె వేద్య, వేదన భావరహితమై, నిశ్చలముగను, సమముగను, శాంతముగను; నిర్వికారముగను, యేకముగను చిద్రూపమున నెలకొనియుండు స్థితియే ధ్యానమని లేక సమాధియని చెప్పఁబడును.

ద్వైతాద్వైతసముద్భేదైర్వాక్యసందర్భవిభ్రమైః
మా విశత దుఃఖాయ విబుధా అబుధా ఇవ. 8

ఓ పండితులని తలంచువారలారా! మీరు అజ్ఞానులవలె ద్వైతాద్వైతవికల్ప జాలముచేతను, వివిధ కలహరూపములగు వాగ్విభ్రమములచేతను వ్యర్థముగ కంఠశోషణము గావించుకొనకుఁడు. శుద్ధ చిద్రూపముననే స్థితినొందియుండుఁడు.

అసదాశ్రయతే దుఃఖం స్వప్నవద్ఘనవాసనః
రూపాలోకమనస్కారాన్సంకల్పరచితానివ. 9

ఘనీభూతములగు వాసనలతో గూడియుండు జీవుఁడు సంకల్పరచితములును, స్వప్నతుల్యములును, అసద్రూపములు నగు బాహ్యాభ్యంతర విషయముల నాశ్రయించి దుఃఖమనుభవించుచున్నాఁడు.

దుఃఖం సదేవ నాశ్నాతి సుప్తవత్తనువాసనః
రూపాలోకమనస్కారాన్సంకల్పరహితానివ. 10

సూక్ష్మవాసనాయుక్తుఁడగువాఁడు, సంకల్పరహితుఁడై, బాహ్యాభ్యంతర విషయములను మిథ్యగా నెఱిఁగి, ప్రారబ్ధకర్మచే దుఃఖము విద్యమానమైయున్నను, నిద్రించు మనుజుఁడు దోమమొదలగువాని కాటును గుర్తించనట్లు, అద్దాని ననుభవించకయే యుండును.

అత్యన్తతనుతామేత్య వాసనైవైతి ముక్తతామ్
దేశకాలక్రియాయోగాత్ప్రబుద్ధార్థభావనామివ 11

పదార్థమును భావన, పొందునట్లు దేశ, కాల, క్రియా యోగముచే అతిసూక్ష్మమగు వాసన ముక్తత్వదశను బొందును.

అత్యన్తతనుతాం యాతా వాసనైవైతి ముక్తతామ్
పరాణు పరిణామేన ఖతాం ఖేఽభ్రాదికా యథా. 12

ఆకాశమున మేఘ, ధూమాదుల అతిసూక్ష్మములగు పరమాణువులు ఆకాశరూపత్వమును బొందునట్లు, అత్యంత సూక్ష్మమైనచో వాసనయే ముక్తిరూపత్వమును బొందును.

అహం భావనయా బోధే వాసనా ఘనతానవా
విపశ్చిత్సంగమాభ్యాసాత్పాణ్డిత్యమివ మూఢతా. 13

పండితుల యొక్క సాంగత్య మభ్యసించు చుండఁగా, క్రమముగ మూఢత్వము పాండిత్యరూపమగునట్లు, బ్రహ్మమందలి అహంభావనయొక్క యభ్యాసముచే వాసన సూక్ష్మత్వమును వచ్చి క్రమముగ ముక్తిరూపమగును.

నాహమస్తీహ మద్వ్యాక్యా నిశ్చయోఽన్తః శమాత్మకః
జీవతో జీవతశ్చాస్తి రూఢబోధ ఇతి స్మృతః. 14

నేను వచించిన యుక్తినిబట్టి, ఎవఁడు ఇహలోకమునగాని, పరలోకమునగాని, నేను, శుద్ధబ్రహ్మరూపుఁడనను నీయభ్యాసయోగముచే దాను 'అహం' శబ్దార్థరూపుఁడగు జీవుఁడు గాఁడను నిశ్చయ మెపుడు గలిగియుండునో, అపుడట్టి శాంతస్వరూపుఁడగు మనుజుఁడు దృఢబోధకలవాఁడని చెప్పఁబడును.

వాయౌ స్పన్దవదిమాత్రేదం జగదాది చ భాసతే
కోఽహం కథమిదం చేతి విచారేణైవ శామ్యతి. 15

వాయువందు, చలనమువలె ఈజగజ్జీవాదులేవి భాసించుచున్నవో? అవి 'నే నెవఁడను, ఈ జగత్తెట్టిది, అను నీప్రకారమగు విచారణచేతనే శమించుచున్నవి.

నాహమిత్యేవ నిర్వాణం కిమేతావతి మూఢతా
సత్సఙ్గమవిచారాభ్యామేతదాశ్వవగమ్యతే. 16

'నేను దేహేంద్రియ మనోబుద్ధ్యాదిరూపుఁడను గాను, నిర్వాణరూపమగు ఆత్మనే అని యింతమాత్ర మెఱుఁగుటయందు మూఢత్వమేమి? ఏలయనిన, సత్సాంగత్య, శాస్త్రవిచారముల చే నిట్టి జ్ఞానము శీఘ్రముగనే గలుగుచున్నది.

క్షీయతే తత్త్వవిత్సఙ్గాదహమిత్యేవ బన్ధనమ్
ఆలోకేనేవ తిమిరం దివసేనేవ యామినీ. 17

ప్రకాశముచే అంధకారమున్ను, లేక, పగటిచే రాత్రియున్ను నశించునట్లు, తత్త్వజ్ఞానియగు మహాత్ముని సాంగత్యముచే అహంభావమను బంధనము క్షయించిపోవుచున్నది.

కోఽహం కథమిదం దృశ్యం కో జీవః కిం చ జీవనమ్
ఇతి తత్త్వజ్ఞసంయోగాద్యావజ్జీవం విచారయేత్. 18



'నే నెవరు? ఈదృశ్య మెట్టిది? జీవుఁడెవఁడు? ఆతని ప్రాణాదుల ధారణయేమి? అను నీరీతిగ! తత్త్వజ్ఞానియొక్క సాంగత్యముచే జీవిత(మోక్ష)పర్యంతము విచారణచేయు చుండవలయును.

జీవితం భువనం భాతి తతోఽహమితి నశ్యతి
తత్త్వమేకేన తజ్జ్ఞార్కసేవనాత్సనిషేవ్యతామ్. 19

తత్త్వజ్ఞుఁడగు మహాత్ముని సేవనముచే, ప్రథమమున ఈజగత్తు జ్ఞానముచే సుజీవితమైనట్లు భాసిల్లును. పిమ్మట, అహంభావమను అంధకారము నశించును. అనంతర మొకక్షణములో ఆత్మవస్తువు ప్రకాశించును. కావున ముముక్షువగువాఁడు తత్త్వజ్ఞానియను సూర్యుని దప్పక సేవించవలయును.

యో యో బోధాతిశయవాంస్తం తం పృథగుపాస్స్వ భోః
సంగమే కథయోదేతి తేషాం వాదపిశాచికా. 20

ఓ రామచంద్రా! తత్త్వజ్ఞానులెవరెవరు గలరో వారిని వేఱుపఱచి సేవింపుము. ఏలయనగా, నైయాయికాదుల సాంగత్యమున పరస్పర విరుద్ధవచనములచే వాదమను పిశాచ ముదయించును.

వాదయత్యేష్యభ్యుదితే బాలస్యేవ విపశ్చితః
యుక్తియుక్తములం ముఖ్యముదేత్యహమితి భ్రమః. 21

అట్టివాదమను పిశాచ ముదయించఁగనే శ్రుతివిరుద్ధమైనను తర్కయుక్తిచే యుక్తముగ ప్రతిపాదింపఁబడు 'అహం'రూప ప్రత్యక్ - తత్త్వమే (జీవత్వమే) ముఖ్యమైనదనియు, అదియే తనకుఁ బోలుననియు, తోపింపఁజేసి (అంధగోలాంగూలన్యాయముగ) అనర్థమును గలుగఁజేయు భ్రమ, బాలునకువలె! పండితునకును నుదయించును.

అతః ప్రత్యేకమేకాన్తే ప్రాజ్ఞః సేవేత పణ్డితమ్
ఏకీకృత్య తదుక్తాంస్తానర్థాన్బుద్ధ్యా విచారయేత్. 22

కాఁబట్టి, బుద్ధిమంతుఁడగువాఁడు ఒక్కొక్క తత్త్వజ్ఞానియగు పండితుని సేవచేఁ బ్రసన్నునిగఁజేసి ఏకాంతమున వారినిఁ బ్రశ్నించి, వారుపదేశించు అర్థముల నన్నింటిని క్రోడీకరించి స్వబుద్ధిచే విచారింపవలయును.

విచారయేత్తదుక్త్యర్థం బుద్ధ్యా బుద్ధివివృద్ధయే
సర్వసంకల్పముక్తం యత్తత్సత్తన్మయతాం వ్రజేత్. 23

బుద్ధియొక్క శుద్ధికొఱకును వృద్ధికొఱకును వారు వచించు అర్థములను శ్రుతి, యుక్తి, స్వానుభవములద్వారా, మఱియు నితరవిద్వజ్జనులతోటి సంవాదముద్వారా, స్వబుద్ధిచే బాగుగ విచారించి సర్వసందేహ నివృత్తి గావించుకొని యాపిమ్మట నిదిధ్యాసనముద్వారా సర్వసంకల్పరహితమగు సద్రూపమైన బ్రహ్మమందు తన్మయత్వమును బొందవలయును.

విపశ్చిత్సంగమైర్బుద్ధిం నీత్వా పరమతీక్ష్ణతామ్
అజ్ఞానలతికా సైకా కణశః క్రియతామలమ్. 24

బుద్ధిమంతుఁడగువాఁడు తత్త్వజ్ఞుల సాంగత్యముచే బుద్ధిని మిగులతీక్ష్ణముగఁజేసి, అజ్ఞానమను లతను ముక్కలుముక్కలుగా ఖండించి వేయవలెను.

ఏషోఽర్థః సంభవత్యేవ తేనేదం కథయామ్యహమ్
స్వానుభూతం వయం బాలా నాసమఞ్జసవాదినః. 25

తత్త్వజ్ఞుల సాంగత్యముచే జ్ఞానప్రాప్తియను ఈ ప్రయోజనము సంభవించును. కావుననే స్వానుభూతమగు ఈ విషయమును నేను వచించుచున్నాను. మేము అసమంజసమైన వాక్యములఁ బల్కు బాలురము కాదు.

వ్యోమ్నోఽమ్బువాహాదివిజృమ్భయేవ
తరఙ్గభఙ్గ్యేవ మహాజలస్య
న యుజ్యతే నాపి చ నశ్యతీహ
నాశోదయౌ నిర్మననస్య కించిత్ 26

మేఘము, మంచు, ఎండ మొదలగునవి విజృంభించుటచే నాకాశమునకును, తరంగాదులు విజృంభించుటచే సముద్రమునకును, నొకింత యనిష్టప్రాప్తిగాని, ఇష్టనాశముగాని, కలుగనట్లు, సంకల్పరహితుఁడగు యోగికిని, జగద్వ్యవహారములచే అనిష్టప్రాప్తిగాని, ఇష్టనాశముగాని, యొకించుకైనను గలుగకుండును.

ఇదం హి సర్వం మృగతృష్ణికామ్బువ
న్నిరామయే బ్రహ్మణి శాన్త ఆతతే
విచారితే నాహమితీహ విద్యతే
కుతః క్వ కస్మాన్మననాదివిభ్రమః. 27

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు
నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే సత్యావబోధనోపదేశో నామ
ద్వాత్రింశః సర్గః ॥ 32 ॥

ఓ రామచంద్రా! నిర్వికారమై, పరిపూర్ణమై, శాంతమై, సర్వవ్యాపకమైనట్టి బ్రహ్మముయొక్క జ్ఞానముచే జీవుఁడు బుద్ధుఁడు కాఁగా, మృగతృష్ణాజలమువలె ఈ సమస్త జగజ్జీవాదులు, ఆత్మ (బ్రహ్మ) రూపుఁడగు తనకంటె వేఱుగ భాసింపకయుండ నీకు నట్టి తత్త్వజ్ఞానికి మననాదుల విభ్రమ మెట్లు, ఎచట నెందుల కుండఁగలదు?

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణ ప్రకరణమున నుత్తరార్ధమున
సత్యావబోధనోపదేశమను ముప్పదిరెండవ సర్గము ॥ 32 ॥

---

### త్రయస్త్రింశః సర్గః

[ఇహోపవర్ణ్యతే భ్రాన్తికల్పనా ప్రతికల్పనా
పరలోకచికిత్సా చ సంవిత్ప్రసరవారణాత్.

(భ్రాంతియొక్క కల్పన, దానికి ప్రతికల్పన; చైతన్య ప్రసరణముయొక్క నిరోధముచే పరలోకమను వ్యాధియొక్క చికిత్స యిచట వర్ణింపబడుచున్నవి.]



శ్రీవసిష్ఠ ఉవాచ:—

స్వపౌరుషేణ స్వధియా సత్సంగమవికాసయా
యది నానీయతే జ్ఞత్వం తదుపాయోఽస్తి నేతరః. 1

శ్రీవసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! అధికారయోగ్యమగు శరీరమును బొందియు, మనుజుఁడు పురుషప్రయత్నముచేతను, సత్సాంగత్యముద్వారా వికసించినట్టి స్వబుద్ధిచేతను, ఆత్మజ్ఞానమును బొందనిచో నిఁక (దానిఁ బొందుటకు) మఱియొక యుపాయ మెద్దియు నాతనికి లేదు.

స్వం కల్పితం కల్పితం చ ప్రతికల్పనయా స్వయా
తదేవాన్యత్వమాదత్తే విషత్వమమృతం యథా. 2

వైద్యశాస్త్రోక్తమగు ప్రతికల్పనచే విషము మరణహేతుత్వమును వదలి, అమృతరూపత్వముఁ జెందునట్లు, తనయొక్క అధ్యాత్మశాస్త్రీయ ప్రతికల్పనచే, అశాస్త్రీయములును, కల్పితములునగు సమస్త వాసనా, అవిద్యాజగదాదులు బంధన హేతుత్వమును త్యజించి మోక్షహేతుత్వమును ధరించుచున్నవి.

కల్పనా చాకల్పనాన్తా ముక్తతా యదకల్పనమ్
ఏతచ్చ భోగసంత్యాగపూర్వం సిద్ధ్యతి నాన్యథా. 3

కల్పన లన్నియుఁ బూర్ణముగ నశించువఱకును ప్రతికల్పన యొనర్చుచునే యుండవలెను. ఏలయనిన, సర్వ కల్పనారహితస్థితియే ముక్తియగును. అట్టి స్థితి భోగత్యాగమునకుఁ బూర్వ మెన్నటికిని గలుగనేరదు.

వచసా మనసా చాన్తః శబ్దార్థావవిభావయన్
య ఆస్తే వర్ధతే తస్య కల్పనోపశమః శనైః. 4

శ్రవణ మననములచే ఆత్మతత్త్వమును నిశ్చయించి వాక్కుచేతను, మనస్సుచేతను లోన పదార్థములను భావింపకుండుటయను ప్రతికల్పన నభ్యసించు వానికి, అట్టి వాఙ్మనంబుల నిరోధముచేఁ గల్పనయొక్క శమనము మెల్ల మెల్లగ వృద్ధినొందును.

వర్జయిత్వాహమిత్యేవ నావిద్యాస్తీతరాత్మికా
శాన్తే త్వభావనాదస్మిన్నాన్యో మోక్షోఽస్తి కశ్చన. 5

తదుపరి (అనహంభావనయను ప్రతికల్పనద్వారా) అహంభావమును వర్జింపవలయును. ఏలయనిన, అహంభావముకంటె వేఱగు అవిద్య లేదు. ఇట్లు, అహంకారము బాధితము కాఁగా, సర్వభావనారాహిత్యముచే తత్త్వసాక్షాత్కారము నయించుటఁబట్టి, అదియే మోక్షస్థితియగును. అంతకంటె వేఱుగ మోక్ష మెద్దియును లేదు.

అహంభావమథో దేహం కించిచ్ఛ్రియసి నశ్యసి
జగదాదిరుచిస్తస్మిం స్త్యక్తే శామ్యసి సిధ్యసి. 6

తత్త్వ సాక్షాత్కారానంతరమున్ను పూర్వకాలిక జగజ్జీవాది భావములందుఁ బ్రీతియుక్తుఁడవై, స్థూలదేహపర్యంతము మొకింత అహంభావము నాశ్రయించినచో నశింపదువు. (సంసారదుఃఖమున శపింతువు) అట్టి అహంభావమును త్యజించుటయను ప్రతికల్పన యొనర్చినచో శాంతిఁగొంది, నిరతిశయానందస్వరూప సిద్ధిని బడయఁగలవు.

అచేతనాదిదం సర్వం సదేవాసదివస్థితమ్
శాన్తం యస్యోపలస్యేవ నమస్తస్మై మహాత్మనే. 7

బహిర్ముఖవృత్తిచే గాంచకుండుట యను ప్రతికల్పననే గావని కీసమస్తజగత్తున్ను, ఉన్నదైనను అసత్తుగను, శిలవలెఁ బ్రశాంతముగ నున్నట్లును దోచునో, అట్టి మహాత్మునకు నమస్కారము.

అచేతనాదిదం సర్వముపలస్యేవ శామ్యతి
శూన్యాఖ్యాతః పరా లీనచిత్తస్య చిత్త్వభావనాత్. 8

పరబ్రహ్మమున లీనమైనట్టి చిత్తముగలవాఁడును, దృశ్యశూన్యుఁడునగు వానికి చిత్తముయొక్క బహిర్ముఖత్వము లేనందువలనను, ఆభ్యంతరమునఁ జైతన్యభావనతోఁ గూడియుండుటచేతను ఈ జీవజగదాది సమస్త ప్రపంచమున్ను శిలవలెఁ బ్రశాంతమగుచున్నది.

ఇదమస్త్వథవా మాస్తు చేతితం దుఃఖవృద్ధయే
అచేతితం సుఖాయ స్తరచేతనమచేతనాత్. 9

'ఇది నాకుండుగాక, ఇది నాకు లేకుండుగాక' అను ఈ కల్పన దుఃఖమును వృద్ధిజేయును. బ్రహ్మాకారభావనచే చిత్తముయొక్క నిరోధ (దృశ్యాదర్శన) రూపమగు ఆభ్యంతర ప్రతికల్పన సుఖమునే కలుగఁజేయును.

ద్వౌ వ్యాధీ దేహినో ఘోరవయం లోకస్తథా పరః
యాభ్యాం ఘోరాణి దుఃఖాని భుఙ్క్తే సర్వైర్విషాపీడితః. 10

జీవునకిహలోక, పరలోకములను రెండు మహాఘోరవ్యాధులు గలవు. వానివలన ఆధ్యాత్మికాది సమస్తపాపములచేఁ బీడితుఁడై యాతఁడు మహాదుఃఖముల ననుభవించుచున్నాఁడు.

ఇహలోకే యతన్తే జ్ఞా వ్యాధౌ భోగైర్దురౌషధైః
ఆజీవితం యథాశక్తి చికిత్సా నాపరామయే. 11

అజ్ఞులగువారు, ఇహలోకమునకుఁ జెందిన, ఆకలి, దప్పిక మున్నగువ్యాధుల శమనమునకై అన్నపానాది దుష్టౌషధములచే ఆ జీవితము యథాశక్తి ప్రయత్నించుచున్నారు. గాని, జనన మరణ నరకాదిరూపమగు పరలోకవ్యాధి నివారణకై యత్నించుటలేదు. ఏలయనిన, భోగాదులు వాని యౌషధములు కానేరవు.

పరలోకమహావ్యాధౌ ప్రయతన్తే చికిత్సనమ్
శమసత్సఙ్గబోధాఖ్యైరమృతైః పురుషోత్తమాః. 12

ఉత్తమ పురుషులు శమము, సత్సంగత్వము, జ్ఞానమను అమృతతుల్యములగు ఔషధములచే పరలోకరూపమగు మహావ్యాధియొక్క చికిత్సకై ప్రయత్నించుచున్నారు.



పరలోక చికిత్సాయాం సావధానా భవన్తి యే
మోక్షమార్గమహేచ్ఛాయాం శమశక్త్యా జయన్తి తే. 13

అపథ్యములగు భోగములను త్యజించుటద్వారా, మఱియు సత్సంగాది ఔషధ సేవనము ద్వారా పరలోకమను వ్యాధియొక్క చికిత్సయందెవరు సావధానులై యుందురో, అట్టివారు శమమను ఔషధముయొక్క శక్తిచే మోక్షమార్గమును గూర్చిన మహాభిలాషయందు విజయము గాంచుదురు.

ఇహైవ నరకావ్యాధేశ్చికిత్సాం న కరోతి యః
గత్వా నిరౌషధం స్థానం సరుజః కిం కరిష్యతి. 14

ఈ మనుష్యజన్మయందున్నప్పుడే నరకమను పరలోకవ్యాధికి చికిత్స యెవఁడు గావించుకొనఁడో, అట్టివాఁడు సత్సంగ శాస్త్రాద్యౌషధములులేని నరక స్థావరాదిస్థానములకు రోగసహితుఁడై జని, యేమి చేయఁగలఁడు?

ఇహలోకచికిత్సాభిర్జీవితం యాతు మా క్షయమ్
ఆత్మజ్ఞానౌషధై రజ్ఞాః పరలోకశ్చికిత్స్యతామ్. 15

ఓ అజ్ఞానులారా! ఇహలోకమునకుఁ జెందిన ఆకలి, దప్పిక మున్నగు వ్యాధులయొక్క భోగాదిరూప చికిత్సలందు మీ జీవితమును నశింపఁజేయకుఁడు. ఆత్మజ్ఞానమను ఔషధములచే పరలోకవ్యాధికి, చికిత్సయొనర్చుకొనుఁడు!.

ఆయుర్వాయుచలత్పత్రలవామ్బుకణభఙ్గురమ్
పరలోకమహావ్యాధిర్యత్నేనాశు చికిత్స్యతామ్. 16

వాయువుచేఁ జలింపఁబడు పత్రముపైనున్న యల్పజలబిందువువలె ఆయువు మిగుల క్షణభంగురమైనది. కావున సత్సంగాది యత్నములచే పరలోకమను మహావ్యాధికి వెంటనే చికిత్స గావించుకొనవలయును.

పరలోకమహావ్యాధౌ యత్నేనాశు చికిత్సితే
ఇహలోకమయో వ్యాధిః స్వయమాశూపశామ్యతి. 17

యత్నముచే పరలోకమను మహావ్యాధికి శీఘ్రముగ చికిత్స గావింపఁబడినచో, ఇహలోకమునకుఁ జెందిన వ్యాధి తనంతట నదియే శీఘ్రముగ శమించిపోవును.

సంవిన్మాత్రం విదుర్జన్తుం తస్య ప్రసరణా జగత్
పరమాణావరేఽప్యస్తి తచ్ఛైలశతవిస్తరమ్. 18

జీవుఁడు చైతన్యమాత్రుఁడనియే చెప్పబడెను. అతని ప్రసారమే జగత్తు. ఆ చైతన్యము పరమాణువునందును వ్యాపించియుండుటచే అనేక పర్వతాదుల విస్తారముతోఁగూడిన జగత్తు పరమాణువునందును గలదు.

యత్సంవిదః ప్రసరణం రూపాలోకమనాంసి తత్
వ్యోమన్యేవానుభూయన్తే నాతః సత్యో జగద్భ్రమః. 19

చైతన్యముయొక్క ప్రసరణము (బహిర్ముఖత్వముచే వివర్తనము) యేదిగలదో, అదియే బాహ్యపదార్థ రూపముననను, కామసంకల్పాది అభ్యంతర మానసిక పదార్థరూపముననను, చిదాకాశమున యనుభూతమగుచున్నది. కావున, జగద్భ్రమ సత్యమైనదికాదు.

ప్రలయేష్వపి దృష్టేషు జగద్దృశ్యాక్ష్యవిభ్రమః
న నశ్యతి న జాయేత భ్రాన్తిమాత్రైకరూపిణః. 20

కేవలము భ్రాంతిమాత్రస్వరూపము గలదగుటచే (మిథ్యయగుటచే) ఈ దృశ్యజగత్తను విభ్రమము అనేకప్రళయములచేతను నశించుటలేదు. అనేక సృష్టులచేతను జనించుటలేదు.

భోగపఙ్కార్ణవే మగ్న ఆత్మా నోత్తార్యతే యది
స్వపౌరుషచమత్కృత్యా తదుపాయోఽస్తి నేతరః. 21

భోగమను పంక సముద్రమున మునింగియున్న తన ఆత్మ నెవఁడు స్వకీయ పురుషప్రయత్నముయొక్క చమత్కారముచే నుద్ధరింపఁడో, అట్టివానికిఁదన యాత్మోద్ధరణమున మఱియొక యుపాయ మెద్దియును లేదు.

అజితాత్మా జనో మూఢో రూఢో భోగైకకర్దమే
ఆపదాం పాత్రతామేతి పయసామివ సాగరః. 22

సముద్ర మనేకనదీ జలంబులకుఁ బాత్రమగునట్లు, ఇంద్రియ జయములేనివాఁడును, కేవలము భోగమను పంకమున నిమగ్నుఁడైనవాఁడు నగు మూఢుఁడనేక ఆపదలకుఁబాత్రుఁడగును.

జీవితస్య యథా బాల్యం దృష్టం ప్రాథమకల్పితమ్
నిర్వాణస్య తథా భోగసంత్యాగో రాగశాన్తిదః. 23

ఆయువుయొక్క మొదటి నియమము బాల్యావస్థయైనట్లు, రాగాదుల శమనమును గలుగఁజేయునట్టి భోగత్యాగము నిర్వాణముయొక్క ప్రథమ నియమమై యున్నది

తజ్జ్ఞస్య జీవితనదీ సకల్లోలాప్యసంభ్రమా
సమం వహతి సౌమ్యైవ చిత్రస్థేవ నీరసా. 24

జ్ఞానియొక్క జీవితమను నది సుఖదుఃఖాదులను తరంగములతోఁ గూడుకొనియున్నను, చిత్రమందు లిఖింపఁబడిన రసహీనమగునదివలె సంభ్రమము లేకయు, సౌమ్యముగను బ్రవహించును

అజ్ఞజీవితనద్యాస్తు రసనాత్యన్తభీషణాః
ఆవర్తావృత్తివిక్షోభకల్లోలాః సహవాహినః. 25

అజ్ఞానులయొక్క జీవితమను నదులు ధ్వనిచే మిగుల భయంకరములై, కామాది వృత్తులను ఆవర్తములచే విక్షోభమయములైనట్టి తరంగములతోఁగూడి ప్రవహించును.

సర్గవర్గాః ప్రవల్గన్తి సంవిత్ప్రసరలేశకాః
ద్విచన్ద్రబాలవేతాలమృగామ్బుస్వప్నమోహవత్. 26



అవిచారముచే అజ్ఞానికి చైతన్యముయొక్క లేశమాత్ర ప్రసరణరూపములగు సృష్టిసమూహములు, రెండు చంద్రులఁగూర్చిన భ్రమవలెను, బాలుని బేతాళమువలెను, ఎండమావుల జలమువలెను, స్వప్నవిమోహమువలెను భ్రమచే ప్రసరించుచున్నవి.

సంవిద్వారితరఙ్గౌఘా భ్రాన్తిసర్గాః సహస్రశః
విచారితాస్త్వసత్యాస్తే సత్యాస్త్వనుభవభ్రమాత్. 27

చైతన్య సముద్రముయొక్క తరంగ సమూహములగు అనేక సృష్టులెవ్వి భాసించుచున్నవో, అవి (తత్త్వ) విచారముచే అసత్యములును, భ్రమానుభవముచే సత్యములును నగును.

జగన్త్యాకాశకోశేఽపి సంవిత్ప్రసరణభ్రమాత్
సన్తీవాప్యనుభూయన్తే న తు సత్యాని తాని తు. 28

ఈ ప్రసిద్ధమగు భూతాకాశమందును, చైతన్య ప్రసరణముయొక్క భ్రమచే గంధర్వనగరాది జగత్తులు సత్యమైనవివలె ననుభూతమగుచున్నను, యథార్థముగ సత్యమైనవి కావుగదా!

సంవిద్వికాసపయసో బుద్బుదః సర్గవిభ్రమః
అహమిత్యాదిసద్భావవికారాకారరూపవాన్. 29

అహంభావాది పదార్థముల వికారములచే రూపవంతమైనట్టి యీసృష్టియొక్క భ్రమ, చైతన్యప్రసరణమను జలముయొక్క బుద్బుదమైయున్నది.

సంవిన్నిర్వాణమజగత్సంవిదున్మీలనం జగత్
నాన్తర్న బాహ్యం నాసత్యం న సత్యం సర్వమేవ తత్. 30

చైతన్యముయొక్క యంతర్ముఖమగుటయే సమస్త జగత్తుయొక్క నివృత్తిరూపమగు నిర్వాణము. చైతన్యముయొక్క బహిర్ముఖమగుటయే (ప్రసారమే) యీ జగత్తు, యథార్థముగ, చైతన్యము ఆభ్యంతరముకాదు. బాహ్యముకాదు, అసత్యముకాదు, సత్యముకాదు, (అధిష్ఠానదృష్టిచే సమస్తమదియే యైయున్నది.

చిద్రూపమజమవ్యక్తమేకమవ్యయమీశ్వరః
స్వత్వభావత్వరహితం బ్రహ్మ శాన్తాత్మ ఖాదపి. 31

బ్రహ్మము చిద్రూపమై, అజమై, అవ్యక్తమై, అద్వితీయమై, నాశరహితమై, ఈశ్వరస్వరూపమై (సర్వశక్తివంతమై), మనోబుద్ధ్యాదిరహితమై, శాంతమై, ఆకాశముకంటెను నిర్మలమై యున్నది.

బ్రహ్మణో నిఃస్వభావస్య సర్గసంవేదనే స్వతః
స్పన్దనే పవనస్యేవ కారణం నోపయుజ్యతే. 32

స్వభావరహితమగు బ్రహ్మముయొక్క స్వయముగ సృష్టిరూపమున స్ఫురించుటయందు, వాయువుయొక్క చలనమునందువలె కారణ మెద్దియును లేదు.

స్వప్నానుభవవద్భ్రాన్తిర్బ్రహ్మాబ్ధౌ బ్రహ్మవీచయః
సర్గతా వస్తుతస్త్వత్ర న స్వప్నో న చ సర్గతా 33

స్వప్నముయొక్క యనుభవమువలె బ్రహ్మమను సముద్రందనేక సృష్టిరూప తరంగములు భ్రాంతిరూపములే యైయున్నవి. వాస్తవముగ స్వప్నముగాని, సృష్టిగాని లేనివే యగును.

ఏకమేవ నిరాభాసమచిత్త్వమజడం సమమ్
న సన్నాసన్న సదసదిదమవ్యయమద్వయమ్. 34

పరమాత్మయగు బ్రహ్మము, ఏకమై, ఆభాసరహితమై, చిత్తధర్మవర్జితమై, జడత్వశూన్యమై సర్వత్రసమరూపమై, సత్తుగాని, అసత్తుగాని, సదసత్తుగాని కానిదై, అవ్యయమై, అద్వయమై యొప్పుచున్నది.

యథాస్థితస్యైవ సతో యస్యాసంవేదనాత్మకమ్
సంవిత్ప్రశమనం జాతం తమాహుర్మునిసత్తమమ్ 35

ఎవఁడిట్టి బ్రహ్మరూపముతో స్థితిగల్గియుండునో, ఆతని చిత్తము అంతర్ముఖమై, దృశ్యస్ఫురణలేనిదై, ప్రశాంతత్వము నొందినదేయగును. మఱియు, నట్టివాఁడే మునిసత్తముఁడని చెప్పఁబడును.

సతోఽపి మృన్మయస్యేవ యస్యాసంవేదనాత్మకమ్
సాహం జగద్విగలితం తమాహుర్మునిసత్తమమ్. 36

ఎవఁడు విద్యమానుఁడైయున్నను మృత్తికాప్రతిమవలె, దృశ్యవేదనారహితుఁడై యుండునో, ఎవని దృష్టియందు (అనహంభావనచే) అహంభావసహితముగ ఈ జగత్తంతయు విలీనమైపోవునో, అతఁడే మునిశ్రేష్ఠుఁడని వచింపఁబడును.

యథా శామ్యత్యసంకల్పాత్సంకల్పనగరం తథా
వేదనోత్థం జగదహం చితి శామ్యత్యవేదనాత్. 37

సంకల్పముచే నుత్పన్నమగు నగరము సంకల్పాభావముచే నెట్లు శమించునో, అట్లే, దృశ్యవేదనముచే నుత్పన్నమగు, అహంభావసహితమగు ఈజగత్తు, దృశ్యవేదనములేమి శమించిపోవుచున్నది.

స్వభావవర్జం శబ్దార్థాః సర్వ ఏవ సహేతుకాః
స్వభావస్య తు యో హేతుర్ముక్తిస్తదనుభావనమ్. 38

సమస్తవస్తువులందును అనుగితమై యున్న స్వభావరూపమగు జడత్వమేదిగలదో, అదియే మూలావిద్య. దానిని వదలిన, తక్కిన సమస్తపదార్థములును సహేతుకములై యున్నవి. ఆ స్వభావముయొక్కయు హేతువు, (సాక్షిరూపముచే సాధకమగు ఆత్మ) ఎయ్యదిగలదో, అట్టి ఆత్మయొక్క అనుభవము గలిగియుండుటయే ముక్తి.

న కస్యచిత్పదార్థస్య స్వభావోఽస్తీహ కశ్చన
మహాచిదమ్బుద్రవతాః సర్వా ఏవానుభూతయః. 39

వాస్తవముగ ఏ పదార్థమునకును ఏస్వభావమున్ను లేదు. సమస్త అనుభవములున్ను, మహాచైతన్యమను సముద్రముయొక్క ద్రవత్వరూపములే యగును.



మహాచిదనిలస్పన్దా ఏతా ఏవానుభూతయః.
ఏతాస్తా బ్రహ్మగగనశూన్యతా ఇతి బుధ్యతామ్. 40

ఈ యనుభవములన్నియు మహాచైతన్యమను వాయువుయొక్క చలనములే అయియున్నవి. మఱియు, వీనినన్నింటిని బ్రహ్మమను ఆకాశముయొక్క శూన్యత్వముగ నెఱుఁగవగును.

వాతస్పన్దా ఇవా భిన్నా బ్రహ్మసర్గా విభిన్నతా
తయోస్త్వసత్యా స్వభ్రాన్తిః స్వప్నే స్వమరణోపమా. 41

వాయువు, ఆద్దాని చలనమువలె, బ్రహ్మము, సృష్టి అభిన్నరూపములై యున్నవి. వాని భేదము స్వప్నమందలి నిజమరణమువలె భ్రాంతిరూపమై, మిథ్యయై యున్నది.

భ్రాన్తిస్తు తావత్తత్త్వార్థవిచారో యావదస్ఫుటః
విచారే తు స్ఫుటే భ్రాన్తిర్బ్రహ్మతామేవ గచ్ఛతి. 42

ఆత్మతత్త్వమునుగూర్చిన విచారము స్పష్టము కానంతవఱకు ఈ భ్రాంతి యుండియే యుండును. ఎపుడట్టి (ఆత్మ సాక్షాత్కారరూప) విచారము స్పష్టమగునో, అపుడీభ్రాంతియు బ్రహ్మరూపమునే చెందును.

భ్రాన్తిస్త్వసత్యా వస్త్వేవ ప్రేక్షయాతో న లభ్యతే
శశశృఙ్గవదత్యచ్ఛమతో బ్రహ్మైవ శిష్యతే. 43

భ్రాంతియందు సత్తాస్ఫూర్తిరూపమగు అంశమెద్దిగలదో, అదియే బ్రహ్మరూపత్వమును జెందును. తద్భిన్నమైనది శశశృంగమువలె అవస్తువై తత్త్వవిచారముచే లభింపకయుండును. కావున నపుడు అతినిర్మలమగు బ్రహ్మమే శేషించును.

అనాదిమధ్యాన్తమనన్తమచ్ఛం
సమం శివం శాశ్వతమేకమేవ
సర్వాం జరామోహవికారభార
భ్రాన్తిం విముచ్యామ్బర భావమేహి. 44

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే సత్యార్థోపన్యాసయోగో నామ త్రయస్త్రింశః సర్గః ॥ 33 ॥

ఓరామచంద్రా! నీవు దేహసంబంధముచే సంప్రాప్తించు సమస్త జరామోహాది వికారభారరూపమగు భ్రాంతిని విడనాడి, ఆది మధ్యాంతరహితమై, అనంతమై, నిర్మలమై, సమమై, శివరూపమై శాశ్వతమై, ఏకమైనట్టి బ్రహ్మాకాశ భావమును బొందుము.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున సత్యార్థోపదేశయోగమను ముప్పదిమూఁడవ సర్గము ॥33॥

## చతుస్త్రింశః సర్గః

[దృష్టసృష్టి జగత్తస్యా దర్శనాదేవ సంక్షయః
ఇది యత్ప్రస్తుతం తస్య వర్ణ్యన్తేఽత్రోపపత్తయః.

జగత్తు దృష్టి సృష్టి మాత్రమేయైయున్నది. దానిని (జగత్తును) గాంచకపోవుటచే నయ్యది నశించునను నిర్విషయమున యుక్తులిట వర్ణింపఁబడుచున్నవి.]

శ్రీవసిష్ఠ ఉవాచ:—

ప్రాప్తేషు సుఖదుఃఖేషు యో నశ్యతి స నశ్యతి
యో న నశ్యత్యనాశోఽసావలం శాస్త్రోపదేశనైః. 1

శ్రీవసిష్ఠుఁడు.— ఓ రామచంద్రా! ప్రాప్తించు సుఖదుఃఖములందు (జ్ఞాతృజ్ఞానజ్ఞేయరూపమగు త్రిపుటియందు) యేది నశించునదైయున్నదో, అది యెపుడును నశించునదే యగును. ఏది నశింపకయున్నదో, అట్టి సాక్షిరూపముగ విద్యమానమై యుండు నేకమగు ఆత్మ యెన్నఁడును నశింపకయే యుండును. అదియే త్రిపుటికంటె వేఱగు నాశరహితమైన ఆత్మ - ఇదియే శాస్త్రసారము. ఇంతకంటె నధికముగ శాస్త్రోపదేశములతోఁ బనిలేదు.

యస్య చేచ్ఛోదయస్తత్ర సన్త్యవశ్యం సుఖాదయః
తే చేత్సమ్యక్చికిత్స్యన్తే పూర్వమిచ్ఛైవ ముచ్యతామ్. 2

ఎవనికి ఇచ్ఛ యుదయించునో, వానికి అవశ్యము సుఖదుఃఖాదులుండును. (ఇచ్ఛారహితుఁడగు ఆత్మజ్ఞాని కవియుండవు) అట్టి సుఖదుఃఖాదుల చికిత్సబాగుగ, జేయఁదలంచుచో మొట్టమొదట ఇచ్ఛను త్యజింపవలయును.

అహం జగదిదం భ్రాన్తిర్నాస్త్యేవ పరమే పదే
ఇదం శాన్తమనాలమ్బం సర్వం నిర్వాణమవ్యయమ్. 3

శుద్ధమగు పరమపదమున, అహంభావముయొక్కగాని, జగత్తుయొక్కగాని, ఇచ్ఛాదులయొక్కగాని భ్రాంతి లేనేలేదు. ఇది యంతయు సదా శాంతమై, నిరాధారమై, అవ్యయమై, నిర్వాణరూపమైనట్టి చిదాకాశమే అయియున్నది.

అహం బ్రహ్మ జగచ్చేతి శబ్దసంభ్రమవిభ్రమః
సర్వస్మిఞ్శాన్త ఆకాశే కేన నామోపకల్పితః. 4

'అహం' (నేను) బ్రహ్మము, జగత్తు— ఈమున్నగు శబ్దముల భ్రమ నెవరో, సర్వాత్మకమై శాంతమైనట్టి చిదాకాశమునఁ గల్పించిరి.

నేహాస్త్యహం న చ జగన్న చ బ్రహ్మాదిశబ్దకాః
శాన్తస్యైకస్య సర్వత్వాత్కర్తా భోక్తేహ కః కుతః. 5

ఈ చిదాకాశరూపమగు ఆత్మయందు, అహంభావముగాని, జగత్తుగాని, బ్రహ్మము మొదలగు శబ్దముల ప్రవృత్తిగాని లేవు, శాంతమై, ఏకమై, సర్వాత్మకమైనట్టి ఆ యాత్మకు, కర్తృత్వ భోక్తృత్వము లెట్లు ఎచట సంభవింపఁగలవు.



ఉపదేశ్యాతిశాయిత్వాత్సర్వాపహ్నవ ఏవ చ
కృతోఽయం స చ సత్యాత్మా తదహావాం విశిష్యతే. 6

సమస్తముయొక్క అపలాపము (నిషేధము) గావింపఁబడ ఆ మిథ్యాపదార్థములన్నింటికంటెను బరమైయుండుటఁబట్టి, ఉపదేశ్యవస్తువైన సత్యమగు ఆత్మయే శేషించుచున్నది.

అగ్రస్థసిద్ధసంచారో జ్ఞాయతే నాపి దారుణః
యథైకపార్శ్వసంసుప్తనరః స్వప్నాభ్రగర్జితమ్. 7

ఎదుట నున్నప్పటికిని సిద్ధులయొక్కయు, పిశాచాదులయొక్కయు సంచారము భయంకరమైనను గానుపించనట్లును శయ్యయొక్క యొకభాగమున నిద్రించుచున్న మనుజుని స్వప్నమందలి మేఘగర్జనము దారుణమైనను అన్యునకు వినిపించనిదై లేనిదేయగునట్లును, ఈ జగత్తున్ను ఎదుట నున్నను, దర్శింపనంతమాత్రముచే శమించుచున్నది.

జ్ఞప్తౌ నాస్తి యతస్తేన సిద్ధచారో న లక్ష్యతే
స్వభావ ఇతి సర్వేణ జ్ఞప్తిస్థో హ్యనుభూయతే. 8

తన జ్ఞప్తియందు లేదు గనుకనే మనుజునకు సిద్ధాదుల సంచారము గానుపించుటలేదు. తన జ్ఞప్తియందున్నట్టి పదార్థములనే సర్వులును అనుభవించుచుండుట స్వభావప్రసిద్ధమైయున్నది.

జ్ఞప్తిరప్యాత్మభూతైవ సర్వం భాతి హి తన్మయమ్
తస్మాత్సాహం జగత్సర్వమభిన్నం పరమాత్మనః. 9

వాస్తవముగ జ్ఞప్తి (జ్ఞానము) ఆత్మరూపమేయై యున్నది. మఱియు, సమస్తము జ్ఞప్తిమయమై భాసించుచున్నది. కాఁబట్టి, అహంకారసహితముగ ఈ జగత్తంతయు పరమాత్మకంటె వేఱు కానిదై యున్నది.

జ్ఞప్తిర్జగత్తయా భాతి సంకల్పస్వప్నయోరివ
అనానావయవోదేతి జలమూర్మితయా యథా. 10

సంకల్ప, స్వప్నములందువలె జ్ఞప్తి జగద్రూపమున భాసించుచున్నది. అయ్యది అనేకత్వరహితమైనను, జలము తరంగరూపమున భాసించునట్లు, వివిధావయవములతోఁగూడి ప్రకాశించుచున్నది.

ఏకాత్మైవోదయే జ్ఞప్తేర్నానాతామివ చాగతః
అజ్ఞానాత్సత్యవస్తుత్వాత్ప్రేక్షితో నోపలభ్యతే. 11

ఏకమగు ఆత్మయే, జ్ఞప్తియొక్క అజ్ఞానముచే అనేకరూపత్వమును బొందినట్లు భాసించుచున్నది. కాని, విచారదృష్టిచే గాంచినచో ఆయనేకత్వము లభింపనేరదు.

యథా స్వావయవానేవ సర్వానవయవీ భవేత్
నిత్యానవయవం శాన్తం బ్రహ్మైవేదం తథా జగత్. 12

అవయవరహితుఁడైనను, జీవుఁడు స్వప్న, మనోరథాదులందు హస్తపాదాది నిజావయవములన్నింటినిఁ గల్పించుకొనుచు, అవయవయుక్తుఁడగునట్లు, నిత్యమై, శాంతమై, అవయవరహితమైనట్టి బ్రహ్మమున్ను జగద్రూపమగుచున్నది.

భాణ్డాలకాని ధత్తేఽన్తశ్చిద్రూపకనకేష్టికా
యదేవ సా చేతయతే జగదాదీవ వేత్తి తత్. 13

ఈ చిద్రూపమను కుమ్మరిది అనేకజగంబులను పాత్రలను దనయందు ధరించుచున్నది. అందు దేనినది స్మరించునో, దాని ననుభవించుచున్నది.

బ్రహ్మైవ కచతీవేదం సత్తయాచ్ఛజగత్తయా
చిద్రూపత్వాద్ద్రవాత్మత్వాత్తరఙ్గాదితయాబ్ధివత్. 14

ద్రవరూపమగుటచే సముద్రము తరంగరూపముగ భాసించునట్లు, చిద్రూపమగుటచే బ్రహ్మమే తన నిర్మల సత్తచే జగద్రూపముగ భాసించుచున్నది.

యద్యచ్చేతయతేఽన్తస్తు జగదాదీవ పశ్యతి
అరూపమపి రూపం స్వం యన్న చేతయతే న తత్. 15

రూపరహితమైనను, చైతన్యము తనయందే యే జగదాదివస్తువులను స్మరించుచున్నదో, వాని వాని నా యా రూపములఁ దనయందు గాంచుచున్నది. దేనినిస్మరింపకయున్నదో, దానిని గాంచకయున్నది.

చేతనాచేతనత్వోక్తిస్తస్యేశత్వాత్స్వదేహగే
ఉపదేశార్థమేవోక్తే న సద్విషయమర్థతః. 16

మాయాశబలిత బ్రహ్మము (ఈశ్వరుని)యొక్క సర్వశక్తియుతమగు మాయారూప దేహమున, చేతనత్వ, అచేతనత్వములఁ గూర్చిన కథనము ఉపదేశము కొఱకు మాత్రమే యగును. యథార్థముగ నట్టికథనము శుద్ధాత్మవిషయమును గూర్చి కాదు.

న జగత్సన్న చైవాసద్భాసతే చేతనాచ్చితి
అచేతనాన్న కచతి క ఇవార్థగ్రహోఽత్ర నః. 17

ఈ జగత్తు సత్తుకాదు, అసత్తుకాదు. ఇది చైతన్యమున చైతన్య విస్తరణముచే భాసించుచున్నది. అట్టి చైతన్య విస్తరణము లేనిచో భాసింపదు. ఇట్టి మిథ్యాజగత్తునందు మనము విశ్వాసమొనర్పనేల?

అచేతనం చేతనం చ స్పన్దాస్పన్దవదాత్మనః
స్వాయత్తేన కదర్థ్యన్తే స్వస్థపాషాణవత్స్థితే. 18

నిశ్చల స్ఫటిక శిలకు దనయందలి యనేక ప్రతిబింబముల చలనాచలనములు స్వాధీనములే గాని, పరిశ్రమ సాధ్యములు గానట్లు, చైతన్యాత్మకు, దనయందలి విస్తరణ, అవిస్తరణములు స్వాధీనములే గాని యత్న సాధ్యములు గావు.

యస్యేక్షితస్య నో సత్తా నాధారో న చ కారణమ్
సోఽహమిత్యేవ యో యక్షో న జానే కుత ఉత్థితః. 19

విచారదృష్టిచే జూచినచో దేనికి సత్తగాని, ఆధారముగాని, కారణముగాని లేదో, అట్టి అహంకారమను పిశాచ మెటనుండి యావిర్భవించినదో తెలియకున్నది!



యస్యాహమితి యక్షస్య సత్తైవాస్తి న సత్యతః
అహో ను చిత్రం తేనేమే భవన్తో వివశీకృతాః. 20

ఏ అహంకారమను పిశాచమునకు వాస్తవముగ సత్త(ఉనికి)యే లేదో, అట్టిదానిచే మీరు వివశులు కాఁబడుట చాల చిత్రముగా నున్నది!

కాకతాలీయవద్భ్రాన్తమహం బ్రహ్మణి భాసతే
స్వమేవ రూపం దృగ్భ్రాన్త్యా కేశోణ్డ్రకమివామ్బరే. 21

దృష్టియొక్క భ్రమచే ఆకాశమున కేశాదులు భాసించునట్లు, కాకతాలీయముగ (అకస్మాత్తుగ) భ్రాంతిచే, తనయొక్క రూపమే బ్రహ్మమున 'అహంభావముగ, భాసించుచున్నది.

బ్రహ్మైవాహం జగచ్చాత్ర కుతో నాశసముద్భవౌ
అతో హర్షవిషాదానాం కిం త్వేవ కథమాస్పదమ్. 22

అంతయు బ్రహ్మమే యైయుండనిఁక నందు 'అహంభావము' జగత్తు, దాని నాశము, ఉత్పత్తి యెచట నుండగలవు? కావుననిఁక హర్షవిషాదములకు విషయమేమి! ఆశ్రయమేమి?

సర్వేశ్వరత్వాదీశస్య విభాతీదం ప్రచేతితమ్
అచేతితం చ నో భాతి తేనాచేతితమస్తు తే. 23

ఓ రామచంద్రా! పరమాత్మ సర్వేశ్వరుఁడున్ను, సర్వశక్తివంతుఁడున్ను నగుటచే స్మరణమాత్రముచే ఈ సమస్త విచిత్ర జగత్తున్ను భాసించుచున్నది. స్మరింపకున్నచో భాసింపకుండును. కావున నిద్దాని విస్మరణమే నీ కగుఁగాక!

కాకతాలీయవచ్చిత్త్వాజ్జగద్భాతి బ్రహ్మ ఖమ్
స్వప్నసంకల్పపురవత్తత్తస్మాద్భిద్యతే కథమ్. 24

వాస్తవముగ జగత్తున్ను చిద్రూపమగుటచే చిదాకాశమగు బ్రహ్మమే స్వప్న, సంకల్ప రచిత పురమువలె కాకతాలీయముగ జగద్రూపముచే భాసించుచున్నదగును. కావున పరమార్థమున ఆ బ్రహ్మమునుండి యీ జగత్తెట్లు భేదింపఁబడును.

యథోర్మ్యాది జలే వృక్షే యథా వా శాలభఞ్జికా
యథా ఘటోదయో భూమౌ తథా బ్రహ్మణి సర్గతా. 25

జలమందు, తరంగాదులున్ను, కాష్ఠమందు విగ్రహమున్ను, మృత్తికయందు ఘటాదులున్ను నున్నట్లు, బ్రహ్మమం దీ సృష్టియున్ను గలదు.

అనాకృతావ సంస్థానే స్వచ్ఛే యదనుభూయతే
తత్తదేవాత్త ఉదితం కింనామాహం జగన్తి కిమ్. 26

అవయవరహితమైన నిర్మలమగు బ్రహ్మమున ఏజగత్తనుభూతమగుచున్నదో, అది యా బ్రహ్మమే యారూపమున నుదయించినదగును. అట్టిచో నిఁక అంహకార, జగంబు లేమి! (మిథ్యయని భావము)

మరుతః స్పన్దవైచిత్ర్యం సత్తయైవ యథా తథా
బ్రహ్మణో నిఃస్వభావస్య జగదాద్యహమాది చ 27

వాయువుయొక్క సత్తయే చలనవైచిత్ర్యరూపమున భాసించునట్లు, అవిద్యాస్వభావరహితమగు బ్రహ్మముయొక్క సత్తయే, అహంభావ, జగనాది ప్రపంచరూపమున భాసించుచున్నది.

యథాభ్రే లక్ష్యతే వృక్షగజవాజిమృగాదితా
అసన్నివేశాకృతిని సర్గాహన్తే తథాపరే. 28

వృక్షాద్యాకారరహితమగు మేఘమున వృక్ష, గజ, అశ్వ, మృగాదుల యాకారములు భాసిల్లునట్లు, నిరాకారమగు బ్రహ్మమున అహంకార, జగదాదులు భాసిల్లుచున్నవి.

సర్గోఽవయవవద్భాతి సర్వ ఏవ పరే శివే
ఏవం తదుపమాం విద్ధి కార్యకారణవద్యథా. 29

సూక్ష్మమగు వటబీజాది కారణములందు, వృక్షశాఖాదికార్యములు వెలయునట్లు, శివరూపమగు పరమాత్మయందీ సృష్టియంతయును నద్దాని అవయవముల చందమున వెలయు...ది.

అన్తః శాన్తమనాయాసమనుపాధి గతభ్రమమ్
జగత్సంభవాదేవ వ్యోమవత్సమమాస్యతామ్. 30

ఓరామచంద్రా! ఇవ్విధమున, ఆత్మరూపముకంటె భిన్నముగ జగత్తు సంభవింపమి అంతఃకరణమునఁ బ్రశాంతుఁడవై, ఆయాసవర్జితుఁడవై, ఉపాధిరహితుఁడవై, భ్రమ తొలగినవాఁడవై, ఆకాశమువలె సమముగానుండుము.

న భవన్తో నచ వయం న జగన్తి న ఖాదయః
సన్తి శాన్తమశేషేణ బ్రహ్మేదం నిర్భరం స్థితమ్. 31

ఓ సభ్యులారా! యథార్థముగ మీరుగాని, మేముగాని, జగత్తులుగాని, ఆకాశాదులుగాని లేవు. సర్వథా శాంతమై, పరిపూర్ణమైనట్టి బ్రహ్మమేగలదు. ఈ సమస్తము ఆ బ్రహ్మమే యైయున్నది.

అశేషేష్వవిశేషేషు శాన్తేష్వవిశేషతా
సత్యా సైవాహమిత్యాశు త్యక్త్వా మోక్షాయ భావ్యతామ్. 32

ఓ రామచంద్రా! చైతన్యము...టె భిన్నమగురూపము పదార్థములకు నిరూపింపఁబడ...కావున సమస్తపదార్థములున్ను, అవిశేషములై యున్నందున, విశేషత్వమునుగూర్చిన భ్రమను ...త్యజించి, మోక్షమునకొఱకై, 'సర్వవిశేష రహితమై, పరమార్థసత్యమైనట్టి యా చైతన్యమే నేనని' భావింపుము.

వేదనం బన్ధనం విద్ధి విద్ధి మోక్షమవేదనమ్
...స్థి... యథాచారం భవ శాన్తమవేదనమ్. 33

...స్మరణమే బంధమనియు, అద్దాని విస్మరణమే మోక్షమనియు నెఱుఁగుము.
...చారము ననుసరించి భూమికల నభ్యసించుచు జగత్తును విస్మరించి శాంతమై
...మ్రయ... లకమ్ము.



ద్రష్టా న దృశ్యతాం యాతి చితిర్నాయాతి చేత్యతామ్.
చేత్యాభావాదజగతి కః కిం చేతయతే కథమ్ 34

ద్రష్ట దృశ్యరూపమెన్నటికిఁ గానేరదు. మఱియు, చైతన్యము జడమగు విషయరూపత్వమెన్నఁటికిని బొందదు. కాఁబట్టి, విషయాభావముచే జగద్రహితమగు శుద్ధచైతన్యమున నెవఁడు దేని నెట్లు ప్రకాశింపఁజేయగలఁడు?

దృష్టృదృశ్యదశాభావాజ్జాగ్రత్యేవ సుషుప్తివత్
శరదాకాశకోశాభమసత్తోపమమాస్యతామ్. 35

ఓ రామచంద్రా! ద్రష్టృదృశ్య స్థితియొక్క అభావముచే జాగ్రత్తునందే సుషుప్తివలెను. శరత్కాలాకాశమువలె నిర్మలముగను, శూన్య సదృశముగను నున్నవాఁడవై ఆత్మరూపముతోటి స్థితినొందియుండుము.

తథైకబ్రహ్మ చిద్రూపే పవనస్పన్దనే యథా
అత్రాచిదోఽబ్ధతా సర్గో మోక్షో బ్రహ్మైకబోధతా. 36

వాయువుయొక్క చలనమందువలె, యేకమైనట్టి చిద్రూపమగు బ్రహ్మమున అజ్ఞానముచేతనే భేదము దర్శింపఁబడుచున్నది. మఱియునిట, చిత్తు (బ్రహము,) అచిత్తుల (జగజ్జీవాది పదార్థముల) భేదజ్ఞానమేసృష్టియగును. వానియైక్యజ్ఞానమే మోక్షము.

చిత్స్పన్దో బ్రహ్మమరుతో యత్ర సర్గ ఇతి స్మృతః
నాత్రచిత్స్పన్దనం యస్యాన్నిర్వాణం తదుదాహృతమ్. 37

బ్రహ్మమను వాయువునందెచట చిత్ - స్పందము (చలనము) గలదో, అచటనే సృష్టి గలదని వచింపఁబడెను. అట్టి చిత్ - స్పందము లేకుండుటయే నిర్వాణమని పేర్కొనఁబడెను.

బీజమన్తర్యథా వేత్తి స్వరూపం పల్లవాదికమ్
తథా మహాచిదన్తస్థం స్వరూపం వేత్తి సర్గతామ్. 38

బీజము తనయందలి నిజరూపమును పల్లవాదుల రూపమున నెట్లెఱుఁగుచున్నదో, అట్లే మహాచైతన్యమున్ను తన యాభ్యంతరముననున్న స్వరూపమును సృష్టిరూపముగ నెఱుఁగుచున్నది.

పత్రాదివేదనాద్బీజం యథా పత్రాది తిష్ఠతి
పరా చిత్సర్గసంవిత్తిస్తథా భవతి సర్గతా. 39

పత్రాదుల యనుభవముచే బీజము పత్రాదులరూపముగ స్థితినొందియున్నట్లు, మహాచైతన్యమున్ను సృష్టియొక్క యనుభవముచే సృష్టిరూపమగుచున్నది

యథా భావవికారాభాశ్చిత్పరాః సర్గతాస్తథా
సర్వే బీజాని దృష్టాన్తాస్తద్రూపా ఏవ తన్మయాః. 40

బీజమురొుక్క వృక్షరూపమున ఉత్పత్తి స్థితి, వృద్ధి, అపక్షయాది షడ్వికారములెట్లు భాసించుచున్నవో, అట్లే చైతన్యమురొుక్క వివర్తరూపమగు సృష్టియందును తత్సృష్టివికారములును

భాసించుచున్నవి. మఱియు, దృష్టాంతమందలి బీజాకారమున చైతన్యమే స్థితినొందియున్నది. కావున సమస్తబీజాదిరూప సృష్టియు చిద్రూపమై, చిన్మయమే యైయున్నది.

నిర్వికారపరబ్రహ్మమయం సర్వమిదం జగత్
నిర్వికారమనాద్యన్తమేవం విద్ధి నిరామయమ్ 41

ఓ రామచంద్రా! ఈ జగత్తంతయు నిర్వికారమైనట్టి పరబ్రహ్మమయమై యున్నది. కాబట్టి దీనినిగూడ నీవు నిర్వికారముగను, ఆద్యంతరహితముగను, నిరామయముగను తెలిసికొనుము.

నిజసంకల్పమాత్రాత్మా నిజసంకల్పనాత్త్వయా
ద్వైతాద్వైతవికారోఽయం సంకల్పనగరం యథా. 42

ద్వైతాద్వైత వికారమయమగు ఈ జగత్తు, సంకల్పనగరమువలె నిజసంకల్పమాత్రముచే సిద్ధించునదై, నిజసంకల్పాభావముచే నశించునదై యున్నది.

శూన్యత్వాకాశయోర్భేదో యాదృశోఽవగతస్త్వయా
భేదం నిరాత్మకం విద్ధి తాదృశం బ్రహ్మసర్గయోః. 43

ఆకాశముయొక్కయు, శూన్యత్వముయొక్కయు భేద మెట్లు రూపరహితముగ (మిథ్యగా) నీవెఱిగితివో, అట్లే బ్రహ్మముయొక్కయు, సృష్టియొక్కయు భేదమున్ను మిథ్యగా తెలిసికొనుము.

మహాచిద్రూపిణీ శాన్తా యా సత్తా బ్రహ్మణః పురా
స్వతః సేయమహన్త్వం చ మానవోఽస్మీత్యబోధతః. 44

పూర్వసిద్ధమగు యా మహా చిద్రూపమైన శాంతమగు బ్రహ్మసత్తయే, అజ్ఞానముచే 'నేను మనుష్యుడ'నను ఈ భావనవలన స్వయముగ అహంకార, జడరూపములుగ స్థితి నొందియున్నది.

బ్రహ్మణ్యస్మిఞ్జగద్రూపే న కించిదపి జాయతే
జాతమప్యథ నష్టం చ న నశ్యత్యమ్బువీచివత్. 45

జలమందు తరంగములవలె, బ్రహ్మమందీజగద్రూపము జనించినను జనింపకయే యున్నది; నశించినను నశింపకయే యున్నది.

పదార్థబ్రహ్మరూపేణ బ్రహ్మైవాత్మని తిష్ఠతి
అవయవీవావయవే ఖే ఖం వారివ వారిణి. 46

వృక్షము తన శాఖాద్యవయవములందును, ఆకాశ మాకాశమందును, జలము జలమందును, స్థితిగల్గియున్న విధమున, పదార్థరూపముగను, బ్రహ్మరూపముగను నున్నట్టి బ్రహ్మము తన స్వరూపమందు అవికారరూపముగ స్థితిగల్గియున్నది.

నిమేషార్ధభాగేన దేశాద్దేశాన్తరస్థితౌ
యద్రూపం సంవిదో మధ్యే స స్వభావ ఉపాస్యతామ్. 47

ఓ రామచంద్రా! నిమిషముయొక్క యర్ధభాగమున భూతలమునుండి సూర్యమండలాది ప్రదేశములకు జ్ఞానసత్త చనినపుడు ఆ రెంటి (భూతలముయొక్కయు, సూర్యాదులయొక్కయు) మధ్యనేది నిర్విషయజ్ఞానముయొక్క స్వరూపముగలదో దానిని నుపాసింపుము.

సంతుష్టమతుష్టమితి ద్విరూపం
సంవిత్స్వరూపం ప్రవదన్తి సన్తః
శ్రేయః పరం యేన సమీహసే త్వం
తదేకనిష్ఠో భవమాఽనతిర్యాః 48

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే పరమార్థయోగోపదేశో నామ చతుస్త్రింశః సర్గః ॥ 34 ॥

ఓ రామచంద్రా! వివేకులు అజ్ఞానుల యనుభవసిద్ధమున్ను, వివర్త సహితమున్ను, జగద్రూపముచే సంతుష్టమున్నగు యొక రూపమును, వివర్తరహితమై, అతుష్టమై, పూర్ణానందైక రసమైనట్టి మఱియొకరూపమును చైతన్యము (బ్రహ్మము)నకు వచించుచున్నారు. ఆ రెంటియందును దేనిచే నీకు పరమశ్రేయము గలుగునని యెంచెదవో, దానియందే తత్పరుడవై యుండుము. కాని, పరీక్షింపకుండ గ్రహించునట్టి అవివేకివి గాకుము.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్థమున పరమార్థయోగోపదేశమను ముప్పదినాల్గవ సర్గము ॥34॥

---

పఞ్చత్రింశః సర్గః

[సప్రపఞ్చాప్రపఞ్చాత్మవస్త్వఖణ్డైక్యదృష్టయే
సత్యానృతోభయాభాసం బ్రహ్మరూపం ప్రపఞ్చ్యతే.

ప్రపంచ సహితమైయు, ప్రపంచరహితమైయు నున్నట్టి బ్రహ్మతత్త్వముయొక్క అఖండైక్యదృష్టికొఱకై, సత్యముగను, అసత్యముగను, ఉభయరూపములతోటి ఆభాసమానమగు బ్రహ్మముయొక్క స్వరూపమిచట వర్ణింపబడుచున్నది.]

శ్రీవసిష్ఠ ఉవాచః—

దేశాద్దేశాన్తరం దూరం ప్రాప్తాయాః సంవిదః క్షణాత్
యద్రూపమమలం మధ్యే పరం తద్రూపమాత్మనః. 1

శ్రీవసిష్ఠుడు.— ఓరామచంద్రా! క్షణకాలములో క్రమముగ నొకప్రదేశమునుండి మఱియొక అతిదూరమగు (సూర్యమండలాది) ప్రదేశమునకు నేత్రేంద్రియముద్వారా జనునట్టి జ్ఞానముయొక్క, ఆరెండు ప్రదేశముల మధ్యనుండు నిర్మలమై, నిర్విషయమైనట్టి స్వరూపమేదిగలదో, అదియే పరమాత్మయొక్క రూపము.

గచ్ఛచ్ఛ్రాన్తస్య విశ్రాన్తమున్మిషన్నిమిషన్నసన్
నూనం నిరామయత్వాయ నిత్యమేతన్మయో భవ. 2

ఓ రామచంద్రా! నిర్వాణ ప్రాప్తికొఱకై, నీవు నడుచుచున్నను, వినుచున్నను, స్పృశించుచున్నను, మూర్కొనుచున్నను, కన్నులం దెఱచుచున్నను, మూయుచున్నను, నవ్వుచున్నను నిక్కముగ, నిర్విషయమగు చిద్రూపముననే నిత్యము తన్మయుఁడవై యుండుము.

తత ఏవ నిరాభాసాత్సత్యాన్నిర్వాసనైషణాత్
యథాస్థితః యథాచార మచలామరశైలవత్. 3

ఓ రాఘవా! జీవన్ముక్తస్థితి ననుసరించి స్వకులాచారమునుబట్టి వ్యవహరించుచున్నను, ఈ నిరాభాసమై, సత్యమై, వాసనేచ్ఛాదివర్జితమైనట్టి చిత్స్వరూపమునుండి సుమేరు పర్వతమువలె నెన్నటికిని చలింపకుము.

ఏతద్రూప మవిద్యాయః ప్రేక్షితా యన్నలభ్యతే
ప్రేక్షితా లభ్యతే చేత్సా తద్విద్యైవ పరాభవత్. 4

(ప్రమాణములచే) విచారించినప్పటికిని లభింపకయుండుట యేది గలదో, అదియే, అవిద్యయొక్క స్వరూపము. విచారించుటచే లభించినచో నది పరావిద్యయే యగును.

అవిద్యాసంభవాచ్చేత్య చిత్త్వే సంభవతః క్వ కిమ్
చేత్యతే కథమేవాన్తః శాన్తిరేవ బలోదితా. 5

అట్లు, అవిద్య సంభవింపమి ఇఁక చిత్తు, చేత్య(విషయ)మను భేదమెచట ఎట్లు సంభవించును? భేదాభావముచే కేవలము తన స్వరూపముననే చైతన్యమిఁక దేనిని ప్రకాశింపఁజేయును? కావున శాంతమై, నిర్విషయమైనట్టి చిన్మాత్రస్థితియే బలాత్కారముగ నుదయించినదగుచున్నది.

సత్యం బ్రహ్మ జగచ్చైకం స్థితమేకమనేకవత్
సర్వం వా సర్వవద్భాతి శుద్ధం చాశుద్ధవత్తతమ్. 6

పరమార్థమున బ్రహ్మమున్ను, జగత్తున్ను నొకటియే యైయున్నవి. కాని, అజ్ఞానమువలన ఆ బ్రహ్మమేకమైనను అనేకముగను, పూర్ణమైనను అపూర్ణముగను, శుద్ధమైనను అశుద్ధముగను నున్నట్లు, భాసించుచున్నది.

అశూన్యం శూన్యమివ చ శూన్యం వా శూన్యవత్స్ఫుటమ్
స్ఫారమస్ఫారమివ తదస్ఫారం స్ఫారసన్నిభమ్. 7

బ్రహ్మము శూన్యముగానున్నను, (ప్రళయకాలమున) శూన్యముగను, పదార్థరహితమై యున్నను (సృష్టికాలమున) పదార్థసహితముగను, దేశకాలములచే అపరిచ్ఛిన్నమైనను పరిచ్ఛిన్నమైనదిగను, దేశకాలాది రూపరహితమైనను, విశాల దేశకాలాది రూపసహితముగను నున్నట్లు వర్తించుచున్నది.

అవికారం వికారీవ సమం శాన్తమశాన్తవత్
సదేవాసదివాదృశ్యం తదేవాతదివోదితమ్. 8



మఱియు ఆ బ్రహ్మము, వికారరహితమైనను, వికారవంతముగను, సమమై, శాంతమైన్నను, అసమముగను, అశాంతముగను, సత్తైనను, అదృశ్యమగుటచే అసత్తుగను నున్నట్లు, భాసించుచుచున్నది.

అవిభాగం విభాగీవ నిర్జాడ్యం జడవద్గతమ్
అచేత్యం చేత్యభావీవ నిరంశం సాంశశోభనమ్. 9

అట్లు నిర్విభాగమైనను భాగసహితముగను, చిద్రూపమైనను జడముగను, విషయశూన్యమైనను విషయరూపముగను, నిరంశమైనను అంశయుక్తముగను నున్నట్లు బ్రహ్మము భాసించుచున్నది.

అనహం సోహమివ తదనాశమివ నాశవత్
అకలఙ్కం కలఙ్కీవ నిర్వేద్యం వేద్యవాహివత్. 10

మఱియు ఆ బ్రహ్మము అహంకారరహితమైనను అహంకారసదృశముగను, నాశరహితమైనను నాశవంతముగను, కళంకవర్జితమైనను కళంకయుక్తముగను, విషయరహితమైనను విషయసహితముగను నున్నట్లు వెలయుచున్నది.

ఆలోకిధ్వాన్తఘనవన్నవవచ్చ పురాతనమ్
పరమాణోరపి తను గర్భీకృతజగద్గణమ్. 11

సర్వాత్మకమపి త్యక్తం దృష్టం కష్టేన భూయసా
అజాలమపి జాలాఢ్యం చాశేషవదనేకథా. 12

అట్లే, బ్రహ్మము స్వప్రకాశమైనను [illegible] పురాతనమైనను నూతనమైనదానివలెను, పరమాణువుకంటెను సూక్ష్మమైనను అనేక బ్రహ్మాండములను దన యుదరమున ధరించునదిగను, సర్వరూపమైనను వైరాగ్యాది పురుషప్రయత్నములచే దృశ్యవర్గమును త్యజించునదిగను, ప్రపంచరహితమైనను ప్రపంచపూర్ణమైనదానివలెను, అద్వితీయమైనను అనేకరూపములతో నున్నట్లును భాసించుచున్నది.

నిర్మాయమపి మాయాంశుమణ్డలామలభాస్కరమ్
బ్రహ్మ విద్ధి విదాంనాథమపామివ మహోదధిమ్. 13

అట్లే ఆ బ్రహ్మము మాయారహితమైనను మాయాకిరణమండలముయొక్క నిర్మలసూర్యునివలెను, శుద్ధజ్ఞానమాత్ర స్వరూపమైనను సర్వజ్ఞునివలెను నొప్పుచున్నది.

జగద్రత్నమహాకోశం తులాయాం తూలకాల్లఘు
మాయామరీచిశశినమపి నేక్షణగోచరమ్. 14

మఱియు, బ్రహ్మము జగత్తులను రత్నములయొక్క మహాకోశమైనను, మిగుల గురుతరమైనను, వివేకమను త్రాసునందుతూచిన దూదియొక్క లవలేశముకంటెను లఘువైనదిగను, దృష్టికి గోచరముకానిదైనను మాయారూప కిరణసమూహముయొక్క చంద్రునివలెను వెలయుచున్నది.

అనన్తమపి నిష్పారం న చ క్వచిదపి స్థితమ్
ఆకాశే వనవిన్యాసనగనిర్మాణతత్పరమ్. 15

దేశకాలములచే అనంతమైనను బ్రహ్మము ఏయొక దేశకాలములందునునుండనిదియు, శూన్యస్థానమందున్ను, వన, పర్వతాదులను నిర్మించుటయందు దత్పరమైనదియు నై యున్నది.

అణీయసామణీయాంసం స్థవిష్ఠం చ స్థవీయసామ్
గరీయసాం గరిష్ఠం చ శ్రేష్ఠం చ శ్రేయసామపి. 16

బ్రహ్మము సూక్ష్మతరవస్తువుకంటెను సూక్ష్మతమమై, స్థూలతరవస్తువుకంటెను స్థూలతమమై, గురుతరవస్తువుకంటెను గురుతమమై, శ్రేష్ఠవస్తువులకంటె నతిశ్రేష్ఠమై వెలయుచున్నది.

అకర్తృ కర్మకరణ మకారణమకారకమ్
అన్తః శూన్యతయైవైతచ్చిరాయ పరిపూరితమ్. 17

కర్తృకర్మ కరణరహితమై, కారణవర్జితమై అకారకమై, అంతశ్శూన్యమై, యున్నప్పటికి బ్రహ్మము చిరకాలము కర్తృకర్మాదులచే బూర్ణమైయున్నట్లు తోచుచున్నది.

జగత్సముద్గకమపి నిత్యం శూన్యమరణ్యవత్
అనన్తశైల కఠినమప్యాకాశలవాన్మృదు. 18

జగంబులను రత్నములయొక్క పేటికియైయున్నను, బ్రహ్మము అరణ్యమువలె నిత్యము శూన్యమైయు, అనంతకోటి పర్వతమువలె కఠినమైయున్నను ఆకాశలేశమువలె గోమలమైయున్నది.

ప్రత్యేకం ప్రత్యహం ప్రాయః పురాణం పేలవం నవమ్
ఆలోకమన్ధకారాభం తమస్త్వాలోకమాతతమ్. 19

మఱియు, బ్రహ్మము సర్వపదార్థరహితమైనను, ప్రత్యేకవస్తుకాలరూపముగను, పురాతనమైనను నూతనముగను, స్వప్రకాశరూపమైనను అంధకారమువలెను, ప్రకాశమయమై వ్యాపించియున్నను జగత్తుయొక్క తిరోభావమను తమముతోఁగూడియున్నదానివలెను నొప్పుచున్నది.

ప్రత్యక్షమపి దుర్లక్ష్యం పరోక్షమపి చాగ్రగమ్
చిద్రూపమేవ చ జడం జడమేవ చిదాత్మకమ్. 20

(సాక్షిరూపముచే) ప్రత్యక్షమైయున్నను బ్రహ్మము నేత్రములచే దుర్లక్ష్యమైనదియు, (ఇంద్రియములచే) పరోక్షమైనను (సాక్షిరూపముచే) సమ్ముఖమున నేయున్నదియు, చిద్రూపమైనను జడజగద్రూపమున భాసించునదియు, జడజగదాదిరూపముల భాసించినను శుద్ధ చిన్మాత్రమేయై యున్నదియు నగుచున్నది.

అహమేవానహం భావమనహం వాహమేవ చ
అన్యదేవ తదేవాహమహమేనాన్యదేవ తత్. 21

అహంభావ రహితమైనను బ్రహ్మము అహంభావమువలె భాసించుచున్నది. అట్లు అహంభావరూపమున భాసించినను నయ్యది అహంభావరహితమైయే యున్నది. మఱియు నది అన్యముగ (విషయరూపమువలె) నొప్పుచున్నను, ఆత్మరూపమేయై యున్నది. ఆత్మరూపమైయున్నను అన్యముగ (విషయ సదృశముగ) భాసించుచున్నది.



అస్య పూర్ణార్ణవస్యాన్తరిమే త్రిభువనోర్మయః
స్ఫురన్త ఇవ తిష్ఠన్తి స్వభావద్రవతాత్మకాః. 22

ఈ పూర్ణ చిద్రూప సముద్రమందు ముల్లోకములను తరంగములు ద్రవత్వరూప స్వభావముతోఁగూడి స్ఫురించుచున్నవానివలె నున్నవి.

బిభర్తి సర్వమజస్థం తుషారమివ శుక్లతామ్
భాతి సర్వస్త్వనేనైవ తుషారేరేవ శుక్లతా. 23

మంచు తనయందు తెలుపుదనమును ధరించునట్లు, ఈ చైతన్యము తనయందు సృష్టిని ధరించుచున్నది. మఱియు, మంచువలననే తెలుపుదనము భాసించునట్లు, ఈ చైతన్యమువలననే సృష్టి భాసించుచున్నది.

అదేశకాలావయవోఽప్యేష దేవో దివానిశమ్
అసజ్జగత్తనోతీవ యథా వారితరఙ్గకమ్. 24

జలము తరంగములను విస్తరింపఁజేయునట్లు, దేశకాలాద్యవయవ రహితుఁడైనను ఈ చిద్రూప దేవుఁడు దినరాత్రియుక్తమగు ఈ అసత్తైన జగత్తును విస్తరింపఁ జేయువానివలె వెలయుచున్నాఁడు.

ఏతస్మిన్వికసన్తీమా విపులాకాశకాననే
జగజ్జరఠమఞ్జర్యః ప్రసరత్ప్రత్రపఙ్క్తయః. 25

ఈ చిదాకాశమను మహారణ్యమున పంచభూతములను పత్రములతోఁగూడిన జగత్తులను పురాతన లతలు వికసించుచున్నవి.

ఏష స్వప్రతిబిమ్బస్య స్వయమాలోకనేచ్ఛయా
అత్యన్త నిర్మలాకారః స్వయం ముకురతాం గతః. 26

ఈ చిద్రూపుఁడగు పరమాత్మ స్వప్రతిబింబమగు జీవ జగద్రూపమైన అన్యాకారమును వీక్షించునిచ్ఛచే స్వయముగ నిర్మల దర్పణ రూపత్వమును బొందుచున్నాఁడు.

వ్యోమవృక్షఫలస్యాస్య స్వేచ్ఛావయవ ఉజ్జ్వలాః
సర్గోపలమ్భ ఉద్యచ్ఛ చమత్కుర్వన్తి సంవిది. 27

అపరిచ్ఛిన్నమగు బ్రహ్మచైతన్యమున, ఆకాశ వృక్షఫలమును బోలిన (మిథ్యయగు) బ్రహ్మాండముయొక్క స్వేచ్ఛాకల్పితమగు త్రైలోక్యమను అవయవమున, దేదీప్యమానులగు సూర్యచంద్రాదులున్ను, వారినుండి యుత్పన్నమైన నేత్రాది కిరణసమూహమున్ను, జీవభూతుఁడగు ఆత్మయొక్క రూపాదుల దర్శనమున ఉపకరణరూపముచే చమత్కారము చేయుచున్నవి.

అన్తస్థేన బహిష్ఠేన నానా నానాతయాత్మని
ఏష సోఽన్తర్బహిర్భాతి భావాభావ విభావయా. 28

ఆ పరమాత్మయే అభ్యంతరమందలి వాసనామయప్రపంచముగను, బాహ్యమందలి భువనరూప ప్రపంచముగను, స్వప్నమందలి వివిధరూపములుగను, సుషుప్తియందలి యేకమైన అవిద్యారూపముగను ఆవిర్భావ తిరోభావరూపభావనతోడ స్వయముగనే అంతర్బాహ్యములందును బ్రకాశించుచున్నాఁడు. (అతని కన్యముగ నణుమాత్రమైనను లేదని భావము.)

ఏతద్రూపా పదార్థశ్రీరేతస్మిన్నేతదిచ్ఛయా
చమత్కారోత్యేతదర్థం జిహ్వేవ స్వాస్యకోటరే. 29

జిహ్వ తన ముఖరూపబిలమున చమత్కారము చేయునట్లు, చిదాత్మయందు చైతన్యము యొక్క యిచ్ఛచే చిద్రూపములగు పదార్థములు చమత్కారము చేయుచున్నవి.

అస్యామ్బుసో ద్రవత్వం యత్తదిదం జగదుచ్యతే
సంవిత్స్వాదూపలమ్భాఙ్గం భువనావర్తవృత్తిమత్. 30

ఈ చైతన్యమను జలముయొక్క, సంవిత్తే(జ్ఞానమే)స్వాదము గాఁగలిగి యనుభవింపఁబడునట్టి రూపరసాదులు అంగములుగాఁగలదై, లోకములను ఆవర్తములతోఁగూడినట్టి ద్రవత్వమే జగత్తనఁబడుచున్నది.

శామ్యత్యత్ర పదార్థశ్రీః సర్వాసామేవ భాస్వతి
ఏతస్మాదేవ చోదేతి స్వాలోక ఇవ తేజసః. 31

సూర్య, చంద్రాది సమస్త ప్రకాశముల యొక్క రూపాది పదార్థములీ చిద్రూపమందే ప్రకాశించుచున్నవి. మఱియు సుషుప్తిప్రళయములందు దీనియందే లయించుచున్నవి. సూర్యాదుల తేజమునుండి ప్రభామండలముదయించునట్లు, మరల జాగ్రత్స్వప్నములందవి దీనినుండియే యుదయించుచున్నవి.

ఇదమేవ జగత్సర్వం శుక్లత్వం తుహినే యథా
అత ఏతాః ప్రవర్తన్తే విద ఇన్దోరివాంశవః. 32

మంచునందుఁ దెలుపుదనమువలె, ఈ చిద్రూప బ్రహ్మమందే జగత్తంతయును గలదు. (కావున జగత్తంతయు ఈ బ్రహ్మమేయైయున్నది) మఱియు, చంద్రునినుండి కిరణములవలె ఈ బ్రహ్మమునుండియే సమస్త పదార్థములును వెలువడుచున్నవి.

ఏతస్మాద్రద్జగతోఽనఙ్గాజ్జగచ్చిత్రమిదం స్థితమ్
విధ్యభావ వికారాది శాన్తమేతన్మయం తతమ్. 33

ఓ రామచంద్రా! అవయవరహితమగు ఈ చైతన్యమను రంగుచే జగత్తను చిత్రము లిఖింపఁబడియున్నది. కావున ఈజగత్తను నీవు జన్మాది వికారరహితముగను, శాంతముగను, చిన్మయముగను నెఱుఁగుము.

అస్మాద్వనతరోరేతాః స్వరూఢా గగనాఙ్గణే
దృశ్యశాఖాః ప్రవర్తన్తే జగజ్జాలగులుచ్ఛకాః. 34



ఈ చిద్రూపమను గొప్ప వనవృక్షము నుండియే, ఆకాశమను ముంగిలియందు దృఢపడినట్టివియు జగత్సమూహములను పుష్పగుచ్ఛములచే శోభించునవియునగు ఈదృశ్యరూప శాఖలు విస్తరించుచున్నవి.

వ్యయోదయవతీ నూనమత్ర దృశ్యతరఙ్గిణీ
నానాతానన్తకుసుమా వహత్యవిచలాచలే. 35

ఈ బ్రహ్మమను నిశ్చల పర్వతముపై, నిక్కముగ వృద్ధిక్షయయుక్తమైనదియు, అనేకత్వమను అనంతములైన పుష్పములచే శోభాయమానమైనదియునగు దృశ్యమను నది ప్రవహించుచున్నది.

అస్మిన్వ్యోమాత్మకే రఙ్గే భువనాభినయభ్రమైః
నృత్యత్యవిరతారమ్భం వారైర్నియతినర్తకీ. 36

ఈ చిదాకాశమను నాట్యరంగమున జగద్రచనయను అభినయ భ్రమలతోఁగూడినదియు, అనేక కార్యారంభసహితమైనదియునగు, నియతి యను నర్తకి కల్పములను దివసములందు నృత్యమొనర్చుచున్నది.

జగత్కోటిమహాకల్ప కల్పోన్మేష నిమేషణః
వితానే నాట్యతే భూయో జన్యతే కాలబాలకః. 37

అనేక బ్రహ్మండములయొక్క యుత్పత్తిప్రళయములే కను తెఱయుట, కనుమూయుటలుగాఁగల్గియున్న కాలమను బాలకుఁడు బ్రహ్మమను మండపమున మరలమరల నాట్యమొనర్చుచు, ఉపసంహరించుచు మరల యేతెంచుచు నున్నాఁడు.

ఉద్యత్స్వపి జగత్స్వేష శాన్తమేవావతిష్ఠతే
అనిచ్ఛ ఏవ ముకురః ప్రతిబిమ్బశతేష్వివ. 38

అనేక ప్రతిబింబము లుదయించినను అద్దము వికారరహితముగ నుండునట్లు, అనేక బ్రహ్మండము లుత్పన్నమైననుగూడ బ్రహ్మము వికారరహితముగను, శాంతముగను నుండును.

భూతానాం వర్తమానానాం సర్గాణాం సంభవిష్యతామ్
ఏషోఽకారణకం బీజం సర్గాణామివ కారణమ్. 39

స్థూలపంచభూతములకు కారణము సూక్ష్మపంచభూతము లైనట్లు, ఈ చిన్మాత్రమగు బ్రహ్మమే (స్వయముగ కారణరహితమైనను) భూత, భవిష్య ద్వర్తమాన సృష్టులన్నింటికిని కారణమగు బీజమై యొప్పుచున్నది.

అస్యోన్మేషో జగల్లక్ష్మీర్నిమేషః ప్రలయాగమః
అనున్మేషనిమేషోఽసావాత్మన్యేవావతిష్ఠతే. 40

ఈ బ్రహ్మము యొక్క (విస్తరణమే) జగత్తు. అట్టి విస్తరణముయొక్క అభావమే ప్రళయము. కాని, యథార్థముగ ఈరెండు స్థితులందును నయ్యది సమముగఁ దన స్వరూపమందే స్థితి నొందియున్నది.

ఉద్యన్త్యమూని సుబహూని మహామహాన్తి
సర్గాగమప్రలయజన్మదశా జగన్తి
సర్వాణి తాన్యయమపారస్వరూప ఏవ
ప్రస్పన్దనాని మరుదేవ యథాస్స్వ శాన్తమ్. 41

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు
నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే పరబ్రహ్మస్వరూపవర్ణనం నామ
పఞ్చత్రింశః సర్గః ॥ 35 ॥

ఓ రామచంద్రా! వాయువుయొక్క చలనములు వాయురూపములేయైనట్లు, సృష్టిప్రళయ, జనన మరణ, హానిలాభాది దశాసహితములై చిదాకాశమున నుత్పన్నములగు ఈ యనేక మహామహా బ్రహ్మాండములన్నియు అపరిచ్ఛిన్నమైన యా చిదాకాశముయొక్క రూపములే యగునని యెఱింగి శాంతుఁడవై యుండుము.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున
పరబ్రహ్మస్వరూప వర్ణనమను ముప్పదియైదవ సర్గము ॥35॥

---

## షట్త్రింశః సర్గః

[తుచ్ఛస్యానిచ్ఛతో భోగో న బన్ధాయేతి వర్ణ్యతే
ఇచ్ఛైవ పరమో బన్ధస్తత్త్యాగాన్ముక్తిరిత్యపి.

ఇచ్ఛారహితుఁడగు మనుజునకు మిథ్యయగు భోగములు బంధమును గలిగింపఁ జాలవు. ఇచ్ఛయే మహా బంధనము. అద్దాని త్యాగమే ముక్తి-అని యిచట వర్ణింపఁబడు చున్నది.]

శ్రీవసిష్ఠ ఉవాచ:—

చమత్కుర్వన్త్యథానర్థా ఆవర్తా ఇవ వారిణి
ఏకస్వభావాః సకలా యథా వారితరఙ్గకాః. 1

శ్రీవసిష్ఠుఁడు:- ఓ రామచంద్రా! జలమందు ఆవర్తములవలె సమస్త పదార్థములును ప్రథమమున చమత్కారము చేయుచున్నవి. (కోరికను గలుగఁజేయుటద్వారా చిత్తమును భ్రమింపఁజేయు చున్నవి.) ఆ పిదప రాగద్వేషనరకాదిరూపములగు అనర్థములుగఁ బరిణమించుచున్నవి. కాని, జలమందు తరంగములవలె నవియన్నియు యథార్థముగ ఏకమైనట్టి బ్రహ్మస్వభావమే గలిగియున్నవి.

సర్వస్యైవాస్య విశ్వస్య నిర్జ్ఞేయజ్ఞేయరూపిణీ
పరమాకాశతారూపం పరోపశమసంశ్రయా. 2

సర్వపదార్థములందును వ్యాపించినదై, కాని, వాని నామరూపములకంటె వేఱై, కేవలము జ్ఞేయ (సన్మాత్ర)రూపమై చిదాకాశ స్వరూపమై, సమాధిరూపమగు యుపశమనముచే నాశ్రయింపఁదగినదైనట్టి యేకమగు సత్తయే యీ సమస్తవిశ్వమునకుఁ గలదు.



బాలచిన్తా పురోవ్యోమ్ని న కించిదపి మే యథా
తథేదం తత్త్వతో విశ్వం సత్యం తు శిశుచేతసి. 3

బాలుని చింతనముచే నెదుటఁ గల్పింపఁబడిన పిశాచాదిరూపములు ప్రౌఢుని దృష్టియందు కించిత్తైనను లేనట్లు, చిదాకాశమునఁగల్పింపఁబడిన యీ జగత్తున్ను నాయొక్క (విజ్ఞుల) దృష్టియందేమియు లేనిదే యైయున్నవి. అజ్ఞుల చిత్తమునకే యిది సత్యముగఁ దోచును.

అరూపాలోకమననం శిలాపుత్రకసైన్యవత్
రూపాలోకమనస్కార భ్రాన్తి కేవాత్ర విశ్వతా. 4

జ్ఞాని దృష్టియం దీజగత్తు శిలయందుఁ జెక్కఁబడిన సైన్యమువలె, బాహ్యరూపప్రకాశాది రహితమై, అభ్యంతర సంకల్పాది మానసిక చేష్టారహితమై యొప్పుచున్నది. అట్టిచో నీక నాతని దృష్టియందు విశ్వత్వ మెచట? అజ్ఞానిదృష్టియందో, ఈజగత్తురూప సంకల్పాది యుక్తమైయే భాసించుచున్నది.

రూపాలోకమనస్కార సారశ్చిన్మాత్రతాం వినా
న లభ్యతేఽసావపరం వ్యోమేవాత్ర క్వ విశ్వతా. 5

యథార్థముగ విచారించి చూచిన, రూపప్రకాశ సంకల్పాది బాహ్యాభ్యంతర విషయములయొక్క సారము చిన్మాత్రమేయైయున్నది. ఏలయనఁగా, చిదాకాశముకంటె భిన్నముగ నవి లభించుట లేదు. కావున నీక, ప్రపంచత్వ మెచట ?

విదో విత్త్వం జగద్భ్రాన్తి రవిత్త్వం తు న విభ్రమః
విత్త్వావిత్త్వే త్వదాయత్తే చిత్తాచిత్తే యథా తవ. 6

ఓ రామచంద్రా! జ్ఞాతకు జగత్తు నెఱుఁగుటయే జగద్భ్రాంతియైయున్నది. అట్లెఱుఁగకుండుటయే సర్వభ్రమశాంతియగును. ఇఁకనిపుడు స్మరణ, విస్మరణములవలె జగత్తు నెఱుఁగుట, ఎఱుఁగకుండుట నీయొక్క యధీనముననే యున్నవి.

పరమాకాశరూపత్వాచ్చిద్వ్యోమ్నో వితతాకృతేః
న స్వభావవిపర్యాసః కశ్చిత్సంభవతి క్వచిత్. 7

వ్యాపకమగు చిదాకాశము పరమాకాశ (శుద్ధచిన్మాత్రబ్రహ్మ) రూపమగుటచే అద్దాని స్వభావముయొక్క పరివర్తనమేవిధముగను నెచటను సంభవింపఁజాలదు. (ఏలయనగాఁ చైతన్యము జడమెన్నటికిని గాఁజాలదు! ఆకాశమెన్నటికిని మూర్తివంతమున్ను గానేరదు.)

తన్మయస్యాస్య విశ్వస్య న స్వభావవికారితా
విద్యతే ప్రేక్ష్యమాణాపి కిము సాస్య భవిష్యతి. 8

చిన్మయమగు ఈ విశ్వమునకు స్వభావవికారత్వ మేమియును లేదు. ఏలయనిన, విచార దృష్టితో గాంచిన, నామరూపాత్మకమగు వికారరూప జగత్తు బాధితమగుటచే నయ్యది యా చైతన్యమం దెట్లుండగలదు?

సర్వం చిద్వ్యోమ చైవేదం న సత్త్వమహమిత్యపి
వికారాద్యస్తి న జ్ఞప్తావజ్ఞప్తిం న లభేత్క్వచిత్. 9

ఈ సమస్తప్రపంచము చిదాకాశమాత్రమేయై యున్నది. అట్టి జ్ఞానస్వరూపమున అహంకారాది వికారము లెవ్వియును లేవు. మఱియు, జ్ఞానము (చిత్తు) నకన్యముగ నెచటను ఏ పదార్థమున్ను లభింపనేరదు.

సర్వం శాన్తం శివం శుద్ధం త్వమహన్తాదివిభ్రమమ్
న కించిదపి పశ్యామి వ్యోమజం కాననం యథా. 10

'త్వత్త, అహంత్వము' (నీవు, నేను) ఈ మున్నగువానిరూపముగు సమస్తవిభ్రమమున్ను శాంతమై, శివమై, శుద్ధమైనట్టి బ్రహ్మరూపమే యగును. ఆకాశమున నుత్పన్నమగు అరణ్యమును గాంచనట్లు, చైతన్యము (బ్రహ్మము)కంటె వేఱుగ నేనేమియును గాంచుటలేదు.

సంవిదాకాశశూన్యత్వం యత్తద్విద్ధి వచో మమ
ఇదం త్వత్సంవిదాకాశే స్వయమాత్మని తిష్ఠతి. 11

ఓ రామచంద్రా! ఈ నా యుపదేశ వాక్యములనుగూడ శుద్ధమై, (దృశ్య) శూన్యమైనట్టి చిదాకాశ రూపముగనే యెఱుంగుము. ఏలయనిన ఇయ్యవి నీయొక్క చిదాకాశ రూపమగు ఆత్మయందే స్వయముగ స్థితిఁబొందును గాని జడస్వరూపమునఁ గాదు.

పదమాహుః పరం సద్యదనిచ్ఛోదయమాసితమ్
పాషాణ పురుషస్యేవ చిత్రస్థస్యేవ చాసనమ్. 12

శిలయందుఁ జెక్కఁబడిన మనుజునివలెను, చిత్రమందలి మనుజునిచందమునను, ఇచ్ఛారహితమగు చైతన్యముయొక్క స్థితి యేదిగలదో, అదియే పరమపదమని (సద్వస్తువగు ఆత్మయొక్క స్థితియని) వచింపఁబడెను.

స విశ్రాన్తమనా మానీ యస్య ప్రకృతకర్మసు
స్పన్దో దారునరస్యేవ విగతేచ్ఛమనాకులమ్. 13

ఎవనియొక్క ఆచరణ యథాప్రాప్తములగు కర్మలందు ఇచ్ఛా, వ్యాకులత్వరహితమై, కాష్ఠప్రతిమను బోలియుండునో, అతఁడే విశ్రాంతచిత్తుఁడైన జీవన్ముక్తుఁడగు మునియగును.

అన్తఃశూన్యం బహిఃశూన్యం విరసం గతవాసనమ్
జగద్వేణోరివ జ్ఞస్య జీవతో భాతి జీవనమ్. 14

జ్ఞానియగువాని కీప్రపంచజీవనము వెదురునాళమువలె బాహ్యాభ్యంతరములందు శూన్యముగను, రసహీనముగను, వాసనారహితముగను దోచును.

యస్య న స్వదతే దృశ్యమదృశ్యం స్వదతే హృది
సబాహ్యాభ్యన్తరం శాన్తః స వితీర్ణో భవార్ణవాత్. 15



ఎవనికి హృదయమున ఈ దృశ్యప్రపంచము రుచింపదో, అదృశ్యమగు చిన్మాత్రబ్రహ్మము (ఆత్మ) రుచించునో, అట్టివాఁడే బాహ్యాభ్యంతరములందును శాంతుఁడై యుండును. మఱియు నాతఁడే సంసారసాగరమును దాటినవాఁడగును.

ఉచ్యన్తాం శబ్దజాలాని వంశవద్గతవాసనమ్
రసేనానఙ్గలగ్నేన ప్రకృతానన్యచోదనైః. 16

ఓ సభ్యులారా! ప్రారబ్ధకర్మనాశమున కనుపయోగములగు అన్యశబ్దముల నుచ్చారణము లేనట్టి వ్యవహారములందు, దేహాదులందలి అహంకార మమత్వాదులయొక్క సంబంధరాహిత్యమను మాధుర్యముతోఁగూడి, మురళివలె వాసనారహితులై (వాగింద్రియముచే) శబ్దముల నుచ్చరింపుఁడు.

స్పృశ్యన్తాం స్పర్శనీయాని యథా ప్రాప్తాన్యవాసనమ్
కూటాగారవదత్క్షుబ్ధమనిచ్ఛమమనోదయమ్. 17

అట్లే క్షోభావర్జితులై, ఇచ్ఛారహితులై, వాసనలెవ్వియులేక, అమనస్కులై, స్పృశింపదగినట్టి యథాప్రాప్తములగు చందన, మాలాది వస్తువులను (త్వగింద్రియముచే) స్పృశింపుఁడు.

స్వాద్యన్తాం రసజాలాని విగతేచ్ఛాభయైషణమ్
అపరాగాభిలషణం యథా ప్రాప్తాని దర్వివత్. 18

ఆవిధముగనే రాగేచ్ఛాభయాదిరహితులై, వాసనావర్జితులై, యథాప్రాప్తములను రససమూహములను దర్వి (గరిఁటె)వలె (జిహ్వేంద్రియముచే) ఆస్వాదింపుఁడు.

దృశ్యన్తాం రూపజాలాని పునః ప్రాప్తాద్యవాసనమ్
అరసం నిర్మనోమానమగర్వం చిత్రనేత్రవత్. 19

ఆప్రకారముగనే, వాసనారహితులై, నిరభిమానులై, అమనస్కులై, రాగత్యాగ పూర్వకముగ యథాప్రాప్తములగు రూపసమూహములను, చిత్రమందలి మనుజుని నేత్రమువలె (నేత్రేంద్రియముచే) గాంచుఁడు.

జిఘ్రన్తాం గన్ధపుష్పాణి విగతేచ్ఛమవాసనమ్
స్పన్దబన్ధోపలగ్నాని త్యాగాయ వనవాతవత్. 20

అట్లే వాసనేచ్ఛారహితులై, ఘ్రాణేంద్రియసంలగ్నములైన యథాప్రాప్తములగు పుష్పాదులయొక్క సుగంధములను త్యాగముకొఱకై వనవాయువువలె (ఘ్రాణేంద్రియముచే) గ్రహింపుఁడు, (రాగము కొఱకు గాదని భావము.)

ఇతి చేద్విరసత్వేన బోధయిత్వా చికిత్సితాః
న భోగరోగాస్తద్వచ్ఛ శాన్త్యై నాస్తి కథైవ చ. 21

ఈప్రకారముగ, కర్మేంద్రియ, జ్ఞానేంద్రియ విషయములందు నిఃసారత్వముచే మనస్సునకు బోధించుటద్వారా భోగములను రోగములకుఁ చికిత్సగావింపఁబడనిచో నిఁక జీవునకు శాంతిని గూర్చిన వార్తయే యుండదు!

యః స్వాదయన్భోగవిషం రతిమేతి దినేదినే
సోఽగ్నౌ స్వమూర్తిం జ్వలితే కక్షమక్షయముజ్ఝతి. 22

ఎవఁడు భోగములను విషము నాస్వాదించుచు దినదినము ప్రసన్నుఁడగుచుండునో, అట్టి వాఁడు ప్రజ్వలించుచున్న అగ్నియందుఁ దనశరీరముపై నిరంతరము తృణసమూహమును విసరుకొను వాఁడేయగును.

నిరిచ్ఛత్వం సమాధానమాహురాగమ భూషణాః
యథా శామ్యేన్మనోఽనిచ్ఛం నోపదేశశతైస్తథా. 23

ఇచ్ఛారాహిత్యమే సమాధియని వేదవేత్తలలో శ్రేష్ఠులగువారు పలికిరి. ఏలయనిన, మనస్సు ఇచ్ఛారాహిత్యముచే శమించువిధమున, వేలకొలది యుపదేశములచేఁగూడ శమింపఁజాలదు.

ఇచ్ఛోదయే యథా దుఃఖమిచ్ఛాశాన్తిర్యథా సుఖమ్
తథా న నరకే నాకే బ్రహ్మలోకేఽనుభూయతే. 24

ఇచ్ఛ యుదయించుటచే గలుగు దుఃఖము నరకమందును ననుభవింపఁబడనిదై యున్నది. మఱియు, ఇచ్ఛ శమించుటచే గలుగు సుఖము బ్రహ్మలోకమందును ననుభవింపఁబడనిదై యున్నది.

ఇచ్ఛామాత్రం విదుశ్చిత్తం తచ్ఛాన్తిర్మోక్ష ఉచ్యతే
ఏతావన్త్యేవ శాస్త్రాణి తపాంసి నియమా యమాః. 25

ఇచ్ఛామాత్రమే చిత్తమనియు, ఇచ్ఛారాహిత్యమే మోక్షమనియు, వచింపఁబడెను. ఈ యిచ్ఛారాహిత్యమే సమస్త శాస్త్రములయొక్కయు, తపస్సులయొక్కయు, యమనియమాదుల యొక్కయు తాత్పర్యమైయున్నది.

యావతీయావతీ జన్తోరిచ్ఛోదేతి యథాయథా
తావతీతావతీ దుఃఖబీజముష్టిః ప్రరోహతి. 26

ఏ యేప్రకారముగ నెంతెంత యిచ్ఛ జీవున కుదయించుచుండునో, ఆయాప్రకారముగ నంతంత దుఃఖబీజసమూహ మాతనికి వృద్ధినొందుచుండును.

యథాయథేచ్ఛా తనుతాం యాతి జన్తోర్వివేకతః
తథాతథోపశామ్యన్తి దుఃఖచిన్తావిషూచికాః. 27

మఱియు, ఏయే ప్రకారముగ వివేకముచే జీవున కిచ్ఛ సన్నగిలుచుండునో, ఆయా ప్రకారముగ నాతనికి దుఃఖచింతయను మహామారియు శమించు చుండును.

యథాయథేచ్ఛా ఘనతాం యాతి లోకస్య రాగతః
తథాతథా వివర్ధన్తే దుఃఖచిన్తావిషోర్మయః. 28

ఏయే విధముగ మనుజునకు రాగముచే ఇచ్ఛ ఘనమగుచుండునో; ఆయావిధముగ నాతనికి దుఃఖచింతయను విషతరంగములు వృద్ధియగుచుండును.

ఇచ్ఛా చికిత్స్యతే వ్యాధిర్న స్వయత్నౌషధేన చేత్
తదత్ర బలవన్మన్యే విద్యతే నౌషధాన్తరమ్. 29



ధైర్యముచే మనోనిగ్రహమను స్వకీయ పురుషప్రయత్నరూపమగు ఔషధముద్వారా వ్యాధికిఁ జికిత్సగావింపఁబడనిచో నిఁక నట్టి పురుషప్రయత్నముకంటెఁ బలవత్తరమైన ఔషధము వేఱొకటి యద్దాని శాంతికై లేదనియే తలంచెదను.

ఇచ్ఛోపశమనం కర్తుం యది కృత్స్నం న శక్యతే
స్వల్పమప్యనుగన్తవ్యం మార్గస్థో నావసీదతి 30

ఒకేకాలమున ఇచ్ఛలన్నిటిని త్యజింపజాలనిచో, కొంచెము కొంచెముగ వానిఁ ద్యజించుచు రావలెను. ఏలయనిన, సన్మార్గమునఁజను మనుజునకెన్నటికిని దుఃఖము కలుగఁజాలదు.

యస్త్విచ్ఛాతానవే యత్నం న కరోతి నరాధమః
సోఽన్ధకూపే స్వమాత్మానం దివానుదినముజ్ఝతి. 31

ఎవఁడు తన ఇచ్ఛను సన్నగించుటకై ప్రయత్నము సల్పకయుండునో, అట్టినరాధముఁడు ప్రతిదినము తన్ను అంధకూపమునఁ బడదోసికొనువాఁడే యగును.

దుఃఖప్రసవశాలిన్యా బీజమిచ్ఛైవ సంసృతేః
సమ్యగ్జ్ఞానాగ్నిదగ్ధా సా న భూయః పరిరోహతి. 32

దుఃఖములను పుష్ప ఫలాదులచే శోభితమగు సంసారమనులతకు ఇచ్ఛయే బీజమైయున్నది. అయ్యది యుత్తమమైన ఆత్మజ్ఞానమను నగ్నిచే దహింపఁబడినచో నిఁక మరలయెన్నటికిని మొలకెత్తదు.

ఇచ్ఛామాత్రం హి సంసారో నిర్వాణం తదవేదనమ్
ఇచ్ఛానుత్పాదనే యత్నః క్రియతాం కిం వృథాశ్రమైః. 33

ఓ రామచంద్రా! ఇచ్ఛామాత్రమే సంసారము. యిచ్ఛయొక్క అభావమే నిర్వాణము. కాఁబట్టి యిచ్ఛ నుత్పన్నముగాకుండఁ జేయుటయందే ప్రయత్నమాచరింపుము. తక్కిన వ్యర్థప్రయత్నములచే నేమిప్రయోజనము ?

శాస్త్రోపదేశగురవః ప్రేక్ష్యన్తే కిమనర్థకమ్
కిమిచ్ఛాననుసంధానసమాధిర్నాధిగమ్యతే. 34

ఓ రామచంద్రా! శాస్త్రములకొఱకును, గురువుల యుపదేశముకొఱకును వ్యర్థముగ నేల ప్రతీక్షించుచున్నావు! ఇచ్ఛారాహిత్యమను చిత్తశాంత్యుపాయము నేల యాశ్రయించుటలేదు ?

యస్యేచ్ఛాననుసంధానమాత్రే దుఃసాధ్యతా మతేః
గురూపదేశశాస్త్రాది తస్య నూనం నిరర్థకమ్. 35

ఎవనికి తనవివేకముచే ఇచ్ఛను రహితమొనర్చుట మాత్రమందు దుస్సాధ్యత్వము గానుపించుచున్నదో, అట్టివానికి నిక్కముగ గురూపదేశ, శాస్త్రాదులు నిరర్థకములేయగును.

ఇచ్ఛావిషవికారిణ్యామన్త ఏవ నృణామలమ్
దుఃఖప్రసరకారిణ్యాం హారిణ్యా జన్మ జఙ్గలే. 36

వ్యాఘ్రాదులచే వ్యాప్తమగు అరణ్యమున ఆఁడు జింకకు మరణము నిశ్చితమైనట్లు, దుఃఖములను విస్తరింపఁజేయునదియు, ఇచ్ఛయను విషయముయొక్క వికారములతోఁ గూడినదియు నగు సంసారమున మనుజులకు మరణము నిశ్చలమైయున్నది.

న బాలీక్రియతే తీవ్రషదాత్మజ్ఞానాయ చేదసా
ఇచ్ఛోపశాన్తిః క్రియతాం తయాలం తదవాప్యతే. 37

ఇచ్ఛచే మనుజుఁడు బాలునివలె చపలుఁడు గాకయున్నట్లైన, ఆత్మజ్ఞానము కొఱకాతనికి అల్పప్రయత్నమే గావింపవలసియుండును. కావున, ఇచ్ఛయొక్క శమనముకొఱకే యత్నమాచరింపవలయును. దానిచే మనుజుఁడు బాగుగ ఆత్మజ్ఞానమును బొందగల్గును.

నిరిచ్ఛతైవ నిర్వాణం సేచ్ఛతైవ హి బన్ధనమ్
యథాశక్తి జయేదిచ్ఛాం కిమేతావతి దుష్కరమ్. 38

ఇచ్ఛయొక్క అభావమే నిర్వాణము. ఇచ్ఛయే బంధనము. కాఁబట్టి యిచ్ఛను యథాశక్తి జయింపవలెను. ఇంతమాత్రమున దుష్కరమైనది యేమిగలదు?

జరామరణజన్మాది కరజ్ఞఖదిరావలేః
బీజమిచ్ఛా సదైవాన్తర్దహ్యతాం శమవహ్నినా. 39

ఓ రామచంద్రా! జన్మ, జరా, మరణాదులను కంటకవృక్ష సమూహమునకు ఇచ్ఛయే బీజమైయున్నది. అద్దానిని నిరంతర మభ్యస్తమగు శమమను అగ్నిచే నంతఃకరణమున దహింపఁజేసివేయుము.

యతో యతో నిరిచ్ఛత్వం ముక్తతైవ తతస్తతః
యావద్గతి యథాప్రాణం హన్యాదిచ్ఛాం సముత్థితామ్. 40

ఎచటెచట ఇచ్ఛయొక్క అభావముండునో, అచటచట ముక్తియు విద్యమానమైయుండును. కావున, వివేకవైరాగ్యాదులు పూర్ణముగ గలుగునంతవఱకు, పైకిలేచునట్టి యిచ్ఛను యథాశక్తి నశింపఁజేయవలెను.

యతో యతశ్చ సేచ్ఛత్వం బన్ధపాశాస్తతస్తతః
పుణ్యాపాపమయా దుఃఖరాశయో వితతార్తయః. 41

ఎచటెచట ఇచ్ఛగలదో, అచటచట బంధన పాశములున్ను, పుణ్యాపాపమయములగు దుఃఖరాశులున్ను, మహాబాధలున్ను నుండియేయుండును.

ఇచ్ఛానిరాసరహితే గతే సాధోః క్షణేఽపి చ
దస్యుభిర్ముషితస్యేవ యుక్తమాక్రన్దితుం చిరమ్. 42

ఇచ్ఛను రహితమొనర్పక సాధువగువాఁ డొక్కక్షణమైనను గడపినచో, చోరులచే నపహరింపఁబడిన సర్వస్వముగలవానివలె చిరకాలము రోదనమొనర్పవలసియుండును.

యథాయథాస్య పుంసోఽన్తరిచ్ఛా సముపశామ్యతి
తథాతథాస్య కల్యాణం మోక్షాయ పరివర్ధతే. 43



మనుజున కేయేవిధముగ ఇచ్ఛ యంతఃకరణమున శమించుచుండునో, ఆ యావిధముగ నాతనికి మోక్షముకొఱకై శుభదాయకమగు సాధన చతుష్టయ సంపత్తియు వృద్ధియగుచుండును.

ఆత్మనో నిర్వివేకస్య యదిచ్ఛాపరిపూరణమ్
సంసారవిషవృక్షస్య తదేవ పరిషేచనమ్. 44

వివేకరహితమగు ఆత్మ(జీవుని)యొక్క, విషయోపభోగముద్వారా యిచ్ఛను బరిపూర్ణమొనర్చుట యేదిగలదో, అదియే సంసారమను విషవృక్షముయొక్క సేచనము(తడుపుట)అయియున్నది.

హృద్వృక్షజాః స్వసుఖదుఃఖకు బీజకోశా
వైరాదివాశ్రయకృతాదశుభాఇచ్ఛభాచ్చ
ఆసాద్య దుష్కృతకృశానుశిఖాః శితాన్తా
ఇచ్ఛాచ్ఛమచ్ఛమితి పుంస్పశుమాదహన్తి. 45

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు
నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే సంసారబీజకథనం నామ
షట్త్రింశః సర్గః ॥ 36 ॥

ఓ రామచంద్రా! హృదయమను వృక్షమున జనించినవియు, తీక్ష్ణమైన అగ్రభాగము గలవియు, ఇచ్ఛారూపములునగు దుష్కృతమను అగ్నియొక్క శిఖలు, అటనున్నట్టి జీవుఁడను పశువును, తమయాశ్రయమగు హృదయమున నొనర్పఁబడిన పుణ్యాపాపరూపమగు స్వాశ్రయదోషాపరాధముచే నుత్పన్నమైన వైరముచేవలె, మోహమను ధూమముచే నంధునిగఁజేసి, రాగాది పాశములచే దృఢముగ బంధించి, కిందఁబడద్రోసి, సుఖదుఃఖ బీజములకు కోశరూపమగు దాని యండకోశములను ఛమచ్ఛమను ధ్వనిచే బూర్ణముగ దహించివేయుచున్నవి.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున
సంసారబీజకథనమను ముప్పదియాఱవ సర్గము ॥36॥

---

## సప్తత్రింశః సర్గః

[యథేచ్ఛైవ న జాయేత జాతాపి బ్రహ్మ కేవలమ్
తథోపపత్తిభిర్భూయో జ్ఞానయోగోఽత్ర వర్ణ్యతే.
దేనిచే ఇచ్ఛయే జనింపదో, జనించినచో కేవలము బ్రహ్మరూపముగనే యెంచఁబడునో, అట్టి జ్ఞానయోగము యుక్తులచే నిచట వర్ణింపఁబడుచున్నది.]

శ్రీవసిష్ఠ ఉవాచః —

ఇచ్ఛావిషవికారస్య వియోగం యోగనామకమ్
శాన్తయే శృణు భూయోఽపి పూర్వముక్తమపి స్ఫుటమ్. 1

శ్రీ వసిష్ఠుఁడు:- ఓ రామచంద్రా! ఆత్మసంయోగమను పేరుగల్గిన ఇచ్ఛయను విషవికారముయొక్క వియోగమును గూర్చి పూర్వప్రసంగమున స్పష్టముగ వచించియున్నప్పటికిని, అట్టి యిచ్ఛయొక్క సంపూర్ణశాంతి కొఱకు మరల యద్దానిఁగూర్చి వినుము.

ఆత్మనో వ్యతిరిక్తం చేద్విద్యతే తదిహేచ్ఛయా
ఇష్యతామసతి త్వేతత్స్వాత్మాన్యత్వం కిమిష్యతే. 2

ఓ రామచంద్రా! ఆత్మకంటె వేఱుగ నేదేని పదార్థముండెనేని, దానిఁగూర్చి యిచ్ఛగింపుము. ఏదియు లేనిచో నిఁక ఆత్మకంటె వేఱుగ దేని నిచ్ఛగించెదవు? (ఆత్మజ్ఞానము కలుగునంతవఱకు, రెండవవస్తువు సత్యమను భ్రాంతిచే ఇచ్ఛయిదయించును. ఆత్మజ్ఞానయోగముచే నిఁక రెండవ వస్తువు లేదని తెలియఁగా మరల దేనిఁగూర్చి యిచ్ఛ జనించును? కావున, ఆత్మజ్ఞానమే విషయపరిహారముద్వారా ఇచ్ఛానివృత్త్యుపాయమని భావము.)

నిర్భాగావయవా సూక్ష్మా వ్యోమ్నః శూన్యతరైవ చిత్
సైవాహం జగదాకారా సతీ కిం తత్రయేష్యతే. 3

అవయవరహితమై (త్రిపుటీ విభాగవర్జితమై) ఆకాశముకంటెను సూక్ష్మమై, అతిశూన్యమై (దృశ్యరహితమై) నట్టి చైతన్యమేది గలదో, అదియే, అహంభావ జగదాకారములచే నుండియుండ నిఁక నద్దానికంటె వేఱుగ దేని నిచ్ఛగించెదవు?

సా వ్యోమరూపా వ్యోమైవ వ్యోమాత్మ వేద్యవేదికా
వ్యోమాత్మ జగదాభాసమత్రేచ్ఛావిషయోఽస్తి కః. 4

యీ యాకాశమున్ను, విషయములున్ను, వాని జ్ఞాతయు ఆకాశరూపమగు ఆ చైతన్యమే యైయున్నవి. ఈ జగత్తుయొక్క ఆభాసమున్ను ఆ చిదాకాశరూపమే యైయున్నది. అట్టిచో నిట ఇచ్ఛకు విషయమెద్ది గలదు.

గ్రాహ్యగ్రాహకసంబన్ధః కుతశ్చిదితి తన్న నః
విద్యతేఽసౌ ప్రశాన్తానాం యేషామస్తి న వేద్మి తాన్. 5

ప్రశాంతచిత్తులమగు మనకీ అజ్ఞానదృష్టి ప్రసిద్ధమగు గ్రాహ్యగ్రాహక సంబంధమె ప్రమాణముచేతను లేదు. ఈ హేతువువలనగూడ మనమిఁక దేని నిచ్ఛగించుదుము? ఎవరిదృష్టియందిట్టి గ్రాహ్యగ్రాహక సంబంధము గలదో, వారినిన్ని నే నాత్మకంటె వేఱుగ నెఱుఁగుటలేదు.

గ్రాహ్యగ్రాహకసంబన్ధః స్వనిష్ఠోఽపి న లభ్యతే
అసతస్తు కథం లాభః కేన లబ్ధోఽసితః శశీ. 6

ఆత్మనిష్ఠితమైనప్పటికిని గ్రాహ్యగ్రాహక సంబంధము లభించుటలేదు. ఏలయనఁగా, అసత్తగునది యెట్లు లభించును? చంద్రునకు నలుపువర్ణముండుట నెవరుగాంచిరి?

ఏషైవ గ్రాహకాదీనాం సత్తా యన్నాత్మనిష్ఠతా
స్వభావావేక్షయా సత్యా న జానే క్వ ప్రయాన్తి తే. 7



అజ్ఞానముచే ఆత్మయందు నిష్ఠలేకపోవుటయే గ్రాహ్యగ్రాహకాదులయొక్క సత్తయై యున్నది. అశాస్త్రీయ దృష్టిచేతనే యవియన్నియు సత్యములుగఁ దోచుచున్నవి. శాస్త్రీయమగు తత్త్వవిచారముచే నవి యెచటికో పలాయనమగుచున్నవి.

ఏష ఏవ స్వభావో యద్ద్రష్టృదృశ్యక్షయోఽఖిలః
జ్ఞాత్వాఽసత్యా వినిర్వాణమహన్తాత్మని గచ్ఛతి. 8

అసత్యమగు 'అహంత్వము' శాస్త్రములద్వారా! స్వతత్త్వమెఱిఁగి, అట్టి ఆత్మతత్త్వజ్ఞానముచే ఆత్మయందే విలీనమగుచున్నది. అదియే ద్రష్టృదృశ్యాదుల సంపూర్ణక్షయరూపమగు నిర్వాణము. ఆత్మజ్ఞానముయొక్క స్వభావమిదియే.

నిర్వాణే నాస్తి దృశ్యాది దృశ్యాదౌ నాస్తి నిర్వృతిః
మిథోఽనయోరనుభవో న ఛాయాతపయోరివ. 9

నిర్వాణమున దృశ్యాదులు లేవు; దృశ్యాదులందు శాంతిరూపమగు నిర్వాణమున్ను లేదు. ఛాయ, ఆతపము (నీడ, ఎండ)ల వలె ఈ రెంటియొక్క పరస్పరానుభవము (కూడిక) గలుగనేరదు.

ఉభే ఏతే మిథోఽసత్యే అసత్యే చ న నిర్వృతిః
యతో నిర్వాణమజరమదుఃఖమనుభూయతే. 10

ఈ రెంటి (నిర్వాణ, దృశ్యముల) యొక్క సహభావము గలిగినచో, పరస్పరము బాధితములగుట బట్టి రెండును అసత్యములగును. అట్లుగాక విద్వజ్జనుల యనుభవమున బాధితములగుటచే నిలువనివి, అసత్యమునందు శాంతిలేదు. కాని, నిర్వాణమో, అజరముగను, దుఃఖశూన్యముగను తత్త్వజ్ఞులకనుభూతమగుచున్నది.

భ్రమభూతం చ దృశ్యాది నిత్యం నాత్ర సుఖప్రదమ్
అసచ్చ తద్భావ్యతాం మా నిర్వాణే స్థీయతామజే. 11

ఓ రామచంద్రా! దృశ్యాదులు సదా దుఃఖదాయకములును, భ్రమరూపములునైయున్నవి. కావున, అసత్తగు ఆ దృశ్యాదులను భావింపకుము. అజమైనట్టి నిర్వాణమున (ఆత్మపదమున) స్థితిగల్గియుండుము.

శుక్తికారూప్యసదృశం ప్రేక్షితం యన్న లభ్యతే
అర్థకార్యపి తన్నాస్తి కిమత్రాపహ్నవేన చ. 12

శుక్తి (ముత్తెపు చిప్ప)యందలి రజతము (వెండి) వలె విచారించిచూచిన నేది లభించుటలేదో, అయ్యది మనుజునకే ప్రయోజనకారియు గానేరదు. కావున నిట ఈదృశ్యములు మిథ్యగా నెఱుఁగుటచే నేమి హానిగలదు?

తత్సద్భావాన్మహద్దుఃఖమసద్భావాన్మహత్సుఖమ్
అభావః సోపపత్తిస్తు దృఢతాం యాతి భావనాత్. 13

దృశ్యమును సత్యమని తలంచుటచే మహాదుఃఖమున్ను, దృశ్యము అసత్యమని తలంచుటచే మహాసుఖమున్ను గలుగును. ఆత్మయొక్క మననసహితమగు నిదిధ్యాసనముచే నట్టి దృశ్యముయొక్క అభావము దృఢపడును.

తత్కిమాత్మని బన్ధాయ విదగ్ధం న ముధాధమాః
స్పష్ట ఏవోపచయాదేర్వస్తున్యస్తమితాఽపదే. 14

ఓ మనుజాధములగు అజ్ఞానులారా! ఉత్పత్త్యాది వికారములకు విషయము గానట్టి స్వప్రకాశరూపమగు ఆత్మ (కరతలామలకమువలె) స్పష్టముగ స్ఫురించుచుండ నద్దానిని మీ రేల దర్శింపకయున్నారు? మఱియు ఆత్మయందు బంధహేతువైనట్టి దృశ్యసమూహమును జ్ఞానాగ్నిచే దహింపఁజేయక యేల వ్యర్థముగ నున్నారు?

కార్యకారణభావాది బ్రహ్మైవ సకలం యదా
తదా తు బ్రహ్మతా హ్యస్మిన్సంవిన్మాత్రాత్మకే తతే. 15

ఎపుడు కార్యకారణభావాదులన్నియు బ్రహ్మమే యగుచున్నవో, అపుడే దేహాది పరిచ్ఛిన్న పదార్థముల బాధచే విస్తారమును బొందిన చిన్మాత్ర స్వరూపమున బ్రహ్మత్వము సిద్ధించును గాని, అణుమాత్రమైనను దృశ్యము శేషించినపుడు గాదు.

మార్గయన్తి ప్రబోధాయ తైర్మృగైరలమస్తు నః
వ్యోమరూపే కిలైకస్మిన్సర్వాత్మని తతే సతి. 16

చిదాకాశరూపమై, ఏకమై, సర్వవ్యాపకమై, పరిపూర్ణమైనట్టి సర్వాత్మయగు బ్రహ్మమందు కార్యకారణాది దృశ్యము నంగీకరించి బ్రహ్మప్రబోధము కొఱకు సాధనముల నెవరు వెతకుచున్నారో, అట్టి పశుతుల్యులగు మనుజులతో మాకుఁ బ్రయోజనములేదు. (వారి పరిశ్రమ వ్యర్థమని భావము.)

కార్యకారణతాఖ్యానాం ముక్తీనామేవ కః క్రమః
యో హేతుః స్పన్దనే వాయోర్ద్రవత్వే సలిలస్య చ. 17
శూన్యత్వే నభసః సౌమ్య సర్గాదిత్వే చిదాత్మనః
కార్యకారణభావాది బ్రహ్మైవ సకలం యదా. 18
తదా బ్రహ్మణి సర్గాణాం కారణార్థా విలజ్జతా

కార్యకారణ పూర్ణములగు వాక్యములందు అవిద్యతప్ప మఱియే క్రమముగలదు? సౌమ్యుడవగు రామచంద్రా! వాయువుయొక్క చలనమందును, జలముయొక్క ద్రవత్వమందును, ఆకాశముయొక్క శూన్యత్వమందును నేహేతువు గలదో, అదియే చిదాత్మయొక్క సృష్టిత్వమందును గలదు. కార్యకారణభావాదులన్నియు నెపుడు బ్రహ్మమే యైయున్నవో, అపుడు బ్రహ్మమందు సృష్టులయొక్క కారణత్వమును వచించుట నిర్లజ్జత్వమే యగును.

న దుఃఖమస్తి న సుఖం శాన్తం శివమయం జగత్. 19

కావున సుఖముగాని దుఃఖముగాని లేదు. ఈజగత్తు కేవలము శాంతమై, శివమయమై యున్నది;



నాస్తి చిన్మాత్రతాన్యత్వమత ఇచ్ఛోదయః కుతః
మృద్దేహయోధసేనాయాం న మృన్మాత్రేతరద్యథా. 20

మృత్తికచే నిర్మింపబడిన యోధుల సైన్యమున మృత్తికతప్ప అన్యమేమియు లేనట్లు, ఈ జగత్తునందు, చిన్మాత్రము తప్ప వేఱెద్దియు లేకయుండ నిఁక ఇచ్ఛయొక్క యుదయ మెచట నెట్లు సంభవించును?

న సజ్జగదహన్త్వాదా దృశ్యే బ్రహ్మేతరత్తథా

జగత్తు, అహంత్వము - ఇత్యాదిరూపమగు దృశ్యమున బ్రహ్మముకంటె వేఱైనది యొకింతైనను సత్యముగాదు

శ్రీరామ ఉవాచ:—

ఏవం చేత్తదుదేత్విచ్ఛా మావోదేతు మునీశ్వర. 21
సా తు బ్రహ్మైవ కోఽర్థః స్యాదస్యా విధినిషేధనే

శ్రీరాముఁడు. — ఓ మునీశ్వరా! అట్లైనచో నిఁక ఇచ్ఛయుదయించినను, ఉదయింపకుండినను నొకటియే గదా! అంతయు బ్రహ్మరూపమైయుండ, ఇచ్ఛయు బ్రహ్మరూపమే యగును గాన నద్దానిని యుత్పత్తిచే నిఁక నేమిహానిగలదు? అపుడిఁక విధినిషేధములవలన నేమి ప్రయోజనము?

శ్రీవసిష్ఠ ఉవాచ.—

జ్ఞాతాయాం సంప్రబుద్ధాయామిచ్ఛా బ్రహ్మైవ నేతరత్. 22
యథా సంబుద్ధవాన్నామ తత్సత్యం కిం త్విదం శృణు

శ్రీ వసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! ఆత్మజ్ఞాన ముదయించిన మీదట ఇచ్ఛయు బ్రహ్మమే యగును గాని, యన్యముగాదని నీ వెఱింగిన యీ విషయము సత్యమేయైయున్నది కాని యిదియును వినుము:—

యదాయదా జ్ఞతోదేతి శామ్యతీచ్ఛా తదాతదా. 23
వస్తుస్వభావాదుదయత్యాదిత్యే యామినీ యథా
శామత్యేవ న తూదేతి జ్ఞప్తావిచ్ఛాది తత్తథా. 24

ఎపుడాత్మ జ్ఞానముదయించునో, అపుడిచ్ఛయు శమించును. ఏలయనిన, ఇది యా ఆత్మజ్ఞానముయొక్క స్వభావమైయున్నది. సూర్యుఁడుదయించుటతోడనే, రాత్రి శమించునట్లు, జ్ఞానముదయించగనే యిచ్ఛాదులున్ను శమించిపోవును.

యథాయథోదయే జ్ఞప్తేర్ద్వైతశాన్తిస్తథాతథా
వాసనావిలయశ్చైవ కథమిచ్ఛోదయో భవేత్. 25

జ్ఞాన మెట్లెట్లుదయించుచుండునో, అట్లట్లు ద్వైతశాంతియు, వాసనావిలయమున్ను సంభవించుచుండును. అపుడిఁక ఇచ్ఛ యెట్లుదయించును?

తస్యాఽవిద్యోపశాన్తేయం నిర్మలా ముక్తతోదితా
అశేషదృశ్యవైరస్యాద్యస్యేచ్ఛోదేతి న క్వచిత్. 26

ఎవనికి సమస్తదృశ్య పదార్థములందును వైరాగ్యము గలుగుటచే, ఏకాలమందును, ఇచ్ఛ యుదయింపకయుండునో, అతనికి సంసారమును గూర్చిన అవిద్య నశించి నిర్మలమగు ముక్తియుదయించినదగును.

విరక్తతాస్య నో దృశ్యే నోదేత్యత్రాస్య రక్తతా
కేవలం ద్రష్టృదృశ్యశ్రీః స్వదతే న స్వభావతః. 27

అట్టి యిచ్ఛారహితునకు దృశ్యపదార్థములందు రాగముగాని, ద్వేషముగాని యుదయింపకుండును. కేవలము స్వభావముగనే యాతనికి దృష్టదృశ్యములయొక్క శోభ రుచింపకుండును.

కాకతాలీయయోగేన పరప్రేరణయానయా
యది కించిత్కదాచిచ్చ సమ్యగిచ్ఛతి వా న వా. 28

అట్టి జ్ఞాని, ఆకస్మిక ఘటనచేగాని, లేక ఇతరుల ప్రేరణచేగాని, శాస్త్రములచే నిషేధింపఁబడని అన్నదానాది పదార్థముల నెపుడైన యొకింతయిచ్ఛగించును. లేక ఇచ్ఛగింపకయుండును.

తదస్య నేచ్ఛా నేచ్ఛా వా బ్రహ్మైవాత్ర న సంశయః
ఇచ్ఛా న జాయతే జ్ఞస్యావశ్యమేవాను వా న వా. 29

అపుడా ఆత్మజ్ఞానికి ఆ ఇచ్ఛయు, అనిచ్ఛయు రెండును బ్రహ్మరూపములే యగును. ఇందు సంశయమేమియును లేదు. లేక, జ్ఞానికి పూర్వాభ్యాసము ననుసరించి యైనను నూతనమగు ఇచ్ఛ అవశ్య ముదయింపకుండును.

జ్ఞతా చేదుదితా జన్తోస్తదిచ్ఛాస్యోపశామ్యతి
నైతయోః స్థితిరేకత్ర ప్రకాశతమసోరివ. 30

జీవున కెపుడాత్మజ్ఞాన ముదయించునో, అపుడిచ్ఛ శమించుచున్నది. ఏలయనిన, ప్రకాశ, అంధకారములవలె నీరెంటికిని నొకచోట స్థితి యెన్నటికిని సంభవింపబదు.

ప్రతిషేధవిధీనాం తు తజ్జ్ఞో న విషయః క్వచిత్
శాన్తసర్వైషణేచ్ఛస్య కోఽస్య కిం వక్తి కిం కృతే. 31

శాస్త్రములయొక్క విధినిషేధములకు జ్ఞానియెన్నడును విషయము కానేరఁడు. ఏలయనిన, సమస్త ఏషణలు, వాంఛలు నశించిన యాతనికి నెవఁడే ప్రయోజనము కొఱకేమి వచింపఁగలఁడు?

ఏతదేవ జ్ఞతాచిహ్నం యదిచ్ఛాస్వతితానవమ్
హ్లాదనం సర్వలోకానామథానుభవ ఏవ వా. 32

ఇచ్ఛ పూర్ణముగ సన్నగిలుట, సమస్తజనులను అభయదానముచే ప్రసన్నమొనర్చుట, ఆత్మానందానుభవముచేఁ దృప్తుఁడైయుండుట—ఇదియే ఆత్మజ్ఞాని యొక్క చిహ్నమైయున్నది.



దృశ్యం విరసతాం యాతం యదా న స్వదతే క్వచిత్
తదా నేచ్ఛా ప్రసరతి తదైవ చ విముక్తతా. 33

దృశ్యపదార్థము లెపుడు నీరసములై, రుచింపకయుండునో, అపుడే వానియెడ నిచ్ఛ ప్రసరింపకుండును. అపుడే ముక్తి యుదయించును.

బోధాదనైక్యమద్వైతం యః శాన్తమవతిష్ఠతే
ఇచ్ఛానిచ్ఛాదయః సర్వే భావాస్తస్య శివాత్మకాః. 34

ఆత్మజ్ఞానముచే ద్వైతాఽద్వైతరహితమగు శాంతరూపమున నెవఁడు స్థితిగల్గియుండునో, వానికి ఇచ్ఛానిచ్ఛాది సమస్తపదార్థములున్ను బ్రహ్మరూపములేయగును.

బోధాదస్తమితద్వైత మద్వైతైక్యవివర్జితమ్
యః స్వచ్ఛో విగతవ్యగ్రః శాన్త ఆత్మన్యవస్థితః. 35
నైవ తస్య కృతేనార్థో నాకృతే నేహ కశ్చన
న చాస్య సర్వభూతేషు కశ్చిదర్థవ్యపాశ్రయః. 36

ఆత్మజ్ఞానముచే నశించిన ద్వైతముగలవాఁడును, ద్వైతాఽద్వైత (ద్విత్వ, ఏకత్వసంఖ్యా) వివర్జితుఁడును, నిర్మలుఁడును, వ్యాకులత్వరహితుఁడును, ప్రశాంతుఁడును, ఆత్మయందుస్థితిగల్గియున్నవాఁడునగు జ్ఞాని కీప్రపంచమునఁ గార్యమొనర్చుటచేగాని, ఒనర్పకపోవుటచేగాని యే ప్రయోజనమున్ను లేదు. మఱియు సమస్తభూతములందు నాతనికిఁ బ్రయోజననిమిత్త మాశ్రయింపవలసిన పదార్థ మొకటియును లేదు.

నానిచ్ఛయా నేచ్ఛయాథ న సతా నాసతా సదా
నైవాత్మనా న చాన్యేన నైతైర్మరణజీవితైః. 37

అట్టి జ్ఞానికి ఇచ్ఛచేగాని, అనిచ్ఛచేగాని, సత్తుచేగాని, అసత్తుచేగాని, ఆత్మచేగాని, లేక మఱియేనిచేగాని, జీవితముచేగాని, మరణముచేగాని యెప్పుడును ఏ ప్రయోజనమున్ను లేదు.

ఇచ్ఛా చ తస్య నోదేతి నిర్వాణస్య ప్రబోధినః
యది చోదేతి తస్యేచ్ఛా బ్రహ్మ శాశ్వతమేవ సా. 38

నిర్వాణరూపుఁడును, ప్రబుద్ధుఁడునగు అట్టిజ్ఞానికి ఇచ్ఛయే యుదయింపదు. ఒకవేళ యెపుడైన యుదయించినను, అది నిత్యమగు బ్రహ్మముయొక్క రూపమే యగును.

న దుఃఖమస్తి న సుఖం శాన్తం శివమజం జగత్
ఇతి యోఽన్తః శిలేవాస్తే తం ప్రబుద్ధం విదుర్బుధాః. 39

సుఖముగాని, దుఃఖముగాని లేదు; ఈ జగత్తు శాంతమై, శివ(బ్రహ్మ) మయమైయున్నది' అని యువ్విధమున నిశ్చయించి యెవఁడంతఃకరణమున శిలవలె నిశ్చలముగ నుండునో, అతనినే పండితులు ప్రబుద్ధుఁడు (ఆత్మజ్ఞాని) అని వచింతురు.

దుఃఖం సుఖం భావనయా కుర్వన్విష మివామృతమ్
ఇతి నిశ్చిత్య ధీరాత్మా ప్రబుద్ధ ఇతి కథ్యతే. 40

ఇట్లు ఆత్మతత్త్వమును నిశ్చయించి యెవఁడు విషము నమృతముగ నొనర్చునట్లు, దుఃఖమునున్ను నిరతిశయానందాత్మభావనచే సుఖముగను నొనర్చుచు ధీరచిత్తుఁడై యుండునో, ఆతఁడే ప్రబుద్ధుఁడని చెప్పఁబడును.

తత్స్థితం వ్యోమని వ్యోమ శాన్తే శాన్తం శివే శివమ్
శూన్యే శూన్యం సతి చ సద్యద్బ్రహ్మణి జగత్స్థితమ్. 41

అట్టి జ్ఞానస్థితియందు, చిదాకాశరూపమై, శాంతమై, శివమై, (దృశ్య) శూన్యమై, సద్వస్తువైనట్టి బ్రహ్మమున, చిదాకాశరూపమై, శాంతమై, శివమై, (దృశ్య) శూన్యమై, సద్వస్తువైనట్టి జగత్తు స్థితిగల్గియున్నట్లను భూతమగును. ఇదియే జ్ఞానముయొక్క పరాకాష్ఠ.

అసంవేదనసంవిత్తే తతేఽవిశ్వమితి స్థితే
సౌమ్యే సమసమే శాన్తే శివేఽహంతా భ్రమః క్షయీ. 42

ఇవ్విధమున జగత్తు బ్రహ్మమయమై స్థితిగల్గియుండ, విషయవర్జితమై, చిదాకాశరూపమై, వ్యాపకమై, సౌమ్యమై, సమమై, శాంతమై, శివమైనట్టి యాబ్రహ్మమున, అహంకారాది భ్రమమంతయు క్షయించినదేయగును.

యదిదం దృశ్యతే కించిజ్జగత్స్థావరజంగమమ్
తత్సర్వం శాన్తమాకాశం పరచిన్తాపురోపమమ్. 43

మనోరాజ్యనగరము బోలిన స్థావరజంగమాత్మకమగు ఈజగత్తెయ్యది గానుపించుచున్నదో, అది యంతయు శాంతమైనట్టి చిదాకాశమే యైయున్నది.

పరచిన్తాపురోమధ్యే గతవిఘ్నం గమాగమౌ
యథాన్తస్తవ శూన్యత్వాత్తథైవాస్మిజ్జగద్భ్రమే. 44

అన్యపురుషుని మనోరాజ్యముచేఁ గల్పితమగు నగరమధ్యమున నీయొక్క గమనాగమనములు ముగ నెట్లు సిద్ధించునో, అట్లే యీ జగద్రూపమగు భ్రమయందును తత్త్వజ్ఞుని గమనాగమనములు సిద్ధించుచున్నవి.

అబ్ధిద్యుర్వీనదీశైలశోభాశూన్యతరాత్మని
జృమ్భతే ద్రష్టృకరణం గతతృష్ణామ్బువీచివత్. 45

దప్పికగొనియున్నవాని నేత్రము జలరహితమగు సమ్ముఖప్రదేశమున మృగతృష్ణాజలతరంగరూపమున విజృంభించునట్లు, సముద్ర, పృథివీ, నదీ, పర్వతాదుల శోభ యొకింతైనను లేనట్టి ఆత్మయందు ద్రష్టయొక్క అంతఃకరణము తత్సముద్రాదుల రూపమున విజృంభించుచున్నది.

స్వప్ననిర్మాణపురవద్బాలవేతాల తాలవత్
యదిదం దృశ్యతే తత్ర కిం కిలాసత్యతేతరత్. 46



స్వప్ననగరమువలెను, బాలుని బేతాళమువలెను గాన్పించునట్టి యీజగత్తునందు అసత్యత్వము (మిథ్యాత్వము) దప్ప వేఱేమిగలదు.

అసత్యమేవాహమితి భాసతే సత్యమేవ చ
భ్రాన్తిభాజం వినైవేయం భ్రాన్తిః స్ఫురతి సా సతీ. 47

సత్యమగు బ్రహ్మమే అసత్యములగు (అహంత్వ)జగదాదుల రూపమున భాసించుచున్నది. కావున ఏయీ భ్రాంతి భ్రాంతిపాత్రము గాకనే స్ఫురించుచున్నదో, అయ్యది వాస్తవముగ సత్యమే యైయున్నది.

న సన్నాసన్న సదసత్కిమపీదమతీన్ద్రియమ్.
అవాచ్యం జగదిత్యేవ భాత్యవక్షుభితం ఖవత్. 48

ఈజగత్తు సత్తుకాదు, అసత్తుకాదు, ఉభయరూపము (సదసత్తున్ను) గాదు. ఇయ్యది యింద్రియములచే నిశ్చయింపఁబడని తత్త్వమై, అనిర్వచనీయమై, గంధర్వనగరాదిరూపమగు అక్షుబ్ధమైన యాకాశము భంగి భాసించుచున్నదగును.

ఇహేచ్ఛానిచ్ఛతే జ్ఞస్య శామ్యతాం యదలం సమే
తథాపి శ్రేయసే మన్యే నన్వనిచ్ఛోదయం స్ఫుటమ్. 49

ఓ రామచంద్రా! జ్ఞానికి తత్త్వబోధబలముచే విషయములు పూర్ణముగ శమించుటచే, ఇచ్ఛయు, అనిచ్ఛయు సమముగ నున్నప్పటికిని, విక్షేపరహితమగు జీవన్ముక్తిసుఖమను శ్రేయము గొఱకుగాను, అనిచ్ఛ (ఇచ్ఛయుదయింపమి) యే యాతనికి నుత్తమమైనదని నేను దలంచుచున్నాను.

అహం జగదితి జ్ఞప్తిః ఖే ఖస్యేవేయమాస్థితా
చిదాత్మనో యథా వాయోః స్పన్దో నాత్రాస్తి కారణమ్. 50

వికారరహితమగు ఆకాశమందు ఆకాశమునుండి వాయువు, వాయువునుండి యగ్ని ఇత్యాది క్రమముచే అహంకారజగద్రూపములుగ జ్ఞప్తి (చైతన్యము) యుండినట్లు, అజ్ఞానావృతమగు చిదాత్మయందీజగత్తున్ను వాయువునందు చలనమువలె యుండియున్నది. ఇటవేఱుకారణమెద్దియును లేదు.

చితశ్చేత్యోన్ముఖత్వం యత్తచ్చిత్తం సైవ సంసృతిః
సేచ్ఛా తన్ముక్తతా ముక్తిర్యుక్తిం జ్ఞాత్వేతి శామ్యతామ్. 51

ఓ రామచంద్రా! చైతన్యము విషయాభిముఖమగుటయే చిత్తము; అదియే సంసారము. మఱియు నదియే యిచ్ఛ. అట్టి యిచ్ఛనుండి విముక్తమగుటయే ముక్తి. ఇట్టి ముక్తి నెఱిఁగి యిచ్ఛారహితుఁడవై శాంతముగ నుండుము.

ఇచ్ఛా భవత్వనిచ్ఛా వా సర్గో వా ప్రలయోఽథవా
క్షతిర్న కస్యచిత్కాచిన్న చ కించిదిహాస్తి హి. 52

ఇచ్ఛ యుండినను, అనిచ్ఛ యుండినను, సృష్టియుండినను, ప్రళయ ముండినను, ఆత్మజ్ఞానికి సందేహానియున్న లేదు. ఏలయనిన, ఈ జగత్తు సత్యముకాదు.

ఇచ్ఛానిచ్ఛే సదసతీ భావాభావౌ సుఖాసుఖే
ఇత్యత్ర కలనా వ్యోమ్ని సంభవన్తి న కాశ్చన. 53

ఆత్మజ్ఞానరూపమగు చిదాకాశమున, ఇచ్ఛ, అనిచ్ఛ, సత్తు, అసత్తు, భావము, అభావము, సుఖము, దుఃఖము – ఇత్యాది కల్పన లెవ్వియు సంభవింపజాలవు.

ఇచ్ఛానాం తానవం యస్య దినానుదినమాగతమ్
వివేకశమతృప్తస్య తమాహుర్మోక్షభాగినమ్. 54

వివేకముచేతను, శమముచేతను తృప్తుఁడగు యే మనుజునియొక్క యిచ్ఛలు దినదినము సన్నగిల్లుచుండునో, అతఁడు మోక్షభాజనుఁడని వచింపఁబడును.

ఇచ్ఛాక్షురికయా విద్ధే హృది శూలం ప్రవర్తతే
జయన్తి యత్ర నైతాని మణిమన్త్రౌషధాని చ. 55

ఇచ్ఛయను కత్తిచేఁ బొడువఁబడ, హృదయమున శోకమోహాదుల వేదనమను శూల (నొప్పి) జనించుచున్నది. తచ్ఛూల నివారణమున మణిమంత్రౌషధాదులెవ్వియును జయింపఁజాలవు. (కుంఠితములేయగునని భావము.)

యాన్కార్యకరణవ్యూహాన్సృతవాన్పూర్వమేవ తాన్
సంప్రేక్షయా న పశ్యామి మిథ్యాభ్రమభరాదృతే. 56

బ్రహ్మదేవుఁడు ఏ మణిమంత్రౌషధాది కార్యకరణ సమూహమును జీవుని దుఃఖచికిత్సార్థము సృజించెనో, అవి యెవ్వియును మిథ్యాభ్రమ పరిపూర్ణుఁడగు మనుజుని చికిత్సయందు సమర్థములగుటను నేను గాంచలేదు. ఏలయనిన, పూర్వమే నేను వానిని బరీక్షించి చూచితిని.

భ్రమభూతేన కుర్మశ్చేద్వ్యవహారమవస్తునా
తత్కస్మాత్పరచిత్తాద్రిః కమ్బలత్వం న నీయతే. 57

భ్రాంతిసిద్ధమై, మిథ్యయైనట్టి మనయొక్క యుపాయముచే నితరుని భ్రాంతిసిద్ధమైన దుఃఖమును నివారించుటయను వ్యవహార మాచరింప గల్గితిమేని, మనయొక్క మనోరథముచే కల్పితమైనట్టి బహుయోజన విస్తృతమైన ముఖముచే అన్యుని చిత్తముచేఁ గల్పింపబడిన పర్వతాదు లేల కబళింపఁబడకున్నవి?

అసతా వ్యవహారశ్చేత్ప్రేక్షామాత్రవినాశినా
క్రియతే శశశృఙ్గేణ తత్కథం ఖాద్యతే న ఖమ్. 58

విచారమాత్రముచే నశించునట్టి అసత్పదార్థముచే సంసారదుఃఖ నివారణయను వ్యవహారము సంభవించుచో, కుందేటికొమ్ముచే నాకసమేల కప్పఁబడకున్నది?

అహంభావాచ్చిదాకాశో జాడ్యాతిశయతః క్షణాత్
పాషాణతాం జలమివ మనస్త్వాద్యాతి దేహతామ్. 59



శీతాధిక్యతచే జలము క్షణకాలములో ఘనీభవించి శిలారూపమును బొందునట్లు, చిదాకాశమున్ను దేహాదులందలి అహంభావరూపమగు అభిమానముచే మనస్సుద్వారా దేహాద్యాకారములఁ బొందుచున్నది.

చిత్త్వాదనుభవత్యేతామసత్యామేవ దేహతామ్
అవినష్టైవ చిచ్ఛక్తిః స్వప్నే స్వమరణం యథా. 60

జడమగు దేహరూపమును బొందినప్పటికిని చిదాకాశముయొక్క వాస్తవమగు చిత్-శక్తి అక్షయమైయే యుండును. అద్దానిచే నది స్వప్నమందలి స్వమరణమును వలె, అసత్యములగు దేహాదుల ననుభవించుచున్నది.

వ్యోమ్న్యసత్యమవస్తుత్వాత్సత్యం చానుభవాద్యథా
నీలత్వం తద్వదీశేఽస్మిన్సర్గో నాసన్న సన్మయః. 61

ఆకాశమందలి నీలత్వము అవస్తువగుటచే అసత్యమై, అనుభవముచే సత్యమై యెట్లున్నదో, అట్లే పరమాత్మయందీసృష్టియు సత్యము గాకయు, అసత్యము గాకయునున్నదై, అనిర్వచనీయమై యొప్పుచున్నది.

యథా శూన్యత్వనభసోర్యథా స్పన్దనభాస్వతోః
భేదో నాస్తి తథా సర్గబ్రహ్మణోరేకరూపయోః. 62

-ఆకాశ, శూన్యత్వములకును, వాయు, స్పందములకును భేదము లేనట్లు, ఏకరూపములే యైనట్టి బ్రహ్మ, సృష్టులకును భేదములేదు.

నేహ సంజాయతే కించిజ్జగదాది న నశ్యతి
స్వప్నే నిద్రాగతస్యేవ కేవలం ప్రతిభాసతే. 63

యథార్థముగ నిట (బ్రహ్మమున) జగదాది పదార్థము లుత్పన్నములగుటలేదు. నశించుటలేదు. నిద్రించినవానియొక్క స్వప్నమువలె నవి కేవలము ప్రతిభాసమాత్రములే యైయున్నవి.

అవిద్యమానే పృథ్వ్యాదౌ ప్రతిభామాత్రరూపిణి
సర్గే క ఇవ సంరమ్భస్త్యాగాదానైశ్చిదమ్బరే. 64

ఇట్లు పృథివ్యాదులు లేనివేయనియు, సృష్టి ప్రతిభాసమాత్రమే యనియు, సిద్ధింపనిఁక చిదాకాశమున గ్రహణ త్యాగాదులఁ గూర్చిన అభినివేశమేల?

న దేహః ప్రతిభాతోఽస్తి పృథ్వ్యాదికారణాన్వితః
కేవలం బ్రహ్మచిన్మాత్రమేవాత్మన్యేవ సంస్థితమ్. 65

పృథివ్యాది కారణములతోఁ గూడిన యీదేహమున్ను లేనిదేయగుచు, ప్రతిభాసమాత్రమే యైయున్నది. కేవలము చిన్మాత్రమగు బ్రహ్మమే తనయందుఁ దాను స్థితిగల్గియున్నది.

బుద్ధ్యాదేః కరణత్వం చ ద్వైతే క్వాసంభవాన్న సత్
అనేనేదం క్రియత ఇత్యస్యార్థం యాతి సంభవాత్. 66

ద్వైత, ఏకత్వములు అసంభవములగుటచే బుద్ధ్యాదుల కరణత్వమున్ను, అసత్యమైయున్నది. ఏలయనఁగా అంతయు బ్రహ్మరూపమగుటచే దీనిచే నిది చేయఁబడుచున్నదను నీవ్యవహారమున్ను అసత్తేయగును. కావున పరమార్థవస్తువొకటియే సంభవమగుటచే సమస్తము తద్రూపమునే పొందుచున్నది.

అహేతురక్రమం భాతి చితి కల్పక్రియాగణః
క్షణేనైవ యథా స్వప్నే మృతి జన్మాదిసత్వరాః. 67

ఈ చైతన్యమున కల్పములు మహాకల్పములు, వాని క్రియాసమూహము సహేతుకముగను, సక్రమముగను నున్నట్లు ప్రతిభాసించినను, స్వప్నమందు క్షణకాలములో శీఘ్రముగ సంభవించు జననమరణాదులవలె అహేతుకములును, క్రమరహితములునై యున్నవి.

ఖమేవ పృథ్వీ ఖం శైలాః ఖమేవ దృఢభిత్తయః
ఖమేవ లోకాఃస్పన్దః ఖం సర్గసంవేదనం చితేః. 68

చైతన్యమునకుఁ దనస్వరూపముననే సృష్టినిగూర్చిన యనుభవము కలుగుటఁబట్టి పృథివియు, పర్వతములున్ను, దృఢమైన భిత్తిసముదాయమున్ను, సమస్తలోకములున్ను, చలనమున్ను, చిదాకాశమేయై యున్నవి.

వ్యోమభిత్తౌ జగచ్చిత్రం చిద్రఙ్గ మయమాతతమ్
నోదేతి నాస్తమాయాతి న శామ్యతి న తామ్యతి. 69

చిదాకాశమను భిత్తి (గోడ) పై జగత్తను చిత్రము చైతన్యమను రంగుచేఁ బరిపూర్ణమై వ్యాపించియున్నది. అది (జగత్తు) యుదయించుటలేదు. అస్తమించుటలేదు శమించుటలేదు, గ్లానిఁ బొందుటలేదు.

చిద్వారిణి జగత్తుఙ్గతరఙ్గద్రవరూపిణి
కింను వా కథముత్పన్నం కిం శాన్తం చ కదా కథమ్. 70

చైతన్యమను ద్రవరూపమైన జలమున జగత్తను నెత్తైనఁ తరంగము భాసించుచున్నది. అట్టిచో నిఁక నేదియెట్లు, ఎపుడుత్పన్నమైనది? ఏది శమించినది?

శాన్తే మహాచిదాకాశే జగచ్ఛూన్యత్వశాలిని
చేత్యాసంభవతః సన్తి నోదయాస్తమయాః కుతః. 71

జగచ్ఛూన్యత్వముచే శోభించునదియు, శాంతమైనదియునగు చిదాకాశమున విషయమే (జగదాదులే) యసంభవమగుటచే నిఁక జగద్రూపముచే చైతన్యముయొక్క యుదయాస్తమయము లెట్లు సంభవించును.

పర్వతా గగనాయన్తే గగనం పర్వతాయతే
సంవేదనప్రయోగేణ బ్రహ్మణః సర్గతాస్థితౌ. 72

బ్రహ్మము (మాయచే) సృష్టిరూపమున విస్తృతము కాగా చైతన్యముయొక్క వాసనానుసారమగు సంకల్పముచే పర్వతములున్ను ఆకాశరూపములు కాఁగలవు. ఆకాశమున్ను పర్వతరూపము కాఁగలదు.



సంవిచ్చూర్ణప్రయోగేణ నిమేషార్ధేన యోగినః
కుర్వన్తి జగదాకాశమాకాశం త్రిజగన్తి చ 73

చైతన్యమను సిద్ధచూర్ణముయొక్క ప్రయోగముచే యోగులు జగత్తును ఆకాశముగను ఆకాశమును ముల్లోకములుగను అర్ధనిమిషములో గావించుచున్నారు.

సిద్ధసంకల్పనగరాణ్యసంఖ్యాని యథామ్బరే
తథా సర్గసహస్రాణి సన్తితాని తు చిన్నభః. 74

సిద్ధులచేఁ గల్పితములగు అసంఖ్యాతములైన నగరము లాకాశమున గుప్తముగను, పరస్పరము మిళితము గాకయు నుండునట్లు, చిదాకాశమున వేలకొలది సృష్టులున్ను గలవు.

మహార్ణవే యథావర్తా అన్యోన్యమపి మిశ్రితాః
పృథగేవావతిష్ఠన్తే పయసో ఽన్యే చ నైవ తే. 75
మహాచితి మహాసర్గా అన్యోన్యమపి మిశ్రితాః
పృథగేవావతిష్ఠన్తే వ్యతిరిక్తా న తే తతః. 76

మహాసముద్రమున అనేక ఆవర్తములు పరస్పరము మిళితములైయున్నను వేర్వేఱుగ యెట్లు కానుపించునో, కాని యవియన్నియు జలముకంటె నెట్లు వేఱుకావో, అట్లే మహాచైతన్యమున గొప్ప బ్రహ్మాండము లనేకములు పరస్పరము కూడియున్నను, వేర్వేఱుగనే కానుపించుచున్నవి. కాని, యవియన్నియు ఆ చైతన్యముకంటె వేఱు గానివై యున్నవి.

సర్గాత్సర్గాన్తరాలోకే యా ప్రబుద్ధస్య యోగినః
సిద్ధలోకాన్తరే ప్రాప్తిః సైవేతి విబుధోక్తయః. 77

తత్త్వజ్ఞానియగు యోగి తన యుపాధిని మూల చైతన్యమున లయింపఁజేసి, పరస్పరము గుప్తములుగా నున్నను సిద్ధుల లోకాంతరములందు బ్రవేశించుట యేదిగలదో? అదియే యొక సృష్టి నుండి మఱియొక సృష్టిని బొందుటయని విజ్ఞులు పల్కుదురు.

అవినాశిని భూతాని స్థితాని పరమే శివే
వ్యోమ్నీవ శూన్యతోల్లాసాః సర్గవర్గా నిరర్గలమ్. 78

ఆకాశమందు శూన్యత్వమువలె, నాశరహితమగు పరబ్రహ్మమున సమస్త భూతములున్ను, వాని భోగ్యములగు సృష్టిసమూహ విలాసములున్ను నిర్విఘ్నముగ స్థితిగల్గియున్నవి.

పరమార్థనిజామోదాః సహజాః సర్గవిభ్రమాః
నోద్యన్తి నోపశామ్యన్తి లేఖా ఇవ శిలోదరే. 79

ఈ సృష్టి విభ్రమములు పరమార్థ చిదాకాశముయొక్క నిజక్రీడారూపములును, స్వాభావికములునై యున్నవి. కావున, స్ఫటిక శిలయందలి రేఖలవలె నవి యుదయించుటలేదు. అస్తమించుటలేదు,

అన్యోన్యం కుసుమామోదా మిలితా అప్యమీలితాః
వ్యోమరూపాస్తథా సర్గా అన్యోన్యం సిద్ధభూమయః. 80

పుష్పముల సుగంధములున్ను, సిద్ధుల లోకములున్ను పరస్పరము కలిసియున్నను వేఱ్వేఱుగనే కానుపించునట్లు, చిదాకాశరూపములగు యీ సృష్టులున్ను వేర్వేఱుగ కానుపించుచున్నవి.

సంకల్పాకాశరూపత్వాత్సర్వానుభవవర్తినః
తనుసంకల్పమోహానాం సత్యాశ్చ మనసోక్తయః. 81

సంకల్పాకాశ రూపముగలదగుటచే ఈ ప్రపంచము స్థూల సంకల్పము, స్థూలమోహము గల పామరుల దృష్టియందు స్థూలముగను, సూక్ష్మ, సూక్ష్మతర, సూక్ష్మతమ సంకల్ప, మోహములు గల యోగుల దృష్టియందు క్రమముగ సూక్ష్మముగను, సూక్ష్మతరముగను, సూక్ష్మతమముగను, స్థితి గల్గియున్న దగును. ఇవ్విధమున వారివారి యనుభవము ననుసరించి సర్వులయొక్క కథనమున్ను సత్యమే యైయున్నది.

న జ్ఞానవాదితా సత్యా న బాహ్యానర్థ వాదితా
యథా వేదనమేతాని వేదనాని ఫలన్తి వః. 82

ఓ వాదులారా! ఆభ్యంతర విజ్ఞాన మాత్రమే సత్యమని పచించు విజ్ఞానవాదుల మతము కాని, బాహ్య దృశ్య వస్తువులును, అనర్థ హేతువులునైనట్టి ద్రవ్య, గుణ, కర్మాది సప్త పదార్థములే సత్యమని వచించు వైశేషికుల మతముగాని యథార్థముగ సత్యముకావు. కాని మీమీ సంకల్పానుసారమవియన్నియును సత్యములై ఫలించుచున్నవి. (అంతేకాని పారమార్థికసత్యము కానేరవని భావము).

చితి చిత్త్వం యదస్యాస్తర్జగదిత్యేవ భావితే
భేదో ద్రవత్వపయసోరివ నాత్రోపపద్యతే. 83

జ్ఞాతృ జ్ఞాన జ్ఞేయరూపమగు త్రిపుటిని ప్రకాశింపఁజేయునట్టి శక్తి యెయ్యది చైతన్యమునగలదో, అదియే వాస్తవముగ జగద్రూపమున భాసించుచున్నది. కావున జల, ద్రవత్వములందువలె చైతన్యజగత్తులనందు భేదము తగదు.

కాలో జగన్తి భువనాన్యహమత్వవర్గ
స్త్వం తాని తత్ర చ తథేతి చ సర్వమేకమ్
చిద్వ్యోమ శాన్తమజమవ్యయమీశ్వరాత్మ
రాగాదయః ఖలు న కేచన సంభవన్తి. 84

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు
నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే దృశ్యోపదేశయోగో నామ
సప్తత్రింశః సర్గః ॥ 37 ॥

ఓ రామచంద్రా! సర్వాధారమగు కాలము, తదంతర్గతమగు బ్రహ్మాండములు, వానియందలి పదునాల్గులోకములు ఆ లోకములందలి 'అహం, త్వం' (నేను, నీవు) ఇత్యాది భోక్తలు, ఆభోక్తల యుపకరణములగు ఇంద్రియసమూహము. శబ్దస్పర్శాది భోగ్యవిషయములు, వాని విచిత్రభోగములు ఈ సమస్తమున్ను మాయిక సర్వజ్ఞత్వ, సర్వశక్త్యాది సంపన్నమగు ఈశ్వరాత్మయై, పరమార్థమున నేకమై,



శాంతమై, అజమై, అవ్యయమైనట్టి చిదాకాశమేయైయున్నది. ఇట్టి నిశ్చయము గల్గియుండుటచే నిఁక రాగాదులెవ్వియును సంభవింప నేరవు. (ఇచ్ఛాది సర్వదోషముల జయించుట యందిదియే ముఖ్యోపాయమని భావము)

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్థమున
దృశ్యోపదేశయోగమను ముప్పదియేడవ సర్గము ॥ 37 ॥

---

## అష్టత్రింశః సర్గః

[ ఇహ చిచ్చేత్యసంసర్గ భేద భ్రమనిరాసతః
చిదేవ జగదిత్యేతత్సత్తర్కైరుప పాద్యతే ॥

చిత్తు, చేత్యము (సృష్టి) వీనియొక్క భేదమును నిరసించుటద్వారా చిన్మాత్రమే జగత్తను విషయమిచటను త్తమ తర్కములచే నిరూపింప బడుచున్నది.]

శ్రీవసిష్ఠ ఉవాచ:—

చిత్పశ్యతి జగన్మిథ్యా స్వవేదనవిబోధితా
వ్యోమ్ని మాయాఞ్జనాసిక్తా దృగివాచలతాన్తరమ్. 1

శ్రీవసిష్ఠుఁడు.— ఓ రామచంద్రా! మాయాస్వభావమగు అంజనముచే లిప్తమైన నేత్రము ఆకాశమునఁ బర్వత, శిఖర, వన, కుంజాదులను, దర్శించునట్లు, చైతన్యము మిథ్యయగు తనయొక్క అబ్రహ్మత్వభ్రమచే (తానుజీవుడను భావముచే) విక్షేపము నొంది జగత్తును గాంచుచున్నది.

బ్రహ్మసర్గశ్చిత్తసర్గో ద్వావేతౌ సదృశౌ మతౌ
పరమార్థస్వరూపత్వాదక్షుబ్ధత్వాత్సదైవ చ. 2

పరమార్థమున రెండును నేకస్వరూపములై, చిద్రూపములై సదా క్షోభవర్జితములై యుండుటఁబట్టి, బ్రహ్మముయొక్క సృష్టియు, చిత్తముచే సంకల్పితమగు సృష్టియు, రెండును సమానములేయై యున్నవి.

జ్ఞానరూపతయా బాహ్యం బాహ్యం చానుభవత్తథా
సత్యరూపమతః సత్యాం విద్ధి బాహ్యార్థరూపతామ్. 3

ఓ రామచంద్రా! భిత్తియందు, చిత్రింపఁబడిన సృష్టి భిత్తిరూపమేయైయున్నను, భ్రమచే బాహ్యరూపముగ భాసించునట్లు, జ్ఞానము(చిత్తు)నందుఁగల్పింపఁబడిన జగద్రూపసృష్టియుఁజ్ఞానరూపమేయైయున్నను, భ్రాంతానుభవముచే బాహ్యరూపముగ భాసించుచున్నది. కావున, జ్ఞానము సత్యరూపమైనందున బాహ్యపదార్థ రూపత్వమున్ను (జ్ఞానరూపముచే) సత్యమనియే యెఱుఁగుము.

బాహ్యార్థవాదవిజ్ఞానవాదయోరైక్యమేవ నః
వేదనాత్మైకరూపత్వాత్సర్వదా సదసంస్థితేః. 4

పదార్థ, విజ్ఞానాదులన్నియు సదా చిదాత్మైక రూపములగుటచేతను, సద్రూపముకంటె భిన్నముగ బాహ్యప్రపంచ స్థితిలేకయుండుటచేతను, బాహ్యపదార్థవాదమున్ను, అభ్యంతర విజ్ఞానవాదమున్ను, పరమార్థమున నొకటియే యైయున్నవి.

అక్షుబ్ధఖానిలాలోకజలభూశాన్తిశాలినీ
తతా శూన్యా మహారమ్భా బ్రహ్మసత్తైవ సర్వతః. 5

సమస్త పదార్థములు చిద్రూపములేయగుటచే, క్షుబ్ధములగు ఆకాశ, వాయ్వగ్నిజలభూములను పంచభూతముల సత్తయంతటను క్షోభవర్జితమై, శాంతియుతమై, వ్యాపకమై, మహారంభయుక్తమైనట్టి బ్రహ్మసత్తయే యైయున్నది.

తస్మై సర్వం తతః సర్వం తత్సర్వం సర్వతశ్చ తత్
తచ్చ సర్వమయం నిత్యం తస్మై సర్వా[illegible]నే నమః. 6

ఆ బ్రహ్మరూపుఁడగు పరమాత్మ కొఱకే యీ సమస్తమున్ను అయియున్నది. ఆతని నుండియే యీ సమస్తమున్ను నుద్భవించినది. ఆతఁడే సమస్తమునై యున్నాడు. అంతట నాతఁడే వ్యాపించియున్నాడు, ఆతఁడే సర్వమయుఁడై నిత్యము వెలుఁగుచున్నాఁడు, అట్టి, సర్వరూపుఁడగు పరమాత్మకు నమస్కారము.

చిన్మయత్వాద్యదా చేత్యమేతి ద్రష్టృ చితైకతామ్
తదా దృశ్యాఙ్గమైవై తచ్చేత్యతే నాన్యథా చితా. 7

సర్వము చిన్మయమగుటచే ఘటాది విషయ మెపుడు ద్రష్టయొక్క నేత్రవృత్త్యవచ్ఛిన్నమగు చైతన్యముతోటి వృత్తివ్యాప్తిద్వారా యేకత్వమొందునో, అపుడు దృశ్యము శరీరముగాఁగలిగిన యా చైతన్యముచేతనే తద్ఘటాదులు ప్రకాశింపఁబడునుగాని యన్యవిధముగఁగాదు. (వ్యవహారకాలమందును. చైతన్యమువలననే విషయములకు సత్తాస్ఫూర్తి గలుగుచున్నదనుట)

యదా చిన్మాత్రమేవేయం ద్రష్టృదర్శన దృశ్యదృక్
తదానుభవనం తత్ర సర్వస్య ఫలితం స్థితమ్. 8

ఇట్లు, ద్రష్టృదర్శనదృశ్యములు చిన్మాత్రైక్యములేక సిద్ధింపనందుచే, చిన్మాత్రరూపములే యగుటచే, ఈ సమస్త జగత్తుయొక్క స్వరూపము పరమార్థముగ అనుభవ మాత్రమేయై యున్నదను ఫలితము తేలుచున్నది.

ద్రష్టృదృశ్యే న యద్యైకమభవిష్యచ్చిదాత్మకే
తద్దృశ్యాస్వాదమజ్ఞః స్యాన్నాదృష్ట్వేక్షుమివోపలః. 9

ద్రష్టృదృశ్యములు సాక్షియగు చైతన్యమున నేకరూపములుగానిచో, చెఱకును భక్షించుటకై ప్రవృత్తుఁడగు మనుజుఁడు ఆ చెఱకును జూచి దానిని భక్షించుచున్నను శిలవలె నద్దాని మాధుర్యానుభవము లేక యుండవలసియుండును. ఏలయనిన, జడమగువాఁడు రసానుభవమును గావింపలేడు, జడమగు [illegible]మున్ను వానియెడల స్ఫురింపలేదు.

చిన్మయత్వాచ్చితౌ చేత్యం జలమ[illegible]వ మజ్జతి
తేనానుభూతిర్భవతి నాన్యథా కాష్ఠయోరివ. 10



జలమందుఁ బడిన జలబిందువు ఆజలముతోడ ఏకరూపమును బొందునట్లు, చిన్మయమగుటచే విషయమున్ను చైతన్యమున లీనమై యేకరూపమగుచున్నది. కావుననే, 'నేనీ, రసము నాస్వాదించుచున్నాను. నేనీరూపమును జూచుచున్నాను.' అను అనుభవము గలుగుచున్నది. అట్లు'కానిచో' ఒక కాష్ఠము మఱియొక కాష్ఠము ననుభవింపఁజాలనట్లు, అనుభవము లేకయేయుండెడిది.

సజాతీయైకతాభావాద్యద్వత్కాష్ఠం న చేతతే
దారు తద్వదపి ద్రష్టా దృశ్యం నాజ్ఞాస్యదాజడమ్. 11

కాష్ఠమునకును, దారువు (కొయ్య)కును సజాతీయమగు యేకత్వమున్నప్పటికిని, కాష్ఠము దారువు నెఱుఁగజాలనట్లు, దృశ్యము చైతన్యముతోటి యేకత్వములేనిదై సర్వథా జడరూపమైనచో, ద్రష్ట దాని నెపుడును నెఱుఁగజాలకయే యుండెడివాఁడు.

యాదృక్సత్తాని కాష్ఠాని తాదృగ్రూపం త్వచేతనమ్
జానన్తి నేతరత్తస్మాద్దృశ్యం చిద్దృశ్యచేతనమ్. 12

కాష్ఠాది దృశ్యపదార్థముల స్థితి యేది గలదో, అట్టి అచేతనరూపమునే సర్వులు నెఱుఁగుచున్నారు. కాని తద్విలక్షణమై, సర్వత్ర వ్యాపించియున్నట్టి చైతన్యరూపస్థితి యేది వానికిఁ గలదో దాని నెవరును నెఱుఁగుటలేదు. కావున, పైనఁదెల్పిన యుక్తిచే ద్రష్టయు, దృశ్యమున్ను రెండును చైతన్యరూపములే యగును.

మహాచిదాత్మనైవాస్తి జలానిలధరాశ్మతమ్
నైతేషు స్పన్దబుద్ధ్యాది ప్రాణజీవాద్యభావతః. 13

జల, వాయు, పృథివీ, శిలాది పదార్థములన్నియు మహాచిద్రూపములేయైయున్నవి. ఏలయనిన, వీనియందు స్పంద, బుద్ధి, ప్రాణ, జీవాదులు లేవు.

ప్రాణబుద్ధ్యాదయః సత్తాం భావనావశతో గతాః
భావనా చిచ్చమత్కారః స యథేచ్ఛముదేతి చ. 14

ప్రాణ, బుద్ధి, జీవాదులు భావనా (కల్పనా) వశముచేతనే సత్తను బొందుచున్నవి. భావనయో, చైతన్యముయొక్క చమత్కారమే యైయున్నది. ఆ చమత్కారము యథేచ్ఛగ నుదయించును.

జగత్తయా శాన్తతయా బ్రహ్మసత్తావతిష్ఠతే
పుంస్త్వయాగత ఏవాత్మా రేతోవటక బీజయోః. 15

బ్రహ్మసత్తయగు ఆత్మ వీర్యమందు పురుషశక్తితోడను, వటబీజమున వృక్షశక్తితోడను, నుండునట్లు, జాగ్రత్స్వప్నములందు జగద్రూపముతోను, సుషుప్తి, ప్రళయములందు శాంతరూపముతోను నుండియున్నది.

సర్వాగ్రాణుమయే బీజే యోఽస్మాదగ్రగతోఽణుకః
సస తత్తద్భవత్యగ్రం బీజం స్వాత్మని సంస్థితః. 16

బీజమంతటను సారమైన పదార్థమేదిగలదో అదియే పరమాత్మ. ఆ పరమాత్మయే, అంకుర, శాఖాది రూపమై మరల బీజరూపమగుచున్నాఁడు.

బ్రహ్మ సర్వపరాణ్వాత్మా యో యస్మాదర్థతోఽణుకః
స స తత్తద్భవేద్వస్తు వస్తు బ్రహ్మైవ తిష్ఠతి. 17

బ్రహ్మము సర్వ వస్తువులకంటె నతిసూక్ష్మమైనట్టి పరమాణురూపమై యున్నది. కావున, బీజాదులందే యేసూక్ష్మవస్తువులు కారణరూపముచే, ప్రసిద్ధమైయున్నవో, అవియవి బ్రహ్మమే యగును. మఱియు స్థూలరూపములగు కార్యములెవ్వి గలవో, అవి మాయమయమై, మిథ్యయే యగును. దీనిచే, సర్వత్ర సారమైన వస్తువు బ్రహ్మమే యైయున్నదని సిద్ధించుచున్నది.

ద్రవ్యమేవ యథా ద్రవ్యం తిర్యగూర్ధ్వమధస్తథా
సర్వమేవ తథా బ్రహ్మ యేన తేన యథా తథా. 18

ఘటాది పదార్థములందుఁ బైనగాని, క్రిందగాని, ప్రక్కలగాని, యెచటఁ జూచినను ఘటాదిపదార్థమే కానుపించునట్లు జగత్తునందా మూలాగ్రముగ నెవరెవరెట్లెట్లు పరీక్షించి చూచినను వారివారికి సమస్తము బ్రహ్మరూపముగనే కానుపించుచున్నది.

హేమత్వమేవ నాన్యత్వం నామరూపశతే యథా
శాన్తత్వమేవ శాన్తస్య సర్గాహన్త్వగణే తథా. 19

అనేకములగు సువర్ణాభరణములందు సువర్ణముతప్ప యన్యమెద్దియు లేనట్లు. జగజ్జీవాది సమూహమంతటను బ్రహ్మముతప్ప వేఱేమియును లేదు.

పార్శ్వస్థస్వప్నమేఘౌఘః యథా తవ న కాశ్చన
సర్గప్రలయసంరమ్భాస్తథా ఖాత్మాన ఏవ మే. 20

ఓ రామచంద్రా! నీ ప్రక్కన నిదురించుచున్నవానియొక్క స్వప్నమందలి మేఘ సమూహములు నీకేమియు లేనట్లు, చిదాత్మరూపుఁడగు నాకు సృష్టి, ప్రళయ సంరంభము లెవ్వియును లేవు.

పఙ్క్తా కల్పితా వ్యోమ్నా యా పుత్రిక పతాకినీ
సా యథా శాన్తతామాత్రం ఖమేవేదం తథా జగత్. 21

ఆకాశమందుఁ గల్పింపఁబడిన పులినశ్యముగాని, గంధర్వనగర సైన్యముగాని శాంతమగు ఆకాశమాత్రమే యైనట్లు, ఈ సమస్త జగత్తున్ను చిదాకాశమాత్రమే యైయున్నది.

సంకల్పభ్రమ ఏవాన్తః పుష్పీభూయ జగత్స్థితమ్
జలావనితలక్లిన్నబీజం కల్ప ఇవ ద్రుమః. 22

భూతలములపై జలముచే దడుపఁబడిన వటాదిబీజములు ప్రాణులకు ఛాయాదుల నొసంగ సమర్థమగు వృక్షరూపమగునట్లు, సంకల్పభ్రమయే యంతఃకరణమునఁ బుష్పరూపమై బాహ్యమున జగద్రూప ఫలాకారమున నావిర్భవించుచున్నది.

అనహన్తాత్మనో జ్ఞస్య సత ఏకత్వమాసతః
జరత్తృణలవాయన్తే నను నామాణిమాదయః. 23



అహంభావరహితుఁడును, నిరతిశయానంద స్వరూపమగు బ్రహ్మముతోఁటి యేకత్వమును బొందినవాఁడునగు జ్ఞానియొక్క దృష్టియందు, అణిమాది సిద్ధులు శిథిలమైన తృణలేశమువలెఁ దుచ్ఛముగఁ గన్పట్టును.

త్రైలోక్యం తన్న పశ్యామి సదేవాసురమానుషమ్
ఏకరోమాంశవిశ్వస్య యల్లోభాయ మహాత్మనః. 24

ఎవనికి బ్రహ్మాండమంతయు నొక్కరోమము యొక్క లేశమువంటిదేయగునో, అట్టి మహాత్ముఁడగు జ్ఞానిని ప్రలోభమొనర్చగల్గుటయే దేవతనుగాని, అసురునిగాని, మనుజునిగాని, ముల్లోకములందును నేనెచటను గాంచలేదు.

యథా తథా స్థితస్యాపి యత్ర యత్ర గతస్య చ
ద్వైతసంకల్పసందోహా న సన్త్యధిగతాత్మనః. 25

ఏయేరీతిగనున్న, ఎచటెచటికి, జనినను, ఆత్మసాక్షాత్కారమొందిన జ్ఞానికి ద్వైతసంకల్ప సమూహ మెన్నటికిని నుండనేరదు.

విశ్వమేవ నభో యస్య శూన్యం సర్వం మహాత్మనః
కుతః కస్య కథం తస్య భవత్విచ్ఛా నిరాత్మనః. 26

ఏ మహాత్ముని దృష్టియందీ ప్రపంచమంతయు నాకాశమువలె శూన్యమైయున్నదో, అట్టి వానికిఁక ఆరూపరహితములగు భోగములవలన ఇచ్ఛ యెటనుండి యెట్లుద్భవించగలదు?

శాన్తాశేషవిశేషస్య నిరేషణవిశేషతః
సత్తామసత్తాం సదృశో క ఆకలయితుం క్షమః. 27

సమస్తవిశేషములున్ను, ధనాదిఏషణ (కోరిక) లున్ను శమించినవాఁడును, విభవ, దారిద్ర్యముల రెంటిని సమముగఁ జూచువాఁడును నగు మహాత్ముని మహిమ నెవరెఱుఁగఁగలరు?

మారైర్న కించిన్మ్రియతే జీవైః కించిన్న జీవతి
శుద్ధసంవిన్మయస్యాస్య సమాలోకస్య ఖస్య చ. 28

మరణహేతువులచే నొకింతైనను మరణింపనివాఁడును, జీవనహేతువులచే నొకింతైనను జీవింపనివాఁడును (లేక, బంధుపుత్రాదుల మరణజీవనాదులచే హర్షవిషాదముల నొందనివాఁడును), శుద్ధజ్ఞానమయుఁడును, స్వప్రకాశరూపుఁడును, ఆకాశమువలె నిర్మలమై సర్వవ్యాపకమై యున్నవాఁడును నగు మహనీయుని మహిమాతిశయంబుల నూహింప నెవరికిఁదరము?

మిథ్యాలోకస్య కచతో భ్రాన్త్యా మరణజన్మనీ
అసత్యపి భ్రాన్తిభాజి మృగతృష్ణానదీతటే. 29

అజ్ఞానికి భ్రాంతిచే, మృగతృష్ణానదీతటములవలె, జననమరణములు భ్రాంతిపాత్రమైన తగ చిత్తమందు వాస్తవముగ లేనివైనను మిథ్యగనే వికసించుచున్నవి.

సమ్యక్పరీక్షితం యావన్న భ్రాంతిర్న పరీక్షకాః
న నామ జన్మమరణే కేవలం శాన్తమవ్యయమ్. 30

బాగుగ పరీక్షించిన పిదప భ్రాంతిగాని, పరీక్షకులుగాని, జననమరణములుగాని లేనివే యగును. కేవలము ఏకమై, శాంతమై, అన్యూనమైనట్టి పరమాత్మయే యొప్పుచుండును.

దృశ్యాద్యో విరతిం యాత ఆత్మారామః శమంగతః
స సన్నేవాసదాభాసః పరితీర్ణభవార్ణవః. 31

శాంతుఁడును, ఆత్మారాముఁడును దృశ్యాదుల యెడల విరక్తిని బొందినవాఁడును సంసార సముద్రమును దాటినవాఁడునగు తత్త్వజ్ఞుఁడు బ్రహ్మరూపముచే విద్యమానుఁడైయున్నను, దేహేంద్రియాది సహితమగు పరీక్షకుని రూపముచే లేనివాఁడును ఆభాసమాత్రుడును నగును.

దీపనిర్వాణనిర్వాణమస్తంగతమనోగతిమ్
ఆత్మన్యేవ శమం యాతం సన్తమేవామలం విదుః. 32

మనస్సుయొక్క గతి అస్తమించినవాఁడును, ఆత్మయందే శాంతిని బొందినవాఁడును బ్రహ్మరూపముతోటి విద్యమానుఁడై యుండువాడు నగు మహాత్ముఁడే శమించిన దీపమువలె నిర్మల నిర్వాణస్థితి నొందియున్నవాఁడని వచింపఁబడును.

ఆబుద్ధ్యాది జగద్దృశ్యం యస్మై న స్వదతే స్వతః
ఆకాశస్యేవ శాన్తస్య తమాహుర్ముక్తముత్తమాః. 33

బుద్ధినుండి మొదలుకొని జగత్తువఱకు గల సమస్తదృశ్యమెవనికి స్వయముగ రుచింపకుండునో అట్టి యాకాశమువలె ప్రశాంతుఁడగు మహాత్మునే యుత్తములు ముక్తుఁడని వచింతురు.

అహమస్త్వవిచారేణ విచారేణాహమస్తి నో
అభావాదహమర్థస్య క్వ జగత్క్వచ సంసృతిః. 34

అవిచారణచేతనే అహం భావము గలదు. విచారణచే నది లేకయే యున్నది. అహం భావమే లేనపుడిఁక జగత్తెచట, జననమరణాది రూపమగు సంసారమెచట?

సంవిత్సంవేదనాదేవ బుద్ధ్యాద్యాకారవత్స్థితమ్
రూపాలోకమనోరూపం జగద్వేత్తి చిదమ్బరమ్. 35

వాస్తవముగ, చిదాకాశమే తన స్వరూపముయొక్క, అన్యథాజ్ఞానముచే బుద్ధ్యాద్యాకారము వలె నున్నదై రూపప్రకాశ సంకల్పాదిరూపమగు బాహ్యాభ్యంతరజగత్తు నెఱుగుచున్నది.

సర్వార్థరిక్తమనసః సతః సర్వాత్మనస్తవ
సర్వథా సర్వదా సర్వం సర్వమాచరణం శివమ్. 36

ఓ రామచంద్రా! ఎపుడు నీయొక్క మనస్సు సర్వాత్మరూపమై, సర్వపదార్థ రహితమై యొప్పునో, అపుడే సదా సర్వథా, సమస్తజగత్తున్ను, సమస్తాచరణయు బ్రహ్మరూపముగనే భాసించును.

యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి వదాసి యత్
యత్తపస్యసి హంస్యేషి తత్సర్వం శివమవ్యయమ్. 37



ఓ రామచంద్రా! నీవేమి చేయుచున్నను, తినుచున్నను, హోమముచేయుచున్నను, ఇచ్చుచున్నను, తపమొనర్చుచున్నను, వధించుచున్నను, అంతయు వాస్తవముగ నాశరహితమగు బ్రహ్మమే యగును.

యదహం యత్త్వమాశా యద్యత్క్రియాకాలఖాదయః
యల్లోకాలోకగిరయస్తచ్చిద్వ్యోమ శివం తతమ్. 38
యద్రూపాలోకమననం యత్కాలత్రితయం జగత్
యజ్జరామరణార్త్యాది తన్మహాచిన్నభః శివమ్. 39

ఓ రాఘవా! నేను, నీవు, దిక్కులు, ఇచ్ఛ, క్రియ, కాలము, ఆకాశాది పంచభూతములు లోకాలోకపర్వతములు, రూప ప్రకాశ సంకల్పాదిరూపమగు బాహ్యాభ్యంతర జగత్తుయొక్క యనుభవము, త్రికాలములు, సమస్తబ్రహ్మాండము, జరామరణదుఃఖాదులు, - అన్నియు వ్యాపకమైనట్టి మహాచిదాకాశ స్వరూపమైన బ్రహ్మమేయగును.

నిశ్చికిత్సో నిరాభాసో నిరిచ్ఛో నిర్మనా మునిః
భూత్వా నిరాత్మా నిర్వాణస్తిష్ఠ సంతిష్ఠసే యథా. 40

ఓ రామచంద్రా! దుఃఖ చికిత్సారహితుఁడవును, ఆభాసవర్జితుఁడవును, ఇచ్ఛావిరహితుఁడవును, అమనస్కుఁడవును, దృశ్యవర్జితుఁడవును,మునివియు, నిర్వాణరూపుఁడవునై యెట్లుందువో, అట్లు, వెలయుము.

గతేచ్ఛమననం శాన్తమనన్తసమభావనమ్
వ్యవహారోఽస్తు తే మా వా స్పన్దాస్పన్దైర్యథానిలః. 41

ఓ రామచంద్రా! నీవు ఇచ్ఛా, వాసనరహితుఁడవై, శాంతుడవై, అనంతమగు బ్రహ్మమున్ స్థితిగలవాడై, భావనా వర్జితుఁడవై యుండుము. అట్టి నీకు, వాయువుయొక్క స్పంద, అస్పందముల వలె వ్యవహారముండు గాక! లేక, లేకుండుగాక!

నిర్వాసనా నిష్కలనా శాన్తా పురుషతాస్తు తే
శాస్త్రేణ యన్త్రవాహేన వాహ్యా దారుమయీ యథా. 42

ఓ రాఘవా! శాస్త్రమను యంత్రవాహకునిద్వారా నిర్వహింపఁబడినవగుచు నీయొక్క పురుషోచిత క్రియలు, వాసనారహితములై, కల్పనావర్జితములై శాంతములై, కాష్ఠ విగ్రహమును బోలి యుండుగాక!

భూతాలోకస్తు మా స్నేహో మా వా స్నేహశ్చ బాహ్యగః
అనిర్దేశధరాలోకశ్చిత్రదీపవదాస్యతామ్. 43

ఓ రామచంద్రా! బాహ్యమందలి మాతాపితృ బంధుజనాదుల తోటి నీయొక్క వ్యవహారము అతిస్నేహయుక్తమై యుండవలదు. కేవలము స్నేహరహితమైయు నుండవలదు. ఇతరులచే నిర్దేశింప శక్యముగానట్టి ప్రకాశముగలవాఁడనై చిత్రమందలి దీపమువలె నిశ్చలముగను, ప్రశాంతముగను నుండుము.

నిర్వాసనస్య విరసస్య నిరేషణస్య
శాస్త్రా దృతే క ఇవ తత్త్వ వినోదహేతుః
శాస్త్రార్థసజ్జనమతోఽప్యమలస్య తస్య
సంవేదనేష్వనభిసంధి మతః స్వరూపమ్. 44

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే ఉత్తరార్థే నిర్వాణవర్ణనం నామాష్టత్రింశః సర్గః ॥ 38 ॥

ఓ రామచంద్రా! వాసనా రహితుఁడును, వర్తమాన భోగములందు విరసత్వముగల వాఁడును భావికాలభోగములందుఁ గోర్కెలేని వాఁడునగు జ్ఞానికి సచ్ఛాస్త్రములు దప్ప ఆత్మసుఖమందలి విశ్రాంతికి అన్యమగు హేతువెద్దిగలదు? కావున నిర్మల చిత్తుఁడగు అట్టి తత్త్వజ్ఞానికిన్ని జీవిత వ్యవహారములందు శాస్త్ర, సజ్జన మతానుసారము ఫలాభిసంధిరహితముగ వర్తించుటయే అసాధారణ చిహ్నమైయున్నది. (యథేష్టాచరణము కాదని భావము.)

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణ ప్రకరణమున నుత్తరార్ధమున నిర్వాణవర్ణనమను ముప్పదియెనిమిదవ సర్గము ॥ 38 ॥

---

## ఏకోనచత్వారింశః సర్గః

[ ప్రబుద్ధాత్మని విశ్రాన్తో యద్రూపః పరిశిష్యతే ।
జగచ్చ తస్య యద్రూపం తత్సమ్యగిహ వర్ణ్యతే ॥

ప్రబుద్ధుఁడును, ఆత్మయందు విశ్రాంతి నొందనవాఁడునగు జ్ఞానియొక్కయు, అతని దృష్టియందలి జగత్తుయొక్కయు స్వరూపమిచట స్పష్టముగ వర్ణింపఁబడు చున్నది. ]

శ్రీవసిష్ఠ ఉవాచ:—

సంజాతాకృత్రిమక్షీణసంసృతిప్రత్యయః పుమాన్
అసంకల్పో న సంకల్పం వేత్తి తేనాసదేవ సః. 1

శ్రీవసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! సంసారబంధము క్షయించినవాఁడును స్వాభావికమగు ఆత్మసాక్షాత్కారము గలవాఁడును నగు మనుజుఁడు శాస్త్రానుసారము వ్యవహరించినను సంకల్పరహితుఁడైయే యుండును. తద్వ్యవహారహేతువగు సంకల్పాభాసమును స్వాత్మగనే గాంచుచు నాతఁడు సంకల్పము నెఱుఁగక యుండును. కావున, ఆసంకల్పాభాసము అసత్తే (అలీకమే) యగును.

శ్వాసాన్లానిరివాదర్శే కుతోఽప్యహమితి స్థితా
విది సాఽకారణా దృష్టా నశ్యన్త్యాశు న లభ్యతే. 2



శ్వాసచే అద్దముయొక్క మలినత్వమువలె నేదైన అనిర్వచనీయ కారణముచే సంకల్పము యొక్క బీజమగు అహంభావము తత్త్వజ్ఞానియందావిర్భవించినచో అయ్యది కారణము లేకనే వెంటనే నశించును. మరల వెదకి నప్పటికిని నది లభించకుండును.

యస్య క్షీణావరణతా శాన్తసర్వేహతోదితా
పరమామృతపూర్ణాత్మా సత్తయైవ స రాజతే. 3

అజ్ఞానావరణము క్షయించినవాఁడును, కోర్కెలన్నియునుపశమించిన వాఁడును పరమామృతమయమగు ఆనందముచేఁ బరిపూర్ణమైనట్టి ఆత్మయుదయించిన వాఁడును నగు జ్ఞాని నిరతిశయానందరూపమగు ఆత్మ సత్తగనే శోభించును.

సర్వసందేహదుర్ధ్వాన్తమిహికామాత రిశ్వనా
భాతి భాస్వద్ధియా దేశస్తేన పూర్ణేన్దునేవ ఖమ్. 4

సద్వ్యులయొక్క సందేహములను అంధకారమునకు హేతువైనట్టి హిమసమూహమును నశింపఁజేయుటకు వాయువువంటివాఁడును, నిరావరణమైనట్టి ఆత్మప్రకాశముతో కూడిన బుద్ధిగల వాఁడును నగు జ్ఞానిచే ఆతడుండు ప్రదేశము, పూర్ణచంద్రునిచే నాకసమువలె, ప్రకాశించును.

విసంసృతిర్విసందేహో లబ్ధజ్యోతిర్నిరావృతిః
శరదాకాశవిశదో జ్ఞేయో విజ్ఞాయతే బుధః. 5

సంసారమోహరహితుఁడును సర్వసందేహవర్జితుఁడును, ఆత్మప్రకాశమును బొందినవాఁడును అజ్ఞానావరణశూన్యుఁడును, శరత్కాలాకాశమువలె నిర్మలుఁడును నగు తత్త్వజ్ఞాని జ్ఞేయస్వరూపమగు ఆత్మగనే తెలియఁబడును.

నిఃసంకల్పో నిరాధారః శాన్తః స్పర్శాత్పవిత్రతామ్
అన్తః శీతల ఆధత్తే బ్రహ్మలోకాదివానిలః. 6

సంకల్పరహితుఁడును, నిరాధారుఁడును, శాంతుఁడునునగు జ్ఞాని తన స్పర్శచే (ప్రణామ, శుశ్రూషాదులచేదన్న స్పృశించు) జనులకు పాపరాహిత్యమును గలుగఁజేసి, బ్రహ్మలోకమునుండి యేతెంచిన వాయువువలె, వారియంతఃకరణమున శీతలత్వమును (శాంతిని) స్థాపింపఁజేయును.

అసద్రూపోపలమ్భానామియం వస్తుస్వభావతా
యత్స్వర్గవేదనం స్వప్నవన్ధ్యాపుత్రోపలమ్భవత్. 7

అసత్పదార్థరూపముల ప్రాప్తియొక్క వస్తుస్వభావము, స్వప్నమందలి స్వర్గానుభవ, వంధ్యాపుత్ర దర్శనముల వంటిదేయగును.

అవిద్యమానమేవేదం జగద్యదనుభూయతే
అసద్రూపోపలమ్భస్య సైషా వస్తుస్వభావతా. 8

స్వప్నమందలి వంధ్యాపుత్ర దర్శనమువలె, అవిద్యమానమైయున్నను ఈ జగత్తనుభవింపఁబడుట యేది గలదో అదియే, అసత్పదార్థముల ప్రాప్తియొక్క వస్తుస్వభావమైయున్నది.

అసత్యేష్వేవ సంసారేష్వాస్తామర్థః కుతోఽభవేత్
సర్గాపవర్గయోః శబ్దావేవ వన్ధ్యాసుతోపమౌ. 9

అసత్యమగు ఈసంసారమున సృష్టి(బంధ), మోక్షములఁగూర్చిన శబ్దములే వంధ్యాపుత్రసదృశములై యుండ నిఁక వాని అర్థసిద్ధి యెటునుండి సంభవించును?

జగద్బ్రహ్మతయా సత్యమనిర్మితమభావితమ్
అనిష్ఠితం చాన్యథా తు నాహం నావగతోఽచ తత్. 10

నిర్మింపఁబడనిదియు, భావనకు విషయము కానిదియు, అధారరహితమైనదియునగు ఈజగత్తు బ్రహ్మరూపముచే సత్యమైయున్నది. బ్రహ్మరూపము నంగీకరింపని పక్షమున నిది యెట్లుండునో నాకుఁ దెలియదు.

ఆత్మస్వభావవిశ్రాన్తేరియం వస్తుస్వభావతా
యదహన్తాదిసర్గాది దుఃఖాద్యనుపలమ్భతా. 11

అహంభావాదులు, సృష్ట్యాదులు, దుఃఖాదులు సంప్రాప్తింపకుండ నుండుటయే ఆత్మయందలి విశ్రాంతి అనువస్తువుయొక్క స్వభావమైయున్నది.

క్షణాద్యోజనలక్షాన్తం ప్రాప్తే దేశాన్తరే చితః
చేతనే యస్య తద్రూపం మార్గమధ్యే నిరఞ్జనమ్. 12

క్షణకాలములో నొకప్రదేశమునుండి లక్షలకొలఁది యోజనముల దూరముననున్న మఱియొక ప్రదేశమునకు నేత్రవృత్తిద్వారా సంవిత్తుజనినపుడు యారెండు ప్రదేశముల మధ్యనుండు నిర్విషయమైన చైతన్య స్వరూపమేది గలదో, అదియే నిరంజనమైన ఆత్మయొక్క రూపమైయున్నది.

అస్పన్దవాతసదృశం ఖకోశాభాసచిన్మయమ్
అచేత్యం శాన్తముదితం లతావికసనోపమమ్. 13

సర్వస్య జన్తుజాతస్య తత్స్వభావం విదుర్బుధాః
సర్గోపలమ్భో గలతి తత్రస్థస్య వివేకినః. 14

చలమునలేని వాయువును బోలినదియు, ఆకాశకోశమువలె నిర్మలమైనదియు, చిన్మయరూపమును, విషయరహితమైనదియు, శాంతమైనట్టిదియు, వికసించిన లతవలె నావిర్భవించినదియునగు భూతల సూర్యాది ప్రదేశముల మధ్యగల చైతన్యస్వరూపమేది గలదో, దానినే సమస్తజీవసమూహముయొక్క ప్రసిద్ధమైనట్టి స్వభావముగ విజ్ఞులు చెప్పుదురు. అట్టి శుద్ధచిత్స్వభావమున నుండు వివేకికి సృష్టి భాసింపకయుండును.

సుషుప్తే స్వప్నధీర్నాస్తి స్వప్నే నాస్తి సుషుప్తధీః
సర్గనిర్వాణయోర్భ్రాన్తీ సుషుప్తస్వప్నయోరివ. 15

సుషుప్తియందు స్వప్నబుద్ధిలేదు. స్వప్నమందు సుషుప్తిబుద్ధిలేదు. కాని చైతన్యము సాక్షిరూపముచే సర్వత్రయుండియున్నది. వాస్తముగ స్వప్నసుషుప్తులవలె సృష్టిప్రళయములున్ను భ్రమరూపములేయై యున్నవి.



భ్రాన్తివస్తు స్వభావోఽసౌ న స్వప్నో న సుషుప్తతా
న సర్గో న చ నిర్వాణం సత్యం శాన్తమశేషతః. 16

భ్రాంతిరస్తు స్వభావమగుటచే యథార్థముగ స్వప్నముగాని, సుషుప్తిగాని, సృష్టిగాని ప్రళయముగాని లేనివేయైయున్నవి. సత్యమై, శాంతమైనట్టి చిద్రూపమే యంతట బరిపూర్ణమైయున్నది.

భ్రాన్తిస్త్వసన్మాత్రమయీ ప్రేక్షితాచేన్న లభ్యతే
శుక్తిరూప్యమివాసత్యం కిల సంప్రాప్యతే కథమ్. 17

భ్రాంతి అసత్యరూపమేయై యున్నది. ఏలయనిన, విచారించి చూచినచో నయ్యది లభింపదు. ముత్తెపుచిప్పయందలి వెండివలె నసత్యమైనది యెట్లుపొందఁబడును?

యన్న లబ్ధం చ తన్నాస్తి తేన భ్రాన్తేరసంభవః
స్వభావాదుపలభ్యోఽన్యో నాస్తి కస్య న కస్యచిత్. 18

ఏ వస్తువు పొందఁబడకయుండునో, అది లేనిదేయగును. విచారించిచూచిన భ్రాంతి పొందఁబడదు. గావున నది (పరమార్థమున) అసంభవమే యగుచున్నది. భ్రాంతికంటె అన్యముగ సంప్రాప్తమగునట్టిది ప్రమా (జ్ఞాన) రూపమేయగును. అది సాక్షిస్వభావముకంటె వేఱుకాదు. కావున సాక్షియగు చిద్రూపముకంటె అన్యమైనట్టి సత్యవస్తువు లేనేలేదు.

స్వభావ ఏవ సర్వస్మై స్వదతే కిల సర్వదా
అనానైవ హి నానేవ కిం వాదైః సంవిభావ్యతామ్. 19

ఓ రామచంద్రా! ఆ చిత్స్వభావమే యేకమైనప్పటికి వివిధరూపములవలె భాసించుచు, సర్వజీవులకును సదా పరమప్రేమా రూపముతోటి స్ఫురించుచున్నది. ఆ సాక్షియగు చిద్రూపమునే నీవు భావింపుము. వ్యర్థమగు వాదములచే నేమి ప్రయోజనము?

అస్వభావే మహద్దుఃఖం స్వభావే కేవలం శమః
ఇతి బుద్ధ్యా విచార్యాన్తర్యదిష్టం తద్విధీయతామ్. 20

ఓ రామచంద్రా! చిత్స్వభావముకంటె వేరైనట్టి కల్పనయే మహా (సంసార) దుఃఖము. అకల్పితమగు సాక్షి చిత్స్వభావమందలి స్థితియే కేవలము పరమశాంతమైనట్టి కైవల్యము – ఇట్లు అంతరంగమున బుద్ధిచే విచారించి పిమ్మట ఏది నీకిష్టమో దానిని గ్రహింపుము.

సూక్ష్మే బీజేఽస్త్యగః స్థూలో దృష్టమిత్యుపపద్యతే
శివే మూర్తే జగన్మూర్తమస్తీత్యుత్తమసంకథా. 21

సూక్ష్మమగు బీజమున స్థూలమైనట్టి గొప్పవృక్షమెట్లుగలదో, అట్లే అమూర్తమైన శివరూపమగు బ్రహ్మమున మూర్తివంతమైనట్టి యీ జగత్తుగలదనుట తత్త్వజ్ఞుల యొక్కయు, వేదముల యొక్కయు నుత్తమ కథనమై యున్నది.

రూపాలోకమనస్కారబుద్ధ్యహన్తాదయః పరే
స్వరూపభూతాః సలిలే ద్రవత్వమివ ఖాత్మకాః. 22

జలమందు ద్రవత్వమువలె, రూప, సంకల్పాది బాహ్యాభ్యంతర విషయములున్ను, బుద్ధి, అహంకారము మున్నగునవి యన్నియును పరబ్రహ్మమున చిదాకాశరూపములే యైయున్నవి.

మూర్తే యథా స్వసదృశైః కరోత్యవయవైః క్రియాః
ఆత్మభూతైస్తథా భూతైశ్చిదాకాశమకర్తృ సత్. 23

మూర్తివంతమగు ప్రాణి తన యాత్మభూతములగు హస్త పాదాద్యవయవములచే, క్రియలను సల్పునట్లు, అకర్తయు, సద్రూపమునగు చిదాకాశము తనయాత్మరూపములగు పంచభూతములచే జగదుత్పత్త్యాది క్రియలను సల్పుచున్నది.

ఆత్మస్థాదహమిత్యాది రస్మదాదేరసంస్మృతేః
శబ్దోఽర్థభావముక్తో యః పటహాదిషు జాయతే. 24

వాదకునిచే నధిష్ఠితములగు తప్పెట మున్నగు వాద్యములందు, ఆ వాదకుని యభిప్రాయము ననుసరించి విచిత్ర శబ్దము లుత్పన్నములగునట్లు, జడత్వకారణమున స్వతః వ్యవహారమున అసమర్థము లగుటచే మనయొక్క ఈ వసిష్ఠరామాది దేహాదులు నేను, అను నీమున్నగు యభిప్రాయములఁ దెల్పునట్టి శబ్దములు, చిదాత్మ అధిష్ఠానముగా గల్గియున్నందువలననే జిహ్వాది కరణములద్వారా జనించుచున్నవి.

యద్భాతం ప్రేక్షయా నాస్తి తన్నాస్త్యేవ నిరన్తరమ్
జగద్రూపమరూపాత్మ బ్రహ్మ బ్రహ్మణి సంస్థితమ్. 25

ఏది అవిచారముచే భాసించునో, విచారించుటచే భాసింపకయుండునో, అది సర్వదా లేనిదేయగును. కావున, అవిచార సిద్ధమగు ఈ జగత్తుయొక్క జడత్వాంశరూపము స్వరూప శూన్యమే యగును. కాబట్టి బ్రహ్మము బ్రహ్మస్వభావముననే స్థితిగల్గియున్నదగుచున్నది. ఇదియే యీ జగత్తుయొక్క వాస్తవమగు స్థితి.

యేషామస్తి జగత్స్వప్నస్తే స్వప్నపురుషా మిథః
న సన్తి హ్యాత్మని మిథో నాస్మాస్వమ్బరపుష్పవత్. 26

ఏ అజ్ఞానులకీ జగత్తను స్వప్నము గలదో, ఆట్టి స్వప్నపురుషులు తమతమ ఆత్మయందు పరస్పరము లేకయున్నారు. సర్వదా బ్రహ్మభూతులమగు మాయొక్క దృష్టియందో, వారుపరస్పరము ఆకాశపుష్పమువలె (జడాంశమున) సర్వథా లేకయే యున్నారు.

మయి బ్రహ్మైకరూపం తే శాన్తమాకాశకోశవత్
వాయోః స్పన్దైరివాభిన్నైర్వ్యవహారైశ్చ తన్మయి. 27

(చైతన్యాంశముననో) - వాయు, వాయువుయొక్క చలనమువాయువుకంటె వేఱుగానట్లు, తమకంటె వేఱుగానట్టి తమయొక్క వ్యవహారములతోసహా నాయందుండియేయున్నారు. ఏలయనఁగా నుభయులము ఆకాశకోశమువలెఁ బ్రశాంతమైనట్టి బ్రహ్మైకస్వరూపులమేయైయున్నాము. వారియందలి బ్రహ్మము నాయొక్క ప్రత్యగాత్మ స్వభావమందును గాదుగదా!



అహం తు సన్మయస్తేషాం స్వప్నః స్వప్నవతామివ
తే తు నూనమసన్తో మే సుషుప్తస్వప్నకా ఇవ. 28

స్వప్నముగనువారికి స్వప్నము సత్యముగఁ దోచునట్లు, అట్టి యజ్ఞానుల దృష్టియందు నేను వసిష్ఠరూపముచే సత్యముగఁదోచుచున్నాను. కాని వారో (వారి యుపాధులు), సుషుప్తియందున్నవానికి స్వప్నపురుషులవలె నాదృష్టియందు నిక్కముగ లేకయేయున్నారు.

తైస్తు యోవ్యవహారో మే తద్బ్రహ్మ బ్రహ్మణి స్థితమ్
తే యత్పశ్యన్తి పశ్యన్తు తత్తైరలమలం మమ. 29

వారితోటి యుపదేశాది వ్యవహార మెయ్యది నాకుఁ గలదో, అది నాయొక్క దృష్టియందు బ్రహ్మము బ్రహ్మమున స్థితిగల్గియున్నదే యగును. ఇఁక వారెట్లు గాంచుదురో గాంచుగాక! నాకు వారితో నేప్రయోజనమున్ను లేదు.

అహమాత్మని నైవాస్మి బ్రహ్మసత్తేయమాతతా
త్వదర్థం సముదేతీవ తథారూపైవ వాగియమ్. 30

నేను వాస్తవముగ వసిష్ఠదేహభావముచే లేను. బ్రహ్మసత్తయే యీ వసిష్ఠాద్యాకారముల వ్యాపించినదై మీకొఱకు (వివర్తరూపమున) యుదయించినదగును. ఈ నాక్కున్ను నట్టి బ్రహ్మసత్తా వివర్తరూపమే గలదై మీయొక్క యుపదేశాదులకొఱ కావిర్భవించినదైయున్నది.

అవిరుద్ధవిరుద్ధస్య శుద్ధసంవిన్మయాత్మనః
న భోగేచ్ఛా న మోక్షేచ్ఛా హృది స్ఫురతి తద్విదః. 31

ఏ ఆత్మజ్ఞానికి విరుద్ధములగు దుఃఖాదులన్నియు అవిరుద్ధమగు శుద్ధ సచ్చిదానందరూపములుగ భాసించునో, అట్టివాని హృదయమున భోగేచ్ఛగాని, మోక్షేచ్ఛగాని స్ఫురింపకయే యుండును.

స్వభావమాత్రాయత్తేఽస్మిన్బద్ధమోక్షక్రమే నృణామ్
కదర్థనేత్యహో మోహాద్గోష్పదేఽప్యుదధిభ్రమః. 32

ఆహా! తమయధీనముననే యున్నట్టి తమయొక్క బ్రహ్మస్వభావమాత్రమందలి స్థితిచే బంధనమునుండి మోక్షమొందుటలో జనులకు అజ్ఞానముచే నెట్టి బాధగలుగుచున్నది! గోష్పద బలమున సముద్రమునుగూర్చిన భ్రమ గలుగుచున్నదే!

స్వభావసాధనే మోక్షేఽభావోపశమరూపిణి
న ధనాన్యుపకుర్వన్తి న మిత్రాణి న చ క్రియాః. 33

అసత్తేయైనట్టి దుఃఖముయొక్క యుపశమన రూపమగు తనయొక్క బ్రహ్మస్వభావమాత్రమందలి స్థితియను ఈమోక్షసాధనమున ధనముగాని, మిత్రులుగాని, వివిధమైన క్రియలుగాని, యుపకరింపనేరవు.

తైలబిన్దుర్భవత్యుచ్చైశ్చక్రమప్పతితో యథా
తథాశు చేత్యసంకల్పే స్థితా భవతి చిజ్జగత్. 34

తైలబిందువు నీటియందు బడినచో పలువిధ చక్రాకారముగ నగునట్లు విషయముయొక్క సంకల్ప మాత్రముచే చైతన్యము శీఘ్రముగ జగద్రూపముగ స్థితి గలదగుచున్నది

జాగ్రతి స్వప్నవృత్తాన్తస్థితిర్యాదృగ్విసా స్మృతౌ
తాదృగ్విసాహంత్వజగజ్జాలసంస్థా వివేకినః. 35

జాగ్రదవస్థయందు మనుజునిస్మృతియందు స్వప్నవృత్తాంత మేవిధముగ మిథ్యగఁ దోచునో, అవిధముగనే తత్త్వజ్ఞానికి, అహంభావసహితమగు ఈజగత్సమూహమంతయు మిథ్యగఁగనఁబడును.

తేనైవాభ్యాసయోగేన యాతి తత్తనుతాం తథా
యథా నాహం న సంసారః శాన్తమేవావశిష్యతే. 36

పూర్వోక్తమగు తమయొక్క బ్రహ్మస్వభావమాత్రమందలి స్థితియను అభ్యాసయోగముచే వివేకవంతునకీజగజ్జాలమంతయు అత్యంత సూక్ష్మమైపోవును. అత్తఱి యాతనికి, అహంభావముగాని, జగత్తుగాని భాసింపదు. శాంతమగు బ్రహ్మమే శేషించియుండును

యదా యదా స్వభావార్కః స్థితిమేతి తదా తదా
భోగాన్ధకారో గలతి న సన్నప్యనుభూయతే. 37

ఎపుడెపుడు బ్రహ్మస్వభావమను సూర్యుఁడుదయించునో, అపుడపుడు భోగరూపమగు అంధకారము నశించును. మఱియు, త్రికాలములందును భోగములు అసత్యములను అనుభవమున్ను గలుగును.

మోహమహత్త్వా రహితః స్ఫురతి మృతౌ భవతి భాసతే చ తథా
బుద్ధ్యాది కరణ నికరో యస్మాద్దీపాదివాలోకః. 38

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే వసిష్ఠగీతాసు ఖభావ విశ్రాన్తియోగోపదేశో నామ ఏకోనచత్వారింశః సర్గః ॥ 39 ॥

ఓ రామచంద్రా! భోగరూపమగు అంధకారము నశింప, మనుజుఁడు బుద్ధ్యాది కరణసమూహ రహితుఁడును. అజ్ఞానావరణ వర్జితుఁడును, స్థూలదేహాదుల అధ్యాసములేనివాఁడును నై ప్రకాశించును మఱియు, బ్రహ్మాకారవృత్తిచే దేదీప్యమానమగు బోధరూప ప్రకాశముతోఁటి స్ఫురించును. అత్తఱి యాతఁడు దీపమునుండి బయల్వెడలిన ప్రకాశమువలె ఆబ్రహ్మమయ ప్రకాశముచే సర్వత్ర వ్యాపించి బ్రహ్మీభూతుఁడై వెలుఁగును.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున వసిష్ఠగీతాసుఖభావ విశ్రాంతియోగోపదేశమను ముప్పదితొమ్మిదవ సర్గము ॥39॥

---



## చత్వారింశః సర్గః

న సంసృతౌ బ్రహ్మ భాతి న బ్రహ్మణి చ సంసృతిః
జీవన్ముక్తే ద్వయం భాతి పర్యాయేణేతి వర్ణ్యతే,

[సంసారమున బ్రహ్మముగాని, బ్రహ్మమున సంసారముగాని భాసింపదు. కాని జీవన్ముక్తునియందు క్రమముగ నారెండును భాసించునని యిట వర్ణింపఁబడుచున్నది.]

శ్రీవసిష్ఠ ఉవాచ:—

రూపాలోకమనస్కారబుద్ధ్యాదీన్ద్రియ వేదనమ్
స్వరూపం విదురద్వానమస్వభావస్య వస్తునః. 1

శ్రీవసిష్ఠుఁడు.— ఓ రామచంద్రా! రూప, సంకల్పాది బాహ్యాభ్యంతర విషయములు, బుద్ధీంద్రియముల యనుభవము, ఈ సమస్తవస్తువులయొక్క వాస్తవ స్వరూపము, నిర్వికారమగు చైతన్యమే యని విజ్ఞులు పలుకుదురు.

అస్వభావతనుత్వేన స్వభావస్థితిరాతతా
యదోదేతి తదా సర్గో భ్రమాభః ప్రతిభాసతే. 2

ఎపుడు అవిద్య సన్నగిలగా బ్రహ్మస్వభావముయొక్క వ్యాప్తస్థితి యుదయించునో, అపుడే సృష్టి, భ్రమవలె గోచరించును.

యదా స్వభావవిశ్రాన్తిః స్థితిమేతి శమాత్మికా
జగద్దృశ్యం తదా స్వప్నః సుషుప్త ఇవ శామ్యతి. 3

ఆత్మస్వరూపజ్ఞానముచే నెపుడు బ్రహ్మస్వభావమున శాంతిరూపమగు విశ్రాంతి లభించుచున్నదో, అపుడు, సుషుప్తియందు స్వప్నమువలె ఈ జగత్తను దృశ్యము శమించిపోవుచున్నది.

భోగా భవమహారోగా బన్ధవో దృఢబన్ధనమ్
అనర్థాయార్థసంపత్తిరాత్మనాత్మని శామ్యతామ్. 4

ఓ రామచంద్రా! భోగములే యీ సంసారమున మహారోగములు. బంధువులే దృఢబంధనములు. ధనసంపత్తి యనర్థముకొఱకేయైయున్నది. కావున, ఆత్మయందు శాంతముగ స్థితి నొంది యుండుము.

అస్వభావాత్మతా సర్గః స్వభావైకాత్మతా శివః
భూయతాం పరమవ్యోమ్నా శామ్యతాం మేహ తామ్యతామ్. 5

బ్రహ్మస్వరూపమునకు విరుద్ధమైనట్టి భావనచేయుటయే సృష్టి, బ్రహ్మస్వరూపమందలి స్థితియే శివరూపమగు బ్రహ్మము, ఇక్కారణమున నీవు చిదాకాశరూపుఁడవేయై యుండుము. మఱియు ఈ సంసారమున గ్లానిఁ బొందకుము.

నాత్మానమవగచ్ఛామి న దృశ్యం చ జగద్భ్రమమ్
బ్రహ్మ శాన్తం ప్రవిష్టోఽస్మి బ్రహ్మైవాస్మి నిరామయః. 6

ఓ రామచంద్రా! నే నీవసిష్ఠ శరీరమందలి జీవునిగాని, దృశ్యమునుగాని జగత్స్వప్నమునుగాని యెఱుంగుటలేదు. శాంతమగు బ్రహ్మమునే ప్రవేశించి యున్నాఁడను. నిర్వికారమగు బ్రహ్మమేయై యున్నాను.

త్వమేవ పశ్యసి త్వన్త్వం సత్వం శబ్దార్థజృమ్భితమ్
పశ్యామి శాన్తమేవాహం కేవలం పరమం నభః. 7

ఓ రామచంద్రా! నీవు వసిష్ఠుఁడవు అని యివ్విధమునత్వం (నీవుఅను) శబ్దముయొక్క అర్థముచే వృద్ధిఁబొందిన 'త్వం' పదార్థమునే నీవు (అట్టిరూపుడవే యగుటఁబట్టి) గాంచుచున్నావు. నేనైతే, కేవలము శాంతమైనట్టి చిదాకాశమునే వీక్షించుచున్నాను.

బ్రహ్మణ్యేవ పరాకాశే రూపాలోకమనోమయాః
విభ్రమాస్తవ సంజాతకల్పాః స్పన్దా ఇవానిలే. 8

ఓ రాఘవా! నీకున్న చిదాకాశమగు బ్రహ్మమున ఈశబ్దార్థాది బాహ్యాభ్యంతర విషయములఁ గూర్చిన భ్రమలు పరమార్థమున జనించినవి కావు. వాయువునందు చలనములవలె నవి జనించినట్లున్నవే యగును.

బ్రహ్మాత్మా వేత్తి నో సర్గం సర్గాత్మా బ్రహ్మవేత్తినో
సుషుప్తో వేత్తి నో స్వప్నం స్వప్నస్థో న సుషుప్తకమ్. 9

సుషుప్తియందున్నవాఁడు స్వప్నము నెఱుఁగనట్లును, స్వప్నమందున్నవాఁడు సుషుప్తి నెఱుఁగనట్లును, బ్రహ్మస్వరూపమందున్నవాఁడు సృష్టి నెఱుఁగఁడు. సృష్టియందు లీనమైయున్నవాఁడు బ్రహ్మస్వరూపము నెఱుఁగఁడు.

ప్రబుద్ధో బ్రహ్మజగతోర్జాగ్రత్స్వప్నదృశోరివ
రూపం జానాతి భారూపం జీవన్ముక్తః ప్రశాన్తధీః. 10

జీవన్ముక్తుఁడును, ప్రశాంతచిత్తుఁడును, ప్రబుద్ధుఁడునగు జ్ఞాని బ్రహ్మస్వరూపమును జాగ్రత్తువలెను, జగత్తును స్వప్నమువలెను నెఱుఁగును. (కావున) నాతనికి స్వప్నతుల్యముగ నుపదేశాదులందు, బ్రవృత్తి సంభవించుచున్నవి.

యథాభూతమిదం సర్వం పరిజానాతి బోధవాన్
సంశామ్యతి చ శుద్ధాత్మా శరదీవ పయోధరః. 11

ప్రబుద్ధుఁడును, శుద్ధాత్ముఁడునగు జ్ఞాని యీ సమస్తజగత్తును యథార్థముగ (సత్యమగు పరమాత్మరూపముగ) నెఱిఁగి; శరత్కాలమున మేఘమువలె బ్రశాంతి నొందును.

స్మృతిస్థః కల్పనస్థో వా యథా ఖ్యాతశ్చ సంగరః
సదసద్భ్రాన్తతామాత్ర స్తథాహన్త్వజగద్భ్రమః. 12

యుద్ధమునుగూర్చిన వృత్తాంతము స్మృతియందుగాని, కల్పనయందుగాని యెట్లుభాసించునో అట్లే, జ్ఞానికి సదసత్తుల భ్రాంతి మాత్రమైనట్టి యీ అహంకారాది జగద్భ్రమయున్న భాసించును.



ఆత్మన్యపి నాస్తి హి యా ద్రష్టా యస్యా న విద్యతే కశ్చిత్
న చ శూన్యం నాశూన్యం భ్రాన్తిరియం భాసతే సేతి. 13

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు
నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే వసిష్ఠగీతాసు ఆత్మవిశ్రాన్తికథనం
నామ చత్వారింశః సర్గః ॥ 40 ॥

ఈ కాన్పించు జగన్మాయ పరమార్థసత్యమగు ఆత్మయందులేదు. ఈజగత్తుయొక్క ద్రష్టయైన జీవుఁడున్ను వాస్తవముగ నెవఁడును లేఁడు. ఇట్లు శూన్యాశూన్యవిలక్షణమై, అనిర్వచనీయమై ఈజగద్భ్రాంతి భాసించుచున్నది.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున
వసిష్ఠగీతాసు ఆత్మవిశ్రాంతి కథనమను నలుబదవ సర్గము. ॥ 40 ॥

## ఏకచత్వారింశః సర్గః

[ త్రిజగత్ప్రతికాన్యత్యమస్వభావ స్వభావతః
స్వభావైక స్వభావేన నిర్వాణం చాత్రవర్ణ్యతే.
అవిద్యా స్వభావముచే నుదయించు త్రిజగంబులను నర్తకులయొక్క నృత్యము, బ్రహ్మస్వభావముచే నుదయించు నిర్వాణప్రాప్తి యిచట వర్ణింపఁ బడుచున్నవి.]

**శ్రీవసిష్ఠ ఉవాచ:—**

అస్వభావస్వభావోఽయం సర్వోఽహన్నాదివేదినః
స్వభావైకస్వభావేన నిర్వాణీక్రియతాం స్వయమ్. 1

శ్రీ వసిష్ఠుఁడు:- ఓ రామచంద్రా! అవిద్యయొక్క స్వభావముచే ఆత్మయే అహంకారాది జగద్రూపమై త్రిలోకములను, నర్తకులయొక్క నృత్యమెఱుఁగుచున్నది. అట్టి అవిద్యాస్వభావ యుక్తమగు శాస్త్రోపాయములచే నుత్పన్నమగు విద్యచే నావిర్భూతమగునట్టి పూర్ణానందాత్మ స్వభావముచే, స్వయముగ నిర్వాణరూపమొనర్చి వేయఁబడుగాక!

యత్రాదిత్యో భవేత్తత్ర యథాలోకస్తథా భవేత్
పరం విషయవైరస్యం తత్ర యత్ర ప్రబుద్ధధీః. 2

సూర్యభగవానుఁ డెచట నుండునో, అచట ప్రకాశము స్వయముగఁ గలుగునట్లు, విషయములయెడల పూర్ణవైరాగ్య మెచటగలదో, అచట ఆత్మజ్ఞానరూపమగు 'విద్య' స్వయముగనే యుదయించును.

అకర్తృకకర్మకరణమదృశ్యద్రష్టృదర్శనమ్
జగదగ్రాహ్యసంభారభిత్తౌ చిత్రముత్థితమ్. 3

కర్తృకర్మకరణాది సామగ్రి రహితమై, ద్రష్టృ, దర్శనదృశ్యవర్జితమై, గ్రహింప నలవి కానిదైనట్టి యీ జగత్తను చిత్రము భిత్తిమున్నగు యాధారములు లేకనే (బ్రహ్మమందు) యావిర్భవించినది.

నచోత్థితం కించ నవా శాన్తే శాన్తం యథాస్థితమ్
అనామయం పరం బ్రహ్మ సత్యమవ్యయమేవ తత్. 4

కాని యథార్థముగ నది యెప్పుడును నుదయించలేదు, అస్తమించలేదు. అది తన శాంత స్వభావమున యథారీతి నెలకొనియున్నట్టి, నిర్వికారమై, సత్యమై, అవ్యయమైనట్టి పరబ్రహ్మమే యైయున్నది.

చిచ్చమత్కారమాత్రాత్మకల్పనారఙ్గరఞ్జనాః
సంఖ్యాతుం కేన శక్యన్తే ఖే జగచ్చిత్రపుత్రికాః. 5

చైతన్యముయొక్క చమత్కారమాత్రరూపులగు జీవులయొక్క కల్పనామయమగు నృత్య మండపమున శృంగారాది వివిధరసములచే, బరిపూర్ణులైయే జగచ్చిత్రములను నర్తకులు చిదాకాశమున నాట్యమాడుచున్నారో, వారిని లెక్కింప నెవరికిఁదరము?

రసభావవికారాఢ్యం నృత్యన్త్యభినయైర్నవైః
పరమాణుప్రతిప్రాయః ఖే స్ఫురన్త్యమ్బరాత్మికాః. 6

శృంగారాది భావములచేతను, స్థాయీభావాది వికారములచేతను, కంప స్వేదాది సంచారి భావములచేతను బూర్ణమై, అయా వస్త్వాకారములఁదెల్పు నూతనమైనట్టి చేష్టలతో గూడుకొనిన, ఆకాశరూపులగు జగత్తులను నర్తకులు, ప్రతి పరమాణువునందును విద్యమానమైయున్నట్టి చిదాకాశమున నృత్యమొనర్చుచున్నారు.

సర్వర్తుశేఖరధరా దిగ్బాహులతికాకులాః
పాతాలపాదలతికా బ్రహ్మలోకశిరోధరాః. 7
చన్ద్రార్కలోలనయనాస్తారోత్కరతనూరుహాః
సప్తలోకాఙ్గలతికాః పరితోచ్ఛామ్బరామ్బరాః. 8
ద్వీపామ్బురాశివలయా లోకాలోకాద్రిమేఖలాః
భూతభారచలజ్జీవప్రవహత్ప్రాణమారుతాః. 9
వనోపవనవిన్యాసహారకేయూరభూషితాః
పురాణవేదవచనాః క్రియాఫలవినోదనాః. 10

సమస్తఋతువులను శిరోభూషణములు గలవారును, దిక్కులను బాహులతలచేఁ బరిపూర్ణులును, పాతాళమును పాదలతాయుక్తులును, బ్రహ్మలోకమును కంఠముగల్గియున్నవారును, చంద్రసూర్య మండలనేత్రములు గలవారును, నక్షత్రములను రోమసమూహములతోఁ గూడియున్నవారును, సప్తలోకములను అంగలతాయుక్తులును, నలువైపుల ఆకాశమును స్వచ్ఛవస్త్రమును ధరించియున్న వారును, ద్వీప, సముద్రములను కంకణములు గలవారును, లోకాలోక పర్వతమును కటిసూత్రములచే



నొప్పుచున్నవారును, భౌతిక శరీరముయొక్క ధారణ, పోషణాది హేతువులచే, జంచలమైనట్టి జీవులే ప్రవహించు ప్రాణవాయువుగా గలవారును, అనేక వన, ఉపవనములను హారకేయూరాది భూషణములను ధరించినవారును, పురాణములు, వేదములేవచనములుగా గల్గియున్నవారును, అయా క్రియలయొక్క ఫలములగు సుఖదుఃఖములే వినోదములుగా గలవారునవగు ముల్లోకములను నర్తకులు చిదాకాశమున నాట్యమాడుచున్నారు.

త్రిజగత్పుత్రికానృత్యం యదిదం దృశ్యతే పురః
బ్రహ్మవారిద్రవత్వం తత్తద్బ్రహ్మానిలవేపనమ్. 11

లోకత్రయములను నర్తకులయొక్క నృత్యమెయ్యది యెదుటగాన్పించుచున్నదో, అది బ్రహ్మమను జలముయొక్క ద్రవత్వమున్ను, బ్రహ్మమను వాయువుయొక్క చలనమున్నునై యున్నది.

అస్వభావస్థితైవాస్య కారణం కారణాత్మకమ్
అసుషుప్తస్థితా స్వాపే స్వప్నస్యేవ సతీవ సా. 12

నిద్రయందు సుషుప్తిరహితస్థితియందు చైతన్యము స్వప్నమునకు కారణమెట్లగునో, అట్లే, అవిద్యాస్వభావమందున్న (మాయాశబలితమగు) చైతన్యమే యీముల్లోకములను నర్తకుల నృత్యమునకు కారణమైయున్నది. అట్టికారణరూపమే శ్రుతులందును ప్రసిద్ధమైయున్నది.

అసుషుప్తసుషుప్తస్థః స్వభావం భావయస్స్వవ
జాగ్రత్యపి గతవ్యగ్రో మా స్వప్నమిదమాశ్రయ. 13

ఓ రామచంద్రా! నీవు జగత్తుయొక్క వ్యాకులత్వమును ద్యజించి, బ్రహ్మస్వభావమును భావించుచు జాగ్రద్దశయందే సుషుప్తునివలె నుండి (బ్రహ్మభావమున జాగ్రతుడవై, దృశ్యభావమున మున సుషుప్తుఁడవై) అప్రకాగముగ తురీయపదమున స్థితిగల్గియున్నవాఁడవై ఈజగద్రూపమగు స్వప్నము నెన్నఁటికి నాశ్రయింపక నుండుము.

యజ్జాగ్రతి సుషుప్తత్వం బోధాదరసవాసనమ్
తం స్వభావం విదుస్తజ్జా ముక్తిస్తత్పరిణామితా. 14

రాగ, వాసనారాహిత్యపూర్వకముగ జాగ్రత్తునందే సుషుప్త్యవస్థయెయ్యది సంప్రాప్తించు చున్నదో, దానినే బ్రహ్మస్వభావమని చెప్పుదురు. అద్దానియందు నిష్ఠితుఁడైనచో ముక్తిరూప పరిణామము సంభవించును.

అకర్తృకర్మకరణమదృశ్యద్రష్టృదర్శనమ్
అరూపాలోకమననం స్థితం బ్రహ్మ జగత్తయా. 15

కర్తృకర్మకరణ, ద్రష్టృదర్శన దృశ్యవర్జితమై, రూపసంకల్పాది బాహ్యాభ్యంతర విషయ రహితమైనట్టి బ్రహ్మమే జగద్రూపమున స్థితినొందియున్నది.

కాన్తే కాన్తం ప్రకచతి పూర్ణే పూర్ణం వ్యవస్థితమ్
ద్వైతైక్యరహితే భాతి ద్వైతైక్యపరివర్జితమ్. 16

ద్వైత, ఏకత్వరహితమై, మనోహరమై, పూర్ణమైనట్టి జగదాత్మయందు ద్వైత, ఏకత్వ రహితమై, మనోహరమై, పూర్ణమైనట్టి పరబ్రహ్మము ప్రకాశించుచున్నది.

సత్యం సత్యే స్థితం శాన్తం సర్గాత్మన్యాత్మని స్వయమ్
ఆకాశకోశసదృశం శిలాజఠరసంనిభమ్. 17

సత్యమై, ఆకాశకోశమువలె విశాలమై, శిలామధ్యభాగమువలెఁ బ్రశాంతమై, చిద్ఘనరూపమైనట్టి ఆత్మయే సత్యమైనట్టి సృష్ట్యాత్మయందు స్వయముగ శాంతరూపమున నెలకొనియున్నది.

సురత్నజఠరాకారం ఘనమప్యమ్బరోపమమ్
ప్రతిబిమ్బమివ క్షుబ్ధమప్యక్షుబ్ధమసచ్చ సత్. 18

ఉత్తమ రత్నముయొక్క మధ్యభాగమువలెఁ బ్రకాశమై, ఘనమైనను ఆకాశమువలె నతి సూక్ష్మమై, జగత్ప్రతిబింబముచే సంక్షుబ్ధమైనట్లున్నను వాస్తవముగ సంక్షుబ్ధము కానిదై, అసత్తువలె గోచరించినను సత్స్వరూపమేయై, ఆత్మ వెలయుచున్నది.

భవిష్యన్నవనిర్మాణం చేతసీవ స్థితం పురమ్
బ్రహ్మ బృంహితభారూపమభేదీకృతమానసమ్. 19

చిత్తమందలి భావికాల నూతన నిర్మాణమును బోలి యెదుట నున్నదియు, మహాప్రకాశరూపమైనదియు, మనస్సును తనయందు అభిన్నముగ ధరించియున్నదియునై బ్రహ్మము విరాజిల్లుచున్నది.

యథా సంకల్పనగరం సంకల్పాన్నైవ భిద్యతే
తథాయం జగదాభాసః పరమార్థాన్న భిద్యతే. 20

సంకల్పనగరము సంకల్పముకంటె వేఱుగానట్లు, ఈ జగత్తుయొక్క ఆభాసమున్ను పరబ్రహ్మముకంటె వేఱుగానిదైయున్నది.

హేమశీలమివానేకభవిష్యత్సంనివేశవత్
లక్ష్యమాణమపి స్ఫారం శాన్తమవ్యయమాస్థితమ్. 21

సువర్ణపిండమువలె భావికాలపు అనేక రచనలతో, గూడియున్నట్లు గోచరించినను, విశాలమై, శాంతమై, నాశరహితమై, బ్రహ్మము తన నిజస్వరూపముననే స్థితిగల్గియున్నది.

అజస్రనాశోత్పాదాఢ్యమేకరూపమనామయమ్
అనాశోత్పాదమజరమనేకమివ కాన్తిమత్ 22

నిరంతరము నాశోత్పత్తులచేఁ బూర్ణమైనట్లున్నను నిర్వికారమై, అనేకరూపములతో నున్నను ఏకరూపమై, నాశోత్పత్తిరహితమై, జరామరణవర్జితమై, ప్రకాశవంతమై బ్రహ్మము శోభిల్లుచున్నది.

బ్రహ్మైవనాస్తిఘనభావగతం విభాతి సర్గోదయేన విగతాస్తమయోదయేన
వ్యోమేవ శూన్యవిభవేన గలత్స్వభావ లాభం ప్రతి ప్రసభమేవ నను ప్రబుద్ధే. 23



ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే స్వరూపవిశ్రాన్త్యర్థముపదేశకరణం నామ ఏకచత్వారింశః సర్గః ॥ 41 ॥

ఓ రామచంద్రా! రూపరహితమగు ఆకాశము తన శూన్యత్వ వైభవముతో భాసించునట్లు జ్ఞానముదయింప, శాంతిఘనభావమును బొందిన బ్రహ్మమే గొప్ప అద్వైత స్వభావ బలముచే ఉదయాస్త రహితమైన సృష్టియను స్వారాజ్య విభవముతో భాసించును.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున స్వరూప విశ్రాంత్యర్థముపదేశకరణమను నలుబదియొకటవ సర్గము ॥ 41 ॥

---

## ద్విచత్వారింశః సర్గః

[ భూయః ప్రవక్ష్యతే చాత్ర విశ్వవిశ్వేశ్వరైకతా
వివేకైః పూజనీయశ్చ స్వాత్మైవ పరమేశ్వరః.

మరల జగత్తు, పరమేశ్వరులయొక్క యేకత్వము తెలుపఁబడుచు, వివేకముచే స్వాత్మభూతుఁడగు పరమేశ్వరుఁడే పూజింపవలయునని యిట వచింపఁబడుచున్నది.]

శ్రీవసిష్ఠ ఉవాచ:—

చిత్తవత్కచనం శాన్తే యత్తత్తస్మాన్న భిద్యతే
అవ్యాకృతామలతయా క్వాఽతః సర్గాదిసంభవః. 1

శ్రీవసిష్ఠుఁడు — ఓ రామచంద్రా! శాంతమగు కూటస్థాత్మయందు, ప్రథమముననే చిత్తరూపముతోటి ఏజగత్స్ఫురణము గలదో, అది యాచిదాత్మకంటె భిన్నముకాదు. చిదాత్మనిర్మలమును, అవ్యాకృతము నగుటచే నందు సృష్ట్యాదుల సంభవమెచట?

చిత్తదీపే గతే యాన్తి భ్రాన్తివద్బాహ్యాన్తిఖే స్థితే
రూపాలోకమనస్కార సంవిదోఽమ్బుద్రవోర్మయః. 2

రూప, సంకల్పాది బాహ్యాభ్యంతర విషయములయొక్క యనుభవములను జలతరంగములు చిదాకాశమున మృగతృష్ణాభ్రాంతివలె భాసించుచున్నవి. అట్టివి చిత్తమను సూర్యుఁడస్తమింపగనే అస్తమించి పోవుచున్నవి.

నిరస్తకరణాపేక్షం మరుతః స్పన్దనం యథా
యథా విసరణం భాతస్తథా జగదిదం పరే. 3

ఏవిధమగు కరణముల నపేక్షింపకనే వాయువుయొక్క చలనము, సూర్యునియొక్క ప్రకాశము ఎట్లు విస్తారమును బొందుచున్నవో, అట్లే పరమాత్మయందీజగత్తున్ను విస్తారమును బొందుచున్నది.

ద్రవత్వమివ కీలాలే శూన్యత్వమివ చామ్బరే
స్పన్దత్వం మరుతీవేదం కిమప్యాత్మమయం పరే. 4

జలమందు ద్రవత్వము, ఆకాశమందు శూన్యత్వము, వాయువందు చలనము ఎట్లుగలవో, అట్లే పరమాత్మయందు ఆత్మవివర్తమైనట్టి అనిర్వచనీయమగు ఈజగత్తున్ను గలదు.

మహాచితి మహాకాశే యదిదం భాసతే జగత్
తచ్చిత్త్వమేవ కచతి నిర్మలత్వం మణావివ. 5

మహా చిద్రూపమగు మహాకాశమున ఈజగత్తెయ్యది భాసించుచున్నదో, అది చైతన్యమే మణియందు నిర్మలత్వమువలె స్ఫురించుచున్నదగును.

యథా ద్రవత్వం పయసి యథా శూన్యత్వమమ్బరే
యథా ప్రస్పన్దనం వాయౌ మహాచితి తథా జగత్. 6

జలమందు ద్రవత్వము, ఆకాశమందు శూన్యత్వము, వాయువునందు సంచలనము, యున్నవిధమున మహాచైతన్యమున ఈజగత్తున్ను గలదు.

వేత్తి వాయుర్యథా స్పన్దం తథా వేత్తి జగచ్చితిః
న ద్వైతైక్యాదిభేదానాం మనాగప్యత్ర సంభవః. 7

వాయువు చలనము నెఱుఁగు విధమున చైతన్యము జగత్తు నెఱుఁగుచున్నది. కావున నిట ద్వైత, ఏకత్వాది భేదములేమాత్రమున్ను సంభవింప నేరవు.

అవివేకవివేకాభ్యాం భాసురం భఙ్గురం జగత్
బోధే స్వదైవ సద్రూపమభాసురమభఙ్గురమ్. 8

అవివేకముచే ఈజగత్తు ప్రకాశశీలమై, వివేకముచే వినాశశీలమై యొప్పుచున్నది. కాని పరమాత్మబోధచే తదుభయశూన్యమై, సదా కేవలము సద్రూపమగు బ్రహ్మమాత్రమే యైయుండును.

జ్ఞప్తిమాత్రాదృతే శుద్ధాదాదిమధ్యాన్తవర్జితాత్
నాన్యదస్తీహ నిర్ణీతం మహాచిన్మాత్రరూపిణః. 9

ఆదిమధ్యాంతరహితమై, జ్ఞానమాత్రమై, శుద్ధమైనట్టి మహాచిన్మాత్రరూపమున కన్యముగ నెద్దియు లేదను నివ్విషయమును వివేకులు నిర్ణయించిరి.

తత్కస్య చిచ్ఛివం శాన్తం కస్యచిద్బ్రహ్మ శాశ్వతమ్
కస్యచిచ్ఛూన్యతామాత్రం కస్యచిజ్జ్ఞప్తిమాత్రకమ్. 10

ఆ మహాచైతన్యమగు పరమాత్మను గొందఱు శాంతమైనట్టి శివరూపముగను కొందఱు నిత్యమైనట్టి బ్రహ్మరూపముగను, మఱికొందఱు శూన్యమాత్రముగను, ఇంక కొందఱు జ్ఞానమాత్రముగను దలంచుచున్నారు.



తదనన్తాత్మ చిద్రూపం చేత్యతామివ భావయత్
స్వసంస్థమేవ జ్ఞేయత్వమజ్ఞత్వమివ గచ్ఛతి. 11

జ్ఞేయత్వము (ఆత్మరూపత్వము) తనయందుఁ గల్గినప్పటికి ఆ అనంతాత్మయగు చిద్రూపము విషయరూపమును భావించుచున్నదానివలె నున్నదై అజ్ఞానిచందమున నగుచున్నది.

చిత్తయా నాస్తి సత్తా చ చిత్తతా నాస్తి తాం వినా
వినావినా యథా వాయోర్యథా స్పన్దేషు కారణమ్. 12

శూన్యమై, కూటస్థమైనట్టి ఆకాశములేనిచో, వాయువునకు కారణములేనట్లును, వాయువు లేనిచో నద్దాని స్పందమునకు కారణములేనట్లును, చైతన్యసత్తలేనిచో దృశ్యసత్తలేనిదగును. దృశ్యసత్త లేనిచో, చిత్తముయొక్క చిత్తత్వము లేనిదగును.

తథా మహాచితీచ్ఛాయాః సర్గసంవిత్తివృత్తిషు
నిత్యం సత్త్వమసత్త్వం వా హేతోరన్యానపేక్షణాత్. 13

ఇవ్విధమున, బ్రహ్మసత్తయొక్క యధీనమున నున్నట్టి సృష్టిరూప భ్రాంతులందు అన్య కారణముయొక్క అపేక్షలేనందుచే, జగత్తునకధిష్ఠాన రూపముచే నిత్యసత్యత్వము నిజదృశ్యరూపముచే నిత్యఅసత్యత్వము సిద్ధించుచున్నవి.

ఇత్యత్రార్థో భవిష్యత్సద్ద్విత్వైకత్వాస్తితావశాత్
కోఽత్ర కల్పయితా ద్విత్వమేకత్వం వా మహామ్బరే. 14

ఇట్లు, ఈసృష్టి భ్రాంతులందు, ఓజ్జడములయొక్కయు, ద్విత్వ, ఏకత్వములయొక్కయు అస్తిత్వము స్వతః సద్వస్తువు (ఆత్మసత్త) యొక్క యధీనమైయున్నదను ప్రసిద్ధార్థము నిశ్చితమగుచున్నది. ఇఁక కూటస్థమై, అద్వయమైనట్టి మహాచిదాకాశముననో ద్విత్వ, ఏకత్వము[illegible] వారెవరు! (ఎవరులేరని యర్థము)

విష్వగ్విశ్వమపారైకపరమాకాశకోశతా
యథా స్పన్దానిలద్విత్వం శబ్దమేవ న వాస్తవమ్. 15

వాయువు, అద్దాని స్పందములయొక్క భేదము శబ్దమాత్రమేగాని వాస్తవముగానట్లు, ఈసమస్త ప్రపంచముయొక్కయు, అనంతమై, ఏకమైనట్టి మహాచిదాకాశముయొక్కయు భేదము కల్పనామాత్రమైయున్నది.

విశ్వవిశ్వేశ్వరద్విత్వం తథైవాసన్మయాత్మకమ్
సదేవాసంభవద్ద్విత్వం మహాచిన్మాత్రకం చ యత్. 16

అట్లే, విశ్వముయొక్కయు విశ్వేశ్వరునియొక్కయు, ద్వైతము అసత్యమై యున్నది. ద్వైతము అసంభవమగుటచే [illegible]రూపమగు మహాచిన్మాత్రమే అయియున్న[illegible].

విశ్వాభాసం తదేవేదం న విశ్వం సన్న విశ్వతా
దేశకాలాదిమత్త్వేన కదాచిద్ధేమ్ని సత్యతా. 17

కటకత్వస్య భిన్నస్య విశ్వస్య చ తథా పరే
ద్విత్వైక్యాసంభవే చాత్ర కార్యకారణతా కుతః. 18

పరమాత్మయే జగత్తువలె భాసించుచున్నాఁడు. మఱియు దేశకాలాదియుక్తమగుటచే ప్రపంచముగాని, ప్రపంచత్వముగాని సత్యముగానివై యున్నవి. సువర్ణముకంటె భిన్నముగ కటకాద్యాభరణములందు సత్యత్వము లేనట్లు, పరమాత్మకంటె భిన్నముగ విశ్వమందును సత్యత్వములేదు. ఇవ్విధమున, ద్వైత ఏకత్వముల అభావముచే పరమాత్మయందు కార్య, కారణత్వము లెట్లుండగలవు?

స్వచ్ఛే తత్కల్పనామాత్ర మేవైతన్నాన్యవస్తుతా
శూన్యతా నభసీవాత్ర ద్రవత్వమివ చామ్భసి. 19

కల్పనా మాత్రముచే జగత్తునందు సత్యత్వము గలదని, ఆకాశముకంటె భిన్నముగ శూన్యత్వముగాని, జలముకంటె భిన్నముగ ద్రవత్వముగాని లేనట్లు, పరమాత్మకంటె భిన్నముగ అన్యవస్తుత్వ మెద్దియును లేదు.

ఖే ఖలేఖావ్యభిన్నేవ కిలాస్తి జగదాదితా
యద్రూపం బ్రహ్మ తద్రూపం జగత్కాత్ర ద్వితైకతే. 20

అత్యంత అభేదమందును, ఆకాశమందు ఆకాశరేఖవలె, బ్రహ్మ, జగత్తులకు భేదము గలదని అట్టి భేదము కల్పితమాత్రమేయైయున్నది. వాస్తముగ ఆకాశముయొక్క రూపమెయ్యదియో ఆకాశరేఖయొక్కయు రూపమదియే, అట్లే బ్రహ్మముయొక్క రూపమెయ్యదియో, అదియే జగత్తుయొక్కయు రూపమైయున్నది. అట్టిచో నిక నిట ద్వైత, ఏకత్వము లెచట?

యద్రూపం వ్యోమ తద్రూపమేవం శూన్య కిలాఖిలమ్
ఏకాత్మని తతే స్వచ్ఛే చిన్మాత్రే సర్వరూపిణి. 21

శిలాపుత్రక సేనాయాం పాషాణత్వ ఇవాస్థితే
కార్యకారణవైచిత్ర్యం కథం సంభవతి క్వ వా. 22

ఆకాశ, శూన్యత్వము లేకరూపములై యున్నట్లు, బ్రహ్మ, జగంబులున్ను నొకేరూపము గలవైయున్నవి. అత్తఱి, ఏకమై ఆత్మస్వరూపమై సర్వవ్యాపకమై, నిర్మలమై, చిన్మాత్రమై, సర్వరూపమైనట్టి బ్రహ్మము, శిలానిర్మిత సైన్యమునందు శిలాత్వమువలె జగత్తునందుండియుండ (జగత్తు కేవల బ్రహ్మమయమైయుండ) ఇఁక కార్యకారణవైచిత్ర్యమెట్లెచట సంభవింపఁగలదు.

కథమవ్యోమతా వ్యోమ్ని ద్వితీయాసంభవాద్భవేత్
ప్రతిభాత్మైవ భారూపో భాతి సర్గో మహాచితి. 23

పుత్రికేవోపలోత్కీర్ణా తన్మయత్వాత్తదాత్మికా
సాధో యథాస్థితస్త్యేవం బుద్ధ్వా విశ్వం ప్రలీయతే. 24

చిదాకాశమున రెండవ వస్తువు సంభవింపనందుచే అందు తద్విరుద్ధమగు వస్తువం దెట్లుండగలదు! శిలయందుఁ జెక్కఁబడిన ప్రతిమ శిలామయమగుటచే తచ్ఛిలారూపమే యగునట్లు, మహా



చైతన్యమున ఈసృష్టియు చిత్ప్రకాశమయమై యుండుటచే బ్రహ్మరూపమేయగుచున్నది. ఓ సాధూ! వాస్తవమగు బ్రహ్మతత్త్వము నెఱుఁగుటచే ఈప్రపంచము లయించిపోవుచున్నది.

కాష్ఠమౌనదశాభాసం సంసారమవశిష్యతే
యథా నిమీలితాక్షస్య రూపాలోకమనోభ్రమః. 25

భావనారూపమగు మనస్సుయొక్క చలనమాత్రముచే జనించు ఈరూప, సంకల్పాది బాహ్యాభ్యంతర జగత్తంతియు, తద్భావనాత్యాగముచే (తత్ప్రపంచమునుండి దృష్టిని మరలించుటచే) తొలఁగఁగా కాష్ఠమౌన (బాహ్యమానసిక సర్వచేష్టారహితమగు) స్థితితోటి స్ఫురించుచు బ్రహ్మమే శేషించి యుండును.

స్వప్నే జాగ్రత్యనగ్రస్థోఽప్యసన్నేవాస్తిభావనాత్
తథైవోన్మీలితాక్షస్య రూపాలోకమనోభ్రమః 26

స్వప్నమందును, జాగ్రత్తునందును సమ్ముఖమునలేని పదార్థములు తత్తద్భావనచే నున్నట్లు తోచువిధమున, ప్రపంచమువైపునకు దృష్టిని మరలించుటచే, అనఁగా తత్ప్రపంచ భావనచే రూప సంకల్పాది బాహ్యాభ్యంతర విషయరూపమగు జగద్భ్రమ భాసించుచున్నది.

స్వప్నే జాగ్రత్యనగ్రస్థోఽప్యసన్నేవాస్తి భావనాత్
భావనోపశమం కృత్వా శిలీభూయ యథాస్థితమ్. 27

స్వప్నమందును, జాగ్రత్తునందును, సమ్ముఖమునలేని పదార్థములు తత్తద్భావనచే నున్నట్లు తోచుచున్నవి. గావున, భావన నుపశమింపఁజేసి ఆత్మయందు స్వాభావికముగ శిలవలె నిశ్చలముగ నుండవలెను.

అశిలీభూతమేవాన్తః స్వభావం సమమాస్యతామ్
అవివేకోపహారేణ యథాప్రాప్తార్థపూజనైః. 28

పూర్ణవివేకమను ఉపహారము (కానుక) చేతను, యథాప్రాప్తములగు పదార్థములను అసంగ బుద్ధితో స్వీకరించుటయను పూజనములచేతను, చైతన్యస్వరూపమగు సచ్చిదానందఘనమైనట్టి ఆత్మ స్వభావమును అంతఃకరణమున నవలంబించి సమముగ నుండవలయును.

బోధాయ పూజ్యతాం బుద్ధ్వా స్వభావః పరమేశ్వరః
వివేకపూజితః స్వాత్మా సద్యః స్ఫారవరప్రదః. 29

ఆత్మబోధకొఱకుగాను, స్వబుద్ధిచే వివేక వైరాగ్యాది సాధనములద్వారా పరమేశ్వరుని బూజింపవలయును. అట్లు వివేకముచేఁ బూజితుఁడగు పరమాత్మ తత్క్షణమే నిరతిశయానందమును పర మొసంగును.

రుద్రోపేన్ద్రాదిపూజాత్ర జరత్తృణలవాయతే
విచారశమసత్సఙ్గ బలిపుష్పైకపూజితః. 30

సద్యో మోక్షఫలః సాధో స్వాత్మైవ పరమేశ్వరః
సత్యాలోకనమాత్రైకపూజితోఽనుత్తమార్థదః. 31

సాధువగు రామచంద్రా! ఈపరమాత్మయొక్క పూజయందు రుద్ర, ఉపేంద్రాదుల పూజయు శుష్కతృణలేశమువలె గాన్పించును. ఏలయనఁగా, విచార, శమ, సత్సంగములను కానుకలచేతను, పుష్పములచేతను, బూజితుఁడగు స్వాత్మయగు పరమేశ్వరుఁడు తత్క్షణమే మోక్షమను ఫలము నొసంగును. సత్యావలోకన (ఆత్మదర్శన) మాత్రముచేఁ బూజితుఁడగు నాతఁడు సర్వోత్తమమగు ఫలమును బ్రసాదించువాఁడగును.

యత్రాస్త్యాత్మేశ్వరస్తత్ర మూఢః కోఽన్యం సమాశ్రయేత్
సత్సఙ్గశమసంతోషవివేకాపూజితాత్మనః. 32

సత్సంగ, శమ, సంతోషములచే ఆత్మను పూర్ణముగఁ బూజించు వానికి, ఆయాత్మ యగుపరమేశ్వరుఁడే సమస్తఫలములనొసంగుచుండ నిఁక అన్యునినాశ్రయించునట్టి మూఢుఁడెవడుండును?

శిరీషకుసుమాయన్తే శస్త్రాహివిషవహ్నయః
దేవార్చనతపస్తీర్థదానాన్యతికృతాన్యపి. 33
భస్మాయన్తే నిరర్థత్వాదవివేకామహాత్మనామ్
ఏతాన్యపి వివేకేన క్రియన్తే సఫలాని చేత్. 34
వివేక ఏవ తత్కస్మాత్స్ఫుటమన్తర్న సాధ్యతే
యథాభూతార్థవిజ్ఞానాద్వాసనోపరమే పరే. 35

ఆత్మను బూజించువానికి శస్త్రములు, విషము, అగ్నిమున్నగు నవన్నియు శిరీషపుష్పము (దిరిసెనపువ్వు)వలె నతికోమలములుగ దోచును. మఱియు అవివేకులగు అల్పులచే (మహాత్ములుగాని వారిచే) గావింపఁబడు దేవపూజ, తపము, దానము మొదలగునవన్నియు నిరర్థకములగుటఁబట్టి ఆ యాత్మపూజకునకు విభస్మమువలె గోచరించును. వివేకముచే గావింపఁబడినచో ఈదేవపూజాదులున్ను సఫలములగును. అట్టిచో వాసనాత్యాగపూర్వకముగ సత్యపదార్థమగు ఆత్మయొక్క విజ్ఞానముచే వివేకమే స్పష్టముగ నంతఃకరణమున నేల సాధింపఁబడరాదు?

యత్నో హి వివేకశబ్దాఖ్యో భవత్యాత్మప్రసాదతః

నిష్కామముగ నాచరింపఁబడు తపోదానాదులచే సాధ్యమగు చిత్తశుద్ధిచేతనే వివేకమను పేరుగల యత్నము సంభవించుచున్నది.

తథాతథా వివేకోఽన్తర్వృద్ధిం నేయః శమామృతైః. 36
యథాయథా పునః శోషముపయాతి న విభ్రమైః

కావున, మరల విషయభ్రమలచే నశింపకుండువిధమున నట్టి వివేకమును శమ, సంతోషాది రూపమగు అమృతముచే నంతఃకరణమున వృద్ధిచేయవలెను.

దేహసత్తామనాదృత్య యథాభూతార్థదర్శనాత్. 37



లజ్జాం భయం విషాదేర్ష్యే సుఖం దుఃఖం జయేత్సమమ్
జగదాదిశరీరాది నాస్త్యేవాదౌ కుతోఽద్య తత్. 38

ఆత్మజ్ఞానముచే దేహసత్తను మిథ్యగా నెఱిఁగి లజ్జ, భయము, విషాదము, ఈర్ష్య, సుఖము దుఃఖము మున్నగువానిని సమానముగ జయింపవలయును. ఏలయనఁగా, దేహాదులు, తత్కారణమగు జగదాదుల, తత్కారణమగు అవిద్య మొమ్మొదటనే లేకయున్నవి. మొదటనే లేనపుడు ఇపుడెచటి నుండి వచ్చినవి? (కావున మిథ్యయని భావము.)

కార్యం చేత్కారణస్యైతత్తథాపి బ్రహ్మమాత్రకమ్
ప్రతిభామాత్రమేవాచ్ఛం నతు జ్ఞప్తేర్ఘటాది సత్. 39

ఈ జగత్తు బ్రహ్మమను కారణముయొక్క కార్యమనినచో, అపుడున్ను నిదియంతయు, ప్రకాశమాత్రమై, నిర్మలమైనట్టి బ్రహ్మమాత్రమే యగును. ఏలయనిన, ఘటాది పదార్థములు జ్ఞానరూపమగు యా బ్రహ్మముకంటె భిన్నముగ సత్యములు కానేరవు.

జ్ఞానాత్మికైవ ప్రతిభా జ్ఞప్తిరేవాఖిలం జగత్
జ్ఞప్తిరప్యాత్మతత్త్వాంశః పరిజ్ఞాతోపశామ్యతి. 40

దృశ్య వికల్పప్రతిభయు, చిదాభాసజ్ఞానరూపమేయైయున్నది. అట్టిచిదాభాసజ్ఞానమే యీ జగత్తంతయునగును. ఆ చిదాభాసరూపజ్ఞానమున్ను, అద్దమందలి ముఖముయొక్క శోభవలె, ఆత్మతత్త్వముయొక్క విభూతియే యైయున్నది. సాక్షిచైతన్యముయొక్క యథార్థజ్ఞానముచే నదియు నుపశమించి పోవుచున్నది.

జ్ఞేయాభావే త్వనిర్వాచ్యా శిష్యతే శాశ్వతం శివమ్
అశరీరాద్య విశ్రాత్మ సర్వం శాన్తమిదం తతమ్. 41
జ్ఞానజ్ఞేయజ్ఞప్తిముక్తం దృషన్మౌనమివ స్థితమ్

అట్లు, ఉపాధిభూతమగు జ్ఞేయము(దృశ్యము)యొక్క అభావముచే నద్దాని (దృశ్యముయొక్క) జ్ఞానము అనిర్వచనీయమై యొప్పుచున్నది. ఈప్రకారముగ నపుడు శరీర, జగదాదిరహితమై, పూర్ణమై, శాంతమై, శివమై, శాశ్వతమై, శిలవలె నిశ్చలముగ మౌనముగ నున్నట్టి బ్రహ్మమే శేషించుచున్నది.

శాన్తాన్తఃకరణాః స్వస్థాః శిలాపుత్రకకోశవత్. 42
చలన్తశ్చాలయన్తశ్చ జ్ఞరూపాః ఏవ తిష్ఠత
అజ్ఞేయజ్ఞత్వసద్రూపాః సదసత్సారరూపిణః. 43
ఆకాశకోశవిశదా భవతా భవ భూమయః

కావున, ఓ సభ్యులారా! మీరందరున్ను శిలాప్రతిమయొక్క కోశమువలె నంతఃకరణమునఁ బ్రశాంతులై, స్వస్థచిత్తులై, ప్రపంచమున వ్యవహరించుచున్నను, వ్యవహరింపఁజేయుచున్నను, అట్టిచిద్రూపమగు ఆత్మగనేయుండుఁడు. మఱియు, జ్ఞాతృజ్ఞానజ్ఞేయ రూపమగు త్రిపుటికంటె వేఱై

నట్టి సద్రూపులై, సదసత్తులకు సారభూతమైనట్టిఆత్మస్వరూపముగలవారై, ఆకాశమువలె నిర్మలమైన రూపముగలవారై, సాంసారిక భూములకు పరమైనట్టి బ్రహ్మమున నే స్థితిగల్గియుండుదురు.

యథాస్థితం చ తిష్ఠన్తి గచ్ఛన్తశ్చ యథాగతమ్. 44
యథాప్రాప్తైకకర్మాణః సంపద్యన్తే బుధాః పరమ్

జ్ఞానులు తమ యిచ్ఛాపూర్వకముగ నొకచోట నున్నప్పటికిని లేక, సంచరించుచున్నప్పటికిని యథాప్రాప్తములగు వ్యవహారముల నాచరించుచునే పరమాత్మయందు స్థితిగల్గి యుందురు.

అథవా సర్వసంత్యాగశాన్తాన్తఃకరణోజ్జ్వలాః. 45
ఏకాన్తేష్వేవ తిష్ఠన్తు చిత్రకర్మార్పితా ఇవ

లేక, సమస్తమును త్యజించి, శాంతమైన యంతఃకరణముగల్గి ప్రకాశవంతులై, ఏకాంతస్థలములందు, లిఖిత చిత్రమువలె నిశ్చలముగ సమాధియందుందురు.

సంకల్పశాన్తౌ సంకల్ప పురవత్సర్వదాఖిలమ్. 46
స్వప్నవచ్చ ప్రబుద్ధస్య సదైవాస్తంగతం జగత్

సమస్త సంకల్పములు శమింప, ప్రబుద్ధున కీజగత్తంతయు సంకల్ప పురమువలెను, స్వప్నమువలెను సదా అస్తమించియున్నట్లే కానుపించును.

సనేత్రరూపానుభవం జాతితోఽన్ధ ఇవ భ్రమైః. 47
నిర్వాణాం వర్ణయన్నజ్ఞస్తాప్యతేఽన్తర్న శామ్యతి

నేత్రముగలవానియొక్క రూపానుభవమువలె, ఆత్మప్రబోధము (నిర్వాణము)న్న పూర్ణానందానుభవ పర్యంతము దృఢపడి, అపరోక్ష సాక్షాత్కారరూపమై చెన్నొందవలయును. అట్లుగాక, అజ్ఞానులు భ్రమసంయుక్తులై నిర్వాణమునుగూర్చి వర్ణించుచు జన్మాంధునియొక్క రూపకల్పనవలె పరోక్షకల్పనతోఁ గూడుకొనియున్నవారై, అంతఃకరణమున సంతృప్తులగు చున్నారేగాని శాంతిని బొందుటలేదు.

కల్పనాంశోపదేశేన లోకోఽవిద్యామయాత్మనా. 48
యేన కేనచిదజ్ఞత్వాత్కృతార్థోస్మీఽతి మన్యతే
అకృతార్థః కృతార్థత్వం జానన్మౌర్ఖ్య విమోహితః. 49

అజ్ఞానులు, అవిద్యామయమై, కల్పనారూపమైనట్టి యేదోయొక యుపదేశమునువిని, అజ్ఞత్వముచే, తాము కృతార్థులైతిమని తలంచుచున్నారు. ఇట్లు మూర్ఖత్వముచే విమోహితులై, కృతార్థులు గాకున్నను, కృతార్థులైతిమని వారు భావించుచున్నారు.

విజ్ఞాస్యత్యకృతార్థత్వం క్షణాన్తరకదర్థనైః
ఉపాయం కల్పనాత్మానమనుపాయం విదుర్బుధాః. 50
దుఃఖదత్వాన్నిమిషేణ భావాభావైషణభ్రమైః

జ్ఞానియైనను ప్రశ్నోత్తరాదులద్వారా క్షణకాలములోనే వారి అకృతార్థత్వము వెల్లడియగును. కావున, కల్పనాత్మకమగు జ్ఞానము భావాభావ, ఇచ్ఛాది భ్రమములచే నిమిషమాత్రముననే



మహాదుఃఖప్రదమైయుండుటచేనట్టి, జ్ఞానులట్టి కల్పనారూపమగు యుపాయమును అనుపాయముగనే వచింతురు.

జగద్భ్రమం పరిజ్ఞాయ యదవాసనమాసితమ్
విరసాశేష విషయం తద్ధి నిర్వాణముచ్యతే. 51

ఇక్కారణమున జగత్తును మిథ్యగ నెఱిఁగి (హిరణ్యగర్భుని పదము వఱకు గల) సమస్త విషయముల యెడల వాసనారాహిత్యపూర్వకముగ విరక్తిగల్గి, ఆత్మయందు నెలకొనియుండుట యేదిగలదో, అదియే నిర్వాణమని చెప్పఁబడును.

ఆఖ్యాయికార్థ ప్రతిభానమేత్య
సంవేత్స్యచిద్వారిభరాద్రివాత్మా
అవేద్యచిద్రూపమశేషమచ్ఛం
పశ్యన్వినిర్వాసి జగత్స్వరూపమ్. 52

కావున, ఓ రామచంద్రా! నా యీపూర్వోక్తమగు యుపదేశమును లౌకిక కథవలె పరోక్షరూపముగ నెఱిఁగినచో కృతార్థుఁడవు కానేరవు. అపుడు వాసనామాత్ర ప్రవాహముతోఁ గూడి ప్రవహించు అచిత్తైనట్టి జగత్తను జలమునే గాంచుదువు. అపరోక్షముగ నెఱిఁగినచో, పూర్ణమై, నిర్మలమై, అవేద్యమైనట్టి, చిద్రూపముగ జగత్తును సాక్షాత్తుగ ననుభవించుచు నిర్వాణపదమున విశ్రాంతిఁ బొందుదువు.

జాత్యన్ధరూపానుభవాను రూపం యదాగమైర్బద్ధమబోధరూపమ్
అధస్పదీకృత్య తదన్తరేఽస్మిన్బోధే నిపత్యానుభవో భవాభూః. 53

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు
నిర్వాణప్రకరణే ఉత్తరార్థే నిర్వాణోపదేశో నామ
ద్విచత్వారింశః సర్గః ॥ 42 ॥

ఓ రామచంద్రా! ఇక్కారణమున, వేదశాస్త్రోపదేశములచే నెఱిఁగిన బహిర్ముఖరూపమైన పరోక్షజ్ఞానము, అజ్ఞాన తుల్యమున్న, జన్మాంధుని రూపానుభవసదృశమునునై యుండుటచే నద్దాని నణఁగఁద్రొక్కి ఈ నిత్యాపరోక్షమైనట్టి ఆత్మస్వరూపమున నిమగ్నుఁడవై జన్మాది రహితమగు నిర్వాణరూపుఁడవు కమ్ము.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్థమున
నిర్వాణోపదేశమను నలుబది రెండవ సర్గము ॥42॥

---

## త్రిచత్వారింశః సర్గః

[మనోయక్షపురప్రాయే జగత్యజ్ఞానకల్పితే
బోధమాత్రేణ నిర్మృష్టే బ్రహ్మైకస్థితిరీర్యతే.

మనస్సను గంధర్వనగరమున అజ్ఞానముచేఁ గల్పితమగు జగత్తు బోధమాత్రముచే రహితము కాఁగా కేవలము బ్రహ్మైకస్థితియే శేషించుననువిషయమిచట వివరింపబడుచున్నది.]

శ్రీవసిష్ఠ ఉవాచ:—

అహన్త్వాది జగచ్చేదం పరిజ్ఞానాదసత్యతామ్
యాతి సానుభవో మోహాత్సత్యమేవాన్యథాధియామ్. 1

శ్రీవసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! అభ్యంతరమందలి అహంకారాదులు, బాహ్యమందలి జగత్తు, అను భోక్తృభోగ్యరూపమంతయు తదనుభవరూపమగు భోగముయొక్క తత్త్వపరిజ్ఞానముచే అసత్యముగ భాసించుచున్నది. ఏలయనఁగా భోక్తయొక్క భోగ్యవస్తువుతోటి సంబంధముయొక్క యనుభవమే భోగమగును గాన, మూఢులకు అజ్ఞానముచే ఆత్మయే భోగానుభవసహితముగ నాచరించుచున్నది. కావున యథార్థముగ ఆయాత్మ తద్భోగానుభవరహితమై సత్యమగు బ్రహ్మమేయైయున్నది.

అజ్ఞానజ్వరముక్తస్య బోధశీతలితాత్మనః
ఏతదేవ భవేచ్చిహ్నం యద్భోగామ్బు న రోచతే. 2

అజ్ఞానమను జ్వరము తొలఁగినవాఁడును, జ్ఞానమగు శీతలత్వముతోఁ గూడియున్నవాఁడు నగువాని చిహ్నము భోగములను జలము రుచింపకుండుటయే యగును.

అలమన్యైః పరిజ్ఞానైర్వాచ్యవాచకవిభ్రమైః
అనహంవేదనామాత్రం నిర్వాణం తద్విభావ్యతామ్. 3

ఓ రామచంద్రా! వాచ్యవాచక (శబ్దజాల) భ్రమరూపములగు ఇతర పరిజ్ఞానములతో నేమియుఁ బనిలేదు. కేవలము భోగములయెడ విరక్తిఁగల్గి భోక్తయందు 'అహంభావమును' రహితమొనర్చినంత మాత్రముచే, నిర్వాణము సిద్ధించుచున్నది. కాబట్టి యద్దానినిగూర్చియే చింతింపవలయును.

పరిజ్ఞాతా యథా స్వప్నే పదార్థా రసయన్తి నో
నచ సన్తి తథైవాస్మిన్నహం జగదిదంభ్రమే. 4

మేల్కొనిన పిదప స్వప్నమందలి పదార్థములెట్లు రుచింపవో, మఱియు నెట్లు విద్యమానములై యుండవో, అట్లే తత్త్వజ్ఞునికి ఈ అహంకారజగద్రూపభ్రమయందలి పదార్థములున్ను రుచింపకయుండును. నాతని దృష్టియందవి లేనివేయగును.

యథా స్వభావనాద్యక్షస్తరౌ సస్వజనం పురమ్
పశ్యత్యసత్యమేవైవం జీవః పశ్యతి సంసృతిమ్. 5

అరణ్యమున యక్షుఁడు తన భావనచే వృక్షమున మాయాకల్పితమైనట్టి స్వజనసహితమగు పురమును గాంచునట్లును, అయ్యది వాస్తవముగ అసత్యమేయైనట్లును, జీవుఁడున్ను అవిద్యచే మిథ్యయగు ఈసంసారమును గాంచుచున్నాఁడు.



విభ్రమాత్మా యథా యక్షో యక్షలోకశ్చ తే మిథః
సద్రూపౌ సుస్థితౌ మిథ్యా తథాహన్త్వజగద్భ్రమౌ. 6

(పైదృష్టాంతమున) యక్షుఁడును! వానిలోకమున్ను రెండును భ్రమసిద్ధములై, కల్పితములైయున్నప్పటికిని, పరస్పరము అర్థక్రియాసమర్థములై, సద్రూపములవలె వర్తించునట్లు, మిథ్యయగు ఈ అహంకార, జగద్భ్రమయున్ను అజ్ఞానముచే సత్యముగనే వర్తించుచున్నది.

అనావరణతోఽరణ్యే యక్షా విభ్రమరూపిణః
యథా స్ఫురన్తి భూతాని తథేమాని చతుర్దశ. 7

అరణ్యమున యక్షప్రేతాదులు భ్రమరూపులై స్ఫురించునట్లు ఆవరణరహితమగు సాక్షిచైతన్యమునఁ బదునాల్గులోకములున్ను భ్రమరూపములై స్ఫురించుచున్నవి.

భ్రమమాత్రమహం మిథ్యైవేతి బుద్ధ్వా విభావయన్
యక్షోఽయక్షత్వమాయాతి చిత్తం చిత్తత్వతామిదమ్. 8

విచారించుటచే యక్షుఁడున్ను, ఆతని నగరాదులున్ను, లేకపోవునట్లు ఆత్మనెఱిఁగి, అహంకార, జగదాదులు మిథ్యయని, భ్రమమాత్రములని నిశ్చయించుటచే నవ్వి రహితములుకాఁగా చిత్తమున్ను చైతన్యరూపత్వము నొందుచున్నది.

నిరస్తకలనాశఙ్కం త్యాగగ్రహణవర్జితమ్
అవిసారిసమస్వచ్ఛం శాన్తమాస్స్వ యథాస్థితమ్. 9

కావున, ఓ రామచంద్రా! సమస్తకల్పనలను, సంశయములను విడనాడి, గ్రహణత్యాగవర్జితుఁడవై, కోర్కెలన్నింటిని బారద్రోలి, శాంతుఁడవై యుండుము.

అసత్తాసంభవం దృశ్యం ద్రష్ట్రాత్మకమిదం తతమ్
అథవా నైవ ద్రష్ట్రాత్మ సదవాచ్యం కిమాస్యతే. 10

స్వతఃసత్తలేనట్టి యీ దృశ్యము ద్రష్టృరూపమై వ్యాపించియున్నది. లేక, ద్రష్టృరూపమున్ను గాదు; అనిర్వచనీయమైన చిత్స్వరూపమే యగును. ఏలయనఁగా, పరమార్థచిద్రూపమైన సత్తగు ద్రష్ట, అసత్తగు దృశ్యరూపమెట్లు గావింపఁబడును?

వసన్తరసపూరస్య యథా విటపగుల్మతా
స్వరూపమాత్రభరితసంవిదః సర్గతా తథా. 11

వృక్షలతాగుల్మాదులు వసంతకాలపు రసప్రవాహముయొక్క రూపములేయగునట్లు, ఈ సృష్టియు ఆత్మస్వరూపమాత్రపరిపూర్ణమగు చైతన్యముయొక్క రూపమేయైయున్నది.

యదిదం జగదాభాసం శుద్ధం చిన్మాత్రవేదనమ్
కా తత్రైకతా ద్వితా కా వా నిర్వాణమలమాస్యతామ్. 12

ఓ రామచంద్రా! ఈ జగత్తుయొక్క ఆభాసమెయ్యదిగలదో, అది శుద్ధచిన్మాత్రమేయైయున్నది. ఇట ద్వైత, ఏకత్వమెట్లుండగలవు? కాఁబట్టి పూర్ణముగ నిర్వాణరూపుఁడవై యుండుము.

భూయతాం చిన్మయవ్యోమ్నా పీయతాం పరమో రసః
స్థీయతాం విగతాశఙ్కం నిర్వాణానన్దనన్దనే. 13

ఓ సజ్జనులారా! మీరందఱున్ను చిదాకాశరూపులు కండు! నిరతిశయమగు ఆత్మానంద రసమును పానముచేయుఁడు ! సర్వసంశయవర్జితులై నిర్వాణమను నందనవనమును సుస్థితులై యుండుఁడు!

కిమేతాస్వతిశూన్యాసు సంసారారణ్యభూమిషు
మానవా వాతహరిణా భ్రమథో భ్రాన్తబుద్ధయః. 14

ఓ మనుజులారా! ఈ సంసారమను అతిశూన్యమైనట్టి యరణ్యభూములందు భ్రాంతబుద్ధులగు హరిణములవలె మీరేల తిరుగాడుచున్నారు?

జగత్త్రయమరీచ్యమ్బు విప్రలబ్ధాన్ధబుద్ధయః
మా ధావత గతవ్యగ్రమాశయోపహతాశయాః. 15

ముల్లోకములను మృగతృష్ణాజలముచే వంచింపఁబడినట్టి అంధబుద్ధి గలవారై, ఆశచే నశించిన చిత్తముగల్గి, ధైర్యరహితులై పరువిడకుఁడు.

రూపాలోకమనస్కారమృగతృష్ణామ్బుపాయినః
వ్యర్థమాయా సమాయూంషి మామా క్షపయతైణకాః. 16

రూప, సంకల్పాది బాహ్యాభ్యంతరభోగములను మృగతృష్ణాజలమును ద్రావునట్టి హరిణరూపులగునో మనుజులారా! మీరీ సాంసారిక పరిశ్రమలందు మీయాయువును వ్యర్థముగ గడుపకుఁడు.

జగద్గన్ధర్వనగరగురుగర్వేణ నశ్యథ
సుఖరూపాణి దుఃఖాని నాశనాన్యేవ పశ్యథ. 17

జగత్తను గంధర్వనగరమును గూర్చిన మహాగర్వముచే మీరు నశింపకుడు. సంసారసుఖములను నాశకారకములగు దుఃఖములుగనే గాంచుడు.

జగత్కేశోణ్డ్రికభ్రాన్త్యా మా మహామ్బరమధ్యగమ్
అవలోకయతాభ్రాన్తే స్వరూపే పరిణమ్యతామ్. 18

దృష్టి భ్రాంతిచే నాకసమున కేశములఁ గాంచునట్లు, బ్రహ్మాకాశమున జగత్తను, అజ్ఞానరూప నీలత్వమును వీక్షింపకుఁడు. భ్రాంతిరహితమైనట్టి సత్యమగు ఆత్మయందే విశ్రమింపుఁడు.

మానవా వాతలోలోచ్చపత్రప్రాన్తామ్బుభఙ్గురా
మానవాసు న చాస్వన్ధగర్భశయ్యాసు సుప్యతామ్. 19

ఓ మనుజులారా! వాయువుచే చంచలమైనట్టి, వృక్షముయొక్క యూర్ధ్వభాగమునగల పత్రముపైనున్న జలబిందువువలె క్షణభంగురమైనట్టి మానవదేహములయొక్క సంసారరూపములైన అంధగర్భశయ్యలందు శయనింపకుఁడు.



అవిరామమనాద్యన్తే స్వభావే శాన్తమాస్యతామ్
ద్రష్టృదృశ్యదశాదోషాదస్వభావాద్వినశ్యతామ్. 20

ఆద్యంతరహితమై, అఖండితమైనట్టి ఆత్మస్వభావమున శాంతముగ నెలకొనియుండుడు. ద్రష్టృదృశ్యాది దశారూపమగు దోషమునఁబడి అస్వభావము (అనాత్మ స్వభావము) చే నశింపకుఁడు.

అజ్ఞావబుద్ధః సంసారః న హి నాస్తి మనాగపి
అవశిష్టం చ యత్సత్యం తస్య నామ న విద్యతే. 21

ఈ ప్రపంచము అజ్ఞానికే సత్యముగ భాసించుచున్నది. ఆత్మజ్ఞానకది యొకింతైనను లేదు. ప్రపంచము బాధితముకాఁగా శేషించుసత్యమైనట్టి శుద్ధాత్మవస్తువు నామరూపరహితమై యున్నది. అందు జగత్తుయొక్క లేశమైనను లేదు.

త్రోటయిత్వా తు తృష్ణాయాః శృఙ్ఖలావలితం బలాత్
సంసారపఞ్జరం తిష్ఠ సర్వస్యోర్ధ్వం మృగేన్ద్రవత్. 22

ఓ రామచంద్రా! తృష్ణయను ఇనుపగొలుసులచేఁజుట్టబడిన సంసారమను పంజరము (బోను)ను ఆత్మజ్ఞానమను బలముచే భేదించివైచి సింహమువలె సర్వోత్కృష్టుఁడవై వెలయుము.

ఆత్మాత్మీయగ్రహభ్రాన్తిశాన్తిమాత్రా విముక్తతా
యథా తథా స్థితస్యాపి సా స్వసత్తైవ యోగినః. 23

'నేను' 'నాది' ఈ ప్రకారమగు అభిమానరూపమైన భ్రమశమించుట మాత్రమే ముక్తి. వారేవిధముగ నున్నప్పటికిని (వ్యవహారమందున్నను సమాధియందున్నను) యోగులయొక్క యట్టి ముక్తస్వరూపము స్వాత్మసత్తయే యగును.

నిర్వాణతాఽవాసనతా పరాఽపతాపతాజ్ఞతా
సంసారాధ్వని ఖిన్నస్య శాన్తా విశ్రామభూమయః. 24

సంసారమను మార్గమున ఖిన్నుఁడైనట్టి జీవునకు నిర్వాణత్వము వాసనారాహిత్యము, ఉత్కృష్టమైనదగు త్రివిధతాపశూన్యత్వము ఆత్మజ్ఞానము అనునీనాల్గున్ను ప్రశాంతములైన విశ్రాంతి ప్రదేశములు.

తజ్జజ్ఞాతో న మూర్ఖాణాం మూర్ఖజ్ఞాతో న తద్విదామ్
విద్యతే జగదర్థోఽసావవాచ్యార్థమయో మిథః. 25

తత్త్వజ్ఞులీజగత్తునెట్లు (మిథ్యగ) యెఱుఁగుచున్నారో అట్లు, అజ్ఞాను లెఱుఁగుటలేదు. అజ్ఞానులెట్లు (సత్యముగ) యెఱుఁగుచున్నారో అట్లు తత్త్వజ్ఞులెఱుఁగుట లేదు. వారిరువురి యనుభవములున్ను పరస్పరము వచించుకొనుట కయోగ్యములైయున్నవి. జ్ఞానికీజగత్తు ఆనందమయముగను, అజ్ఞానికి దుఃఖమయముగను భాసించుచున్నది.

విశ్వతాభ్రాన్తిసంశాన్తా సంస్థితైవ న లభ్యతే
మహార్ణవామ్బువలితా పుత్రికేవ పయోమయీ. 26

జలమయములగు గంగా, గోదావరి మున్నగు నదులయొక్క ఆకృతులు మహాసముద్రముచే పరివేష్టింపబడినపుడు, అందులయించి తత్సముద్రరూపమేయై, సముద్రనివాసులకు వేఱుగలభ్యముకానట్లు భ్రమ శమింప యీ జగద్రూపమున్ను విద్యమానమైయున్నప్పటికిని జ్ఞానులకు లభింపకుండును.

భ్రాన్తిశాన్తౌ ప్రబుద్ధస్య వినిర్వాణస్య విశ్వతా
యథాస్థితైవ గలితా విద్యతే చ యథాస్థితమ్. 27

ప్రబుద్ధుఁడును, నిర్వాణమును బొందినవాఁడును నగు జ్ఞానికి, ఈ జగత్తు యథారీతి విద్యమానమైయున్నప్పటికిని, లేనిదేయగును.

నిర్దగ్ధతృణభస్మాలీ క్వాపి యాత యథానిలైః
సతాం స్వభావవిశ్రామైః క్వాపి యాతి తథా జగత్. 28

భస్మీభూతమైన తృణసమూహము వాయువేగముచే నెచటికో యెగిరిపోవునట్లు, ఆత్మస్వభావమున విశ్రాంతినొందు సజ్జనుల కీజగత్తెచటికో పలాయనమై పోవుచున్నది.

జగద్బ్రహ్మ పదార్థస్య సంనివేశః సహూత్తమః
బ్రహ్మశబ్దార్థరూపాత్మా న జగచ్ఛబ్దకార్యభాక్. 29

'వర్ధనశీలమైనది' అను 'బ్రహ్మ'శబ్దముయొక్క అర్థముగైకొని జగత్తును బ్రహ్మరూపముగను, నిరతిశయానంద మయముగను వచించినచో నది జగచ్ఛబ్దముయొక్క యుత్తమమైన యర్థమగును. అట్లుగాక షడ్విధ వికారములచే గమన (పరివర్తన) శీలమైనదని వచించినచో నది యుత్తమమైన అర్థము కానేరదు.

అవిజ్ఞాతస్య బాలస్య పదార్థా యాదృశా ఇమే
విదుషస్తాదృశా ఏవ తిష్ఠతః క్షీణవాసనమ్. 30

చింతలు మున్నగునవెవ్వియు లేనివాఁడును, విశేష జ్ఞానరహితుఁడునగు బాలకుని దృష్టియందీజగత్పదార్థములెట్లు వికల్పానుభవ రహితములై యుండునో, అట్లే వాసనలు క్షయించినట్టి ఆత్మజ్ఞానికిన్ని నిర్వికల్పముగ భాసిల్లును.

యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ
యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః. 31

సమస్తజీవులకును ఏది (ఆత్మజ్ఞానము) రాత్రియైయున్నదో, (ఏ యాత్మజ్ఞానవిషయమున సమస్తజీవులును అసావధానులై నిదురించుచున్నారో) అచట ఆత్మజ్ఞానియగు సంయమి మేల్కొని (జాగరూకుఁడై) యుండును. ఎచట (ఏ సంసార, విషయాదులందు) జీవులందఱును మేల్కొనుచున్నారో, అది ఆత్మజ్ఞుఁడగు మునికి రాత్రియేయగును. (అట్టి ప్రాపంచిక విషయాదులందు జ్ఞాని దృష్టియే లేకయుండునని భావము.)

స్థితమేవాఽవిరామీ యజ్జాగ్రదస్య సుషుప్తవత్
చిత్రావలోకిత ఇవ జాగ్రత్యోఽస్య రసైషణాః. 32



ఏలయనిన, సర్వజీవులకును అజ్ఞానాంధకారముచే నావరింపఁబడి సుషుప్తివలెనున్నట్టి ఆత్మవస్తువు జ్ఞానికి విరామశూన్యమై సదా జాగ్రద్రూపమై యున్నది. మఱియు, అజ్ఞానులకు జాగ్రద్రూపముచేఁ బ్రసిద్ధమైనట్టి శబ్దాది విషయములు జ్ఞానికి చిత్రలిఖిత పదార్థములవలె నెదుటనున్నను లేనివేయగును.

జాత్యన్ధరూపానుభవసమం భువనవేదనమ్
భ్రాన్తప్రాయమసద్రూపం జ్ఞస్య భాతి న భాతి చ. 33

జ్ఞానికీజగత్తుయొక్క యనుభవము జన్మాంధుని రూపానుభవమువలె భ్రాంతప్రాయమై, అసద్రూపమై యొకపుడు (సుషుప్తివలె) భాసింపకయు నుండును.

విమూఢదుఃఖం త్రిజగద్విమూఢవిషయం స ఖత్
స్వప్నే స్వప్నతయా జ్ఞాతే రూపాలోకమనఃక్రియాః. 34
న స్వదన్తే యథా తద్వజ్జాగ్రత్స్వప్నే స్ఫురన్తు మా
నిర్విభాగః సమాశ్వస్తోఽవిరోధం పరమాగతః. 35
అశీతలాన్తఃకరణో నిర్వాణో జ్ఞోఽవతిష్ఠతే

విమూఢులకు దుఃఖరూపముచేఁ బ్రసిద్ధములగు ఈ ముల్లోకములున్ను విమూఢులకే విషయమగునుగాని జ్ఞానికిగాదు. ఏలయనిన నివి సత్తుకావు. స్వప్నము స్వప్నరూపమున నెఱుఁగఁబడ నందలి రూపసంకల్పానుభవాది బాహ్యాభ్యంతర విషయములా జాగ్రత్పురుషున కెట్లు రుచింపవో, అట్లే యీ జాగ్రత్తను స్వప్నమందలి భోగములున్ను జ్ఞానికి స్ఫురింపకయుండుగాక! (దానిచే నేమి!) అతఁడు సదావిభాగరహితుఁడై, స్వస్థచిత్తుఁడై, విరోధింపఁబడినట్టి పరమాత్మను బొందినవాఁడై, నిర్వాణస్వరూపుఁడై, శీతలాంతఃకరణుఁడై (అతితృప్తుఁడై) యే యుండును.

తజ్జస్యాకృష్టముక్తస్య సమం ధ్యానం వినా స్థితిః. 36

భోగవాసనలచే నాకర్షింపఁబడని చిత్తముగల జ్ఞానియొక్క స్థితి ధ్యానము (చిత్తనిరోధయత్నము) లేకున్నను సమముగనే యుండును.

నిమ్నం వినైవ తోయస్య న సంభవతి కాచన
అర్థ ఏవ మనస్కారో మన ఏవార్థరఞ్జనమ్. 37

తటాకాదులందలి జలమునకు (తూము మొదలుగాగల) నిమ్నమార్గములేనిచోఁ బ్రవాహక్రియ యేమియు సంభవింపనట్లు, పదార్థముల వాసన లెవ్వియు లేనందుచే జ్ఞానియొక్క చిత్తమున్ను నెచటికిఁ జనకయుండును. ఏలయనిన, పదార్థములే మనస్సు; మనస్సే పదార్థములను రంజింపఁజేయునదైయున్నది. (కావున, తత్పదార్థము లందలి వాసనలు బాధితములుకాఁగా మనోనిరోధమున్ను సంభవించుచున్నది).

ఏష ఏవైష ఆభాసః సబాహ్యాభ్యన్తరాత్మకః
ఆసముద్రం నదీవాహాశతసంఘమయాత్మకమ్. 38
యథైకశ్లేషపిణ్డాత్మ వహత్యమ్బు తరఙ్గిణామ్
సబాహ్యాభ్యన్తరాకారమర్థానర్థమయాత్మకమ్, 39

మన ఏవ స్ఫురత్యర్థనిర్భాసం వ్యాతతం తథా
నాస్త్యర్థమనసోర్ద్విత్వం యథా జలతరఙ్గయోః. 40

ఈ మనస్సే బాహ్యాభ్యంతరము లందలి పదార్థముల ఆభాసమైయున్నది. నదుల జలములు సముద్రమున కేగునంతవఱకు ప్రవాహాద్యనేక భిన్నరూపముల గోచరించునట్లును, సముద్రమును జేరినపిదప యేకమై, జలసామాన్యముగనే భాసించునట్లును, అర్థ, అనర్థమయరూపములగు ఈబాహ్యాభ్యంతర పదార్థసముదాయమెయ్యది భాసించుచున్నదో, అది యంతయు తద్రూపమున స్ఫురించు వ్యాప్తమగు మనస్సేయగును. మఱియు, జల, తరంగములందు భేదములేనట్లు, మనస్సు, జగత్పదార్థములందును భేదములేదు.

ఏకాభావేద్వయోః శాన్తిః పవనస్పన్దయోరివ
నూనమేకోపశాన్త్యైవ నిఃసారే పరమార్థతః. 41

వాయువు, అద్దాని సంచలనములవలె పదార్థములు- ఈ రెంటియందు నొకదానియొక్క అభావముచే రెండును నుపశమించుచున్నవి. కావున, తత్త్వజ్ఞానముచేఁ బదార్థములయొక్క నిస్సారత్వ మెఱుఁగుటచే మనస్సున్ను నిక్కముగ శమించుచున్నది.

ఏకత్వాదర్థమనసీ సమమేవాశు శామ్యతః
అర్థః సంకల్పరూపాత్మా నేహితవ్యో విజానతా. 42

మనస్సు, పదార్థములు, రెండును నొకటేయగుటఁబట్టి (జ్ఞానముచే) యేకకాలముననే నవి శీఘ్రముగ శమించుచున్నవి. కావున విజ్ఞుఁడగువాఁడు సంకల్పరూపములగు పదార్థముల నెన్నఁటికిని వాంఛింపకయుండవలెను.

మనశ్చసమ్యగ్జ్ఞానేన శాన్తిరేవం భవేత్తయోః
అనష్టే నశ్యతశ్చైతే జ్ఞస్యార్థమనసీ స్వతః. 43

ఈ ప్రకారముగ సమ్యక్-జ్ఞానముచే మనఃపదార్థములు రెండును శమించుచున్నవి. ఇవ్విధమున, స్వప్నమందలి వ్యాఘ్రముయొక్క నాశమువలె నశింపఁజేయఁబడక యున్నను జ్ఞానికామనః పదార్థములు రెండును స్వయముగనే నశించుచున్నవి.

మృన్మయే ద్విపతి జ్ఞానాద్విపద్భావభయే యథా
యథా సంస్థం స్థితే ఏవ జ్ఞస్యార్థమనసీ సదా. 44

మృత్తికాప్రతిమయందు భ్రాంతికల్పితమగు శత్రుభావమున్ను, తజ్జనితమగు భయమున్ను, దానిఁగూర్చిన యథార్థజ్ఞానముచే నెట్లు నశించుచున్నవో, ఆ పిమ్మట ప్రతిమయున్నప్పటికిని, అందు శత్రుత్వ, భయాదు లెట్లు లేకపోవుచున్నవో, అట్లే, జ్ఞానికి మనః పదార్థములు రెండును సదా బ్రహ్మస్వభావముగ స్థితి నొందియుండుటచే విద్యమానములైయున్నప్పటికిని వాని నామరూపములు, తజ్జనితములగు ఆసక్తిభయాదులు నశించియే పోవుచున్నవి.



కిమప్యపూర్వమేవాస్యత్సంపన్నే భావరూపిణి
సంహితార్థజగత్కాలోఽప్యజ్ఞో జ్ఞవిషయోఽప్యసత్. 45
పార్శ్వసుప్తనరస్వప్న ఇవ క్లీబాగ్రయక్షవత్

సంసారదశకంటె విలక్షణమైనట్టి పూర్ణానంద స్వరూపము సంప్రాప్తముకాఁగా, పరమార్థస్వరూపము ఘటిల్ల, తత్త్వజ్ఞునకు కార్యకారణ సహితమగు జగత్పదార్థ సంయుక్తమైన సంసారకాలము తత్కాలకృతములగు జన్మాది వికారములు, వానిభోక్తయగు అజ్ఞాని, అతని విషయములగు శబ్దస్పర్శాదులు మున్నగునవి యన్నియు, ప్రక్కన నిదిరించుచున్న మనుజునియొక్క స్వప్నమువలెను, బాలునిచేఁ గల్పితమగు యక్షునివలెను, అసత్తుగనే గోచరించును.

జ్ఞస్య సాజ్ఞం జగన్నాస్తి వీరస్యేవ పిశాచధీః. 46

వీరునకుఁ బిశాచమునుగూర్చి బుద్ధిలేనట్లు, జ్ఞానికి, అజ్ఞానిసహితమగు ఈజగత్తున్ను లేకయున్నది.

జ్ఞమజ్ఞో భావయత్యజ్ఞం చిరం వన్ధ్యాపి వర్ధతే
విన్నైవ జ్ఞాతశబ్దార్థమర్థభావమివాగతమ్. 47
స్థితం బోధమనాద్యన్తం స్వభావం సర్గగం విదుః
మనః శబ్దార్థరహితం విభాగాన్తవివర్జితమ్. 48

అజ్ఞాని తనబుద్ధిచే జ్ఞానిని అజ్ఞానిగఁ దలంచును. అతనిదృష్టియందు వంధ్యయు చిరకాలము పుత్రపౌత్రాదులతోటి వర్ధిల్లును. ఇఁక జ్ఞానిదృష్టి, జ్ఞానముసత్య విషయము కానిదియు, బోధాకారముగ నున్నదియు, ఆద్యంతరహితమైనదియు, సర్వవ్యాపకమైనదియు, మనఃశబ్దార్థ వర్జితమైనదియు, విభాగాది రహితమున్ను, జ్ఞానస్వరూపమునగు బ్రహ్మస్వభావమే ఈసృష్టిరూపమున నున్నట్లు గాంచును.

బోధవారిమనోబుద్ధితరఙ్గమివ నిర్మలమ్
క్వ సంభవత ఏవాన్తః కే వార్థమనసీ కిల. 49

బోధమను (చైతన్యమను) జలమున మనోబుద్ధులు నిర్మల తరంగమువలె నున్నవి. ఏలయనిన శుద్ధాత్మయందు మనఃపదార్థము లెచట సంభవించును?

నిరర్థికైవ విభ్రాన్తిః స్వభావమయమాస్యతామ్
శుద్ధబోధస్వభావస్థైరాకాశమివ శారదైః. 50

జాగ్రత్స్వప్నసుషుప్తాన్త్యన్తత్వం నానుభూయతే
విధూయమానతనానాత్వమసద్భావమనామయే. 51

జ్ఞేయం రజ్జురివాశేషం స్వభావే తిష్ఠ చిద్ఘనే

ఓ రామచంద్రా! ఈమనస్సుయొక్కయు, జగత్తుయొక్కయు భ్రమనిరర్థకమైయున్నది. కావున బ్రహ్మస్వభావముననే స్థితిగల్గియుండుము. ఆకాశమందు ప్రకాశమయమగు సూర్యాది

జ్యోతులవలె బ్రహ్మస్వభావమున నెలకొనియున్నట్టి మనుజులకు జాగ్రత్స్వప్న సుషుప్తులను కల్పితములైన అవస్థలందు మనస్సు అనుభూతము కానేరదు. ఆయవస్థలన్నింటియందును సాక్షిరూపముగ నున్న నిజాత్మయే వారికి సర్వత్రయను భూతమగును. ఇక్కారణమున అనంతరూపములుగా నున్న యీసమస్త జ్ఞేయ (దృశ్య) పదార్థములను మిథ్యగా నెఱుంగుటద్వారా బాధితమొనర్చి అధ్యస్తమగు సర్పముయొక్క బాధచే రజ్జువువలె నిర్వికారమై, చిద్ఘనమైనట్టి ఆత్మస్వభావమున స్థితినొంది యుండుము.

జ్ఞప్తిరేవాన్తరం బాహ్యం చార్థత్వమధితిష్ఠతి.
బీజం శాఖాఫలానీవ క్వాతోఽర్థమనసీ వద 52
జ్ఞేయాసంభవతో జ్ఞప్తిరప్యనాఖ్యం పదం గతా. 53

ఓ రామచంద్రా! బీజమే శాఖా,ఫలాదిరూపములను ధరించునట్లు, (బుద్ధివృత్తియే) బాహ్యాభ్యంతర పదార్థరూపములను ధరించుచున్నది. అట్టిచో నిఁక మనస్సుగాని, పదార్థములుగాని యెచట నున్నవో చెప్పుము. ఇవ్విధముగ జ్ఞేయము (దృశ్యము) యొక్క అసంభవముచే జ్ఞప్తి (బుద్ధివృత్తి)యు అనిర్వచనీయమగు పదమును బొందుచున్నది.

శాన్తాశేషవిశేషాత్మా తేన శేషోఽస్తి సత్స్వభాః
అర్థ ఏవ మనస్కారః స చాభావాత్మకో భ్రమః. 54
మన ఏవార్థసంస్కారః స చాభావాత్మకో భ్రమః
సర్వాత్మత్వాదజస్యైతదప్యకారణకం మనః. 55

కాఁబట్టి సర్వవిశేష రహితమగు స్వప్రకాశమైనట్టి సద్రూపమైన ఆత్మయే శేషించుచున్నది. మఱియు, పదార్థములే మనస్సు, మనస్సే పదార్థములు. రెండును, అభావరూపములును, భ్రమాత్మకములు నైయున్నవి. అజమగు బ్రహ్మము సర్వ వస్తువులయొక్క ఆత్మయగుటచే మనోరూపముచే గూడ నదియే అకారణముగ భాసించుచున్నదగును.

భ్రమానుభవతోఽర్థశ్చ మిథ్యైవాస్తీవ భాసతే
అకారణకమేవార్థనిర్భాసం భాసతే మనః. 56

అట్లు బ్రహ్మము అకారణముగ మనోరూపముగ భాసించునట్లు, మనస్సున్ను అకారణముగ పదార్థరూపముగ భాసించుచున్నది. అట్టి పదార్థములు వాస్తవముగ మిథ్యయైయున్నప్పటికి భ్రమానుభవముచే సత్యములుగఁ దోఁచుచున్నవి.

విద్యుద్విలసితాకారమస్థిరం తరలాయతే
త్వం మనస్కారమాత్రాత్మా సంసృతౌ విభ్రమాయసే. 57

ఓ రామచంద్రా! మెఱపుయొక్క విలాసమువలె, ఈ మనస్సున్ను, జగత్తున్ను అస్థిరములై, చంచలములైయున్నవి. (అజ్ఞానస్థితియందు) అట్టి మనోమాత్రరూపుఁడవగుటచే నీవున్ను, ఈ సంసారమున భ్రమఁజెందెదవు.



స్వభావైకపరిజ్ఞానాన్నాసి నాసి భ్రమాయసే
మనస్యేవ హి సంసార ఆత్మబోధేన శామ్యతి. 58

ఓ రాఘవా! ఆత్మస్వభావము నెఱిఁగినచో నీవు అజ్ఞుఁడవుగా నేరవు. మఱియు నీకు భ్రమయున్ను గలుగనేరదు. ఏలయనఁగా, ఆత్మజ్ఞానముచే మనస్సుద్వారా యే యీ సంసారము శమించిపోవుచున్నది.

శుక్తిరూప్యభ్రమాకారో జనో మిథ్యైవ శామ్యతి
అభావభావస్తు పరం బోధరూపమసంసృతిః. 59

ముత్తెపు చిప్పయందలి వెండియనుకొనిన భ్రాంతియందువలె, ఈ జగద్భ్రమయందు మిథ్యగనే జనులు దుఃఖితులగుచున్నారు. పరమాత్మయొక్క యథార్థజ్ఞానముచే ఈ సంసారముయొక్క అభావము సిద్ధించుచున్నది.

నిర్వాణాదితరా సత్తా దుఃఖాయాహమితి భ్రమః
మృగతృష్ణాంబురూపోఽహమసచ్ఛూన్యస్వరూపకః 60

నిర్వాణము (శాంతమగు ఆత్మ) కంటె వేఱైనట్టి 'అహం' (నేను) అను భ్రమరూపమైన సత్త దుఃఖమునే కలిగించుచున్నది. మృగతృష్ణాజలమువంటి రూపముగల ఈ అహంకారము శూన్యమైనదియు, అసద్రూపమున్ను నగును.

ఇత్యేవాత్మపరిజ్ఞానా[illegible]మిథ్యైవ శామ్యతి
జ్ఞాత్వా జ్ఞానమయో భూత్వా సబాహ్యాభ్యన్తరార్థతామ్. 61
గతం స్వమత్యజద్రూపం తరఙ్గత్వం యథా పయః

ఈ ప్రకారముగ శుద్ధాత్మజ్ఞానముచే అహంకారము శమించుచున్నది. ఏలయనఁగా సృష్ట్యాదియందు బ్రహ్మము సర్వజ్ఞత్వముచే స్వాత్మభూతమగు సృజింపఁదగిన పదార్థము నెఱిఁగి స్వయముగ జ్ఞానమయుఁడగు హిరణ్యగర్భుఁడయి జలము తరంగరూపమును బొందునట్లు, ఆతని సంకల్పానుసారము స్వయముగనే బాహ్యాభ్యంతర పదార్థ రూపత్వమును, తన స్వరూపమును త్యజింపకనే పొందెను.

మూలశాఖాగ్రపర్యన్తా సత్తా విటపినో యథా. 62
నిర్వికారమలం జ్ఞప్తేర్జ్ఞేయాన్తైకైవ భాసతే

కావున, మూలమునుండి మొదలుకొని శాఖాగ్రభాగమువఱకు వృక్షముయొక్క సత్త యొక్కటేయై యున్నట్లు, జ్ఞాతృజ్ఞానజ్ఞేయ రూపమగు ఈ జగత్తునందు అత్యంత నిర్వికారమైనట్టి బ్రహ్మ యొకటియే భాసించుచున్నది.

యథా యోజనలక్షాభమేకమేవామలం నభః. 63
ఏకమేవ తథా జ్ఞానం జ్ఞేయాన్తం భాత్యఖణ్డితమ్

లక్షలకొలఁది యోజనముల పర్యంత మొకే నిర్మలమైన యాకాశము వెలయుచున్నట్లు, చిద్రూపమగు బ్రహ్మమొక్కటియే జ్ఞాతృజ్ఞానజ్ఞేయ రూపమగు ఈ జగత్తునందు అఖండరూపముతోటి భాసిల్లుచున్నది.

శూన్యత్వాదేకమమలం యథా సర్వగమేవ ఖమ్. 64
తథైకమమలం జ్ఞాత్వా జ్ఞానజ్ఞేయదశాస్వపి

శూన్యత్వకారణముచే నిర్మలమైన యాకాశమొకటియే సర్వత్ర వ్యాపించి యున్నట్లు, జ్ఞానజ్ఞేయాది దశలందంతటను, నిర్మలమైనట్టి యేకమగు ఆత్మయే వ్యాపించియున్నది.

ఘృతేనాత్మా ఘనీభూయ పాషాణీక్రియతే యథా. 65
చితా చేత్యతయాత్మైవ స్వచిత్తీక్రియతే తథా
దేశకాలం వినైవాత్మా బోధాబోధేన చిత్తతామ్. 66

నేయి ఘనీభవించి తన్ను శిలారూపముగ గావించుకొనునట్లు, చైతన్యమున్ను విషయరూపమై తన్ను చిత్తరూపముగ గావించుకొనుచున్నది. దేశకాలాదులులేకనే, ఈఆత్మ తన యథార్థస్వరూపము నెఱుఁగమి చిత్తరూపత్వమును బొందుచున్నది.

అబుద్ధో నీయతే న్యాయైరేకమేవైష సుస్థితః
అత్ర యద్యప్యబోధాదేః సంభవో నాస్తి కశ్చన
తథాపి కల్ప్యతేఽత్రైవ బోధనాయ పరస్పరమ్. 67

ఏకమైనట్టి ఆత్మ తనస్వరూపముననే సదాస్థితినొందియున్నప్పటికి, అవిద్యచే అజ్ఞానదశను బొందుచున్నది. శుద్ధాత్మయందట్టి అజ్ఞానాదులెవ్వియును సంభవింపకున్నను, ఈ అవిద్యాదశయందు పరస్పరబోధకొఱకై చిత్తాదులు కల్పింపఁబడుచున్నవి.

మహానుభావా విగతాభిమానా విమూఢభావోపశమే గలన్తి
నిర్భ్రాన్తయోఽన్తతయైవ శాన్తా నిత్యం సమాధానమయా భవన్తి. 68

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు
నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే బ్రహ్మైకతానతోపదేశో నామ
త్రిచత్వారింశః సర్గః ॥ 43 ॥

ఓ రామచంద్రా! కావున జ్ఞానముచే మూలాజ్ఞానము శమింప, అభిమానరహితులగు మహానుభావులు (ఘృతకాఠిన్యమువలె)తమ ఆత్మస్వరూపముననే లయమొందుచున్నారు. దానిచే వారనంతమైన యాత్మానందముచేఁ బరిపూర్ణులై, శాంతులై, విక్షేపరహితులై, నిరంతరము సమాధి విశ్రాంతి తత్పరులై మెలఁగుచున్నారు.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున
బ్రహ్మైకతానతోపదేశమను నలుబదిమూఁడవ సర్గము. ॥ 43 ॥

---



## చతుశ్చత్వారింశః సర్గః

[వర్ణ్యతే వర్ధనీయోఽత్ర సమాధానసురద్రుమః
తలే తస్య చ విశ్రాన్త్యై శ్రాన్తో దేహిమనోమృగః.

సమాధియను కల్పవృక్షముయొక్క వృద్ధి, అలసటజెందిన జీవుని మనస్సను మృగము దాని క్రింద విశ్రమించుట యను విషయములిట వర్ణింపఁబడుచున్నవి.]

శ్రీరామ ఉవాచః—

క్రమాత్సమాధానతరోరాజీవఫలశాలినీమ్
సలతాకుసుమాం బ్రూహి సత్తాం విశ్రాన్తిదాం మునే. 1

శ్రీ రాముఁడు.— ఓ మునీంద్రా! లతా, పుష్పాదిసహితమై, వివేకులకు సదాజీవనప్రదములగు నుత్తమ ఫలములను గలుగఁజేయునదైనట్టి సమాధియను వృక్షముయొక్క విశ్రాంతి నొసంగు స్థితిని గూర్చి క్రమముగ వర్ణింపుడు!

శ్రీవసిష్ఠ ఉవాచః—

ఆజీవముద్యదుత్సేధం వివేకిజనకాననే
పత్రపుష్పఫలోపేతం సమాధానతరుం శృణు. 2

శ్రీవసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! వివేకజనులను వనమున నున్నదియు, వివేకులకు సర్వథా జీవనమూలమైనదియు, విశాలమైనదియు, పత్రపుష్పఫలాది సహితము నగు సమాధియను వృక్షమును గూర్చి వినుము.

యథాకథంచిదుదితం దుఃఖేన స్వయమేవ చ
సంసారవననిర్వేదం బీజమస్య విదుర్బుధాః. 3

శత్రు 'స్వజనాదులచే, గావింపఁబడు అవమానముచేగాని, సౌభాగ్యవశమున స్వయముగగాని, లేక, మహాత్ముల యుపదేశముచేగాని, ఏదోయొక విధముగనుత్పన్నమగు–సంసారారణ్యముయెడలనైన పరమ వైరాగ్యమునే విజ్ఞులీ సమాధివృక్షముయొక్క బీజమని వచించుచున్నారు.

శుభజాలహలాకృష్టం రసాసిక్తమహర్నిశమ్
ప్రవహచ్ఛ్వసనాకుల్యం క్షేత్రమస్య విదుర్బుధాః. 4

శుభకర్మలను నాగళ్లచే దున్నఁబడినదియు, శాంత్యాది జలములచే అహర్నిశము తడుపఁబడినదియు, ప్రాణాయామము మన్నగు పిల్లకాలువలతోఁ గూడియున్నదియు నగు చిత్తమే యీ సమాధి వృక్షమునకు క్షేత్రమని తత్త్వజ్ఞులు బల్కుదురు.

సమాధిబీజం సంసారనిర్వేదః పతతి స్వయమ్
చిత్తభూమౌ వివిక్తాయాం వివేకిజనకాననే. 5

సంసారముయెడల పరమవైరాగ్యమను సమాధి బీజము వివేకముచే శుద్ధముగాఁ జేయఁబడిన చిత్తమను భూమియందు స్వయముగనే వచ్చిపడుచున్నది.

స్వచిత్తభూమౌ పతితం ధ్యానబీజం మహాధియా
నైకైరమీభిర్యత్నేన సంసేక్తవ్యమఖేదినా. 6

అట్లు స్వచిత్తమను భూమియందుఁబడిన వైరాగ్యమను సమాధి బీజమును వృద్ధినొందించుటకు గాను దృఢమైన బుద్ధితోఁగూడి, ఖేదరహితుఁడై, మనుజుఁడీ వచింపఁబోవు ప్రయత్నరూప జలములచే నద్దానిని బాగుగఁ దడుపుచుండవలెను.

శుద్ధైః స్నిగ్ధైః పవిత్రైశ్చ మధురైరాత్మనోహితైః
సత్సంగమనవక్షీరైరైన్దవైరమృతైరివ. 7

శుద్ధమై, పవిత్రమై, స్నిగ్ధమై, మధురమై, మనంబునకు హితదాయకమై, చంద్రుని అమృతమును బోలునట్టి సత్సాంగత్యమను నూతనక్షీరముచే ఆ సమాధి బీజమును మొమ్మొదటఁ దడుపవలయును.

అన్తఃశూన్యప్రదైః పూర్ణైః స్వచ్ఛైరమృతశీతలైః
విస్మృతైరమృతాకుల్యాః శాస్త్రార్థవరవారిభిః. 8

పిమ్మట నేతి నేత్యాది వాక్యములద్వారా సర్వద్వైత నిషేధముచే నంతఃకరణమున సంసార శూన్యత్వమును బోధించునవియు, కనుక నే ఆత్మతత్త్వపరిపూర్ణములును, నిర్మలములును, సర్వసంసార తాపోపశమనముచే అమృతమువలె మధురమై, శీతలమై, వెలయునవియు, గురువుయొక్క హృదయమను బ్రహ్మసరోవరమునుండి వ్యాఖ్యద్వారా బయల్వెడలినవియు, అమృతప్రవాహమయములగు కాలువలఁ బోలినవియునగు శ్రవణమననాది శాస్త్రార్థములను నుత్తమ జలములచే ఆ వైరాగ్యమను సమాధిబీజమును దడుపవలెను.

స్వచిత్తభూమౌ పతితం పరిజ్ఞాయ మహాధియా
బీజం సంసారనిర్వేదో రక్ష్యం ధ్యానస్య యత్నతః. 9

స్వచిత్తమను భూమియందుఁబడినట్టి సంసారవైరాగ్యమను సమాధి బీజమును తీక్ష్ణబుద్ధితోటి కనుఁగొని ప్రయత్నముచే రక్షింపవలెను.

తపఃప్రకారదానేన పదార్థఘటనే శితైః
తీర్థాయతన విశ్రాన్తివృత్తివిస్తారకల్పనైః. 10

కాయిక, వాచిక, మానసిక తపములను దోహదములచేతను, దానముచేతను, అమానిత్వాది సద్గుణములచే సమర్థింపఁబడినట్టి యుత్తమక్రియలచేతనుఁ పవిత్ర తీర్థములందలి నివాసమను వృత్తివిస్తార రూప కల్పనలచేతను ఈమున్నగు ప్రయత్నములచే ఆ సమాధిబీజమును రక్షింపవలయును.

కర్తవ్యోఽఙ్కురితాస్యాస్య రక్షితా శిక్షితాశయః
సంతోషనామా ప్రియయా నిత్యం ముదితయాన్వితః. 11

ఈ ప్రకారముగ అంకురదశను బొందింపఁజేయఁబడిన యీ బీజమునకు రక్షణోపాయమునందు నిపుణుఁడును, ముదితయను పత్నిసహితుఁడై నిరంతర ముండువాఁడునగు సంతోషమను క్షేత్రపాలకుని నియమింపవలెను.



పశ్చాత్థ్సితాశావిహగాన్వర ప్రణయ పక్షిణః
అస్మాదాపతతః కామగర్వగృధ్రాన్నివారయేత్. 12

పిమ్మట, పూర్వవాసనలచే నావిర్భూతములును, ధన, పుత్రాదులందలి యనురాగరూపములును, ధాన్యమను నంకురమునకు విఘాతమును గలుగఁజేయుటకై వచ్చిపడునవియునగు ఆశయను పక్షులను, కామక్రోధాది గృధ్రములను నివారించవలెను.

మృదుభిః సత్క్రియాకున్తైర్వివేకార్కాతపైరపి
అచిన్త్యాలోకదైరస్మాన్మార్జితవ్యం రజస్తమః. 13

తదుపరి అహింసాప్రధానత్వముచే మృదువైనట్టి యమ, నియమాది సమ్మార్జనుల (చీపురు కట్టల)చే ఆచిత్త-క్షేత్రమందలి రజోగుణమను ధూళిని యూడ్చివేయవలెను. మఱియు, అచింత్యమైనట్టి బ్రహ్మప్రకాశమును గలుగఁజేయు వివేకమను సూర్యుని ఆతపములచే ఆక్షేత్రమందలి అజ్ఞానమను అంధకారమును గూడఁ బోఁగొట్టవలయును.

సంపదః ప్రమదాశ్చైవ తరఙ్గా భోగభఙ్గురాః
పతన్త్యశనయస్తస్మిన్దుష్కృతాభ్రసమీరితాః. 14

ధైర్యౌదార్యదయామన్త్రైర్జపస్నానతపోదమైః
వినివారయితవ్యాస్తాః ప్రణవార్థత్రిశూలినా. 15

అత్తఱి, దుష్కృతమను మేఘములచే బహుద్రోయఁబడినవై, తరంగములవలె క్షణభంగురములైనట్టి వనితా, సంపదాది భోగములను పిడుగులాయంకురముపైఁబడును. గావున, ప్రణవార్థమను త్రిశూలమును ధరించి, ధైర్య, ఔదార్య, దయాది మంత్రములచేతను, జప, తప, స్నాన, దయాదులచేతను వానిని నివారించవలయును.

ఇతి సంరక్షితాదస్మాద్ధ్యానబీజాత్ప్రవర్తతే
అభిజాతో్యన్నతః శ్రీమాన్వివేకాఖ్యో నవాఙ్కురః. 16

ఈరీతిగ రక్షింపఁబడిన యా ధ్యాన(సమాధి) బీజమునుండి, పుష్టి, సౌందర్యాధిక్యతచే నున్నతమై, శోభాయుక్తమైనట్టి వివేకమను నూతనాంకుర ముత్పన్నమగుచున్నది.

తేన సా చిత్తభూర్భాతి సప్రకాశా వికాసినీ
భవత్యాలోకరమ్యా చ ఖం యథాభినవేన్దునా. 17

ఆ వివేకాంకురముచే ఆచిత్తభూమి ప్రకాశయుక్తమై, వికాసవంతమై, అతిశోభాయుతమై నూతనచంద్రునిచే నాకసమువలె రమణీయముగ భాసిల్లును.

తస్మాదఙ్కురతః పత్రే ఉభే వికసతః స్వయమ్
ఏకం శాస్త్రాభిగమనం ద్వితీయం సాధుసంగమః 18

అప్పుడా యంకురమునుండి (వేదాంతాది) సచ్ఛాస్త్రవిచారము, సాధుసంసర్గమను రెండాకులు స్వయముగనే యావిర్భవించి వికాసమొందును.

స్తమ్భమేష నిబధ్నాతి స్థైర్యం నామ సమున్నతిమ్
సంతోషత్వగ్వివలితం వైరాగ్యరసరఞ్జితమ్. 19

ఆపిదప, ఆ యంకురము సంతోషమను చర్మముచేఁ బరివేష్టితమై, వైరాగ్యమను రసముచే శోభితమై, గొప్ప ప్రకాండము(బోదె)చే నలరుచు, దృఢమూలత్వమను, ఉన్నతిని బడయుచున్నది.

వైరాగ్యరసపుష్టాత్మా శాస్త్రార్థ ప్రావృషాన్వితః
స్వల్పేనైవ స్వకాలేన పరామేతి సమున్నతిమ్. 20

వైరాగ్యమను రసముచేఁ బరిపుష్టమై, శాస్త్రార్థమను వర్షముతోఁ గూడినదై, ఆయంకురము అల్పకాలముననే మహోన్నతిని బొందుచున్నది.

శాస్త్రార్థ సాధుసంపర్క వైరాగ్యరసపీవరః
రాగద్వేష కపిక్షోభైర్న మనాగపి కమ్పతే. 21

శాస్త్రవిచార, సాధుసంగమ, వైరాగ్యములను రసముచేఁ బుష్టమై యాధ్యాన వృక్షము రాగద్వేషములను వానరములయొక్క క్షోభలచే నొకింతైనను నపుడు చలింపకయుండును.

అథ తస్మాత్ప్రజాయన్తే విజ్ఞానాలంకృతాకృతేః
లతా రసవిలాసిన్య ఇమా వితతదేశగాః. 22

పిమ్మట, జ్ఞానముచే శోభితమగు ఆకృతిగల యా వివేకవృక్షమునుండి, వైరాగ్యాదిరసములచే విలాసవంతములై, విశాలములై, అపరిచ్ఛిన్నమైన ఆత్మప్రదేశమునకుఁ జనునవైనట్టి యీ చెప్పఁబోవు లతలు జనించుచున్నవి.

స్ఫుటతా సత్యతా సత్తా ధీరతా నిర్వికల్పతా.
సమతా శాన్తతా మైత్రి కరుణా కీర్తిరార్యతా. 23

ఆత్మతత్త్వముయొక్క స్ఫుటత్వము, సత్యత్వము, ఆత్మస్థితి, ధీరత్వము, నిర్వికల్పత్వము, సమత్వము, శాంతి, మైత్రి, కరుణ, కీర్తి, ఆర్యత్వమను లతలు ఆధ్యానవృక్షమునుండి యావిర్భవించుచున్నవి.

లతాభిర్గుణపత్రాభిః స ధ్యానతరురూర్జితః
యశఃపుష్పాభిరేతాభిః పారిజాతాయతే యతేః. 24

శాంత్యాదిగుణములను పత్రములు గల్గిన లతలచేతను యశస్సను బుష్పములచేతను సమృద్ధి నొందిన యా ధ్యానవృక్షమపుడు యోగికిఁ గల్పవృక్షముపగిది యగుచున్నది.

ఇత్యసౌ జ్ఞానవిటపీ లతాపల్లవపుష్పవాన్
భవిష్యజ్జ్ఞాన ఫలదో దినానుదినముత్తమః. 25

ఈ ప్రకారముగ లతాపల్లవ, పుష్పాదులచే శోభితమగు యావివేకవృక్షము దినదినము ప్రవర్ధమానమై, క్రమముగ మూలాజ్ఞానమును నశింపఁజేయ సమర్థమైనదియు, సప్తమ భూమికాపర్యంతము విశ్రాంతి దాయకమునగు బ్రహ్మసాక్షాత్కారరూప జ్ఞానమను ఫలమును గలుగఁజేయునదగుచున్నది.



యశః కుసుమ గుచ్ఛాఢ్యో గుణపల్లవలాసవాన్
వైరాగ్యరసవిస్తారీ ప్రజ్ఞామఞ్జరితాకృతిః. 26

మఱియు నది, యశస్సను పుష్పగుచ్ఛములచేఁ బూర్ణమై, శాంతి, ఉదారత్వాది గుణములను పల్లవములచే భూషితమై, వైరాగ్యమను రసముచే విస్తృతమై, ప్రజ్ఞమను జిగిర్చిన లేఁగొమ్మలతోఁ గూడినదై యొప్పుచున్నది.

సర్వాః శీతలయత్యాశాః పావృషీవ పయోధరః
సర్గాతపం శమయతి సూర్యతాపమివోడుపః. 27

వర్షాకాలమందలి మేఘమువలె ఆ సమాధివృక్షము దిక్కులన్నింటిని శీతల మొనర్చుచున్నది. మఱియు సూర్యతాపమును జంద్రుడు శమింపఁజేయునట్లు సంసారతాపము నయ్యదిశమింపఁజేయుచున్నది.

ప్రతనోతి శమచ్ఛాయం ఛాయామివ ఘనాగమః
నిరోధమాస్ఫారయతి శమోఽనిల ఇవామ్బుదమ్. 28

ఇంకను, మేఘమువలె నది శమమను ఛాయను విస్తరింపఁజేయుచున్నది. వాయువు మేఘమును విశాలమొనర్చునట్లు చిత్తస్థైర్యమునున్ను వృద్ధిపఱచుచున్నది.

నిబధ్నాత్యాత్మనా పీఠం కులాచల ఇవ స్థితమ్
ఫలస్య రచయత్యూర్ధ్వం ఘటికామఙ్గలాదితామ్. 29

కులపర్వతమువలె స్థిరముగ నున్నదై, అది ఆత్మజ్ఞానమను మూలబంధమును (పునాదిని) గట్టిపఱచుచున్నది. మఱియు కైవల్యమను ఫలమును గలుగఁజేయుట కొఱకై యూర్ధ్వభాగమున శాంత్యాది శుభగుణములను పుష్పగుచ్ఛముల శోభను రచించుచున్నది.

వివేకకల్పవృక్షే తు వర్ధమానే దినేదినే
ఛాయావితానవలితే పుంసో హృదయకాననే 30
ప్రవర్తతే శీతలతాతలతాపాపహారిణీ
అభ్యుల్లసన్మతిలతా తుషారోదరసున్దరీ. 31

ఇట్లు మనుజుని హృదయమను వనమున ఛాయయను వితానముచేఁ బరివేష్ఠితమైనట్టి యా వివేకమను కల్పవృక్షము దినదినము వృద్ధినొందుచుండ, శోభాయమానమగు బుద్ధియను లతతోఁ గూడినదై తుషార (హిమ) గర్భమువలె సుందరమై, మూలభూమియగు హృదయముయొక్క ఆధ్యాత్మికాది త్రివిధతాపములను పాపములను హరించునటువంటిదైనట్టి శీతలత్వముదయించుచున్నది.

యస్యామవాన్తరశ్రాన్తో విశ్రామ్యతి మనోమృగః
ఆజన్మ జీర్ణపథికః పథి కోలాహలాకులః. 32

అనేక జన్మలందలి దుఃఖములచే శైథిల్యము నొందినదియు, దైవయోగముచే సన్మార్గము లభించినను వివిధవాదులయొక్క కోలాహలముచే మార్గమందు వ్యాకులమైనదియు, వివిధ సాంసారిక

భూములందుఁ దిరిగి శ్రమనొందినవాఁడగు పథికుఁడైన మనోమృగము ఈ వృక్షము క్రింద కేతెంచి విశ్రాంతి నొందుచున్నది.

సత్తామాత్రాత్మశారీరచర్మార్థం ప్రేక్షితోఽరిభిః
నానాతాసారసాకారగోపయజ్జర్జరోన్ముఖః. 33

ఆ మనోమృగము సత్తామాత్రాత్మరూపుఁడైన పురుషుఁడను చర్మము నపహరించుటకై యత్నశీలురైనట్టి కామక్రోధాదులను బోయవారిచేఁ జరుమఁబడినదియు, అసారమై, అనేకత్వలక్షణముతోఁ గూడినట్టి దేహరూప కంటకకుంజములందు దాగుకొనుటకు యత్నించుచు, తత్కంటకములచే శిథిలీభూతమైనట్టి యూర్ధ్వముఖము గలదియునై యున్నది.

సంసారారణ్యవిసరద్వాసనాపవనేరితః
అహన్తాతాపసరితా సర్వదా విప్రదావదీ. 34

మఱియు, ఆ మనోమృగము సంసారమను నరణ్యమున, వాసనలను వాయువుచే, ప్రేరితమై అహంభావమను మృగతృష్ణానదివైపునకుఁ బరుగిడుచు, విషపీడితమైనదివలె నంతఃకరణమున దాహతృష్ణాదులచే వ్యాకులమైయున్నది.

దీర్ఘాదరీదూరచితసార సంసారజర్జరః
పుత్రపౌత్రపరామర్శప్రతాపాత్పతితోఽవశే. 35

అట్టిది దీర్ఘములగు భోగవిస్తారములందే మిగుల యాదరము గలదియు, కనుకనే దూరప్రదేశములందలి విషయముల వైపునకుఁ బరువిడుటచే శిథిలమైనట్టి శరీరము గలదియు, పుత్రపౌత్రాదుల పాలనవలన త్రివిధతాపములను దావాగ్నియొక్క ప్రతాపముచే అసర్థమను గోతియందుఁబడినదియునై యున్నది.

లక్ష్మీలతావిలుఠనాత్సంకటైః కుణ్ఠితాఙ్గకః
తృష్ణాశ్రీసరితం గృహ్ణాన్కల్లోలైర్దూరమాహతః. 36

ఆ మనస్సను హరిణము, సంపదలను లతలందు పాదములు తగుల్కొనుటచేఁ గ్రిందపడి పొర్లాడినదై తత్ప్రయుక్తములగు అనేక సంకటములచేఁ గుంఠితమైన శరీరము గలదియు, తృష్ణయను నదియందుఁబడి క్షుత్పిపాస, శోకమోహాది తరంగములచేఁ దూరముగఁ గొట్టుకొనిపోఁబడినదియునై యున్నది.

వ్యాధిదుర్వ్యాధవైధుర్యపలాయనపరాయణః
అశఙ్కితవిధిర్వ్యాధపాతాదివ కృతాకృతిః. 37

మఱియు, ఆ మనోమృగము వ్యాధులను దుష్టులగు బోయవారిచే బాధింపఁబడి పరుగెత్తునదియు దైవము (సౌభాగ్యములేక అదృష్టము) యొక్క సంభావనలేనిదియు కావుననే బోయవారియొక్క యాగమనముచే సంకుచితమైన శరీరము గలదియునై యున్నది!

జ్ఞేయాస్పదసమాయాత దుఃఖసాయకశఙ్కితః
వైరివిద్రవణవ్యగ్రో దృషదాహరణాఙ్కితః. 38



అయ్యది, జ్ఞానేంద్రియములయొక్క శబ్దాది విషయములచే నుత్పన్నములైన దుఃఖములను వేటుగాండ్ర బాణములచే నీతిల్లినదియు, కామక్రోధాది శత్రువుల యుపద్రవములచే వ్యాకులమైనదియు, శిలాప్రహారములచేవలె పూర్వకాలికదుఃఖానుభవ సంస్కారములచే చిహ్నితమైనదియునై యొప్పుచున్నది.

ఉన్నతానతసంపాతనిపాతేనాతిఘూర్ణితః
వికారోపలనిర్ఘాతైః పారమ్పర్యేణ చూర్ణితః. 39

ఆ మనోమృగము స్వర్గనరకాది ఉన్నత అవనత ప్రదేశములందలి పాతోత్పాతములచే చకితమైనదియు, కామక్రోధాది వికారములను శిలలయొక్క ప్రహారములచే నిరంతరము చూర్ణితమైనదియునై యున్నది.

తృష్ణాచారులతాజాలప్రవేశవశవిక్షతః
స్వప్రజ్ఞారచితాచారైః పరమాయాస్వశిక్షితః. 40

మఱియు, ఆ మనోరూపహరిణము తృష్ణయను మనోహరమైన లతాసమూహమందుఁ బ్రవేశించుటచే గాయమొందిన శరీరముగలదియు, స్వబుద్ధిచేఁ గల్పితములగు అనేక ఆచారములతోఁ గూడియున్నదియు, పరమాత్మయొక్క మాయ నెఱుఁగనిదియునై యున్నది.

ఇన్ద్రియగ్రామమాగత్య ప్రపలాయనతత్పరః
సుదుర్గ్రహగజేన్ద్రోగ్రవిస్ఫూర్జనవిమర్దితః. 41

ఆ మనోమృగము, ఇంద్రియములను గ్రామమునకేతెంచి పరుగెత్త మొదలిడునదియు, గ్రహించుటకతి దుస్సాధ్యమైనట్టి భయంకరమైన కామమను గజముయొక్క ఘీంకారముచే మర్దింపఁబడునదియునై యున్నది.

విషయాజగరోదారవిషఫూత్కారమూర్ఛితః
కాముకః కామినీభూమా రసాత్ప్రాయో విపోథితః. 42

మఱియునది విషయములను అజగరముయొక్క మహావిషయమగు ఫూత్కారముచే మూర్ఛనొందినదియు, కామినులను భూమియందాసక్తిగలదియు, విషయములను రసముచే మర్దింపబడునదియునై యొప్పుచున్నది.

కోపదావానలప్లుష్టపృష్ఠవిస్ఫోటదాహవాన్
సదా గతాగతానేకదీర్ఘదుఃఖప్రదాహవాన్. 43

మఱియు, ఆ మనస్సను హరిణము క్రోధమను దావాగ్నిచే దహింపఁబడుటచేఁ పృష్ఠభాగమున ననేక బొబ్బలుగలదియు, విషయములందు మరలమరల సదా సంచరించుచుండుటచే చింతాశోకాద్యనేక దీర్ఘదుఃఖములచే నంతఃకరణమున దహింపఁబడునదియునై యున్నది.

స్వాత్మలగ్నాఖిలాపాదంశదోషైరుపద్రుతః
భోగలోభలసన్మోహదశృగాలచిరవిద్రుతః. 44

ఇంకను, ఆ మనోమృగము తనయందు సంలగ్నమైయున్నట్టి యనేక అభిలాషలను దోమల యొక్క కాటులవలన నుపద్రవముతోఁగూడియున్నదియు, భోగేచ్ఛయందలి మహాప్రీతియను శృగాలము(నక్క)లచే చిరకాలము దుఃఖితమొనర్పఁబడినదియునై యున్నది.

స్వకర్మ కర్తృతోద్భ్రాన్తదారిద్ర్యద్వీప్యనుద్రుతః
వ్యామోహమిహికాన్ధత్వ కూటావటలుఠత్తనుః. 45

స్వకర్మచే నుత్పన్నమైన దారిద్ర్యమను వ్యాఘ్రముచేఁ బీడింపఁబడినదియు, పుత్ర, మిత్ర, కళత్రాదులందలి వ్యామోహమను మంచుచేఁ గుడ్డిదిగా, జేయఁబడుటచే కపటములు, నీచకృత్యములను గోతులలోఁబడి దొర్లుటవలన భగ్నమైన శరీరముగలదియునై యా మనోమృగ మొప్పుచున్నది,

మానసింహసముల్లాసహృదయోత్కమ్పనాతురః
మరణేన రణే యేన వృకపుష్పమివేక్షితః. 46

మఱియు, ఆ మనస్సను మృగము, మానమను సింహముయొక్క యుల్లాసముచే హృదయమున భీతిల్లునదియు, మృత్యువను బ్రసిద్ధమగు వ్యాఘ్రముచే యుద్ధమున (సులభముగ విశీర్ణము కాఁబడునట్టి) పుష్పమువలెఁ గాంచఁబడునదియునై యున్నది.

గర్వేణ గిరణాయాశు దూరతో జనసేవితః
కామైః సమస్తోదన్త వితానితయవాఙ్కురః. 47

మఱియు నది, గర్వమను అజగరముచే నిర్జనారణ్యమున శీఘ్రముగ మ్రింగబడుటకై చిరకాలము నిరీక్షింపఁబడినదియు, అనేక కోర్కెలతోఁ గూడియున్నదై, వాని నిమిత్తము దీనత్వ, యాచనాదులచే తనదంతములను యవాంకురములను విస్తరింపఁజేసినదియునై యున్నది.

తారుణ్యనారీసుహృదా క్షణమాలిఙ్గ్య వర్జితః
దుఃసంచారేషూపవనైః కుపితైరివ వర్జితః. 48

ఇంకను ఆ మనోమృగము సుహృద్రూపిణియగు యువతిచే క్షణకాలము కౌఁగలింపఁబడి మరల త్యజింపఁబడినదియు, కృద్ధములైన ఝంఝామారుతములఁబోలిన యింద్రియములచే దుర్గమములగు నరక, స్థావరాది ప్రదేశములందు విసరఁబడినదియునై యున్నది.

కదాచిన్నిర్వృతిం యాతి స శమం చ తరౌ క్వచిత్
మనోహరిణకో రాజన్నాజీవమివ భాస్వతి. 49

ఓ రామచంద్రా! రాత్రియందు అంధకార, శీతలత్వములచే పీడితుఁడగు మనుజుఁడు సూర్యోదయముకాఁగానే విశ్రాంతినొందునట్లు, పైవచించినరీతి యున్నట్టి మనస్సను మృగము అనేక జన్మార్జితమగు పుణ్యముచే నొకానొకపుడు అధికారిదేహమునుబొంది, అచట శమదమాది సాధనములతోఁగూడి పూర్వోక్తమగు సమాధివృక్షముక్రింద విశ్రాంతిని బొందుచున్నది.

తాలీ తమాలబకులాదికవృక్షగుల్మ
విశ్రాన్తిషు ప్రచురపుష్పవిలాసహాసైః



నామాపి యస్య న విదన్తి సుఖస్య మూఢాః
ప్రాప్నోతి తచ్ఛమతరోః స్వమనోమృగో వః. 50

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే మనోమృగవిపద్వర్ణనం నామ చతుశ్చత్వారింశః సర్గః ॥ 44 ॥

ఓ సభ్యులారా! తాళీ, తమాలాది వృక్షమూలములందలి విశ్రాంతినిబోలినట్టి భూలోకాది సత్యలోక పర్యంతముగల నివాసములందలి యనేకపుష్పవిలాసహాస తుల్యములగు అనిత్య భోగములచే ఆత్మజ్ఞానరహితులగు జనులు ఏసుఖముయొక్క పేరైనను నెఱుఁగజాలరో, అట్టి నిరతిశయమైన ఆత్మసుఖమును మీమనస్సను మృగము పైనదెల్పిన సమాధివృక్షము క్రిందఁ బడయఁగలదు.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున మనోమృగవిపద్వర్ణనమను నలుబదినాల్గవ సర్గము ॥44॥

---

## పఞ్చచత్వారింశః సర్గః

[వర్ణ్యతే మనసో ధ్యాన పాదపారోహణక్రమః
ఆరోహతః సుఖోత్కర్షో౽ప్యుత్తరోత్తర భూమిషు.

మనస్సుయొక్క సమాధివృక్షముపై నెక్కునట్టి క్రమము, ఎక్కునపుడు ఉత్తరోత్తరభూమికలందుఁగల్గు సుఖాధిక్యత యిచట వర్ణింపఁబడుచున్నవి.]

శ్రీవసిష్ఠ ఉవాచః—

ఇతి విశ్రాన్తవానేష మనోహరిణకో౽రిహన్
తత్రైవ రతిమాయాతి న యాతి విటపాన్తరమ్. 1

శ్రీవసిష్ఠుఁడు.— శత్రునాశకుఁడవగు నో రామచంద్రా! ఈ ప్రకారము ధ్యానవృక్షము క్రింద విశ్రాంతిఁ బడసిన యా మనస్సను హరిణము ఆధ్యానవృక్షమందే ప్రీతిగలదై, మఱియొక వృక్షము క్రిందకుఁ బోకయున్నది.

ఏతావతాథ కాలేన స వివేకద్రుమః ఫలమ్
అన్తస్థం పరమార్థాత్మా శనైః ప్రకటయత్యలమ్. 2

ఇంతలో వివేకసహితమగు ఆ ధ్యానవృక్షము పంచకోశములను తన పుష్పగుచ్ఛముల యొక్క చివరనున్న పారమార్థిక ఆత్మస్వరూపమను కైవల్యఫలమును మెల్లమెల్లగ భూమికాక్రమమునఁ బూర్ణముగఁ బ్రకటమొనర్చుచున్నది

ధ్యానద్రుమఫలం ఫుల్య తదసౌ స్వమనోమృగః
అధఃస్థితః ప్రాన్తగతం తస్య పశ్యతి సత్తమః. 3

ఆ యుత్తమమగు ధ్యానవృక్షముక్రింద నున్నట్టి యా మనోమృగము కొంతతడవున కాపుణ్యవంతమగు ఆత్మసాక్షాత్కారరూప ఫలమును ఆవృక్షశాఖాగ్ర భాగమున వీక్షించుచున్నది.

ఆరోహతి నరో వృక్షం తదాస్వాదయితుం ఫలమ్
అన్యవర్గపరిత్యాగీ వితతాధ్యవసాయవాన్. 4

తదుపరి యా మనుజుఁ * డితరపదార్థములయెడ విరక్తిగల్గి, నిరంతరము ధ్యానాదులందుఁ బ్రయత్నశీలుఁడై, తద్వృక్షముయొక్క ఫలము (ఆత్మసాక్షాత్కారము) నాస్వాదించుటకై దానిపై నెక్కుచున్నాఁడు,

వివేకవృక్షపాన్నామ వృత్తీస్త్యజతి భూగతాః
ఉన్నతం పదమాసాద్య భూయో నాధః సమీహతే. 5

అపుడా వివేక వృక్షముపై దృఢముగఁ బ్రతిష్ఠితుఁడై సంసారభూమిపైనున్నట్టి దేహాదులందలి అహంకార, మమత్వాది వృత్తులఁ ద్యజించుచున్నాఁడు. మఱియునట్టి యున్నతపదమును బొంది మరల క్రిందనున్న సంసార పదార్థములకై చేష్టసల్పకయుండును.

తేనోత్తమఫలార్థేన సంస్కారాన్ప్రాక్తనానసౌ
వివేక పాదపారూఢ స్త్యజత్యహిరివ త్వచమ్. 6

అట్లు వివేకవృక్షముపై ఆరూఢుఁడై ఆత్మసాక్షాత్కారమను నుత్తమఫలము లభించుటచే, సర్పము కుబుసమును ద్యజించునట్లు, ఆతఁడు తన పూర్వకాలిక సంస్కారములన్నింటిని ద్యజించివైచుచున్నాఁడు.

హసత్యుచ్చైః పదారూఢమాత్మానమవలోకయన్
ఏతావన్తమహం కాలం కృపణః కోఽభవం త్వితి. 7

అట్టి యున్నతపదంబున ఆరూఢుఁడై, ఆత్మనవలోకించుచు(ఆత్మానంద మనుభవించుచు) సాంసారిక జనులఁ గాంచి నవ్వుచుండును. మఱియు 'ఇంత కాలమువఱకు విషయసుఖలేశమును బ్రార్థించుచు దీనుఁడనై నే నెట్టుంటిని? అని మనంబున చింతించుచుండును.

కరుణాదిషు తేష్వస్య భ్రమఝ్ఛాఖాన్తరేషు సః
లోభవ్యాలమధః కుర్వన్సమ్రాడివ విరాజతే. 8

సమాధియొక్క వ్యుత్థానకాలమున ఆ వృక్షముయొక్క మైత్రి, కరుణ మున్నగు శాఖలపై సంచరించుచు, లోభము మొదలగు సర్పములను గ్రిందకుఁ బడఁద్రోయుచు, పూర్ణకాముఁడై చక్రవర్తి వలె నాతఁడు శోభించును.

హృదయేన్దోర్గలచ్ఛ్రేణీ దుఃఖాబ్జతిమిరావలిః
కృష్ణాయః శృఙ్ఖలాతృష్ణా దినానుదినముజ్ఝతి. 9

* మృగము వృక్షముపై నెక్కుట యోగ్యముకాదుగనుక నిట మనుజుఁడని వ్యవహరింపఁబడినది.



సద్బుద్ధియను చంద్రుని క్షయమునకు అమావాస్యయొక్క సమూహమువంటిదియు, దుఃఖమను చంద్రునియొక్క యనేకత్వ భ్రాంతికి హేతువైనట్టి తిమిరమను నేత్రవ్యాధి సంతతిఁ బోలినదియు, కృష్ణలోహమయమగు శృంఖలవంటిదియు నగు తృష్ణను దినదినము త్యజించివైచుచుండును.

ఉపేక్షతే న సంప్రాప్తం నాప్రాప్తమభివాఞ్ఛతి
సోమసౌమ్యో భవత్యన్తః శీతలః సర్వవృత్తిషు. 10

ప్రాప్తించిన పదార్థముల నుపేక్షింపకయు, ప్రాప్తింపని వాని నపేక్షింపకయునున్నవాఁడై సర్వవృత్తులందును చంద్రునివలె నంతఃకరణమున సౌమ్యుఁడై శీతలస్వభావయుతుఁడై యుండును.

శాస్త్రార్థపల్లవేష్వేవ నిషణ్ణాత్మావతిష్ఠతే
ఉన్నతావనతాయాతా అధః పశ్యఞ్జగద్గతీః. 11

మఱియు, అధ్యాత్మశాస్త్రార్థములగు శమదమాదులను తత్సమాధివృక్ష పల్లవములందే యాతఁడాసీనుఁడైయుండును. నరకము మొదలు బ్రహ్మలోకమువఱకుగల సాంసారిక నిమ్నోన్నతగతులను గ్రింద (అజ్ఞానదశయందు జనులనుభవించు చుండుటను) జూచుచుండును.

భీమద్రుమలతోత్కీర్ణపుష్పప్రకరదన్తురాః
ప్రాక్తనీః స్వాః స్థలీః పశ్యన్హసత్యన్తర్వరాశతామ్. 12

భయంకరమైన విషవృక్షలతలచే వ్యాప్తములైనట్టి విషమయపుష్పసమూహములచే, ఉన్నతదంతములవలెఁ బ్రకటితములైన స్థలములబోలిన తనయొక్క పూర్వకాలికసప్త అజ్ఞానభూమికలను స్మరించుచు నట్టి దీనదశఁజూచి లోలోన నవ్వుకొనుచుండును.

తేషు తత్స్కన్ధదేశేషు తథోడ్డీనవిడీనయా
హారిణ్యా విహరఞ్జాత్యా రాజేవ పరిరాజతే. 13

(అభ్యాసదశయందు) ఆ సమాధివృక్షముయొక్క శాఖలందు, అనఁగా, ఉత్తరోత్తర భూమికలం దారోహించుచు, అవరోహించుచు, మనోహరమగు చిత్తవృత్తితో విహరించుచున్నవాఁడై యాతఁడు చక్రవర్తివలెఁ బ్రకాశించును.

పుత్రదారసమగ్రాణి మిత్రాణి చ ధనాని చ
జన్మాన్తరకృతానీవ స్వప్నజానీవ పశ్యతి. 14

అవ్విధముగ, జ్ఞానవంతుఁడైన యాత డపుడు పుత్ర, మిత్ర, స్త్రీ, ధనాది సమస్తపదార్థములను మఱియొకజన్మమందలివిగను, లేక, స్వప్నమందలివిగను గాంచును.

రాగద్వేషభయోన్మాదమాన మోహమహత్తయా
నటస్యేవాస్య దృశ్యన్తే శీతలామలచేతసః. 15

శీతలమైనట్టియు, నిర్మలమైనట్టియు చిత్తముగల జ్ఞానికి సంసారవ్యవహారము లన్నియు, రాగ, ద్వేష, భయ, ఉన్మాద, అభిమాన, మోహాదుల యాధిక్యతతో గూడియుండుటఁబట్టి నటునివలె కృత్రిమముగ, గానుపించును.

ఉన్మత్తచేష్టితాకారా హసత్యపి పురోగతాః
తరఙ్గభఙ్గురాధారాః సంసారసరితో గతీః. 16

ఎదుట నున్నప్పటికిని ఈ సంసారమను మృగతృష్ణా నది యొక్క గతులఁజూచి జ్ఞాని వానిని ఉన్మత్తుని చేష్టలవంటివిగను, తరంగమువలె క్షణభంగురములుగను, మిథ్యగను నెఱింగి నవ్వు చుండును.

న స చేతయతే కాశ్చిల్లోకదారధనైషణాః
అపూర్వపదవిశ్రాన్తో జీవన్నేవ యథా శవః. 17

అపూర్వమగు ఆత్మపదమున విశ్రాంతినొందినవాఁడును, జీవించియున్నను శవమువలె (ప్రపంచదృష్టి లేక) యుండువాఁడునునగు ఆజ్ఞాని లోకైషణ, దారైషణ, ధనైషణమున్నగు నవెవ్వియు లేకయుండును,

కేవలం కేవలే శుద్ధే బోధాత్మని మహోన్నతే
దత్తదృష్టిః ఫలే తస్మిన్పరం సమధిరోహతి. 18

అపుడాతఁడు కేవలము శుద్ధమై, కేవలమై, బోధమయమై, మహోన్నతమైనట్టి ఆత్మయను ఫలమున దత్తచిత్తుఁడై పంచభూమికాని స్థానముల నారోహించును.

స్మృత్వాస్మృత్వాపదః పూర్వం సంతోషామృతపోషితః
అర్థానామప్యనర్థానాం నాశేషు పరితుష్యతి. 19

పూర్వపు అజ్ఞానదశయందలి యాపదలను మరల మరల స్మరించుచు, జ్ఞానియగు అతఁడు సంతోషామృతముచేఁ బరిపుష్టుఁడై, అనర్థరూపములగు ధనముల నాశమందును సంతోషాన్వితుఁడైయే [illegible]ఁడును.

వ్యవహారేషు కార్యేషు భోగసంపాదకేష్వపి
పరముద్వేగమాయాతి సనిద్ర ఇవ బోధితః. 20

అత్తటి యాతఁడుభోగదాయకములగు అవశ్య వ్యవహారకార్యములం దితరులచే సమాధినుండి మేలుకొలుపఁబడి, నిద్రనుండి మేలుకొలుపఁబడిన మనుజునివలె చాల అప్రసన్నతను జెందును.

దీర్ఘాధ్వగ ఇవోదారామనారతమబాధితామ్
చిరం మార్గశ్రమాక్రాన్తో విశ్రాన్తిమభివాఞ్ఛతి. 21

దీర్ఘమైన మార్గమున జనువానివలె చిరకాలము అజ్ఞానకారణమున జననమరణాదుల పరంపరచే మిగుల శ్రమనొందినవాఁడగుటచే నాతఁడతియుదారమై, అబాధితమైనట్టి ఆత్మవిశ్రాంతినే నిరంతరము వాంఛించుచుండును.

నిఃశ్వాస బోధితోఽప్యగ్నిరనిన్ధన ఇవాత్మని
శ్వాసమాత్రసమోఽప్యన్తరతిష్ఠన్నేవ శామ్యతి. 22

ప్రాణాధారమాత్రముచే నితర మనుజులవలె నున్నప్పటికిని అతఁడు లోన అహంకారాది [illegible]బడుటవలన, కట్టెలులేని అగ్నివలె ఆత్మయందు శాంతినొందును.



ఆపతన్తీం బలాదేవ పదార్థేష్వరతిం శనైః
న శక్నోతి నిరాకర్తుం దృష్టిమత్ర చ్యుతామివ. 23

బాహ్యపదార్థములందలి విరక్తి పూర్వాభ్యాసబలముచే నేతెంచి వచ్చి పడుచుండ, తత్పదార్థములందు పడినట్టి యథాప్రాప్త భోగదృష్టినివలె నద్దానినికూడ నిరాకరించుట కాతఁడు సమర్థుఁడుగాకయుండును.

తాం మహాపదవీం గచ్ఛన్పరమార్థఫలప్రదామ్
భూమికామప్యుపాయాతి వచసామప్యగోచరామ్. 24

ఈ ప్రకారముగ పరమార్థఫలమును గలుగఁజేయునట్టి యా గొప్పదగు ఆత్మపదముపైఁ జనుచు ఆ జ్ఞాని క్రమముగ వాక్కునకుగూడ అగోచరమైనట్టి యాఱవభూమికను బొందును.

కుతోఽప్యచేష్టితేష్వేవ సంప్రాప్తేషు విధేర్వశాత్
భోగేష్వరతిమాయాతి పాన్థో మరుమహీష్వివ. 25

బాటసారి మరుభూములందు విరక్తిగల్గియుండునట్లు, అత్తటి యాతఁడు, దైవయోగముచేగాని, స్వాప్న యత్నరహితముగగాని, పరప్రయత్నముచేగాని సంప్రాప్తించు భోగములయెడలను విరక్తిగల్గియుండును.

ఘూర్ణః క్షీణ ఇవానన్దీ సుప్తః సంసారవృత్తిషు
అన్తఃపూర్ణమనా మౌనీ కామపి స్థితిమృచ్ఛతి. 26

సంసారవృత్తులందు నిద్రితుఁడై, ఆత్మానందముచే మదోన్మత్తునివలె నున్నవాఁడై, అభ్యంతరమునఁ, బరిపూర్ణ చేతస్కుఁడైయుండు యమ్మునీంద్రుఁడు అపుడొకానొక అనిర్వచనీయమైన స్థితిని బొందును.

స తాదృగ్రూపతామేత్య పరమార్థఫలస్య తత్
క్రమాన్నికటమాప్నోతి ఖగోఽగపదవీమివ. 27

అట్టి స్థితినొంది, సిద్ధుఁడు మేరుపర్వత శిఖరమును బొందునట్లు (లేక, పక్షి వృక్షాగ్రమునుబొందునట్లు) యాతఁడు క్రమముగ మోక్షమను పరమార్థఫలముయొక్క సమీపమును జెందును.

తతస్తదఖిలాం బుద్ధిం విహాయ వియతా సమః
గృహీత్వాథాస్వాదయతి భుక్త్వాఽథ పరితృప్యతి. 28

పిమ్మట ఏడవభూమికను బొందినవాఁడై, ఆకాశముభంగి విశాలరూపుఁడై, సమస్తవాసనలను, బుద్ధివృత్తులను త్యజించి, ఆవరణ, విక్షేపరహితుఁడై, నిరతిశయానందమయమగు బ్రహ్మభావమను ఫలమును గ్రహించి యాస్వాదించుచు నద్దానిచేఁ బరితృప్తుఁడగును.

సంకల్పార్థపరిత్యాగాద్దినాను దినమాతతా
శుద్ధస్వభావవిశ్రాన్తిః పరమార్థాప్తిరుచ్యతే. 29

ఓ రామచంద్రా! సంకల్పిత పదార్థములయొక్క పరిత్యాగముచే దినదినము సంభవించునట్టి విశాలమైన శుద్ధాత్మ స్వభావమందలి విశ్రాంతి యేదిగలదో, అదియే పరమార్థ ప్రాప్తియనఁబడును.

భేదబుద్ధిర్విలీనార్థాఽభేద ఏవావశిష్యతే
శుద్ధమేకమనాద్యన్తం తద్బ్రహ్మేతి విదుర్బుధాః. 30

త్రిపుటినిగూర్చిన భేదబుద్ధి విలీనముకాఁగా, అభేదమై, శుద్ధమై, ఏకమై, అనాదియై, అనంతమైనట్టి సాక్షి చైతన్యమాత్ర మెద్ది శేషించియుండునో, అదియే బ్రహ్మమని విజ్ఞులు పలుకుదురు.

లోకైషణావిరక్తేన త్యక్తదారైషణేన చ
ధనైషణావిముక్తేన తస్మిన్విశ్రామ్యతే పదే. 31

లోకైషణ, దారైషణ, ధనైషణయను, ఏషణాత్రయముయొక్క పరిత్యాగముచే మనుజుఁడా బ్రహ్మపదమున విశ్రాంతి నొందఁగలఁడు.

పరేణ పరిణామేన మిథశ్చిత్పరమార్థయోః
తాపేన హిమలేఖేవ భేదబుద్ధిర్విలీయతే. 32

దృశ్యతత్త్వ శోధనముచే శేషించు సన్మాత్రము యొక్కయు, ద్రష్టృతత్త్వ శోధనముచే శేషించు చిన్మాత్రము యొక్కయు, అఖండైక్యము వలన నిరతిశయానందాత్మ రూపముగ పరిణామ మొందిన చిత్తముయొక్క రమ సాక్షాత్కార వృత్తిచే, సూర్యతాపముచే మంచువలె, భేదబుద్ధి విలీనమైపోవును.

తజ్జ్ఞస్యోత్కృష్టముక్తస్య స్వభావేషూపమాం వినా
స్థితిః స్రగ్దామకస్యేవ న సంభవతి కాచన. 33

ఆత్మ సాక్షాత్కారము నొందిన విజ్ఞుని చిత్తము ఏవిధముగ త్రిప్పియుంచిన, ఆవిధముగనే యుండునట్టి కోమలమగు పుష్పమాలవలె నుండును గాని, లాగివదలిన పిదప మరల యథాప్రకారము పూర్వస్థితినే పొందునట్టి కఠినమైన ధనుస్సువలె నుండదు. (జ్ఞాని తన పూర్వపు అజ్ఞానస్థితిని మరల యెన్నటికిని బొందదని భావము).

యథాఽప్రకటితాఙ్గాన్తః సంస్థితా శాలభఞ్జికా
న సతీ నాసతీ స్తమ్భే తథా విశ్వస్థితిః పరే. 34

స్తంభమందలి అప్రకటితములైన అవయవములుగల విగ్రహము సత్తుగాని, అసత్తుగాని గాక యెట్లుండునో; అట్లే ప్రపంచస్థితియు పరమాత్మయందుగలదు.

ధ్యానం న శక్యతే కర్తుం న చైతదుపయుజ్యతే
అబోధేన విబుద్ధస్తు స్వయమత్రైవ తిష్ఠతి. 35

అజ్ఞానదశయందు (ప్రపంచ సహిత స్థితియందు), నిష్ప్రపంచ బ్రహ్మమునుగూర్చిన అజ్ఞాన కారణమున, తన్నిష్ప్రపంచరహిత బ్రహ్మను ధ్యానముచేయుటకు శక్యముకాదు; మఱియు అట్లు చేయుట యుపయుక్తమున్నుగానేరదు. ప్రబుద్ధుఁడో, స్వయముగనే తద్బ్రహ్మస్వభావమున స్థితిగల్గియుండును. (కావున నాతఁడున్ను నద్దానిని ధ్యానింపఁజాలఁడు.)



ఆత్యన్తికీ విరసతా యస్య దృశ్యేషు దృశ్యతే
స బుద్ధో నాప్రబుద్ధస్య దృశ్యత్యాగే హి శక్తతా. 36

దృశ్యపదార్థములందు సంపూర్ణ వైరాగ్య మెవనికిఁ గానుపించునో, అతఁడే జ్ఞానియగును. ఏలయనిన. అజ్ఞాని దృశ్యత్యాగమున సమర్థుఁడుకాఁడు.

దృశ్యస్య బోధతా బోధో యో బోధాదపరిక్షయః
స సమాధానశబ్దేన ప్రోచ్యతే సుసమాహితైః. 37

దృశ్యముయొక్క సాక్షిస్వరూప బోధ యేదిగలదో, అదియే ఆదృశ్యమును తనయథార్థ స్వరూపమున స్థాపనచేయుటఁబట్టి సమాధానము, లేక, సమాధియనఁబడును. (సమ్యక్ ఆధానం — సమాధానం. ఇట్లు ప్రపంచమును తన వాస్తవస్థితియం దుంచుటయే సమాధియని భావము.) అట్టి బోధ వలననే యా దృశ్యము నాశరహితమైనది (బ్రహ్మము) యగుచున్నది.

ద్రష్టృదృశ్యైకతారూపః ప్రత్యయో మనసో యదా
స తదేకసమాధానే. తదా విశ్రామ్యతి స్వయమ్. 38

ఎపుడు ద్రష్టయగు సాక్షియొక్కయు దృశ్యము యొక్కయు ఐక్యముచే మనోవృత్తి యేకమైన అఖండాత్మాకారమున స్థితిగలదగునో, అపుడే యదిసమాధియందు స్వయముగ విశ్రాంతినొందు[illegible]

స్వభావో దృశ్యవైరస్యమేవ తత్త్వవిదో ద్విజః
దృశ్యస్పన్దనమేవాహురతత్త్వజ్ఞత్వముత్తమాః. 39

జడత్వ, దుఃఖాది దృశ్యస్వభావ విరుద్ధమగు చిదానంద స్వభావమే బ్రహ్మజ్ఞానియొక్క ని[illegible] స్వభావమైయున్నది. దృశ్యమువైపున కున్ముఖమగుటయే అజ్ఞానమని విజ్ఞులు పలుకుదురు.

అతజ్జ్ఞాయైవ విషయాః స్వదన్తే నతు తద్విదః
నహి పీతామృతాయాన్తః స్వదతే కటుకాఞ్జికమ్. 40

సాంసారిక విషయములు అజ్ఞానికే స్వాదిష్టములుగఁదోచునుగాని జ్ఞానికిఁగాదు. అమృతము త్రావువానికి చేదైన మద్యము రుచింపదుగదా!

వితృష్ణస్యాత్మనిష్ఠత్వాదేషణాత్రయముజ్ఝతః
జ్ఞస్యాప్యనిచ్ఛతో ధ్యానమర్థాయాతం ప్రవర్తతే. 41

తృష్ణారహితుఁడును, ఆత్మనిష్ఠుఁడును, ఏషణాత్రయమును వర్జించినవాఁడునగు జ్ఞానికి తా నిచ్ఛగింపకున్నను ధ్యానము (స్వస్వరూపాను సంధానము) స్వయముగఁ గలుగుచున్నది.

బోధః స్ఫురతి తృష్ణయాః సైవ యస్య న విద్యతే
తస్య స్వరూపముత్సృజ్య క్వాసౌ తిష్ఠతి కః కథమ్. 42

తృష్ణ యుండినచో ఆత్మస్వరూపాను సంధానరూపమగు బోధ చలించిపోవు[illegible]. ఎవ నికిఁ దృష్ణయుండదో, అట్టి తత్త్వజ్ఞునకు స్వస్వరూపముతప్ప అన్యమగు ద్రష్టృ దర్శనదృ[illegible]మగు త్రిపుటి యెట్లెచట నుండఁగలదు?

జ్ఞస్యానారాధకో ధ్యేయబోధో నయతు యో భవేత్
అనన్తా సా వితృష్ణస్య నిర్విభాగోదితఃస్వయమ్. 43

లేక, తృష్ణారహితుఁడగు జ్ఞానికి తృష్ణ యనంతమనియుఁ జెప్పవచ్చును. ఏలయనిన, అతఁడు స్వయముగ విభాగరహితమైన అనంతాత్మ స్వరూపముగనే యుదయించినవాఁడై యున్నాడు. కావున నాతనికి చింతనీయమగు బాహ్య పదార్థము యొక్క బోధ యెట్లున్నను, అతఁడద్దానిని సమాధియందు లగ్నము చేసినను, లేక, వ్యవహారమునందు లగ్నము చేసినను, తత్పదార్థముఁ యొక్క ధ్యాత యాతఁ డెన్నఁటికిని గా నేరఁడు (ఏలయనఁగా, ఆతనిదృష్టియం దంతయు ఆత్మరూపముగనేయుండును.)

అనన్తమపతృష్ణస్య స్వయమేవ ప్రవర్తతే
ధ్యానం గలితపక్షస్య సంస్థానమివ భూభృతః. 44

రెక్కలు లేని పర్వతమునకు స్వయముగనే నిశ్చలస్థితి సంభవించునట్లు, తృష్ణారహితుఁడగు జ్ఞానికి అనంతాత్మయొక్క ధ్యానము స్వయముగనే (అప్రయత్నముగనే) కలుగుచున్నది.

శుద్ధబోధాత్మని జ్ఞత్వాదసమాహితతోదితా
న జాతు సుసమిద్ధేగ్నౌ ఘృతబిన్దోరవస్థితిః. 45

శుద్ధబోధరూపమగు ఆత్మ సాక్షాత్తుగ ననుభూతముకాఁగా నిఁక జ్ఞానవిరోధ మెద్దియు లేనందుచే సమాధినిఁగూర్చిన ప్రయత్నము మహాత్ములకు లేకయుండును. ప్రజ్వలించు అగ్నియందు ఘృతబిందు వెన్నటికి నుండదుకదా!

పరం విషయ వైతృష్ణ్యం సమాధానముదాహృతమ్
ఆహృతం యేన తన్నూనం తస్మైన్మృబ్రహ్మణే నమః. 46

సంపూర్ణమగు విషయతృష్ణావినాశమే సమాధియని చెప్పఁబడును. అద్దాని నెవఁడు నిక్కముగ సంపాదించియున్నాడో, అట్టి బ్రహ్మస్వరూపుఁడగు మనుజునకు నమస్కారము.

నూనం విషయ వైతృష్ణ్యే పరిప్రౌఢిముపాగతే
న శక్నువన్తి నిర్హర్తుం ధ్యానం సేన్ద్రాఃసురాసురాః. 47

నిశ్చయముగ మనుజునకు విషయతృష్ణారాహిత్యము బాగుగ దృఢపడినమీదట నిఁక నట్టివాని ఆత్మధ్యానమును దొలగించుటకు ఇంద్రసహితులగు సమస్త దేవతలున్ను, అసురులున్ను గూడ సమర్థులు కాఁజాలరు.

పరం విషయ వైతృష్ణ్యం వజ్రధ్యానం ప్రసాధ్యతామ్
భేదే విగలితే జ్ఞానాదన్యధ్యానతృణేన కిమ్. 48

ఓ రామచంద్రా! సంపూర్ణమగు విషయ తృష్ణారాహిత్యమున్ను, జ్ఞానముచే సమస్తభేదము నశించుటయు, వజ్రమువలె దృఢమైనట్టి యుత్తమధ్యానమగును. అట్టి ధ్యానమునే సంపాదింపవలయును. తృణసమానములగు ఇతరధ్యానములచే నేమి ప్రయోజనము?

మూర్ఖస్థో విశ్వశబ్దార్థో నామూర్ఖ విషయస్తథా
తజ్జ్ఞాజ్ఞయోస్తయోశ్చైవ విశ్వవిశ్వేశయోస్తథా 49
యత్త్రైకీభూయ కచనం తత్ర విశ్రామ్యతాం బుధాః



బోధభూమిషు సిద్ధానామర్థానాం వా వివేకినామ్. 50
సత్తాసత్తే ద్వయైక్యే చ నిర్ణీతే నేహ కేనచిత్

'ప్రపంచము' యొక్క శబ్దార్థములు అజ్ఞానికేగాని జ్ఞానికిఁగావు. కావున, ఓ విజ్ఞులారా! ఏ నిరతిశయానందరూప బ్రహ్మమందు జ్ఞాని, అజ్ఞాని, ప్రపంచము, ప్రపంచాధీశుఁడు అన్నియు ఏక రూపమై, అభిన్నముగ భాసించునో, అట్టి బ్రహ్మమందే విశ్రాంతిని బొందుఁడు. ఏలయనఁగా, ఆరురుక్షువుల యొక్క మననాదిబోధభూమికలందుగాని, ఆరూఢుల యొక్క సాక్షాత్కారాది బోధభూమిక లందుగాని, ఆత్మకంటె వేరైనట్టి సత్తాసత్తులుగాని, ద్వైతైక్యములుగాని యెవనిచేతను నిర్ణయింపఁబడలేదు.

ఉపాయ ఏకః శాస్త్రార్థో ద్వితీయో జ్ఞసమాగమః. 51
ధ్యానం తృతీయం నిర్వాణే శ్రేష్ఠస్తత్రోత్తరోత్తరః

అట్టిబ్రహ్మమందు విశ్రాంతినొందుటకై, అనగా నిర్వాణప్రాప్తికై మొదటియుపాయము, అధ్యాత్మ శాస్త్రార్థములను నిరంతర మభ్యసించుట; రెండవది విజ్ఞులసహవాసము; మూఁడవది ధ్యానము, ఇందు, ఉత్తరోత్తరముగ నొకదానికంటె నొకటి శ్రేష్ఠమై యొప్పుచున్నది.

జీవాదర్శాన్మిథో రూపం గృహ్ణాత్యేషా మహద్వపుః. 52

అపరిచ్ఛిన్నమై, నిత్యాపరోక్షమైనట్టి బ్రహ్మచైతన్యమే జీవుఁడను స్వప్రతిబింబము యొక్క దర్పణమువంటి అంతఃకరణోపాధివశముచే పరస్పరము భిన్నమైనట్టి రూపమును గ్రహించుచున్నది.

జగత్స్యదేతి సంఘట్టాదావిశేషం సమే సమే

అట్టి జగత్తునందీచైతన్యము రాగద్వేషముల సంఘట్టనచే బ్రహ్మాదిస్తంబపర్యంతముగల సమస్త విశేషములను వ్యాపించియున్నదై, స్వకర్మవైచిత్ర్యముచే సమ, విషమ శరీర భేదములందంతట నుదయించుచున్నది.

జ్ఞానపూర్వాపరాశేషజగదష్టాపదస్థితేః. 53
ఏకసిద్ధా ద్వయోః సిద్ధిర్బోధవైతృష్ణ్యదీపయోః

అట్లు సంసారచక్రమునఁ దిరుగుచున్న జీవులలో నొకానొకఁడు సౌభాగ్యవశమున అధికారయోగ్యమగుఁ జన్మనొంది, శాస్త్రసజ్జన సంపర్కాద్యుపాయములచే సమస్త జననమరణ భ్రమణరూపమగు జగత్తను చదరంగపుటాటయొక్క పూర్వాపరస్థితిని బాగుగ నెఱిగినట్టి మహాత్మునకు, జ్ఞాన తృష్ణారాహిత్యములను దీపముల రెంటిలో నొకటి సిద్ధింప, రెండును సిద్ధించినవగుచున్నవి.

మతివాత్యాధుతో వ్యోమ్ని దగ్ధో జ్ఞానాగ్నినాఖిలః. 54
జగత్తూలః పరే శాన్తే న జానే క్వాశు గచ్ఛతి

జ్ఞానాగ్నిచే భస్మీభూతమైన సర్వజగంబను తూలము (దూది) శాంతమగు పరమాత్మయను నాకసమున ఉత్తరభూమికాభ్యాసరూపమైన బుద్ధియను వాయువుచే నెగురగొట్టఁబడి యెచటికో కొట్టుకొని పోవుచున్నది.

చిత్రాగ్నినేవ బోధేన తేన జాడ్యం న శామ్యతి. 55
నిర్మూలాపి జగద్భ్రాన్తిర్యేనాశు న విలీయతే

చిత్రమందలి యగ్నిచే శీతలము నివారింపఁబడనట్లు, పైపైజ్ఞానముచే మూలాజ్ఞాన మెన్నటికిని శమింప నేరదు. మఱియు నట్టి ఆపాతజ్ఞానముచే జగద్భ్రాంతి శీఘ్రముగ నిర్మూలమైనట్లు తోఁచినను వాస్తవముగ నిర్మూలము కానిదేయగును.

యథాజ్ఞస్య జగజ్జప్తిరపజ్ఞానాత్ప్రదీప్యతే. 56
తథా జ్ఞస్య పరిజ్ఞానాత్తదజ్ఞప్తిః ప్రదీప్యతే

అజ్ఞానికెట్లు తన అజ్ఞత్వకారణమున జగద్భ్రాంతి దినదిన మభివృద్ధినొందుచుండునో, అట్లే జ్ఞానికిఁ దనవిజ్ఞానకారణమున జగద్భ్రమ దినదినము భస్మీభూతమగుచుండును.

తజ్జస్యాజ్ఞజగజ్జప్తి శ్శబ్దార్థరహితా స్థితా. 57
యథాస్థితైవ త్రిజగజ్జప్తిశ్చిత్ర ఇవోదితా
శూన్యత్వేనైవ రచితా సుప్తత్వేనేవ నిర్మితా. 58

అట్లు, అజ్ఞానము దహింపఁబడ జ్ఞానికి అజ్ఞానియొక్క జగత్స్థితి జగచ్ఛబ్దార్థరహితముగను చిత్రమందలి ముల్లోకములవలెను, శూన్యత్వముచే రచింపఁబడినదిగను, నిద్రించినవానిచేఁ గల్పింపఁబడినదిగను దోఁచును.

భాసతే భామయీ వాజ్ఞా జగజ్జప్తిరజ్ఞచేతసి
నూనం బోధే విమూఢస్య నాహన్తా న జగత్స్థితిః. 59

జ్ఞానియొక్క చిత్తమున జగత్స్థితి, ఇచ్ఛమున్నగునవి యన్నియు చిదాకాశమయముగనే భాసించును. ఏలయనిన, బోధయుదయించిన మీదట జ్ఞానికి అహంకారముగాని, జగత్స్థితిగాని యుండనేరదు.

భాసతే పరమాభాసరూపిణః క్వాప్యవస్థితిః
బోధాబోధాత్మకం చిత్తం భాతి శుష్కార్ద్రకాష్ఠవత్. 60

అవ్విధమున జ్ఞానికి జగత్స్థితి పరమప్రకాశ (బ్రహ్మ)రూపమై చెన్నొందుచుండును. ఇఁకఁ అర్ధప్రబుద్ధుని చిత్తమునకో, ఈజగత్స్థితి శుష్కమై, ఆర్ద్రమై (తడిసినదై) రెండు విధములగు స్వభావములతోఁగూడి నట్టి కాష్ఠము భంగి భాసిల్లును. క్రమముగ బ్రహ్మ, జగత్స్వభావముల రెంటితోను గూడియున్నట్లు తోఁచును.)

బోధాదేకం జగద్భావైజ్ఞాద్యానాత్మత్వమాగతమ్
మిథో బోధాద్వివదతి మైత్రీం భజతి బోధతః. 61

అట్టి అర్ధప్రబుద్ధుఁడు ఆత్మత్వమును బూర్ణముగ, బొందనివాఁడై, బోధాధిక్యతచే నొకపుడు జగత్తు నేకముగ గాంచును, మఱియొకపుడు అజ్ఞానాంశముచే ననేక రూపములుగను గాంచును. అట్లే బోధచే నొకపుడు మైత్రి, కరుణ మున్నగు నుత్తమగుణముల నాశ్రయించును. అజ్ఞానముచే జగత్తునందుఁ బరస్పర వివాదాదులతోఁటియు వ్యవహరించును.



య ఏవాస్యాధికో భాగస్తన్మయత్వేన తిష్ఠతి
బుధః స తత్త్వం నాప్నైతి జగతోఽభావభావయోః. 62
జాగ్రత్స్వప్నసుషుప్తానాం స్వభావమివ తుర్యగః

ఈ ప్రకారముగ ఆ అర్ధప్రబుద్ధుఁడు, జ్ఞానాజ్ఞానములం దేభాగము తనయందు ప్రబలముగానుండునో దానితో తన్మయుఁడైయుండును. కాని, పరిపక్వస్థితినొందిన జ్ఞాని తురీయావస్థయందున్నవాఁడు జాగ్రత్స్వప్న సుషుప్తులయొక్క స్వభావమును గాంచనట్లు-జగత్తుయొక్క భావాభావముల యథార్థత్వమును గాంచకయుండును.

వాసనైవ మనః సేయం స్వవిచారేణ నశ్యతి. 63
అవస్తుత్వాదతో మోక్షో నాత్మనాశే ప్రవర్తతే. 64

మనస్సు వాసనారూపమేయైయున్నది. అట్టి వాసన ఆత్మవిచారముచే నశించుచున్నది. మఱియు మనస్సు అవస్తు (మాయ, లేక, అవిద్య) మయమగుటచే, అది విద్యమానమై యున్నంతవఱకు మోక్షము సంభవించదు. అది నశించునపుడే సంభవించును.

ధ్యానద్రుమాత్స్వయముపోఢమనల్పపాకా
త్కాలేన బోధముపయాతవతః క్రమేణ
భుక్త్వా రసాయనఫలం పరబోధమాద్య
మిచ్ఛన్మనోహరిణకో నిగడాద్విముక్తః. 65

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు
నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే మనోహరిణకోపాఖ్యానం నామ
పఞ్చచత్వారింశః సర్గః ॥ 45 ॥

ఓ రామచంద్రా! ఈ ప్రకారముగ ముముక్షువను మనోమృగము కాలక్రమమున పూర్ణపరిపక్వస్థితి నొంది స్వయముగ వృద్ధినొందింపఁబడిన బోధయను ఫలమును బొందినదై, ఈ పూర్వోక్తమగు ధ్యానవృక్షమునుండి, ఆద్యమై, పరమాత్మబోధస్వరూపమై, పరమానందలక్షణయుతమైనట్టి అమృతఫలమును భుజించి, సంసార బంధనమునుండి విముక్తి నొందుచున్నది. (గావున, వివేక వైరాగ్యాది సాధనములద్వారా ధ్యానముచే మనస్సును ఆత్మయందు లయింపఁజేయుటయే మోక్షప్రాప్తియని భావము.)

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున
మనోహరిణకోపాఖ్యానమను నలుబదియైదవ సర్గము ॥45॥

---

## షట్చత్వారింశః సర్గః

[ధ్యానద్రుమఫలాస్వాదే యాదృశీ మనసః స్థితిః
దృఢం విషయవైరస్యం యాదృక్తదిహ వర్ణ్యతే॥

ధ్యానవృక్షము యొక్క ఫలాస్వాదనమున మనస్సు యొక్క స్థితి యెట్లుండునో, మఱియు దృఢమైన విషయవైరాగ్య మెట్టిదో యిచట వర్ణింపఁబడుచున్నది.]

శ్రీవసిష్ఠ ఉవాచ:—

పరమార్థఫలే జ్ఞాతే ముక్త్యా పరిణతిం గతే
బోధోఽప్యసద్భవత్యాశు పరమార్థో మనోమృగః. 1

శ్రీ వసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! ధ్యానముచే పరమార్థఫలము సాక్షాత్తుగననుభూతము కాఁగా, జీవుఁడు ముక్తిరూపమునఁ బరిణామము నొందగా, నపుడు చరమ సాక్షాత్కార వృత్తిరూప బోధయున్న తన యుపాదానమగు అజ్ఞానము యొక్క నాశముచే అసత్తే యగుచున్నది. మఱియు నత్తఱి మనోమృగము కేవలము పరమార్థమగు ఆత్మస్వరూపమే యగుచున్నది.

క్వాపి సా మృగతా యాతి ప్రక్షీణస్నేహదీపవత్
పరమార్థదశైవాస్తే తత్రానన్తావభాసినీ. 2

పూర్వకాలిక విషయాన్వేషణమను మనస్సుయొక్క మృగత్వము తైలరహితదీపమువలె నెచటికో వెడలిపోవుచున్నది. కేవలము అనంతమైన ఆత్మప్రకాశరూపమగు పరమార్థదశయే యచట శేషించుచున్నది.

ధ్యానద్రుమఫలప్రాప్త్యా బోధతామాగతం మనః
వజ్రసారాం స్థితిం ధత్తే ఛిన్నపక్ష ఇవాచలః. 3

ధ్యానవృక్షము యొక్క పరమార్థఫలము సంప్రాప్తింప, బోధరూపత్వమును జెందినమనస్సు, ఱెక్కలు ఛేదింపఁబడిన పర్వతమువలె వజ్రతుల్యమగు దృఢనిశ్చలస్థితిని ధరించుచున్నది.

మనస్తా క్వాపి సంయాతి తిష్ఠత్యచ్ఛైవ బోధతా
నిర్బాధా నిర్విభాగా చ సర్వాఽఽఖర్వాత్మికా సతీ. 4

విషయములఁగూర్చి చింతించునట్టి మనస్సుయొక్క స్వభావము మెచటికో పారిపోవుచున్నది. బాధా రహితమై, విభాగ శూన్యమై, సర్వాత్మకమై, సద్రూపమైనట్టి నిర్మల బోధత్వమే (చిన్మాత్రత్వమే) శేషించుచున్నది

సువివిక్తతయా చిత్తసత్తా బోధతయోదితా
అనాద్యన్తా భవత్యచ్ఛప్రకాశఫలదాయినీ. 5

పూర్వకాలము జడదేహాదులఁగూర్చిన అవివేకముచే జడముగ నేయున్నట్టి చిత్తసత్తయిపుడు దేహాదుల నుఱివేచనతోఁ గూడియున్నదై, బోధరూపమున నుదయించినదై, అనాదియై, అనంతమై, నిర్మలమైనట్టి ఆత్మప్రకాశమను ఫలమును గలుగఁజేయునదై యొప్పుచున్నది.



స్వయమేవ తతస్తత్ర నిరస్తసకలైషణమ్
అనాద్యన్తమనాయాసం ధ్యానమేవావశిష్యతే. 6

అట్టి స్థితియందు, సమస్తవాంఛలున్ను త్యజింపఁబడుటచే, అనాదియై, అనంతమైనట్టి ఆత్మను గూర్చిన ధ్యానమే శేషించియున్నందున నట్టిధ్యానము ప్రయాసములేక స్వయముగనే సిద్ధించుచున్నది.

యావన్నాధిగతం బ్రహ్మ న విశ్రాన్తం పరే పదే
తావత్తన్మననత్వేన న ధ్యానమవగమ్యతే. 7

ఎంతవఱకు బ్రహ్మమును బొందలేదో, మఱియు, పరమపదమునవిశ్రాంతి నొందలేదో, అంతవఱకును విషయములఁగూర్చిన మననమువలన, ఆత్మధ్యానము పొందఁబడ నేరదు.

పరమార్థైకతామేత్య న జానే క్వ మనోగతమ్
క్వ వాసనా క్వ కర్మాణి క్వ హర్షామర్షసంవిదః. 8

పరమార్థమగు ఆత్మతోటి యేకత్వము నొంద, మనస్సెచటికో పారిపోవుచున్నది. అట్లే వాసనయు, కర్మయు, హర్ష, క్రోధాది వృత్తులున్ను నెచటికో వెడలిపోవుచున్నవి.

కేవలం దృశ్యతే యోగీ గతో ధ్యానైకనిష్ఠతామ్
స్థితో వజ్రసమాధానే విపక్ష ఇవ పర్వతః. 9

అట్టిస్థితియందు యోగి కేవలము ధ్యానైక నిష్ఠుఁడై కానుపించును. మఱియు వజ్రమువలె దృఢమైనట్టి సమాధియందు, ఱెక్కలులేని పర్వతమువలె నిశ్చలముగస్థితినొందియుండును.

విరసాఖిలభోగస్య ప్రశాన్తేన్ద్రియసంవిదః
నీరసాశేషదృశ్యస్య స్వాత్మారామస్య యోగినః. 10

క్రమేణ విగలద్వృత్తేర్బలాద్విశ్రాన్తిమీయుషః
అర్థాయాతం సమాధానం కేన నామ విచార్యతే. 11

సమస్త భోగముల యెడల విరక్తిగలవాఁడును, ఇంద్రియ వృత్తులన్నియు పూర్ణముగ శమించిన వాఁడును దృశ్యపదార్థములన్నింటి యెడల అరుచిగలవాఁడును, ఆత్మయందే రమించువాఁడును, క్రమముగ నశించిన వృత్తిగలవాఁడును, బలాత్కారముగ విశ్రాంతిని బొందింపఁజేయఁబడు వాఁడునగు యోగికి సమాధిస్వయముగనే సిద్ధించుచున్నది. ఏలయనిన, ఎపుడు సమస్తము బ్రహ్మరూపమే యగుచున్నదో, అపుడిఁక దేనినెవఁడు ధ్యానించును?

తావద్విషయవైరస్యం భావయన్త్యుచితాశయాః
న పశ్యన్త్యేవ తాన్యావద్భోగాంశ్చిత్రనరో యథా. 12

ఎంతవఱకు భోగములను చిత్రలిఖిత మనుజులవలె గాంచకుందురో, అంతవఱకు యోగులగు మహాత్ములు విషయవైరాగ్యమును సంపాదించుచునే యుందురు.

అపశ్యఞ్జాగతానర్థాన్నిర్వాసనతయాత్మవాన్
బలాద్వజ్రసమాధానే త్వన్యేనేవ నివేశ్యతే. 13

ఆత్మవంతుఁడగు జ్ఞాని వాసనలయొక్క అభావమువలన జగత్పదార్థములను గాంచకయున్నవాఁడై వజ్రమువలె దృఢమైనట్టి సమాధియందు అన్యునిచే బలాత్కారముగ నియోజితుఁడైనవానివలె ప్రవేశించుచున్నాఁడు.

ప్రావృషీవ నదీపూరో యః సమాధిరుపస్థితః
బలాదేవ తమాయాతం భూయశ్చలతి నో మనః. 14

వర్షాకాలమున నదీప్రవాహమువలె ఏ సమాధిజనితమగు ఆనందైకరసము మనుజునకు ప్రప్రథమమున నుదయించినదో, అద్దాని నాస్వాదించిన పిదప, 'గుడపిపీలికా న్యాయము' ననుసరించి వస్తుస్వభావ బలముచేతనే దానియందే కాఁగలికలుగ, మనస్సదానినే యాస్వాదించుచు మరలయటనుండి చలింపకయుండును.

సర్వార్థశీతలత్వేన బలాద్ధ్యానే యదా ఒఒగతమ్
జ్ఞానాద్విషయవైరస్యం స సమాధిర్హి నేతరః 15

సంపూర్ణ శీతలత్వ (శాంతి) కారణమున ధ్యానయుక్తమగు చిత్తమందు జ్ఞానముద్వారా యే విషయ విరక్తి బలాత్కారముగ నేతెంచుచున్నదో, అదియే సమాధిగాని తదితర మెద్దియు గాదు. (రాగాదులచే సంతప్తమగు చిత్తమందెప్పుడును నెవరికిని సమాధిజనింపదని భావము.)

దృఢం విషయవైరస్యమేవ ధ్యానముదాహృతమ్
తదేవ పరిపాకేన వజ్రసారం భవత్యలమ్. 16

దృఢమగు విషయవైరాగ్యమే ధ్యానమని చెప్పఁబడును. పరిపక్వతచేనట్టి ధ్యానమే వజ్రమువలె బాగుగదృఢ మడినదగుచున్నది. (అదియే సమాధి.)

తదేతద్భోగవైతృష్ణ్యం ధ్యానముత్కీరితం హి తత్
తదేవ పీఠబన్ధేన బద్ధం భవతి బన్ధురమ్. 17

ఈప్రకారముగ, భోగములయెడల వైరాగ్యమను బీజమే యంకురించి ధ్యానమగుచున్నది. అదియే ప్రరూఢమై, దృఢమూలము గల్గినదని కాఁగా సమాధియగుచున్నది.

సమ్యగ్జ్ఞానం సముచ్ఛూనం సదైవోజ్ఝితవాసనమ్
ధ్యానం భవతి నిర్వాణమానన్దపదమాగతమ్. 18

సాక్షాత్కారవృత్తిచే నావిర్భూతమగు బ్రహ్మమే, అజ్ఞాన నాశక మగుటచే జ్ఞానమున్ను వాసనోచ్ఛేదకమగుటచే ధ్యానమున్ను, సర్వదుఃఖ వినాశక మగుటచే ఆనంద పదమగు నిర్వాణమున్ను నగుచున్నది.

అస్తి చేద్భోగవైతృష్ణ్యం కిమన్యద్ధ్యానదుర్ధియా
నాస్తి చేద్భోగవైతృష్ణ్యం కిమన్యద్ధ్యానదుర్ధియా. 19

భోగములయెడల విరక్తిగల్గియున్నచో నిఁక ధ్యానమను దుష్టబుద్ధిచే నేమి ప్రయోజనము! భోగములయెడల విరక్తిలేకయున్నచో నప్పుడున్ను నిఁక ధ్యానమను దుష్టబుద్ధిచే నేమి ప్రయోజనము! (అనగా, విషయవిరక్తి యున్నచో ధ్యానము స్వయముగనే కలుగుననియు, లేనిచో నెప్పటికిని గలుగనేరదనియు భావము.)



దృశ్యస్వదనముక్తస్య సమ్యగ్జ్ఞానవతో మునేః
నిర్వికల్పం సమాధానమవిరామం ప్రవర్తతే. 20

దృశ్యముయొక్క యాస్వాదనము లేనివాఁడును, ఉత్తమ జ్ఞానయుక్తుఁడునగు మునికి నిర్వికల్ప సమాధి నిరంతరము స్వయముగనే కలుగుచుండును.

యస్మై న స్వదతే దృశ్యం స సంబుద్ధ ఇతి స్మృతః
న స్వదన్తే యదా భోగాః సమ్యగ్బోధస్తథోదితః. 21

ఎవనికి దృశ్యము రుచింపకుండునో, ఆతఁడే యుత్తమజ్ఞానియని చెప్పఁబడును. ఏలయనఁగా భోగములెప్పుడు రుచింపకుండునో యప్పుడే యుత్తమజ్ఞాన ముదయించును.

యస్య స్వభావవిశ్రాన్తిః కథం తస్యాస్తి భోగితా
అస్వభావో హి భోగిత్వం తత్క్షయే తత్కథం కుతః. 22

ఎవనికి బ్రహ్మస్వభావమున విశ్రాంతి సంప్రాప్తించినదో, ఆతనికి భోగములందు రుచి యెట్లు కలుగును. ? ఏలయనఁగా, బ్రహ్మస్వభావ విరుద్ధమగు అజ్ఞానమందే భోగములు రుచించును. జ్ఞానముచే నెపుడజ్ఞానము నశింపఁబడినదో, అపుడిఁక భోగములందు రుచి యెట్లెచట గలుగును?

శ్రుతపాఠజపాన్తేషు సమాధినిరతో భవేత్
సమాధివిరతః శ్రాన్తః శ్రుతపాఠజపాఞ్ఛ్రయేత్. 23

సాధకుఁడగువాఁడు వేదాంతశ్రవణము, ఉపనిషదాదుల పఠనము, ప్రణవాదుల జపము మున్నగునవి గావించినపిదప సమాధియందు తత్పరుఁడై యుండవలెను, సమాధినుండి లేచినపిదప మరల యథావిధముగ శ్రవణ, పఠన, జపాదుల, గావింపవలయును.

నిర్వాణమాసీత నిరస్తఖేదం
సమస్తశఙ్కాస్తమయాభిరామమ్
సుషుప్తసౌమ్యం సమశాన్తచిత్తం
శరద్ఘనాభోగ విశుద్ధమన్తః. 24

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు
నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే సామ్యావబోధనో నామ
షట్ చత్వారింశః సర్గః ॥ 46 ॥

ఓ రామచంద్రా! ఖేదరహితమై, సర్వసంశయ వర్జితమై, అతిరమణీయమై, సుషుప్తివలె సౌమ్యమై, సమమును, శాంతమునగు చిత్తముగలదై, శరత్కాలమేఘమువలె విశుద్ధమైనట్టి నిర్వాణ రూపమగు సమాధియందు సదా నెలకొని యుండవలెను.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్థమున
సామ్యావబోధనమను నలుబదియాఱవ సర్గము ॥46॥

## సప్తచత్వారింశః సర్గః

[భూయోఽపి విస్తరాన్ముక్తిసాధనక్రమవర్ణనే
ప్రస్తుతే దృఢవైరాగ్యప్రాప్త్యన్త మిహ వర్ణ్యతే.

మరల విస్తారముగ ముక్తిసాధన క్రమమును వర్ణించుచు దృఢవైరాగ్యమునుగూర్చి యిట దెలుపుచున్నారు.]

శ్రీవసిష్ఠ ఉవాచ:—

సంసారభారసుశ్రాన్తః సంకటేషు లుఠత్తనుః
యోఽభివాఞ్ఛతి విశ్రాన్తిం తస్య క్రమమిమం శృణు. 1

శ్రీవసిష్ఠుఁడు.— ఓ రామచంద్రా! సంసారభారముచే మిగుల శ్రమనొందియున్నవాఁడై, మరణ మూర్ఛాది సంకటములందు దొరలిన దేహముగలవాఁడై యెవఁడాత్మయందు విశ్రాంతిని గోరునో ఆతని ఈగుణక్రమమును గూర్చి వినుము.

పూర్వం వివేకకణికా యదా స్వహృది జాయతే
సంసారనిర్వేదమయీ కారణాద్వాప్యకారణాత్. 2

తదాశ్రయన్తి సచ్ఛాయాన్సాధుత్వసువిశాలినః
అధ్వశ్రమహరాంస్తాపతప్తా మార్గతరూనివ. 3

సూర్యతాపముచే దపించిన జనులు, ఉత్తమచ్ఛాయతోఁ గూడియున్నవియు, మార్గమందలి శ్రమను హరించునవియునగు వృక్షముల నాశ్రయించునట్లు, పూర్వజన్మయందుగాని, ఈజన్మయందుగాని గావించిన జప, తపాదుల కారణముచే స్వహృదయమున నెపుడు సంసారమునుగూర్చిన వైరాగ్యమయమైనట్టి వివేక కణిక (అంకురము) యుత్పన్నమగునో, అపుడు మనుజుఁడు సాధుత్వముచే మహావిశాలమైనట్టి హృదయముగల్గిన మహనీయుల నాశ్రయించును.

దూరే పరిహరత్యజ్ఞాన్యజ్ఞయూపానివాధ్వగః
స్నానదానతపోయజ్ఞాన్కరోతి విబుధానుగః. 4

బాటసారి యజ్ఞస్తంభములను విడిచి జనునట్లు, ఆతఁడజ్ఞానులను దూరమునుండియే త్యజించివేయును. మఱియు, విద్వజ్జనుల సమ్మతి ననుసరించి స్నాన, దాన, తపో, యజ్ఞాదులఁ గావించును.

పేశలం చానురూపం చ వ్యవహారమకృత్రిమమ్
లోకమాహ్లాదనం ధత్తే చన్ద్రబిమ్బమివామృతమ్. 5

చంద్రబింబము అమృతమును ధరించునట్లు, కోమలమై, తనకు యోగ్యమై, స్వాభావికమై, జనులకు హితదాయకమై, ఆనందకరమైనట్టి వ్యవహారమునే యాతఁడాచరించును.

పరప్రజ్ఞానుగో భవ్యః పరార్థపరిపూరకః
పవిత్రకర్మరసికః కోఽపి సౌమ్యః ప్రవర్తతే. 6



ప్రజ్ఞావంతులగు యితరుల యభిప్రాయము ననుసరించువాఁడును, సర్వజనప్రియుఁడును, భవ్యశీలుఁడును, పరోపకార సాధకుఁడును, శాస్త్రసమ్మతములగు పవిత్రకర్మలను ప్రేమించువాఁడును నగునో అట్టియొకానొకఁడు మాత్రమే జనులలో సర్వజనోత్కృష్టుఁడై, సౌమ్యుఁడై వ్యవహరించును.

నవనీతస్థలీవాచ్ఛా స్నిగ్ధా మృద్వీ మనోహరా
జనం సుఖయతి స్వాద్వీ తదీయా నవ సంగతిః. 7

నవనీతస్థలమువలె నిర్మలమై, స్నిగ్ధమై, కోమలమై, మనోహరమై, స్వాదయుక్తమైనట్టి యాతని నూతనసాంగత్యము సమస్తజీవులకును సుఖమును గలుగజేయునదగును.

శీతలాని పవిత్రాణి చరితాని వివేకినః
ఇన్దోరివాంశుజాలాని జనం శీతలయన్త్యలమ్. 8

అట్టివివేకవంతుని పవిత్రశీతల చరిత్రములు చంద్రకిరణములవలెఁ బూర్ణముగ శీతలమైనవియై యున్నవి.

న తథోద్యానఖణ్డేషు పుష్పప్రకరహారిషు
విశ్రామ్యతే వీతభయం యథా సాధుసమాగమే. 9

సాధువులగు మహాత్ముల సాంగత్యమున భయరహితమగు విశ్రాంతి యెట్లులభించునో, అట్టిది పుష్పసమూహములచే మనోహరమైనట్టి యుద్యానమండలములందును లభించ నేరదు.

మన్దాకినీపయాంసీవ సంగతాని వివేకినామ్
ప్రక్షాలయన్తి పాపాని ప్రయచ్ఛన్తి విశుద్ధతామ్. 10

వివేకుల సాంగత్యము గంగాజలమువలె పాపముల నశింపఁజేసి శుద్ధత్వము నొసంగుచున్నది.

వివేకిషు విరక్తేషు సంసారోత్తరణార్థిషు
జనః శీతలతామేతి హిమహారగృహేష్వివ. 11

విరక్తులును, సంసారము దాటిన వారునునగు వివేకుల సాంగత్యమందు, హిమ, పుష్పహార ప్రపూర్ణములగు గృహములందువలె జనులు శీతలత్వమును (శాంతిని) బొందెదరు.

నను నామరతో దారా యా వివేకిని విద్యతే
సురగన్ధర్వకన్యాసు మానవీషు న విద్యతే. 12

వివేకశీలునియం దేయుదారమగుప్రీతిగలదో, అయ్యది మనుజ, దేవ, గంధర్వకన్యలందును లేదు.

ప్రజ్ఞాప్రసాదమాయాతి క్రమాదుచితకర్మణః
అతః కరోతి శాస్త్రార్థమర్థం ముకుర భూరివ. 13

క్రమముగ ననుష్ఠింపఁబడిన నిష్కామకర్మచే బుద్ధి శుద్ధమగుచున్నది. అట్టి శుద్ధబుద్ధి నిర్మలమైన దర్పణ - ముఖము ప్రతిబింబమును ధరించునట్లు, గురుముఖతః శ్రవణముచేసిన శాస్త్రార్థమును దనయందు ధరించుచున్నది.

సత్ప్రజ్ఞోన్నతిమాయాతి శాస్త్రార్థరసశాలినీ
వివేకిని విలాసేన కదలీవ మహావనే. 14

మహావనమున కదళీవృక్షము వృద్ధినొందు విధమున, వివేకయుక్తమగు హృదయమున శాస్త్రార్థమను రసముచే శోభితమగు ఉత్తమబుద్ధి, మూలముయొక్క విస్తారముచే నున్నతిని బొందుచున్నది.

అన్తరేవానుభవతి సర్వార్థాన్ప్రతిబిమ్బితాన్
ఆదర్శవదశేషేణ ప్రజ్ఞానైర్మల్యశాలినీ. 15

అద్దము ప్రతిబింబిత పదార్థములను దనయందు ధరించునట్లు, నిర్మలత్వముచే శోభించు బుద్ధి తనయందు సమస్తశాస్త్రార్థములను బూర్ణముగ ధరించుచున్నది.

సాధుసంగమశుద్ధాత్మా శాస్త్రార్థపరిమార్జితః
ప్రాజ్ఞో భాత్యుద్ధృతం వహ్నేరగ్నిశౌచమివాంశుకమ్. 16

సాధుజనుల సాంగత్యములచే శుద్ధమైనట్టి చిత్తముగల వాఁడును, అధ్యాత్మ శాస్త్రార్థముచే శోధితుఁడునగు వివేకి, అగ్నియందు శౌచమొనర్పబడి పైకెత్తబడిన వస్త్రమువలెఁ బ్రకాశించును.

కచత్కాఞ్చనకాన్తేన విమలాలోకకారిణా
భువనం భాస్కరేణేవ భాతి సాధుః స్వతేజసా. 17

సూర్యునిచేఁ బ్రపంచము ప్రకాశించువిధమున, ప్రదీప్తమగు సువర్ణమువలె మనోహరమైనదియు, నిర్మలమైన ప్రకాశమును గలుగఁజేయునదియు నగు స్వతేజము (ఆత్మప్రకాశము)చే వివేకి భాసిల్లును.

తథానుగచ్ఛతి ప్రాజ్ఞః శాస్త్రసాధుసమాగమౌ
యథాత్యన్తానుషఙ్గేణ తావేవానుభవత్యసౌ. 18

స్వప్నమందును గూడ వాని ననుభవించునంతటి తీవ్రముగ వివేకియగువాఁడు శాస్త్రాభ్యాస, సాధుసాంగత్యములను నిరంతర మనుసరించుచుండును.

క్రమాత్సజ్జనతామేత్య శాస్త్రార్థభరభావితః
భాతి భోగానధఃకుర్వన్పఞ్జరాదివ నిర్గతః. 19

శాస్త్రార్థముచేఁ బవిత్రుఁడైన మనుజుఁడు రాగద్వేషాదులను క్షయింపజేయుచు, మైత్ర్యాది గుణములను సంపాదించుచు, అట్టి క్రమముచే సజ్జనత్వమును సముపార్జించు, భోగముల నణఁగద్రొక్కుచు, పంజరము(బోను)నుండి బయల్వెడలిన సింహమువలె గంభీరముగ శోభించును.

భోగాభిగమదౌర్భాగ్యం దినానుదినముజ్ఝతా
తేన తత్కులమాభాతి తారాచక్రమివేన్దునా. 20

చంద్రునిచే నక్షత్రమండలము శోభించునట్లు, భోగానుసరణమను దౌర్భాగ్యమును దినదినము త్యజించివైచునట్టి వివేకవంతునిచే నాతని వంశమున్ను, సమాజమున్ను శోభించును:



అభోగకృపణా క్వాపి న చైవాస్య ప్రవర్తతే
ముఖే కాన్తిరపూర్వేవ చన్ద్రే రాహుమృతే యథా. 21

భోగములఁగూర్చిన దీనత్వములేని వివేకియొక్క ముఖముపై, రాహువుచే విడువఁబడిన పూర్ణచంద్రునియందువలె నొకానొక నూతనమైన కాంతి వర్తిల్లును.

తృణీకృతత్రిజగతాం మహతామభిధేయతామ్
స యాతి కల్పవిటపీ నభసీవ దివౌకసామ్. 22

స్వర్గమందు దేవతల మధ్యమునఁ గల్పవృక్షము ప్రశంసింపఁబడునట్లు, ముల్లోకములను దృణమువలె నెంచునట్టి మహాత్ములమధ్య వివేకియగువాఁడు కీర్తనీయుఁడగును.

భోగానాం ద్వేషణేనాన్తర్లజ్జమానో మనస్యపి
భోగానామప్యసంపత్త్యా పరమం పరితుష్యతి. 23

వివేకి, ప్రాప్తించిన భోగములయొక్క త్యాగముచే సంతుష్టుఁడైనను, ద్వేషముల నన్నిటిని ద్యజించిన తనకు భోగములయెడ ద్వేషముచే నేమి ప్రయోజనమని తలంచి లోలోన లజ్జితుఁడగును. అయినను, భోగములయొక్క అప్రాప్తిచే మనంబున నతి సంతుష్టుఁడగును.

స్వా ఏవాపహసత్యన్తస్తరుణీస్తరలక్రియాః
ఖేదస్మేరముఖో జాతిర్జాతిస్మర ఇవాధమః. 24

చండాలాది కులములఁ బుట్టినవాఁడు దైవయోగముచే తన జాతిని స్మరించిలోన నవ్వుకొనునట్లు, వివేకి తన పూర్వకాలికములగు రాగాదిప్రౌఢ, చపలక్రియలను స్మరించి లజ్జితుఁడై, తల వంచుకొని లోన నవ్వుకొనుచుండును.

అథ తం ద్రష్టుమాయాన్తి సౌహార్దేనైవ సాధవః
భూమావివోదితం చన్ద్రం విస్మయోత్ఫుల్లలోచనాః. 25

అటుపిదప, భూమిపై నుదయించిన చంద్రునివంటి యట్టి వివేకిని గాంచుటకొఱకై, ఆశ్చర్యముచే వికసితములైన నేత్రములు గలవారై, మిత్రత్వముతోఁగూడి సిద్ధులాతని చెంతకేతెంచెదరు.

నిత్యానాదృతభోగోఽసౌ తతోఽప్యుచితయా ధియా
ప్రాప్తమప్యుచితారమ్భం భోగం న బహుమన్యతే. 26

నిరంతరము భోగములను అనాదరముచేయు నట్టి యావివేకి యాసిద్ధులవలనఁ బొందఁబడిన అనిషిద్ధ భోగములనుగూడ తనయుదారబుద్ధిచే గొప్పవిగాఁదలంపకుండును(వానినాదరింపఁడనిభావము.)

పూర్వం సంసృతివైరస్యమన్తరేవోదితాత్మనః
జాయతే జీర్ణజాడ్యస్య పాకాదివ శరత్తరోః. 27

శరత్కాలమునాటి వృక్షమందు పక్వతవలన రసహీనత్వము జనించునట్లు, జడత్వరహితుఁడును గంభీరహృదయుఁడునగు వివేకియందు ప్రప్రథమముననే సంసారముయెడల విరసత్వము (వైరాగ్యము) జనించును.

తతః సజ్జనసంపర్కముదర్కశ్రేయసే స్వయమ్
కరోతి స్వస్థతాగృధ్నుర్భిషగాశ్రయణం యథా. 28

ఆరోగ్యము నభిలషించువాఁడు వైద్యుని సేవించునట్లు, వివేకవంతుఁడు భావి శ్రేయముకొఱకై సజ్జన సంపర్కమును స్వయముగ నాశ్రయించును.

తేనోదారమతిర్భూత్వా శాస్త్రార్థేషు నిమజ్జతి
మహాన్మహాప్రసన్నేషు సరఃస్వివ మహాగజః. 29

అత్తఱి, సజ్జనుల సాంగత్యముచే నుదారబుద్ధియై, మహాగజము నిర్మల సరోవరములందు నిమగ్నమగునట్లు, అతఁడు శాస్త్రార్థములందు నిమగ్నమగును.

సజ్జనో హి సముత్తార్య విపద్భ్యో నికటస్థితమ్
నియోజయతి సంపత్సు స్వాలోకేష్వివ భాస్కరః. 30

సూర్యుఁడు జనులనంధకారమునుండి తొలఁగించి ప్రకాశమందు నియోగించునట్లు, సజ్జనుఁడగు మహాత్ముఁడు తన చెంతనున్నవారిని విపత్తులనుండి తొలఁగించి సంపదలందు నియోగించును.

పరస్వాదానవిరతిః పూర్వమేవ ప్రవర్తతే
వివేకినో నిజార్థేషు సంతోషశ్చోపజాయతే. 31
పరస్వాదానవిరతః సంతోషామృతనిర్భరః
వివేకీ క్రమశః స్వార్థానప్యుపేక్షితుమిచ్ఛతి. 32

వివేకికి నితరుల ధనాదులయెడల ప్రథమమునందే అరుచిజనించును. అట్లితరుల ధనాదులయెడల విరక్తిగలవాఁడును, సంతోషామృతముచేఁ దృప్తుఁడునగు వివేకివంతుఁడు క్రమముగ తనయొక్క ధనాది పదార్థములఁగూడఁ ద్యజింపఁదలంచును.

దదాతి కణపిణ్యాకశాకాద్యపి హి యాచతే
తేనైవాభ్యాసయోగేన స్వమాంసాని దదాత్యసౌ. 33

ఎవరైన యాచించినచో త్యాగశీలుఁడగు నట్టి వివేకితన వద్దనున్న నూక తెలికపిండి, కూరలు మున్నగువానిని గూడ నితరుల కిచ్చివేయును. ఇంతేల, దాన, త్యాగముల యభ్యాసముచే నాతఁడు యాచకునకుఁ దన మాంసమునుగూడ నొసఁగివేయును.

నూనం విలయచిత్తానాం వివేకమనుధావతామ్
మౌర్ఖ్యం లఘుత్వమాయాతి ధావతామివ గోష్పదమ్. 34

పరుగెత్తువానికి గోష్పదస్థలము అల్పత్వముఁ జెందునట్లు, చిత్తము క్రమముగ లయించునట్టి వారును వివేకమువైపునకుం బరుగిడువారునగు జనులకు అజ్ఞానము అల్పత్వముఁ జెందుచుండును.

పరార్థాదానవిరతిం పూర్వమభ్యస్య యత్నతః
ఆహర్తవ్యా వివేకేన తతః స్వార్థేష్వరక్తతా. 35



మొట్టమొదట ప్రయత్నముచే నితరుల ధనాదులయెడల విరక్తినభ్యసించి పిమ్మట వివేకముచే దనయొక్క ధనాదులయెడఁగూడ విరక్తిని సంపాదింపవలయును.

తతో భోగనిరాసేన సహ స్వార్థనిరాకృతిః
పరమాయై సువిశ్రాన్త్యై క్రియతే కృతిభిః క్రమాత్. 36

తదుపరి వివేకియగువాఁడు, ఆత్మయందలి పరమ విశ్రాంతి కొఱకై తనయొక్క ధనాదుల విరక్తితోబాటు, భోగత్యాగమునుగూడ సంపాదించును.

న తాదృశం జగత్యస్మిన్దుఃఖం నరకకోటిషు
యాదృశం యావదాయుష్కమర్థోపార్జన శాసనమ్. 37

ఆ జీవితము ధనోపార్జనయను దండనమున నెట్టి దుఃఖముగలదో, అట్టిది యీ ప్రపంచమున గాని,కోట్లకొలఁది నరకములందుగాని యెచటను లేదు.

ఆసనే శయనే యానే గమనే రమణే జనే
ఆధిచిన్తాపరా ఏవ నను మూఢా విదన్తు తామ్. 38

కూర్చొనినను, పరుండినను, వాహనము పైఁబోవుచున్నను, నడచుచున్నను, క్రీడించుచున్నను, జనులమధ్యమందున్నను, మూఢులు మానసిక చింతయందే మునిగియుందురు. కాని, అద్దానిని వారెఱుఁగక యున్నారు.

సన్త్వర్థా వితతానర్థా సంపదః సంతతాపదః
భోగా భవ మహారోగా విపరీతేన భావితాః. 39

వివేకముచే విచారించి చూచినచో, ధనము మహానర్థమున్ను, సంపదలు నిరంతరాపదలున్ను, భోగములు సంసార మహారోగములున్ను నై యున్నవి.

తావన్నాయాతి వైరస్యం చిన్తావిషయజృమ్భణైః
యావదర్థమహానర్థో న కదర్థార్థమర్థ్యతే. 40

తన దీనత్వముకొఱకై యెంతవఱకు జీవుఁడు ధనమను అనర్థము నభిలషింపకుండునో, అంతవఱకాతఁడు విషయ చింతాసంతాపములచేఁ దపింపకుండును.

అనుత్తమసుఖం యస్మై చిరాయ పరిరోచతే
జగత్తృణశిఖాదృష్ట్యా సోఽర్థం పశ్యతు శామ్యతు. 41

ఎవనికి శాశ్వతముగ సర్వోత్తమమగు మోక్షసుఖము రుచించుచున్నదో, అట్టివాఁడు ధనమును జగత్తును శుష్కతృణముయొక్క శిఖవలె తుచ్ఛముగ గాంచును. మఱియు ఆత్మయందే శాంతి నొందును. (ధనస్పృహాత్యాగమే ముఖ్యమగు మోక్షోపాయమని భావము.)

భూరిభావవికారాణాం జరామరణకర్మణామ్
దైన్యదౌరాత్మ్యదాహానామర్థః సార్థ ఇతి స్మృతః. 42

అనేక శోక, మోహాది భావ వికారములయొక్కయు, జరామరణాది దుష్కర్మల యొక్కయు, దీనత్వ, దౌరాత్మ్యాది దహనరూపములైన దుష్టచేష్టలయొక్కయు, సమూహము ధనమే యని చెప్పఁబడినది

అస్మిఞ్జగతి జన్తూనాం జరామరణ శాలినామ్
అజరామరణం కర్తుం సన్తోషోఽస్తి రసాయనమ్. 43

ఈ ప్రపంచమున జరామరణాది రోగములచేఁ బూర్ణులైయున్న జీవుల నట్టి జరామరణాదులనుండి విముక్తినొందించుటకై సంతోషమే పరమౌషధమైయున్నది.

వసన్తో నన్దనోద్యానమిన్దురప్సరసః స్మృతాః
ఇత్యేకతః సముదితం సన్తోషామృతమేకతః. 44

వసంతర్తువు, నందనవనము, చంద్రుఁడు, అప్సరసనమూహము - ఇవన్నియుఁజేరి యొక్క సంతోషమను అమృతమునకు సమమైయున్నవి.

సరసః ప్రావృషేవాన్తః సన్తోషేణైవ పూర్ణతా
గమ్భీరాం శీతలాం హృద్యాం ప్రసన్నాం రసశాలినీమ్. 45
సాధురోజస్వితామేత్య సన్తోషేణైవ రాజతే
సుపుష్పితవనాకారో వసన్తేనేవ పాదపః. 46

వర్షముచే సరిస్సు పూర్ణత్వమునొందునట్లు, సంతోషముచేతనే మనుజుఁ డంతఃకరణమునఁ బూర్ణతఁ జెందుచున్నాఁడు. మఱియు వసంతఋతువుచేతనే వృక్షము సుపుష్పితవనాకారముగ భాసిల్లునట్లు, గంభీరమై, శీతలమై, మనోహరమై, ప్రసన్నమై, ఆత్మానందరసముచే శోభితమైనట్టి తేజోరూపమును సాధువు సంతోషముచేతనే పొంది శోభించుచున్నాఁడు.

పాద పీతపరామర్శ పిష్టకీటవదీహతే
దీనప్రకృతిరర్థార్థీ దుఃఖాద్దుఃఖాన్తరం వ్రజేత్. 47

పాదతలముచే మర్దింపఁబడిన కీటమువలె దీనప్రకృతిగల ధనాభిలాషియగు మనుజుఁడు, ఒక దుఃఖమునుండి మఱియొక దుఃఖమును బొందుచుండును.

కల్లోలవికరాః క్షుబ్ధసముద్రపతితా ఇవ
నాప్నువన్తి స్థితిం స్వస్థాం వికృతాకృతయోఽర్థినః. 48

తరంగములచే వ్యాకులమై, సంక్షుబ్ధమైయున్నట్టి సముద్రమునఁబడిన జీవులచందమున వికృతాకారయుక్తులగు ధనవాంఛాపరులెన్నటికిని శాంతస్థితిని బడయఁజాలరు.

సంపదః ప్రమదాశ్చైవ తరఙ్గోత్తుఙ్గభఙ్గురాః
కస్తాస్వహిఫణచ్ఛత్రచ్ఛాయాసు రమతే బుధః. 49

వనితలు, సంపదలు, ఉన్నతతరంగమువలె క్షణభంగురములైనవి, సర్పముయొక్క పడగయను గొడుగుక్రింద బుద్ధిమంతుఁడగువాడెవఁడు క్రీడించును?



అర్థోపార్జనరక్షాణాం జానన్నపి కదర్థనామ్
యః కరోతి స్పృహాం మూఢో నృపశుం తం న సంస్పృశేత్. 50

ధనముయొక్క అర్జన, రక్షణములందలి దుఃఖముల నెఱిఁగియు ఏమూఢుఁ డద్దాని నిచ్ఛగించునో, అట్టి నరపశువును తాఁకఁగూడదు.

మనసో బాహ్యమారమ్భమాన్తరం చ లునాతి యః
సమం వైతృష్ణ్యదాత్రేణ తస్యక్షేత్రం ప్రకాశతే. 51

మనస్సుయొక్క బాహ్యవిషయానుసరణమును, ఆభ్యంతర సంకల్పాదులను నెవఁడు తృష్ణారాహిత్యమను కొడవలిచే సమముగఁ గోయునో, అట్టివాని హృదయమను క్షేత్రము ఆత్మజ్ఞానముచేఁ ప్రకాశించును.

జగత్త్వమజ్ఞసంబుద్ధం జ్ఞో విదన్నసదేవ యత్
సతీవ తత్ర స్ఫురతి తదనభ్యాస జృమ్భితమ్. 52

అజ్ఞానుల బుద్ధియందుగల యీ జగద్వైచిత్ర్యమును (అపరిపక్వ)జ్ఞాని సాక్షిచైతన్యమున అసద్రూపముగ నెఱిఁగియున్నప్పటికిని, వానికది సద్రూపముగనే భాసించుట యేదిగలదో, అది అభ్యాస రాహిత్యము వలననే యగును.

సంసార నిర్వేదదశాముపేత్య
సత్సంగమం శాస్త్రముపేత్య తేన
శాస్త్రార్థభావేన నిరస్య భోగా
న్వైతృష్ణ్యదార్ఢ్యాత్పరమార్థమేతి. 53

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తేమోక్షోపాయేషు నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే ముముక్షుప్రథమోపక్రమో నామసప్తచత్వారింశః సర్గః ॥ 47 ॥

ప్రథమమున సంసారమునెడల వైరాగ్యమును బొంది, పిమ్మట నద్దానిచే సత్సాంగత్య, శాస్త్రాభ్యాసములఁ గావించి, తదుపరి యాఅధ్యాత్మ శాస్త్రార్థముయొక్క భావనచే భోగములఁ బరిత్యజించి, క్రమముగ తృష్ణారాహిత్యముయొక్క దృఢత్వముచే జీవుఁడు పరమార్థమగు ఆత్మతత్త్వము నెఱిఁగి మోక్షమును బొందుచున్నాఁడు.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున ముముక్షుప్రథమోపక్రమమను నలుబదియేడవ సర్గము ॥47॥

---

## అష్టచత్వారింశః సర్గః

[నిరూఢే పరవైరాగ్యే పుంసో యైర్లక్షణైః స్థితిః
యైశ్చ జ్ఞానప్రతిష్ఠాయాం వర్ణ్యన్తే తాని విస్తరాత్.

పరవైరాగ్యము దృఢపడ యే లక్షణములతో మనుజుఁడు కూడియుండునో, మఱియు ఏ లక్షణములచే జ్ఞానమందు ప్రతిష్ఠ సంభవించునో, అట్టి లక్షణము లిచట విస్తారముగ వర్ణింపఁబడుచున్నవి.]

శ్రీవసిష్ఠ ఉవాచ:—

రూఢే సంసారనిర్వేదే స్థితే సాధుసమాగమే
శాస్త్రార్థే భావితే బుద్ధ్యా భోగవైతృష్ణ్య ఆగతే. 1

జాతే విషయవైరస్యే సజ్జనత్వే తథోదితే
ప్రకాశే సోన్ముఖీభూతే హృదయే కలితోదయే. 2

ధనాని నాభివాఞ్ఛన్తే తమాంసీవ వివేకినా
త్యజ్యన్తే విద్యమానాని సంశుష్కామేధ్యపర్ణవత్. 3

శ్రీవసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! సంసారమందు వైరాగ్యము దృఢపడ, సాధుసంపర్కము సిద్ధింప, నిర్మలబుద్ధిచే శాస్త్రార్థము భావింపఁబడ, భోగములయెడల తృష్ణారాహిత్యము సంభవింప, విషయములందు విరసత్వము జనింప, సజ్జనత్వ ముదయింప, హృదయమున జ్ఞానోదయమగుటచే ఆత్మప్రకాశము ఉన్ముఖముకాఁగా, వివేకియగువాఁడు, పాపములనువలె, ధనములను వాంఛింపకుండును. మఱియు గృహమునుండి అపవిత్రములైన ఉచ్ఛిష్టపత్రములు బారవేయఁబడునట్లు విద్యమానములగు ధనాది పదార్థములఁగూడ నాతఁడు త్యజించివేయును.

భారాయ పాన్థదృష్టేవ దృశ్యన్తే దారబన్ధవః
యథాశక్తి యథాకాలముపచర్యన్త ఏవ చ. 4

బాటసారి ఘటాది ఆవశ్యక పదార్థములఁగూడ భారభూత మగుటఁబట్టి త్యజించుచుఁ బోవునట్లు, అట్టి వివేకి స్త్రీ, బాంధవాదులనుగూడ భార రూపులుగ గాంచినవాఁడై, యథాశక్తి యథాకాలము వారిఁద్యజించుచు బోవుచుండును.

ఇన్ద్రియేష్వపి సంలగ్నా ఇన్ద్రియార్థాః పునఃపునః
న భోగా అనుభూయన్తే నూనం శాన్తమనస్తయా. 5

ఇంద్రియార్థములగు విషయములు ఇంద్రియములందు మరల మరల సంలగ్నములైనను, నిక్కముగ శాంతచిత్తుఁ డగుటఁబట్టి యట్టివివేకి యా భోగముల ననుభవింపకయే యుండును. (భోగముల యెడల అరుచిజనించునని భావము.)

ఏకాన్తేషు దిగన్తేషు సరఃసు విపినేషు చ
ఉద్యానే పుణ్యదేశేషు నిజేష్వేవ గృహేషు వా. 6



సుహృత్క్రీడావిలాసేషు శుభోద్యానాశనాదిషు
శాస్త్రతర్కవిచారేషు న తథాఽఽస్థీయతే చిరమ్. 7

మఱియు వివేకి ఏకాంత దేశములందును, సరోవరములందును, అరణ్యములందును, వనవాటికలందును, పవిత్రస్థానములందును, స్వగృహములందును, మిత్రులతో గావించు క్రీడాసహిత విలాసములందును, ఉత్తమ యుద్యాన వనములందలి, భోజనాది క్రియలందును, శాస్త్రతర్క విచారములందును, ఆసక్తిలేమి, చిరకాలము వర్తింపకుండును. ఆత్మయందే సదానెలయుచుండును.

ఉపశాన్తేన దాన్తేన స్వాత్మారామేణ మానినా
జ్ఞాత్వైవాన్విష్యతే జ్ఞేన విజ్ఞానైకాన్తవాదినా. 8

శాంతుఁడును, దాంతుఁడు (జితేంద్రియుఁడు) ను, ఆత్మారాముఁడును, మునియు, విజ్ఞానైకనిరతుఁడునగు వివేకి తన దేహేంద్రియాదులకు సాక్షియై నట్టి ప్రత్యగాత్మయొక్క అన్వేషణమందే సదాతత్పరుఁడై యుండును.

ఏవమభ్యాసవశతః పరే విశ్రామ్యతే పదే
నిమ్నే వామ్భసి శాన్తేన స్వయమేవ వివేకినా. 9

తాపముచే సంతప్తుఁడగు మనుజుఁడు శీతలజలమున విశ్రాంతి నొందునట్లు, ఈ ప్రకారముగ నిరంతరాత్మాన్వేషణరూపమగు అభ్యాసముయొక్క వశముచే శాంతుఁడగు వివేకిస్వయముగనే పరమ పదమగు ఆత్మయందు విశ్రాంతినొందును.

సబాహ్యాభ్యన్తరం శాన్తా జ్ఞప్తైవార్థతయోదితా
న సంభవతి భిన్నోఽర్థ ఇత్యేవ పరమం పదమ్. 10

స్వాత్మను గూర్చిన అజ్ఞానమే బాహ్యాభ్యంతర దృశ్యపదార్థ రూపమున నుదయించినది. కావున నట్టి అజ్ఞానము ఆ పదార్థములకంటె భిన్నముగ నెన్నటికిని సంభవింపదు. ఇవ్విధముగ నెఱిగి దృశ్యత్యాగముద్వారా తత్సాక్షియందు స్థితిగల్గియుండుటచే నయ్యజ్ఞానము శమించుచున్నది. అట్టి శేషించు శాంతమగు ఆత్మస్థితియే పరమపదమైయున్నది.

నార్థోపలబ్ధిర్నో శూన్యమస్తి బోధాత్మతాం వినా
ఇత్యన్తరనుభూతిస్థమాహుస్తత్పరమం పదమ్ 11

ఎచట కేవలము బోధ (చిత్తు) తప్ప అన్యమగు యే పదార్థముగాని, శూన్యత్వముగాని లభింపకుండునో, అట్టి యంతరంగమందలి నిజానుభవస్థితియే పరమపదమనఁబడును.

ఏకబోధాతిసంబన్ధపరిణామాన్న బోధతా
న శూన్యతా నార్థతేతి విద్ధి తత్పరమం పదమ్ 12

ఓ రామచంద్రా! సమస్తపదార్థములున్ను ఏకమైనట్టి బోధరూపమునఁ బరిణతములగుటచే నెచట పదార్థజ్ఞానముగాని, శూన్యత్వముగాని, పదార్థత్వముగాని లేకయున్నవో, అట్టి స్థితినే పరమ పదమని యెఱుఁగుము.

స్వసంవిన్మాత్ర విశ్రామవతామమనసాం సతామ్
న స్వదన్తే హి విషయాః పయాంసి దృషదామివ. 13

(మనశ్శూన్యములగు) శిలలకు క్షీరము రుచింపనట్లు, కేవలము స్వాత్మ మాత్రమున విశ్రాంతి నొందువారును, మనోరహితులునగు మహాత్ములకు విషయములు రుచింపకుండును.

నిరోధపదమాపన్నో నిర్మనా మానమన్థరః
స్వభావే స్థిత ఏవాస్తే చిత్రే కృత ఇవాత్మవాన్. 14

కేవలము బహిర్ముఖత్వ నిరోధపదమును బొందినవాఁడును, మనోరహితుఁడును, మానియు, శరీరాదికార్యములందు శ్రద్ధలేనివాఁడును, ఆత్మజ్ఞుఁడునగు మహనీయుఁడు చిత్రలిఖితునివలె నిశ్చలముగ తన ఆత్మస్వభావమందే నెలకొనియుండును.

సర్వార్థమరరహితం మహాదేవ పరాణువత్
అశూన్యమేవ శూన్యాత్మా హృదయం వేద్యవేదినః. 15

ఆత్మజ్ఞానియొక్క హృదయము సర్వపదార్థ యుక్తమై నప్పటికిని పదార్థ రహితమై, విశాలమై యున్నప్పటికిని పరమాణుసదృశమై, అశూన్యమైనప్పటికిని శూన్యసమమై భాసిల్లుచున్నది.

అహన్త్వం జగదీహాది దిక్కాలకలనాది చ
జ్ఞస్య జ్ఞానాది శూన్యాది స్థితమేవ న విద్యతే. 16

అహంభావము, జగత్తుయొక్క చేష్టాదులు, దేశకాలాదుల కల్పన, జ్ఞాతృజ్ఞానాది త్రిపుటి, శూన్యాదులు, ఈ మున్నగునవి విద్యమానములై యున్నను జ్ఞానియొక్క దృష్టియందు మిథ్యయగుటచే లేనివేయగుచున్నవి.

జ్ఞేనామలపదస్థేన దీపేనేవ నిరస్యతే
తమో హార్దం తథా బాహ్యం రాగద్వేషభయాది చ. 17

దీపము అంధకారమును దొలగించునట్లు, నిర్మలమగు ఆత్మపదమున నున్నట్టి జ్ఞాని హృదయమందలి అజ్ఞానమును, బాహ్యమందలి దృశ్యమును రాగద్వేషభయాదులను తొలగించివేయును.

రజోరహితసత్త్వాంశం సత్త్వాత్పారముపాగతమ్
అసంభవత్తమోరూపం ప్రణమేత్తం నృభాస్కరమ్. 18

రజోగుణము సంపూర్ణముగ నశించినవాఁడును, శుద్ధసత్త్వగుణముచే తమోగుణమను సముద్రమును దాటినవాఁడును, అజ్ఞానాంధకారము విలీనమైనవాఁడునగు మనుజరూపసూర్యునకు సదా నమస్కరింపవలెను.

భేదప్రవిలయే జాతే చిత్తే చాదృశ్యతాం గతే
యా స్థితిః ప్రాప్తబోధస్య న వాగ్గోచరమేతి సా. 19

భేదము సంపూర్ణముగ నశింప, చిత్తము అదృశ్యముకాఁగా, ఆత్మజ్ఞానియొక్క స్థితియెద్ది గలదో, అది వాక్కునకు విషయముకానిదై యున్నది.



దదాత్యేతన్మహాబుద్ధే నిర్వాణం పరమేశ్వరః
అహర్నిశం పరమయా చిరం భక్త్యా ప్రసాదితః. 20

రేయింబవలు చిరకాలమొనర్చు పరమభక్తిచేఁ బ్రసన్నుఁడు గావింపఁబడినవాఁడై పరమేశ్వరుఁడు మహాబుద్ధిమంతుఁడగు వివేకికి నిర్వాణపదము నొసంగును.

శ్రీరామ ఉవాచః—

ఈశ్వరః కో మునిశ్రేష్ఠ కథం భక్త్యా ప్రసాద్యతే
ఏతన్మే తత్త్వతో బ్రూహి సర్వతత్త్వవిదాం వర. 21

శ్రీరాముఁడు:—తత్త్వవేత్తలలో శ్రేష్ఠుఁడవగు నో మునిశ్రేష్ఠా! పరమేశ్వరుఁడెవఁడు? భక్తిచే నాతఁడెట్లు ప్రసన్నుఁడు గావింపఁబడును? దయచేసి యివ్విషయమును నాకు యథార్థముగ వచింపవేఁడెద.

శ్రీవసిష్ఠ ఉవాచః—

ఈశ్వరో న మహాబుద్ధే దూరే న చ సుదుర్లభః
మహాబోధమయైకాత్మా స్వాత్మైవ పరమేశ్వరః. 22

శ్రీవసిష్ఠుఁడు:—మహాబుద్ధివగు రామచంద్రా! పరమేశ్వరుఁడు దూరమునలేఁడు; ఆతఁడు దుర్లభుఁడునుగాఁడు. మహాబోధమయైకస్వరూపమగు స్వాత్మయే పరమేశ్వరుఁడు.

తస్మాత్ సర్వం తతః సర్వం స సర్వం సర్వతశ్చ సః
సోఽన్తః సర్వమయో నిత్యం తస్మై సర్వాత్మనే నమః. 23

సమస్తమున్ను ఆ పరమేశ్వరునికొఱకే అయియున్నది. ఆతనినుండియే సమస్తము నుత్పన్నమైనది. ఆతఁడే సర్వరూపుఁడై యంతట వ్యాపించియున్నాఁడు. సర్వజీవుల హృదయమున నాతఁడే వెలుఁగుచున్నాఁడు. ఆతఁడే సర్వమయుఁడై, సర్వశక్తివంతుఁడై చెన్నొందుచున్నాఁడు. అట్టి సర్వరూపుఁడగు పరమేశ్వరునకు నమస్కారము!

తస్మాదిమాః ప్రసూయన్తే సర్గప్రలయవిక్రియాః
అకారణం కారణతో గతయః పవనాదివ. 24

ఆ పరమేశ్వరునినుండియే యీ సృష్టిప్రళయాది విక్రియలన్నియు జనించుచున్నవి. స్వయముగ నాతఁడు కారణరహితుఁడైనను సమస్తకారణములందును వ్యాపించియున్నాఁడు. నీయొక్క ప్రాణాదుల గతులున్ను నాతనివలననే సంభవించుచున్నవి.

అనిశం పూజయన్త్యేతాః సర్వాః స్థావరజఙ్గమాః
యథాభిమతదానేన సర్వే తే భూతజాతయః. 25

కోరిన పదార్థములను నొసంగుటవలన సమస్త స్థావరజంగమ ప్రాణికోట్లును ఆతనినే నిరంతరము పూజించుచున్నవి.

సుబహూన్యేష జన్మాని యథాభిమతయేచ్ఛయా
యదా సంపూజితస్తేన ప్రసాదమధిగచ్ఛతి. 26

వారి వారి యథేష్టమగు రుచిననుసరించి పెక్కుజన్మములందీ పరమేశ్వరుఁడెప్పుడు జనులచే పూజితుఁడగునో, అపుడు వారియెడల అతఁడు ప్రసన్నుఁడగును.

ప్రసన్నః స మహాదేవః స్వయమాత్మా మహేశ్వరః
బోధాయ ప్రేరయత్యాశు దూతం పూతం శుభేహితైః. 27

శుభకర్మలచే ఈ మహాదేవుఁడైన ఆత్మయగు మహేశ్వరుఁడు స్వయముగఁ బ్రసన్నుఁడై బోధకొఱకై శీఘ్రముగ తనపవిత్రుఁడగు దూతను ప్రేరేపణచేయుచున్నాఁడు.

శ్రీరామ ఉవాచ:—

ఆత్మనా పరమేశేన కో దూతః ప్రేర్యతే మునే
స దూతో బోధనం వాపి కరోతి వద మే కథమ్. 28

శ్రీరాముడు:— ఓ మునీంద్రా! ఆత్మరూపుఁడగు పరమేశ్వరుఁ డేదూతను ప్రేరణ చేయుచున్నాఁడు? ఆ దూత యెవ్విధముగ బోధించుచున్నాఁడు? అను విషయమును దెలియఁజేయ ప్రార్థన?

శ్రీవసిష్ఠ ఉవాచ:—

ఆత్మసంప్రేరితో దూతో వివేకో నామ నామతః
హృద్గుహాయాం సదానన్దస్తిష్ఠతీన్దురివామ్బరే. 29

శ్రీ వసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! ఆత్మయగు పరమేశ్వరునిచే, ప్రేరితుఁడై వివేకమను దూత హృదయ గుహయందుఁ బ్రవేశించి ఆకసమునఁ జంద్రునివలె నట ఆనందరూపముతోటి స్థితినొందుచున్నాఁడు.

స ఏష వాసనాత్మానం జన్తుం బోధయతి క్రమాత్
సంసారసాగరాదస్మాత్తారయత్యవివేకినమ్. 30

ఆ వివేకమను దూత వాసనామయుఁడగు జీవుని, క్రమముగ నుద్బోధించుచున్నాఁడు. మఱియు, అవివేకియగు ఆతనిని సంసారసాగరమునుండి తరింపఁజేయుచున్నాఁడు.

బోధాత్మైషోఽన్తరాత్మైవ పరమః పరమేశ్వరః
అస్యైవ వాచకో నామ ప్రణవో వేదసమ్మతః. 31

బోధరూపుఁడగు ఈ యంతరాత్మయే ఉత్తముఁడగు పరమేశ్వరుండై యున్నాఁడు. వేదసమ్మతమగు ప్రణవమను నామమే యీతని వాచకమై యొప్పుచున్నది.

జపహోమ తపోదాన పాఠయజ్ఞక్రియాక్రమైః
ఏష ప్రసాద్యతే నిత్యం నరనాగసురాసురైః. 32

దేవతలు, మనుజులు, నాగులు, అసురులు మున్నగు వారందఱును జప, హోమ, తపో, దాన, పూజాపాఠ, యజ్ఞాది క్రియా క్రమములచే ఈ పరమేశ్వరునే నిత్యము ప్రసన్ను నొనర్చుచున్నారు.



ద్యౌర్మూర్ధా పృథివీ పాదౌ తారకా రోమరాజయః
భూతాన్యస్థీని హృదయం వ్యోమాస్య పరమేశ్వరః. 33

స్వర్గ మీ పరమేశ్వరుని శిరస్సు, భూమి పాదములు; నక్షత్రములు రోమసమూహములు సమస్తప్రాణికోట్లు అస్థులు, ఆకాశము హృదయము.

సర్వాత్మైష చిదాత్మత్వాద్యాతి జాగర్తి పశ్యతి
తేనైష సర్వతో లక్ష్యకరకర్ణాక్షిపాదభృత్. 34

చిత్స్వరూపుఁడగుటచే నీతఁడు సర్వత్ర యేగుచున్నాఁడు, సర్వదా మేల్కొనుచున్నాఁడు, సర్వులను గాంచుచున్నాఁడు. ఇక్కారణమున సర్వత్ర లక్ష్యములగు హస్త, పాద, కర్ణ నేత్రాదీంద్రియములను ధరించుచున్నాఁడు.

వివేకదూతముద్బోధ్య హత్వా చిత్తపిశాచకమ్
ఆత్మనః పదవీం స్ఫారాం జీవః కామపి నీయతే. 35

ఈ పరమాత్మ వివేకమను దూత నుద్బోధను గావించి చిత్తమను పిశాచమును జంపి, జీవుని, అనిర్వచనీయమైనట్టి తనయొక్క మహత్తరమైన ఆత్మపదమును బొందింపఁజేయుచున్నాఁడు.

త్యక్త్వా సర్వవికల్పౌఘాన్వికారానర్థ సంకరాన్
పౌరుషేణాత్మనైవాత్మా స్వయమేవ ప్రసాద్యతామ్. 36

ఓ రామచంద్రా! సమస్త వికల్ప సమూహములను, అనర్థయుతములగు సమస్త వికారములను త్యజించి పురుష ప్రయత్నముచే స్వయముగ ఆత్మ చేతనే ఆత్మభూతుఁడగు పరమేశ్వరునిఁ బ్రసన్ను నొనర్పుము.

భ్రమన్మనఃపిశాచేఽస్మిన్కల్లోల జలదాకులే
సంసారరాత్రితిమిరే స్వాత్మైవాపూర్ణచన్ద్రమాః. 37

చపలమైనట్టి మనస్సను పిశాచముతోఁ గూడియున్నదై, శోకమోహాది షడూర్ములను మేఘములచే వ్యాప్తమైనట్టి యీ సంసారమను రాత్రియొక్క యంధకారమున స్వాత్మయగు పరమేశ్వరుఁడే ఆనందమును గల్గజేయు ప్రకాశకుఁడైన పూర్ణచంద్రుఁడగును

అగాధమరణావర్త కల్లోలాకులకోటరే
తృష్ణాతరఙ్గతరలే స్వమనశ్చణ్డమారుతే. 38
మహాజడలవాధారే సంసారవిషమార్ణవే
ఇన్ద్రియగ్రామమకరే వివేకః పోతకో మహాన్. 39

అగాధమై, మరణాద్యావర్తములతోఁ గూడినదై, కామక్రోధాదులను కల్లోలముచే వ్యాకులమైనట్టి, పైభాగముగలదై, తృష్ణయను తరంగములచేఁ జంచలమై, మనస్సను ప్రచండవాయువుతోఁ గూడినదై, ఇంద్రియసమూహమను మకరాదులచే భయంకరమై, సమస్త స్థావరజంగమప్రాణికోట్లను జలకణముల కాధారభూతము నగు సంసారమను మహాసముద్రమున వివేకమే గొప్ప నావయైయున్నది.

పూర్వం యథాభిమతపూజనసుప్రసన్నో
దత్వా వివేకమిహ పావనమాతమాత్మా
జీవం పదం నయతి నిర్మలమేకమాద్యం
సత్సఙ్గశాస్త్రపరమార్థపరావబోధైః. 40

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు
నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే వివేకమాహాత్మ్యం నామ
అష్టచత్వారింశః సర్గః ॥ 48 ॥

ఓ రామచంద్రా! ప్రథమమున యథాభిమతములగు పూజనములచే మిగుల ప్రసన్నుఁడై పరమేశ్వరుఁడు వివేకమును దన పవిత్రుఁడైన దూతనొసంగి, పిమ్మట సత్సాంగత్య, శాస్త్రాభ్యాస, పరమార్థ బోధనములద్వారా జీవుని నిర్మలమై, ఏకమై, అద్వితీయమై ఆద్యమైనట్టి ఆత్మ పదమును బొందింపఁ జేయుచున్నాఁడు.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున
వివేకమాహాత్మ్యమను నలుబది యెనిమిదవ సర్గము ॥ 48 ॥

---

## ఏకోనపఞ్చాశః సర్గః

[సుప్రరూఢ వివేకానాం మహత్తా యాదృశీ భవేత్
యాదృక్చ విశ్వం భవతి స్ఫుటం తదిహ వర్ణ్యతే॥
దృఢమైన వివేకముగల మనుజుల మహత్వమెట్టిదో, వారికిఁ బ్రపంచమెట్లు భాసించునో, ఆ విషయమిచట స్పష్టముగ వర్ణింపఁబడుచున్నది.]

శ్రీవసిష్ఠ ఉవాచ:—

పరిపుష్టవివేకానాం-వాసనామలముజ్ఝతామ్
మహత్తా మహతామన్తః కాప్యపూర్వైవ జాయతే. 1

శ్రీవసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! దృఢమైన వివేకముగల వారును, వాసనలను మలమును బూర్ణముగఁ దొలగించినవారునగు మహాత్ములందొకానొక లోకోత్తరమైన మహత్వము జనించుచున్నది.

ఔదార్యోదారమర్యాదాం మతిం గామ్భీర్యసున్దరీమ్
మహతాం నావగాహన్తే భువనాని చతుర్దశ. 2

ఔదార్య, మహత్వముల కవధిభూతమున్ను, గాంభీర్యముచే నతిసుందరమున్ను నగు మహాత్ముల బుద్ధిని బదునాల్గు లోకములందలి ప్రాణికోట్లుకూడ నెఱుఁగఁజాలవు. మఱియు నవి తమ సంపదలచే నాశనిని ప్రలోభన మొనర్ప సమర్థములున్నగావు.



చిత్తభ్రాన్తిర్జగదితి ప్రరూఢే ప్రత్యయే సతామ్
బాహ్యాశ్చాన్తశ్చరన్నక్రగ్రహో మోహశ్చ శామ్యతి. 3

ఈ జగత్తు చిత్తము యొక్క భ్రాంతి మాత్రమే యను విశ్వాసము సజ్జనులకు దృఢపడ, బాహ్యమున శబ్దాదివిషయములందును, అభ్యంతరమున సంకల్పాదుల రూపమునను చరించు మనస్సహితమైన ఇంద్రియాది సమూహమను మకరతుల్యమగు గ్రహమున్ను, తన్మూలమగు అజ్ఞానమున్ను శమించి పోవుచున్నవి.

ద్వీన్దువత్తాపజలవత్కేశోణ్డ్రికవదమ్బరే
విస్ఫురన్త్యాం జగద్భ్రాన్తౌ వాసనాప్రత్యయః కుతః. 4

చంద్ర ద్వయమువలెను, మృగతృష్ణా జలమువలెను, ఆకాశమందలి కేశ నీలత్వములవలెను, జగద్భ్రాంతి (మిథ్యగా) స్ఫురింప వివేకికిఁక వాసనావృత్తి యెటునుండి కలుగును.

వాసనాప్రత్యయే శూన్యే శూన్యం వ్యోమైవ శిష్యతే
సాప్యవస్థా మనోఽసత్వే కుతస్త్యాజ్యా వివేకినా. 5

వాసనా వృత్తినశింప (దృశ్య) శూన్యమగు చిదాకాశమే శేషించుచున్నది. మఱియు నట్టి వాసనాశూన్యావస్థ మనస్సుయొక్క అభావమందే (అమనస్కస్థితియందే) సిద్ధించుచున్నది. అట్టిచో వివేకి యెట్టిస్థితి నేల త్యజింపవలయును.

త్రయమేతత్తు యావత్స్యాత్త్రయేణానేన వర్జితా
పశ్యన్తీ వాప్యపశ్యన్తీ సావస్థా పరమోచ్యతే. 6

జాగ్రత్స్వప్న సుషుప్తులను ఈ మూడవస్థలే సర్వులకును, ప్రసిద్ధమైయున్నవి. ఈమూఁటిచే వర్జింపఁబడినట్టి యే (వివేకియొక్క) 'తురీయ' అవస్థగలదో, అది దర్శనాదివ్యవహారమునకు మూలమగు అజ్ఞానము యొక్క నాశముచే వాస్తవముగ జగత్తును జూడక యున్నను, జీవనమాత్ర హేతువగు ప్రారబ్ధశేషమువలనఁ జూచుచున్నట్లు, అన్యులదృష్టికిఁ దోచును. వివేకిదృష్టియందు మాత్రమది పరమావస్థయే యగును.

విచిత్రరత్నరశ్మ్యోఘ ఇవ నానాత్మకం జగత్
ఆభాసమాత్రం నత్వాత్మా న ఘనం న చ పార్థివమ్. 7

వ్యుత్థానకాలమందును వివేకుల దృష్టియం దీ వివిధరూపమగు జగత్తు, ఘనముగగాని, పృథివ్యాదుల వికారరూపముగగాని భాసింపదు. విచిత్ర రత్నప్రభాపుంజమువలె ఆభాసమాత్రముగనే తోచును.

రూపాలోకనమాత్రం హి శూన్యమేవ జగత్స్థితమ్
ఖే విచిత్రమణివ్యూహాకరజాలమివోత్థితమ్. 8

మఱియు నట్టి జ్ఞానుల దృష్టియం దీజగత్తు రూపముయొక్క దర్శనమాత్రమేయగుచు, ఆకాశమందుఁ బ్రకటమగు విచిత్రమణిసమూహమువలె శూన్యమే యగుచున్నది.

నేహ సత్యాని భూతాని న జగత్తా న శూన్యతా
ఇదం బ్రహ్మాఖ్యరత్నైకప్రభాజాలం విజృమ్భితమ్. 9

వాస్తవముగ నిట నీభూతజాలము సత్యముగాదు. అట్లే జగత్తుగాని, శూన్యత్వముగాని యథార్థముగ లేనివేయగును. ఇది యంతయు సర్వశక్తిమంతుఁడగు బ్రహ్మమను రత్నముయొక్క ప్రభా సమూహముయొక్క విలాసమాత్రమే యగును.

సృష్ట్యోఽసృష్ట్యో బ్రాహ్మో నానాతా చ న నాశతా
అమూర్తా ఏవ భాసన్తే కల్పనార్కగణా ఘనాః. 10

అనేకత్వముయొక్క అభావముచే సృష్టియున్న లేదు. అట్లే నాశత్వముయొక్క అభావ ముచే ప్రళయమున్న లేదు. కల్పనయను సూర్యుని అమూర్తములగు కిరణసమూహములు మాత్రమే యిట భాసించుచున్నవి.

ఏవం తావద్ఘనీభూతః పిణ్డగ్రాహో న విద్యతే
సంకల్పితే చ వ్యోమ్నీవ శూన్యత్వైవావగమ్యతే. 11

ఈ ప్రకారముగ కల్పనయే మూర్తివంతమై జగద్రూపముగ భాసించుచున్నది. అంతేగాని యథార్థముగ నిటఁ మూర్తిత్వ మేమియును లేదు. ఏలయనిన, సంకల్ప సిద్ధములగు మనోరాజ్యాదులందు ఆకాశమునందువలె శూన్యత్వమే విదితమగుచున్నది.

తస్యామవస్తుభూతాయాం కథం భావనిబన్ధనమ్
భవిష్యదాకాశతరౌ విశ్రాన్తః కో విహంగమః. 12

ఇట్టి శూన్యత్వరూపమగు జగత్స్థితియందు వివేకులకు రాగద్వేషాది భావములెట్లు కలుగును? భవిష్యకాలపు ఆకాశవృక్షమున నే పక్షి విశ్రమించినది!

పిణ్డత్వం నాస్తి భూతానాం శూన్యతా చ న విద్యతే
చిత్తమప్యత ఏవాస్తం శేషం సత్త్వన్న చాస్థితి. 13

కావున, సమస్త జగత్తునకు, ప్రాణులకు వాస్తవముగ మూర్తిత్వము లేదు. శూన్యత్వమున్న లేనిదైయున్నది. అందుచే చిత్తమున్న అస్తమించినరూపము గలదే యగుచున్నది. ఇఁక శేషించినది సన్మాత్రమగు ఆత్మయే; అట్టిది అభావరూపమెన్నటికిఁ గానేరదు.

అనానా సమమేవాస్తే నానారూపో విబోధవాన్
అన్తరాలీననానార్థో యథా కనకపిణ్డకః. 14

కాఁబట్టి తత్త్వవేత్తకీవివిధరూపమగు జగత్తు వివిధరూపరహితమై, ఏకమైన ఆత్మగనే భాసిల్లును. ఏకమగు సువర్ణపిండమున సమస్త ఆభరణములు అంతర్గతములైయుండునట్లు, నానావిధ పదార్థములన్నియు ఏకమగు ఆత్మయందే అంతర్గతములైయున్నవి.

యథాస్థితస్య సాహన్త్వం విశ్వం చిత్తం విలీయతే
జ్ఞస్యావాచ్యమచిత్త్వం సత్స్వరూపమవశిష్యతే. 15



యథాభూతమగు చిత్స్వభావమున స్థితిగల్గియున్న జ్ఞానియొక్క దృష్టియందు, అహంభావ సహితమగు జగత్తున్న, చిత్తమున్న లయించిపోవుచున్నవి. అపుడు శేషించునట్టి చిదేకరసమునకు అచిత్స్వభావము వచించుట శక్యముకాదు. ఇవ్విధమున చిదేకరసమగు సన్మాత్రమే శేషించుచున్నదని సిద్ధించుచున్నది.

క్లిశ్యతే కేవలం బుద్ధిరుత్తరాధరదర్శనైః
స్తోకయాభ్యస్తయా యుక్త్యా సతోఽర్థో హ్యవగమ్యతే. 16

ఉన్నత, అవనత విషయములనై పునఃపునః బరుగిడుటచే బుద్ధి కేవలము క్లేశమొందుచున్నది. ఇక్కారణమున సద్రూపమగు ఆత్మ భాసించుటలేదు. కాఁబట్టి యొకింత యుక్తి నభ్యసించుటచే సత్య పదార్థము విదితమగుచున్నది.

విరాడోజోవిరహితం కార్యకారణతాదిభిః
భూతభవ్యభవిష్యస్య జగదజ్ఞస్య సంభవమ్. 17
యేన బోధాత్మనా బుద్ధం స జ్ఞ ఇత్యభిధీయతే
అద్వైతస్యోపశాన్తస్య తస్య విశ్వం న విద్యతే. 18

ఎవఁడు భూత భవిష్యద్వర్తమాన సర్వపదార్థరూపమగు జగత్తుయొక్క జన్యతను కార్యకారణత్వాదులచే విమర్శించి ('వాచారంభణ, శ్రుత్యుక్తన్యాయముచే') అట్టి జగత్తును స్థూల, సూక్ష్మ ప్రపంచరహితముగను, శేషించు సన్మాత్రమైన అఖండ బోధరూపముగను తెలుఁసునో, అతఁడే జ్ఞాని యనఁబడును. ఇవ్విధమున అద్వైత బ్రహ్మమున శాంతినొందునట్టి గుణజ్ఞుని దృష్టియం దీప్రపంచము లేనిదేయగును.

ప్రాగుక్తాః సర్వ ఏవైతే ఉపదేశా విశేషణాః
జ్ఞస్యానుభవమాయాన్తి స్వతః సాధుకథా ఇవ 19

సజ్జనునకు ఉత్తమకథ అనుభవమునకు వచ్చునట్లు, పై వచించిన యుపదేశము లన్నియు జ్ఞానికి అనుభవమునకు వచ్చును.

పిణ్డత్వం నాస్తి భూతానాం శూన్యత్వం చాప్యసంభవాత్
అతఏవ మనో నాస్తి శేషం సత్తత్త్వ స్థితిః. 20

ఓ రామచంద్రా! యథార్థముగ ప్రాణులయొక్క మూర్తిత్వమున్న లేదు. అసంభవమగునట్టి శూన్యత్వమున్న లేదు, కావున మనస్సున్న లేదు; ఇఁక శేషించిన సన్మాత్రమేదిగలదో, అదియే నీ యొక్క వాస్తవస్థితియైయున్నది.

చేతోఽన్తర్ముఖత్వమేవాన్తశ్చేతనస్యాస్య చేతనమ్
ఉదితం తదనర్థాయ శ్రేయసేఽనుదితం భవేత్. 21

ఈ సాక్షిచైతన్యమగు ప్రత్యగాత్మ యొక్క విషయోన్ముఖమగుటయే సంసార జ్ఞానమై యున్నది. అట్టి సంసారజ్ఞాన ముదయించుట అనర్థముకొఱకే యగును. ఉదయింపకుండుట శ్రేయము కొఱకగుచున్నది.

ఉదితం బాహ్యతామేతి తత్ర గచ్ఛతి పిణ్డతామ్
స్వయం సంవేదనాదేవ జాడ్యాదమ్బ్విన శైలతామ్. 22

అవ్విధమున నుదయించు సంసారజ్ఞానము, శీతలత్వముచే జలము ఘనీభవించి శిలారూపము నొందునట్లు, బాహ్యత్వమును జెంది యట మూర్తిత్వమును బడయుచున్నది.

స్వప్నాద్యర్థవదాదత్తే బోధోఽబోధేన పిణ్డతామ్
తద్గ్రాహకతయా చిత్తం భూత్వా బధ్నాతి దేహకమ్. 23

చిద్రూపమగు ఆత్మయే తన స్వరూపమును గూర్చిన అజ్ఞానముచే స్వప్నమందలి పదార్థములవలె మూర్తిత్వమున్ను గ్రహించుచున్నది. అట్లు గ్రహించుటద్వారా చిత్తమయి, క్రమముగ దేహమును ధరించుచున్నది.

ఏతావతీష్వవస్థాసు బోధస్యోదేతి నాన్యతా
శబ్దకల్పనయా భేదః కేవలం పరికల్పితః. 24

ఈ ప్రకారమగు సర్వావస్థలందును, చైతన్యము తన స్వరూపముకంటె అన్యమైన రూపము నొకింతైనను బొందుటలేదు. కేవలము శబ్దమాత్రముయొక్క కల్పనచే ఈ భేదము కల్పింపఁబడినదగును.

బహిరన్తశ్చ బోధస్య భాత్యాత్మైవార్థదృష్టిభిః
అన్తస్త్వేన బహిష్ట్వేన నైవాస్య మనసో యథా. 25

స్వప్నదర్శనమున మనస్సే బాహ్యాభ్యంతర విషయ రూపమున వికృతి నొందు విధమునను, ఆత్మయం దేవికారమున్ను లేనట్లును (జాగ్రత్తునందును) బాహ్యాభ్యంతర పదార్థరూపముచే భాసించుచున్నప్పటికి బోధరూపమగు ఆత్మయం దేవికారమున్ను గలుగదు.

బోధస్యాకాశకల్పత్వాత్కాలాకాశాది తద్వపుః
పదార్థాశ్చైవ స్వాత్మానః స్వప్నవన్నార్థరూపి ఖమ్. 26

చిదాత్మ ఆకాశమువంటి రూపముగలదగుటచే, కాల, ఆకాశములవలె నయ్యది సదా అవికృతరూపముగనే యుండుచున్నది. స్వప్నపదార్థములవలె సమస్తపదార్థములున్ను, చిదాకాశరూపమే యైయున్నవి. కాని, చిదాకాశము పదార్థరూపముగ బరిణామము నొందినదికాదు.

బాహ్యార్థతా నాన్తరత్వం తద్వద్బోధవశాద్వ్రజేత్
నాసాదృశ్యం హి బోధత్వం గన్తుం శక్తం జడం క్వచిత్. 27

అట్లు చైతన్యము పదార్థము నొందకున్న పదార్థము చైతన్యరూపము నొందఁగూడదాయనిన అట్లుకానేరదు. బాహ్యజడపదార్థము తత్త్వబోధ వశముచేతనుగూడ అభ్యంతర చిదాకారరూపమును బొందనేరదు. ఏలయనిన అత్యంత అసదృశమగుటచే జడపదార్థ మెన్నటికిని బోధరూపత్వ మొంద శక్యముకాదు.

బోధో దృశ్యదశాం నైతి ప్రాప్తో వాపి చ తాం స్థితమ్
స యథాస్థితమేవాస్తే మనాగప్యేతి నాన్యతామ్. 28



చిదాత్మ వివర్తభావముచే దృశ్యజడస్థితిని బొందినప్పటికిని, పరమార్థమున జడభావమెన్నటికిని బొందనేరదు. అది సర్వావస్థలందును దన స్వరూపముననే యెప్పటియట్లు స్థితినొంది యున్నదేగాని లేశమైనను అన్యరూపత్వమును భొందుటలేదు.

అత్యర్థం శుద్ధబోధైకపరిణామే కృతోదయే
బోధాబోధార్థశబ్దానాం శ్రుతిరప్యస్తమేష్యతి. 29

సప్తమ భూమికావిశ్రాంతి పర్యంతమగు పరిణామమునుబొందిన, అత్యంతశుద్ధ బోధైకరూపమగు ఆత్మ యుదయింప బోధ, అబోధ ఇత్యాది శబ్దములయొక్క శ్రుతి (వినికి) యున్ను అస్తమించిపోవును.

ఆతివాహికదేహానాం చిత్తానామేవ జాయతే
ఆధిభౌతికతాబోధో దృఢభావనయా స్వయా. 30

తమ తమ చిత్తముల యొక్క దృఢభావన చేతనే సూక్ష్మ శరీరములకు స్థూలమైనట్టి ఆధిభౌతికరూపము జనించుచున్నది.

ఆకాశవిశదైశ్చిత్తైర్భావితైః స్వాతివాహికైః
ఆధిభౌతికతా మిథ్యానటైరివ పిశాచతా. 31

నటుఁడు పిశాచరూపమును ధరించునట్లు, ఆకాశమువలె నిర్మలమైనట్టి సూక్ష్మ చిత్తములే మిథ్యయైనట్టి ఆధిభౌతికరూపమును ధరించుచున్నవి.

భ్రాన్తిరభ్రమణాభ్యాసాత్పరిజ్ఞాతైషోపశామ్యతి
నోన్మత్తోఽస్మీతి సంబోధాచ్ఛామ్యత్యున్మత్తతా కిల. 32

'నే నున్మత్తుఁడను గాసను' ఈ జ్ఞానముచే ఉన్మత్తత శమించునట్లు, భ్రమరహితమగు సత్యవస్తువును గూర్చిన యభ్యాసముచే ఈదేహ, జగదాదిరూపమగు భ్రాంతియు శమించును.

భ్రాన్తేః స్వయం పరిజ్ఞానాద్వాసనా వినివర్తతే
స్వప్నే స్వప్నతయా బుద్ధే కస్య స్యాత్కిలభావనా. 33

భ్రాంతిని గూర్చిన జ్ఞానము స్వయముగ గలుగుటచే వాసన (జగత్తు సత్యమను భావన) నివర్తించుచున్నది, ఏలయనిన, స్వప్నము స్వప్నరూపమున నెఱుఁగఁబడ నిఁక నద్దానియందెవనికి సత్యత్వభావన యుండును?

వాసనాతానవేనైవ సంసార ఉపశామ్యతి
వాసనైవ మహాయక్షీ న్యేతచ్ఛేదపరా బుధాః. 34

వాసన శమించుటచేతనే యీ సంసారము శమించుచున్నది. వాసనయే మహా పిశాచి. కావుననే వివేకులద్దానిని ఛేదించుట యందుఁదత్పరులై యుందురు.

అజ్ఞానోన్మత్తతా పుంసాం యథాభ్యాసేన భావితా
తథైవ బోధాత్స్వభ్యాసాత్సా కాలేనోపశామ్యతి. 35

అజ్ఞానముయొక్క అభ్యాసముచే మనుజులకెట్లు తదజ్ఞానరూపమగు ఉన్మత్తత జనించుచున్నదో, అట్లే జ్ఞానాభ్యాసముచే కాలక్రమమున ఆయున్మత్తతయు శమించిపోవుచున్నది.

ఆతివాహికదేహోఽయమాధిభౌతికతాం యథా
నీయతే భావనాం తజ్జైర్బోధసత్త్వప్రసాదతః. 36

భావనచే సూక్ష్మశరీరము స్థూలరూపమును బొందునట్లు, వివేకులుజ్ఞానాభ్యాస ప్రతాపముచే సూక్ష్మశరీర భావనను బ్రహ్మమాత్రత్వమును బొందింపఁజేయుచున్నారు.

ఆతివాహికదేహోఽపి నీత్వా జీవపదం తథా
దృఢేన బోధాభ్యాసేన నేతవ్యో బ్రహ్మతామపి. 37

ప్రథమమున సూక్ష్మశరీరమును జీవపదమును బొందించి, పిమ్మట దృఢమైన జ్ఞానాభ్యాసముచే ఆ జీవపదమును బ్రహ్మత్వమును బొందింపఁజేయవలెను.

స్వవస్తువచ్చేదుత్పత్తిర్బుధ్యతే బోధరూపిణీ
తదాతివాహికీబుద్ధిః కథమిత్యపి బుధ్యతే. 38

తనయందుత్పన్నమైన వస్తువు తనరూపమే యగునట్లు, సమస్తపదార్థములయొక్కయు, నుత్పత్తి (ప్రథమ వికారము) కూటస్థబోధమాత్రముననే యగుటచే నవి తద్బోధరూపములే (బోధవివర్తములే) యను భావమెపుడు గల్గునో, అపుడు 'ఇఁక సూక్ష్మశరీరమేమి?' (మిథ్య) యను నిశ్చయము కలుగును.

నోచేత్తత్త్వమితివాక్యార్థాత్తద్గ్రన్థిర్నివర్తతే
భూతోత్సాదనసూత్రస్య ప్రతిపత్త్యపదం యథా. 39

అట్లుగానిచో (ఈప్రకారముగ, తత్త్వం పదార్థశోధనచే మహావాక్యార్థబోధద్వారా ఆత్మ నెఱుఁగనిచో) భూతములను దొలగించుటకుగాను నుచ్చరింపఁబడు 'హుం' 'ఫట్' మున్నగు అనర్థక పదములచే వలె, శ్రవణ మాత్రబలముచే సంసార గ్రంథి నివర్తించుననుట కల్పనామాత్రమే యగును.

జగద్బోధైకతాం బుద్ధ్వా బోద్ధవ్యా తావదగ్రణమ్
అత్యన్తపరిణామేన యావత్సాపి న బుధ్యతే. 40

ప్రథమమున, జగత్తుయొక్కయు, తత్కారణమగు ఈశ్వరుని (వాచారంభణ న్యాయముచే) యేకత్వము (తత్పదార్థశోధనము) నెఱిఁగి పిమ్మట 'త్వం' పదార్థశోధనము ద్వారా ప్రత్యగాత్మను 'అసంగ' అద్వయాది రూపములతోటి యెఱుఁగవలెను. ఇవ్విధమున నెంతవఱకు అత్యంత పరిణామముచే క్రమముగ ఆ తత్త్వంపదార్థముల ఐక్యరూపమగు అఖండాకారవృత్తియు ఆత్మయందు లయించినదై, అద్వయాత్మకంబై సత్యముగ నెఱుఁగఁబడకుండునో, అనఁగా నెంతవఱకఖండబోధ జనింపదో, అంతవఱకును శ్రుత్యనుసారము తత్పదార్థద్వయ శోధనముద్వారా దృఢజ్ఞానమును సంపాదించుచుండవలెను.



సబాహ్యాభ్యన్తరే చిత్తే శాన్తే భాతి స్వభావతా
శీతలాం వ్యోమనిర్భాసాం తామేవాశ్రిత్య శామ్యతామ్. 41

బాహ్యాభ్యంతరములందును చిత్తము పూర్ణముగ శమింప జీవునకు తన సాక్షిరూపమగు చిత్స్వభావము ప్రకాశించును. ఆకాశమువలె నిర్మలమై, శీతలమైనట్టి యా తన చిత్స్వభావమునే యాశ్రయించి మనుజుఁడు శాంతముగ నుండవలయును.

జ్ఞానవాన్జ్ఞానయజ్ఞస్థో ధ్యానరూపం విరోపయన్
జగద్విజిత్య జయతి సర్వత్యాగైకదక్షిణః. 42

జ్ఞానియగువాఁడు జ్ఞానమను యజ్ఞమున నెలకొనియున్నవాఁడై, ధ్యానమను దృఢమై ఉన్నతమైనట్టి యజ్ఞస్తంభమును నాటి, సర్వత్యాగమను ముఖ్యదక్షిణ నొసంగి విశ్వమును జయించి సర్వోత్కృష్టుఁడై వెలయును.

పతత్యఙ్గారవర్షే చ వాతి వా ప్రలయానిలే
భూతలే వ్రజతి వ్యోమ్ని సమమాస్తే జ్ఞ ఆత్మని. 43

అగ్నివృష్టి కురిసినను, ప్రళయవాయువు వీచినను, భూతలమెగిరి యాకాశమునకుఁ జనినను జ్ఞాని తన ఆత్మయందేక రూపముననే యుండును.

వైతృష్ణ్యశాన్తమనసో నిరోధమలమీయుషః
స్థితిర్వజ్రసమాధానం వినా నాన్యోపపద్యతే. 44

తృష్ణా రాహిత్యముచే శాంతినొందిన మనస్సుగలవాఁడును, పూర్ణముగ (ఇంద్రియ మనో) నిరోధదశను బొందినవాఁడును నగు మనుజునకుఁదప్ప మఱియెవనికిని సమాధియందు వజ్రతుల్యమగు దృఢస్థితి కలుగనేరదు.

యథా బాహ్యార్థవైతృష్ణ్యే నోపశామ్యత్యలం మనః
న తథా శాస్త్రసందర్భైర్నోపదేశతపోదమైః. 45

బాహ్యపదార్థములందలి తృష్ణారాహిత్యముచే మనస్సెట్లు పూర్ణముగ శమించునో, అట్లు శాస్త్రక్రమములచేగాని, ఉపదేశములచేగాని, తపములచేగాని, దమములచేగాని, శమించనేరదు.

మనస్తృణస్య సర్వార్థవైతృష్ణ్యాగ్నిర్విబోధితః
సర్వత్యాగానిలైః సంపదత్యాపదితి భావనాత్. 46
బహిరన్తశ్చ మోహాశ్చ పిణ్డగ్రాహోఽర్థవేదనమ్
జ్ఞప్తిరేవేతి కచతి జ్ఞాత్వా మణిరివాత్మని. 47

'సంపత్తి మహా ఆపత్తి', అనుభావనచే మనస్సను తృణసమూహమధ్యమున సర్వత్యాగమను వాయువుచే, ప్రబోధితమైనట్టి, సమస్తపదార్థములందలి తృష్ణారాహిత్యమను అగ్ని, నెఱిఁగి చరమ సాక్షాత్కార జ్వాలారూపముచేనద్దాని ప్రదీప్తమొనర్చ బాహ్యాభ్యంతరములందలి అజ్ఞానాంధకారము తత్ప్రయుక్తమగు చోరపిశాచాది సదృశమగు బ్రహ్మాండముయొక్క మూర్త (సాకార) జ్ఞానము,

నేత్రాదీంద్రియములయొక్క రూపరసాది పదార్థముల యనుభవము ఈ సమస్తరూపమున, - మణి తనయందుఁ బ్రతిబింబించిన పదార్థముతోఁగూడ ప్రకాశించునటు, - చిదాత్మయే తన అద్వయ, అఖండస్వభావముతోటి ప్రకాశించుచున్నట్లు విదితమగును.

నరనాగాసురాగారగిరిగహ్వరదృష్టిభిః
చితిరేవేతి విసృతా ధూమోఽమ్బుదతయేవ ఖే. 48

ఆకాశమున ధూమము మేఘరూపత్వమును బొందునట్లుఁ మనుష్య, నాగ, అసురాదులు, వారిస్థానములు, పర్వత, గుహాదులు మున్నగువాని యన్నింటిరూపమున చైతన్యమే వివిధ వైచిత్ర్యమును బొందుచున్నది.

వేపన్తే చిద్ద్రవత్వేన బ్రహ్మాణ్డజడభాణ్డగాః
స్వవివర్తతరఙ్గిణ్యో జీవశక్త్యా పతద్రసాః. 49

చైతన్యము ద్రవత్వముయొక్క కారణముచేతనే, బ్రహ్మాండమను జడమైన పాత్రయందు పుట్టినవియు ప్రాణశక్తిచే సరసములును, ఆత్మయొక్క వివర్తరూపములునగు ప్రాణికోట్ల శరీరములను నదులు చలించుచున్నవి.

జీవకాజీర్ణశఫరీ వ్యోమవారివిహారిణీ
మోహజాలేన వలితా న స్మరత్యాత్మని స్థితిమ్. 50

చిదాకాశమను జలమందు విహరించునట్టి జీవుఁడను శైథిల్యమునొందిన మత్స్యము మోహజాలమున బంధింపఁబడినదై తన ఆత్మస్థితిని స్మరింపకున్నది.

ఘనీభూతా ఘనత్వేన చిద్ఘనా గగనాఙ్గణే
నానాపదార్థరూపేణ స్ఫురతి స్వాత్మనాత్మని. 51

ఈ చైతన్యమే నిజస్వరూపమను ఆకాశప్రాంగణమున మేఘమువలె ఘనీభూతమై తద్ఘనత్వ కారణమున స్వర్గ భూమ్యాద్యనేక మూర్తివంతములగు పదార్థముల రూపముతోటి స్ఫురించుచున్నది.

సర్వ ఏవ సమా జీవా వాసనామన్తరేణచ
శుష్కపర్ణవదుడ్డీనా జడాః శ్వసనవేణవః. 52

వాసనలయొక్క న్యూనాధిక్యతలందుఁదప్ప తక్కిన అన్నియంశములందును జీవులందఱును సమానులే. ఆ వాసనలవలననే వారు శుష్కపత్రమువలె నెగిరి స్వర్గ, నరకాదులందుఁ బడుచున్నారు. మఱియు ప్రాణవాయువుసహాయముచే జడములగు వెదుళ్లవలె శబ్దమొనర్చుచున్నారు.

ఆహృత్య పౌరుషబలాన్యవజిత్య తన్ద్రీ
ముత్థాయ తర్జితసమర్జితవాసనౌఘమ్
సంసారపాశఘనపఞ్జరమఞ్జసైవ
భఙ్క్త్వాభ్యుదేయమభితో జ్ఞ సమేన భావ్యమ్. 53

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే సర్వోపశాన్తిర్నామైకోనపఞ్చాశః సర్గః ॥ 49 ॥



ఓ రామచంద్రా! మొట్టమొదట పురుష ప్రయత్నముచే సాధన చతుష్టయ సంపత్తిని సముపార్జించి, తదుపరి ధ్యానవిఘ్నభూతమగు తంద్రతను ప్రాణాయామాదుల యభ్యాసముచే జయించి సంప్రజ్ఞాతసమాధిచే బహిర్దృష్టినుండి లేచి, నిర్వికల్పసమాధియందుఁ బ్రవేశించుటద్వారా పూర్వసంచిత వాసనాసమూహమును బారద్రోలి, సంసారపాశమను ఘనమైన పంజరము (బంధనము) ను శీఘ్రముగ విరుగఁగొట్టి, అంతటను బూర్ణానందైకరసమగు బ్రహ్మ రూపముతో నీవు ఉదయించ వలయునేగాని, అజ్ఞానివలె నెన్నటికిని నుండఁదగదు.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్థమున సర్వోపశాంతియను నలుబది తొమ్మిదవ సర్గము ॥ 49 ॥

---

## పఞ్చాశః సర్గః

[వాసనాదార్ఢ్యశైథిల్య భేదవైచిత్ర్య కల్పితమ్
ఇహ బోధాయ జీవానాం సాప్తవిధ్యం ప్రపఞ్చ్యతే॥

వాసనలయొక్క దృఢత్వ, శిథిలత్వములఁగూర్చిన భేదవైచిత్ర్యముచేఁ గల్పితములగు జీవుల సప్తవిధ భేదము లిచట బోధకొఱకై వచింపఁబడుచున్నవి.]

**శ్రీవసిష్ఠ ఉవాచ:—**

ఇమే యే జీవసంఘాతా దృశ్యన్తే దశ దిగ్గతాః
నరనాగసురాగేన్ద్రగన్ధర్వాద్యభిధానకాః. 1
తే స్వప్న జాగరాః కేచిత్కేచిత్సంకల్పజాగరాః
కేచిత్కేవలజాగ్రస్థాశ్చిరాజ్జాగ్రత్స్థితాః పరే. 2
ఘనజాగ్రత్స్థితాశ్చాన్యే జాగ్రత్స్వప్నాస్తథేతరే
క్షీణజాగరకాః కేచిజ్జీవాః సప్తవిధాః స్మృతాః. 3

శ్రీ వసిష్ఠుడు:— ఓ రామచంద్రా! ఈ దశదిక్కులందును మనుజ, నాగ, దేవ, గంధర్వాది నామములుగల యే జీవసమూహములు కాన్పించుచున్నవో, అందుఁ గొన్ని స్వప్నజాగ్రద వస్థయందును కొన్ని సంకల్ప జాగత్తునందును మఱికొన్ని కేవల జాగ్రత్తునందును ఇఁకకొన్ని చిరజాగ్రత్తు నందును, కొన్ని ఘన జాగ్రత్తునందును, కొన్ని జాగ్రత్స్వప్నమందును, కొన్ని క్షీణ జాగ్రత్తునందును, వర్తించుచున్నవి. ఇవ్విధమున జీవు లేడు తెఱఁగులుగ వచింపఁబడియున్నారు.

**శ్రీరామ ఉవాచ:—**

ఏతేషాం భగవన్భేదో బోధాయ మమ కథ్యతామ్
జీవానాం సప్తరూపాణాం జలానామర్ణవేష్వివ. 4

శ్రీరాముఁడు :— మహాత్మా! సముద్రములం దనేకవిధములగు జలములవలెనున్నట్టి యీ సప్తవిధములగు జీవులయొక్క భేదమునుగూర్చి నాకు బోధకొఱకై వచింపవేడెద.

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

కస్మింశ్చిత్ప్రాక్తనే కల్పే కస్మింశ్చిజ్జగతి క్వచిత్
కేచిత్సుప్తాః స్థితా దేహైర్జీవా జీవితధర్మిణః. 5
యే స్వప్నమభిపశ్యన్తి తేషాం స్వప్నమిదం జగత్
విద్ధి తే హి ఖలూచ్యన్తే జీవకాః స్వప్నజాగరాః. 6

శ్రీవసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! ఒకానొక పూర్వ కల్పమున నొకానొక జగత్తునం దొకానొకచోట దేహమునుధరించి జీవించుచున్నవారై యే కొందఱు జీవులు నిద్రించుచుస్వప్నమును గాంచుచున్నారో, వారియొక్క స్వప్నరూపమే యీ జగత్తు అయియున్నది. మఱియు, ఆ జీవులు స్వప్నజాగరులు (స్వప్నజాగ్రత్తు నందున్నవారు) అని చెప్పఁబడుదురు.*

క్వచిదేవ ప్రసుప్తానాం యః స్వప్నః స్వయముత్థితః
విషయః సోఽయమస్మాకం తేషాం స్వప్ననరావయమ్. 7
తేషాం చిరతయా స్వప్నః స జాగ్రత్త్వముపాగతః
స్వప్నజాగరకాస్తే తు జీవాస్తే తద్గతాః స్థితాః 8

ఒకానొక జగత్తునందు నిద్రించుచున్న జీవులకు స్వయముగ నావిర్భవించిన స్వప్న ప్రపంచము సమానకర్మ, వాసనాదుల వశమున మనకు విషయమగుచో నపుడు మనమందఱమును వారిస్వప్నమందలి మనుజులగుదుము. చిరకాలత్వమువలన వారియొక్క స్వప్నము జాగ్రద్రూపమును బొందినది. కావున నట్టి అవస్థయందున్న జీవులు స్వప్నజాగరులని వచింపఁబడిరి. †

సర్వజ్ఞత్వాత్సర్వగస్య సర్వం సర్వత్ర విద్యతే
యేన స్వప్నవతాం తేషాం వయం స్వప్ననరాః స్థితాః. 9

ఈశ్వరుఁడు సర్వజ్ఞుఁడును, సర్వశక్తిమంతుఁడును, సర్వవ్యాపియు, సర్వసత్తాప్రదుఁడు నగుటచే సర్వత్ర సర్వమున్ను సంభవించుచున్నది. ఇక్కారణమున, ఆ స్వప్నయుతులగు జనులకు మనమందఱము స్వప్న మనుజులమై యున్నాము.

శ్రీరామ ఉవాచ:—

యేషు కల్పేషు తే జాతాః క్షీయన్తే కల్పకల్పనాః
యది తాస్తత్కథం తేషాం ప్రబుద్ధానామవస్థితిః. 10

శ్రీరాముఁడు:– ఓ మునీంద్రా! పూర్వపు యే కల్పములందా స్వప్నమునుగాంచు జీవులు జనించిరో, వారి యా కల్పములందలి సమస్త పదార్థములును, దేహములును నేఁటికి క్షయించిపోయి నవిగదా. అట్లైనచో, ఆ స్వప్నమునుండి మేల్కాంచిన యాజీవులకు మరల, గడచిన యాకల్పమందు స్థితియెట్లు సంభవించును?

*జీవటోపాఖ్యానమున తెలుపఁబడిన న్యాయము ననుసరించి యిట్లు వచింపఁబడెను.

†ఇవ్విషయము లోలోపాఖ్యానమున ప్రతిపాదింపఁబడినది,



శ్రీవసిష్ఠ ఉవాచ:—

ఇహ స్వప్నభ్రమాన్తే తే ముచ్యన్తే వా వినిద్రతామ్
ప్రాప్య సంకల్పతో దేహాంస్తథైవాన్యాన్ప్రయన్త్యలమ్ 11

శ్రీవసిష్ఠుఁడు,– ఓ రామచంద్రా! ఆ జీవులు మనప్రపంచ రూపమగు వారి స్వప్నమున దైవయోగముచే, తత్త్వజ్ఞానమును బొందినచో, తద్భ్రమ రూపమగు సంసారమునుండి విముక్తులే యగుదురు. అట్లు పొందక, నిద్రనుండి లేచినచో మరల తమ సంకల్పానుసారము అన్యదేహములను (దృష్టిసృష్టివాదమునననుసరించి) ఆశ్రయించి వ్యవహరించు చుందురు. (ఏలయనిన, వారి కల్పమింకను బూర్తి కానిదేయగును.) *

తథైవాన్యం ప్రపశ్యన్తి జగత్కల్పం చ కల్పితమ్
కల్పనాభాసనభసో నహి సంకటతా భవేత్. 12

మరల యట్లే పూర్వమువలె, అన్యమగు కల్పితమైన జగత్తును, కల్పమును వారు గాంచుచుందురు. ఏలయనిన, కల్పన యొక్క ప్రకాశమానమగు ఆకాశమున, అవకాశము లేకయుండుట లేనేలేదు

సంకల్పనాత్మకజగజ్జీర్ణోదుమ్బరకీటకాః
స్వప్నజాగరకాః ప్రోక్తాః శృణు సంకల్పజాగరాన్. 13

ఓ రామచంద్రా! స్వప్నజాగరులు, సంకల్పాత్మకమైనట్టి జగంబను శిథిలమైన ఉదుంబర (మేడి) ఫలమందలి కీటములనియే చెప్పఁబడెను. ఇఁక సంకల్పజాగరులను గూర్చి వినుము.

కస్మింశ్చిత్ప్రాక్తనే కల్పే కస్మింశ్చిజ్జగతి క్వచిత్
అనిద్రాలవ ఏవాన్తః సంకల్పైకపరాః స్థితాః. 14
ధ్యానాద్విలుఠితా వాథ మనోరాజ్యవశానుగాః
సంకల్పదార్ఢ్యమాపన్నా గలితాగ్రానుభూతయః. 15

ఒకానొక పూర్వ కల్పమున నొకానొక జగత్తునం దొకానొకచోటఁ (ఐందవులవలె) నిద్రను వీడినవారై, అంతరంగమున సదా సంకల్పమునే తత్పరులై యా సంకల్పజాగరులుందురు. లేక ధ్యానమునుండి చలింపఁ బడినవారై, (జీవటోపాఖ్యానమందలి భిక్షువువలె) మనోరాజ్యవశమున నున్నవారై, సంకల్పముయొక్క దృఢత్వముచేఁ దమ పూర్వావస్థయొక్క యనుసంధానము లేనివారై యుందురు.

సంకల్ప ఏవ జాగ్రత్త్వం యేషాం చిరతయాంశతః
తత్రాస్తమితచేష్టానాం తే హి సంకల్పజాగరాః. 16

ఏ జీవులయొక్క సంకల్పము చిరకాలము స్థిరముగ నుండుటచే ఘనీభూతమై జాగ్రద్రూపమగుచున్నదో. మఱియు, నెవరట్టి సాంకల్పిక పదార్థములందే లయించిన మనశ్చేష్టగలవారై పూర్వాపరస్థితుల అనుసంధానము లేకయుందురో, అట్టివారు సంకల్ప జాగరు లనఁబడుదురు.

* (ఐందవోపాఖ్యాన న్యాయము ననుసరించి)

సంకల్పోపశమే భూయస్తన్మయం వా శ్రయన్తి తే
దేహే తేషాం వయమిమే సంకల్పపురుషాః స్థితాః. 17

వారి యా సంకల్పము శమించినమీదట మరల దాని నైనగాని, లేక మఱియొక సంకల్పమును గాని యాశ్రయింతురు. వారి సంకల్పమయదేహమున ఈమనమందఱమును సంకల్పపురుషులమై యున్నాము.

సంకల్పజాగరాః ప్రోక్తా ఏతే సంకల్పశాయినః
జీవా జీవితగా లోకాః శృణు కేవలజాగరాన్. 18

ఓ రామచంద్రా! వారి సంకల్పమందుండుటఁ బట్టి యీ జీవులున్ను, వారి సంకల్పజీవితమునఁ బ్రవేశించుటఁబట్టి యీ మనలోకములున్ను వారి దృష్టియందు సంకల్పజాగరరూపములే యగును. ఇఁక కేవలజాగరులను గూర్చి వినుము.

ప్రాథమ్యేనావతీర్ణాస్తే బ్రహ్మణో బృంహితాత్మనః
ప్రోక్తాః కేవలజాగర్యాః ప్రాగుత్పత్త్యవికాసినః. 19

(దామ, వ్యాళ, కటులవలె) పూర్వమున ఉత్పత్తి, వికాసములు (అను స్వప్నము) లేనివారును, వర్ధన శీలమగు బ్రహ్మమునుండి ప్రథమముననే శరీరమును ధరించువారును, కేవలజాగరులనఁబడుదురు.

భూయో జన్మాన్తరగతాస్త ఏవ చిరజాగరాః
కథ్యన్తే ప్రౌఢిమాయాతాః కార్యకారణచారిణః. 20

వారే మరల ఉత్తరోత్తర జన్మ పరంపరలను బొందినవారై, కార్యములగు జాగ్రత్స్వప్నములందును, కారణమగు సుషుప్తియందును సంచరించుచుఁ బ్రౌఢత్వముఁ జెందుటచే చిరజాగరులని పచింపఁబడుచున్నారు.

త ఏవ దుష్కృతావేశాజ్జడస్థావరతాం గతాః
ఘనజాగ్రత్తయా ప్రోక్తా జాగ్రత్సు ఘనతాం గతాః. 21

మఱియు నట్టివారే దుష్కర్మవశముచే జడ, స్థావరతుల్యమగు అజ్ఞానదశనొంది ఘనీభూతమగు జాగ్రత్స్థితిని బడయుటచే ఘనజాగరు లనఁబడుచున్నారు. (—ఈపైవచించిన యైదువిధములగు వారును బద్ధజీవులు)

యే తు శాస్త్రార్థసత్సఙ్గబోధితా బోధమాగతాః
పశ్యన్తి స్వప్నవజ్జాగ్రజ్జాగ్రత్స్వప్నా భవన్తి తే. 22

శాస్త్రాభ్యాస, సత్సాంగత్యములచే బోధితులగుటచే జ్ఞానప్రాప్తి నొందినవారై, జాగ్రత్తును స్వప్నమువలె గాంచునట్టి (చతుర్థ, పంచమషష్ఠ భూమికలందుండు) మహాత్ములు జాగ్రత్స్వప్నులని పిలువఁబడుచున్నారు.

యే తు సంప్రాప్తసంబోధా విశ్రాన్తాః పరమే పదే
క్షీణజాగ్రత్ప్రభృతయస్తే తుర్యాం భూమికాం గతాః. 23

ఇఁక, పరిపూర్ణజ్ఞానము నొందుటచేఁ పరమపదమున (బ్రహ్మమున) విశ్రమించు వారును తురీయమగు సప్తమభూమికయందారూఢులునగు మహనీయులు క్షీణజాగరు లనఁబడుదురు. (వీరు మోక్షము నొందిన ముక్తజీవులు.)

ఇతి సప్తవిధో భేదో జీవానాం కథితస్తవ
సముద్రాణామివ మయా బుద్ధ్వా శ్రేయఃపరో భవ. 24

ఓ రామచంద్రా! ఇవ్విధమున, వివిధసముద్ర జలములవంటి యీ జీవుల సప్తవిధ భేదములను నేనుఁ నీకు దెలియఁజేసితిని. వీని నెఱిఁగి ఉత్తరోత్తర శ్రేష్ఠభూమికలందుఁ దత్పరుఁడవు కమ్ము.

భ్రాన్తిం పరిత్యజ జగద్గణనాత్మికాం త్వం
బోధైకరూపఘనతామలమాగతోఽసి
శూన్యత్వవర్జితమశూన్యతయా చ ముక్తం
తేన ద్వయైక్యకవిముక్తవపుస్త్వమాద్యమ్. 25

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు
నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే జీవసప్తకప్రకారవర్ణనం
నామ పఞ్చాశః సర్గః ॥ 50 ॥

ఓ రామచంద్రా! నీవిఁక జగత్తునుగూర్చిన ద్వైత బుద్ధియను భ్రాంతిని విడువుము. ఏలయనిన, నీవిపుడు పూర్ణముగ బోధైకరూప ఘనత్వమును బొందియున్నావు. ఇక్కారణమున ద్వితీయాదుల అభావముచే, తద్వ్యావృత్తమగు ఏకత్వము యొక్కయు అసంభవమగుటచే ద్వైత, ఏకత్వ, శూన్యత్వ, అశూన్యత్వాది సర్వధర్మ వర్జితుఁడవై, కల్పనలన్నింటికంటెను ఆదియైన అధిష్ఠాన సన్మాత్రుఁడవేయై నీవు శేషించియున్నావు.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున
జీవసప్తక ప్రకారవర్ణనమను యేబదవ సర్గము ॥50॥

---

## ఏకపఞ్చాశః సర్గః

[బ్రహ్మదృష్ట్యావనుత్పన్నమాత్మదృష్ట్యా మృషోద్భవమ్
బోధాదమూర్తం చ జగద్యథా తదిహ వర్ణ్యతే.

బ్రహ్మదృష్టిచే ఉత్పత్తిరహితముగను, ఆత్మదృష్టిచే మిథ్యగా నుత్పన్నమైనదిగను, జ్ఞానముచే నిరాకారముగను, ఈ జగత్తెట్లు భాసించుచున్నదో యావిషయమిచట వర్ణింపఁబడుచున్నది.]

శ్రీరామ ఉవాచః —

కథం కేవలజాగ్రత్త్వమకారణమనర్థకమ్
పరాద్వికసతి బ్రహ్మన్గగనాదివ పాదపః. 1

శ్రీరాముఁడు:— మహాత్మా! ఆకాశమునుండి వృక్షమువలె, మొట్టమొదటనే పరబ్రహ్మము నుండి అకారణముగను, నిరర్థకముగను, కేవలజాగ్రత్ - శరీరధారులగు జీవులు యెట్లుత్పన్నులగుదురు?

శ్రీవసిష్ఠ ఉవాచ:—

అకారణం మహాబుద్ధే న కార్యముపలభ్యతే
తజ్జాగ్రతః కేవలస్య న కశ్చిదిహ సంభవః. 2

శ్రీవసిష్ఠుఁడు:— మహిబుద్ధివగు రామచంద్రా! నీవు సత్యముగనే వచించితివి. కారణము లేక కార్యమెపుడును నుత్పన్నము గానేరదు. కావున, ఆ కేవల జాగ్రజ్జీవులు వాస్తవముగ నుత్పన్నులు గాకయేయున్నారు.

తస్యాతో సంభవాదన్యే జీవభేదాః సజీవకాః
సర్వే న సంభవన్త్యేవ కారణాభావవిక్షతాః. 3

అట్లు వారు సంభవింపమి, తక్కిన జీవ భేదములున్ను, ఆ వివిధ జీవులున్ను కారణము యొక్క అభావమువలన సంభవింపకయే యున్నారు.

నేహ ప్రజాయతే కించిన్నేహ కించన నశ్యతి
ఉపదేశ్యోపదేశార్థం శబ్దార్థకలనోదయః. 4

ఓరామచంద్రా! యథార్థముగ ఈబ్రహ్మమం దేదియు నుత్పన్నమగుటలేదు, నశించుటలేదు కేవలము శిష్యునకుపదేశించుట కొఱకుమాత్రమే యీశబ్దార్థముల కల్పన శ్రుత్యాదులందుఁ గావింపబడినది.

శ్రీరామ ఉవాచ:—

కః కరోతి శరీరాణి మనోబుద్ధ్యాది చేతనైః
కో మోహయతి భూతాని స్నేహరాగాదిబన్ధనైః. 5

శ్రీరాముఁడు! ఓ మునీంద్రా! మనోబుద్ధ్యాది చేతనములద్వారా భోగసాధనములగు ఈ శరీరముల నెవఁడు నిర్మించుచున్నాఁడు? మఱియు స్నేహరాగాది బంధనములచే ప్రాణులను మోహపెట్టునది యెవరు?

శ్రీవసిష్ఠఉవాచ:—

న కశ్చిదేవ కురుతే శరీరాణి కదాచన
న మోహయతి భూతాని కశ్చిదేవ కదాచన. 6

శ్రీవసిష్ఠుఁడు:- ఓ రామచంద్రా! ఈ శరీరముల నెవఁడును నెపుడును నిర్మించుటలేదు. ఈ ప్రాణుల నెవఁడును నెపుడును మోహపెట్టుటలేదు.

అనాద్యన్తావభాసాత్మా బోధ ఆత్మని సంస్థితః
నానాపదార్థరూపేణ కమూర్మ్యాదితయా యథా. 7

జలము తనయందుఁ దరంగాదులరూపమున నుండునట్లు, అనాదియై, అనంతమై, బోధరూపమైనట్టి పరమాత్మయే, ఈ యనేక పదార్థరూపములతోటి తనస్వరూపమున నుండియున్నాఁడు.



బాహ్యం న విద్యతే కించిద్బోధః స్ఫురతి బాహ్యవత్
ఉదేతి బోధహృదయాద్బీజాదివ వరద్రుమః. 8

వాస్తవముగ బాహ్యపదార్థ మెద్దియును లేదు. బీజమునుండి యుత్తమవృక్షమువలె, అభ్యంతర బోధరూపహృదయమునుండి బోధయే (చైతన్యమే) బాహ్యపదార్థమువలె స్ఫురించుచున్నది.

బోధస్యాన్తరిదం విశ్వం స్థితమేవ రఘూద్వహ
స్తమ్భస్యాన్తర్యథా శాలభఞ్జికా ప్రకటీకృతా. 9

రఘుకులోత్తముఁడవగు రామచంద్రా! స్తంభమునందు విగ్రహమువలె, బోధయందీ ప్రపంచము స్థితినొందియున్నది.

సబాహ్యాభ్యన్తరాత్మైకమనన్తం దేశకాలతః
బోధామోదప్రసరణం జగదేవ ప్రబుధ్యతామ్. 10

ఓ రామచంద్రా! దేశకాలముచే అనంతమగు ఏకమైనట్టిదే బోధగలదో, అట్టి బోధయను సుగంధముయొక్క విస్తారమే యీ బాహ్యాభ్యంతర జగత్తని యెఱుఁగుము.

అయమేవ పరో లోకో భావ్యతాం వాసనాక్షయః
శామ్యతాం పరలోకస్థం కాః కిలాయాన్తి వాసనాః. 11

వాసనా సిద్ధములగు అన్య బ్రహ్మాదిలోకము లీ పరమాత్మయందే గలవు. కావున వాసనా క్షయమునుగూర్చి భావింపవలయును. (అట్టి వాసనా క్షయముచే ఆ లోకములన్నియు ఆత్మరూపముచే నిచటనే యున్నవగును.) అందుచే శాంతులగు జ్ఞానుల హృదయమున, పరలోకరూపముతోటి యిచటనే యున్నట్టి ఆత్మయందు, తత్పరలోకముఁగూర్చిన దూరత్వాది వాసన లెన్నటికిని జొరబడ నేరవు.

దేశకాలాక్రియాలోకరూపచిత్తాత్మసత్పదమ్
దేశకాలాదిశబ్దార్థరహితం న చ శూన్యకమ్. 12

ఆ సద్రూపమైన ఆత్మపదము దేశ, కాల, క్రియా, ప్రకాశ, రూప, చిత్తాదిసహితమై యున్నను, వాస్తవముగ దేశకాలాదుల శబ్దార్థములు లేనిదే యగును. కాని శూన్యము మాత్రము కాదు.

పదే పదవిదామేవ తస్మిన్భోగగతిర్భవేత్
ద్రష్టౄణాం శాంతదృశ్యానామేవాన్యేషాం న రాఘవ. 13

ఓ రాఘవా! ఎవరి దృష్టియందు దృశ్యము శమించియున్నదో, అట్టి తత్త్వవేత్తలగు ద్రష్టలకే యీ ఆత్మపదమున బోధ స్థితి సంభవించునుగాని యన్యులకుఁగాదు.

యే వై తరలగమ్భీరమహన్తాగర్తమాశ్రితాః
పశ్యన్తి తే తమాలోకం న కదాచన కేచన. 14

చంచలమై, గంభీరమైనట్టి అహంకారమను గోతియందెవరు పడుదురో, అట్టివారెవరును నెపుడును, ఆ యాత్మ ప్రకాశమును గాంచఁజాలరు.

చతుర్దశవిధానన్తభూతజాతసుఘుంఘుమా
జగద్దృష్టిరియం జ్ఞస్య శరీరావయవోపమా. 15

పదునాల్గు విధములగు అనంతమైన ప్రాణి సమూహముచే ఘుంఘుమ శబ్దసహితమైయున్న జగత్తు జ్ఞానికి, దన శరీరముయొక్క అవయమువలెనే తోఁచును.

కారణాభావతః సృష్టిర్నోదితా న చ శామ్యతి
యాదృశం కారణం వా స్యాత్తాదృగ్భవతి కార్యకమ్. 16

కారణముయొక్క అభావముచే జ్ఞానుల దృష్టియందీసృష్టి యుదయించుటలేదు. అస్తమించుట లేదు. లేక, కారణమెట్లు సత్, చిత్, నిరాకారరూపమై యున్నదో, అట్లే కార్యమగు జగత్తున్నునై యున్నది.

యది స్యాత్కారణే కార్యం స్థితం కారణతాస్య కా
కార్యమేవోపలమ్భాత్తదసద్వ్యయమవేదనాత్. 17

కారణమననే కార్యము (తాత్కారణ) రూపముతోటి ఉన్నచో నిఁక దాని 'కారణత్వ' మేమి గలదు? ఏలయనిన, కుండలమను కార్యమందు సువర్ణమాత్రముయొక్క ప్రాప్తిచేతను, సువర్ణముతప్ప కుండలమను వేఱొకవస్తువు లేనందుచేతను, తాత్కార్యము అసత్తైయున్నది. కార్యమెపుడసత్తయగునో, అపుడు 'కారణత్వ' మను వ్యవహారమున్ను లేనిదే యగును.

సౌమ్యస్యాన్తర్యథామ్భోధేరూర్మ్యావర్తాదయః స్థితాః
బ్రహ్మణ్యసంభవక్షోభే జగచ్చిత్తాదయస్తథా. 18

శాంతమగు సముద్రమునఁ దరంగ, ఆవర్తాదులున్న విధమున క్షోభరహితమగు బ్రహ్మమున జగత్, చిత్తాదులు గలవు.

సర్వాత్మైవామలం బ్రహ్మ పిణ్డ ఏక ఇవ స్థితమ్
నానాభాణ్డాత్మ హేమైవ యథా నస్థితరూపకమ్. 19

పలువిధ పాత్రల రూపమున ఏకమగు మృత్పిండమున్నట్లును, పలువిధ ఆభరణముల రూపమున ఏకమగు సువర్ణపిండ మున్నట్లును, వివిధ జగద్రూపమున సర్వాత్మయై, ఏకమై, నిర్మలమైనట్టి బ్రహ్మపిండము మాత్రమే గలదు.

స్వప్నకాలే స్వప్న ఇవ జాగ్రద్వ్యగ్రాపరిగ్రహాత్
జాగ్రత్కాలే జాగ్రదేవ స్వప్నః సత్యావబోధతః. 20

మృత్పిండ స్థితియందు ఘటము మృత్పిండమే యనియు, ఘట స్థితియందు, మృత్పిండము ఘటమేయనియు నెఱుఁగువారికి ఉభయస్థితులందును నొకేవస్తువుయొక్క దర్శనమగు విధమునజ్ఞానులకున్ను, వాసనాయుక్తమగు మనస్సుయొక్క అపరిగ్రహముచేతను, సత్యమునుగూర్చిన జ్ఞానముచేతను ఈప్రపంచముయొక్కయు స్వప్నకాలమున జాగ్రత్తుస్వప్నమేయనియు, జాగ్రత్కాలమున స్వప్నము జాగ్రత్తేయనియు నెఱుఁగుటచే ఉభయస్థితులందును నొకేవస్తువు భాసించుచున్నది.



చిత్తమాత్రతయా బుద్ధం మృగతృష్ణామ్బువత్స్థితమ్
జాగ్రత్స్వప్నత్వమాయాతి విచారవికలీకృతమ్. 21

మృగతృష్ణాజలమును బోలియున్నట్టి యీ జాగ్రత్తు తత్త్వవిచారముచే మర్దింపఁ బడినదై, చిత్తమాత్రముగ నెఱుఁగఁబడినదికాఁగా స్వప్న సమానమగుచున్నది.

సమ్యగ్జ్ఞానేన భూతాని జ్ఞస్య దేహతయా సహ
పీతబన్ధం విముఞ్చన్తి గతకాల ఇవామ్బుదాః. 22

వర్షాకాలము గడచిపోవ, మేఘములు తమ కారణమగు హిమరూపమును గూడ త్యజించునట్లు, ఆత్మయొక్క సమ్యక్-జ్ఞాన ముదయింప జ్ఞానికి దేహసహితముగ సమస్త భూతములు తమ కారణమగు చిత్తరూపమునుగూడ త్యజించుచున్నవి.

యథా గలితుమారబ్ధో ఘనో గగనతామియాత్
తథా సత్యావబోధేన శామ్యత్యాసమ్యగ్రహం జగత్. 23

లయింప మొదలిడిన మేఘము ఆకాశ రూపమును బొందునట్లు, సత్యముయొక్క పరిజ్ఞానముచే అహంకారసహితముగ జగత్తున్ను శమించుచున్నది.

శరదభ్రవదాలూనా మృగతృష్ణామ్బువత్తథా
పునః సంస్పృశ్యమానైవ బోధాద్గలతి దృశ్యతా. 24

ఆత్మజ్ఞానముచే ఈదృశ్యత్వము మరల స్పర్శాదులచే ననుభవింపఁ బడునపుడు శరత్కాల మేఘమువలెను, మృగతృష్ణాజలమువలెను శమించిపోవుచున్నది.

యథా దీప్తానలే లీనం సువర్ణం ఘృతమిన్ధనమ్
. ఏకతాం యాతి విజ్ఞానే తథా భువన చిత్తదృక్. 25

ప్రజ్వలించు అగ్నియందు లీనమైనట్టి సువర్ణము, ఘృతము, ఇంధనములు మున్నగునవి యేకరూపమగునట్లు, ఆత్మజ్ఞానముచే జగచ్చిత్తాదులున్ను ఏకత్వమొందును.

బోధేన తనుతామేతి పిణ్డబన్ధో జగత్త్రయే
పిశాచబుద్ధిః సదనే బోధితస్య యథా శిశోః. 26

జ్ఞానయుక్తుఁడగు బాలకుని గృహమున పిశాచబుద్ధి నశించునట్లు, జ్ఞానముచే ముల్లోకములందును మూర్తత్వము (సాకారత్వము) క్రమముగ నశించును.

బోధస్యానన్తరూపస్య స్వయమేవాత్మనాత్మని
జగచ్చిత్తాదితా భాతా పిణ్డబన్ధః కిలాత్ర కః. 27

అనంతరూపమైన బోధ (చైతన్యము) యొక్క నిజస్వరూపమున స్వయముగనే (అకారణముగనే) ఈ జగచ్చిత్తాదులు భాసించుచున్నవి. అట్టిచో నిఁక ఈ బోధయందు మూర్తత్వమెచట,

బోధాబోధనమేవేదం జగచ్చిత్తమివోదితమ్
తదేవాస్తం గతం బోధాత్పిండబన్ధస్య కా స్థితా. 28

ఆత్మను గూర్చిన అజ్ఞానమే జగచ్చిత్తాదుల రూపమున నుదయించినది, ఆత్మ జ్ఞానముచే నెపుడా యజ్ఞానము నశించునో, అపుడిక మూర్తత్వముయొక్క. అస్తిత్వమెచట!

జహాతి పిండకాఠిన్యం జాగ్రత్స్వప్నావబోధతః
పరాం పేలవతామేతి హేమ ద్రుతమివాగ్నినా. 29

అగ్నిచే సువర్ణము కఱఁగి అతి సూక్ష్మత్వ మొందునట్లు, ఆత్మజ్ఞానమున నెపుడీ జాగ్రత్తు స్వప్న తుల్యమని యెఱుఁగఁ బడుచున్నదో, అపుడీ ప్రపంచము తన మూర్తత్వమును వీడుచున్నది.

యథాస్థితం బోధ ఏవ ఘనతామివ గచ్ఛతి
వినైవ దేశకాలాభ్యాం తౌ వినిర్మాయ హేమవత్. 30

ద్రవీభూతమగు సువర్ణము క్రమముగ ఘనరూపమును బొందునట్లు, స్వస్వరూపమున నున్నట్టి బోధరూపమగు ఆత్మ దేశకాలములు లేకనే జాగ్రత్స్వప్నములను రచించి ఘనత్వమును బొందినదివలె నగుచున్నది.

జాగ్రత్యేవం విచారేణ స్వప్నాభే పేలవే స్థితే
క్షీయమాణే శరత్కాల ఇవైతి తనుతాం రసః. 31

ఈ ప్రకారము ఆత్మ విచారముచే జాగ్రత్తు స్వప్నమువలె, తుచ్ఛత్వముఁ జెందియుండ, శరత్కాలము గడచినపిమ్మట మేఘాదులందలి జలమువలె భోగములందలి యనురాగమున్ను మనుజునకు సన్నగిలుచున్నది.

పరాం పేలవతాం యాతా దృశ్యలక్ష్మ్యః స్థితా అపి
స్వప్నా ఇవ పరిజ్ఞాతా న స్వదన్తే వివేకినః. 32

దృశ్యము విద్యమానమై యున్నప్పటికిని, వివేకుల కయ్యది మిగుల తుచ్ఛముగఁ గన్పట్టును. మఱియు, తెలిసికొనబడిన స్వప్నమువలె ఆ దృశ్య పదార్థము లెవ్వియు వారికి రుచింపకుండును.

క్వ కిల స్వాత్మవిశ్రాన్తిః క్వైతద్విషయవేదనమ్
సుషుప్తజాగ్రతోరైక్యం భ్రాన్తాభ్రాన్తాత్మనో భవేత్. 33

ఆత్మ సుఖమందలి విశ్రాంతి యెచట! విషయ స్వాదన మెచట! తత్త్వజ్ఞానికిఁ గూడ విషయములందుఁ బ్రీతి గలుగుచో నిక, జాగ్రత్సుషుప్తుల యొక్కయు, జ్ఞాని, అజ్ఞానులయొక్కయు, ఏకత్వమే సంభవించును! (అట్లెన్నటికిని గలుగదనుట.)

చిత్తమాత్రే భ్రాన్తిమాత్రే స్వప్నమాత్రాత్మని స్థితే
జగతీహ పదార్థేభ్యః సత్యబుద్ధిర్నివర్తతే. 34

జగత్తు చిత్తమాత్రమని సిద్ధింప, మఱియు, స్వప్నమువలె భ్రాంతి మాత్రమై యున్నదని యెఱుఁగఁబడ నిక నిచట పదార్థములనుండి సత్యత్వబుద్ధి తొలగుచున్నది.



కస్య స్వదన్తేఽసత్యాని కథమేవ మహామతే
మృగతృష్ణాజలానీవ దృశ్యాన్యపి పురఃస్థితైః. 35

మహామతివగు నో రామచంద్రా! మృగతృష్ణా జలమువలె నెదుట నున్నప్పటికిని, అసత్యము లగు దృశ్యపదార్థములే వివేకి కెట్లు రుచించును?

సత్యబుద్ధౌ విలీనాయాం జగత్పశ్యతి శాన్తధీః
జాలదీపాంశుజాలాభమసిద్ధాత్మామ్బరాత్మకమ్. 36

దృశ్యపదార్థమందలి సత్యత్వబుద్ధి నశించినవాఁడును, శాంతచిత్తుఁడు నగు వివేకి యీ జగత్తును కిటికీగుండా ప్రవేశించిన దీప కిరణములవలె ప్రకాశ రూపమైనను, నిరాకారముగను, ఆకాశ రూపముగను వీక్షించుచున్నాఁడు.

జాగ్రతో వస్తుతః శూన్యాత్పరిజ్ఞాతాన్నివర్తతే
చిత్తభ్రమాత్మనో భ్రాన్తిరూపాస్వాదన భావనా. 37

స్వప్న పదార్థములు శూన్యమని యెఱుఁగుటచే మేల్కొనినవాని కా వస్తువులనుండి యాస్వాద భావన తొలగునట్లు, చిత్తభ్రమ మాత్రముచే సిద్ధించు ఈ జగత్పదార్థములనుండియు భ్రమ రూపమగు ఆస్వాద భావన జ్ఞానికి దొలఁగుచున్నది.

యదవస్త్వితి విజ్ఞాతం తత్రోపాదేయతా కుతః
కేన స్వప్నం పరిజ్ఞాయ స్వప్న హేమాభిగమ్యతే. 38

ఏ వస్తువు మిథ్యయని తెలియఁబడుచున్నదో, దానియందిక గ్రాహ్యబుద్ధి యెట్లు గలుగును? స్వప్నమని యెఱిఁగిన పిదప యిక ఆ స్వప్నమందలి సువర్ణము నెవఁడు గైకొనఁ బోవును?

స్వప్నాదివ పరిజ్ఞాతాద్రసో దృశ్యాన్నివర్తతే
ద్రష్టృదృశ్యదశాదోషగ్రన్థిచ్ఛేదః ప్రవర్తతే. 39

తెలిసికొనఁబడిన స్వప్నమునుండివలె దృశ్యపదార్థములనుండి జ్ఞానికి రాగబుద్ధి నివర్తించుచున్నది. మఱియు ద్రష్టృదృశ్య స్థితియొక్క దోషములను గ్రంథులయొక్క ఛేదనము ప్రవర్తించుచున్నది.

నీరసః శాన్తమననో నిర్వాణాహంకృతిః కృతీ
వీతరాగో నిరాయాసః శాన్తస్తిష్ఠతి బుద్ధధీః. 40

జ్ఞాని బంధ్వాదులందు రాగరహితుఁడై, దృశ్యపదార్థమననవర్జితుఁడై అహంకార శూన్యుడై విషయములందను రాగములేనివాఁడై, సాంసారిక ప్రయత్న రహితుఁడై, శాంతుడై వెలయును.

రసే నీరసతాం యాతే వాసనా ప్రవిలీయతే
శిఖాయాం ప్రవిలీనాయాం ప్రదీపస్యాంశవో యథా. 41

దీపశిఖనశింప, తద్దీపకిరణములున్ను నశించునట్లు, భోగములు నీరసములుకాఁగా వాసనయు నివర్తించుచున్నది.

బోధాద్దీపాంశుజాలాభమఘనం వ్యోమ దృశ్యతే
భ్రాన్తిరూపం జగత్కృత్స్నం గన్ధర్వనగరం యథా. 42

గంధర్వ నగరమువలె భ్రాంతి రూపమైనట్టి యీ జగత్తంతయు తత్త్వబోధచే, దీపకిరణ సమూహమువలె ప్రకాశమానమై, సూక్ష్మమైనట్టి సచ్చిదాకాశమువలెఁ దోచును. (అధిష్ఠానదృష్టియందు)

నైవాత్మానం న చాకాశం న శూన్యం న చ వేదనమ్
అత్యన్తపరిణామేన పశ్యన్పశ్యతి తత్పరమ్. 43

సప్తమ భూమికాస్థితి రూపమగు అత్యంత పరిణామముచే జ్ఞాని ఆత్మపదమునే గాంచుచు, తన్నుగాని, ఆకాశమునుగాని, శూన్యమునుగాని, పదార్థానుభవమునుగాని గాంచకుండును.

యత్ర నాత్మా న శూన్యం చ న జగత్కలనాపి చ
న చిత్తదృశ్యోదయధీః సర్వం చాస్తి యథాస్థితమ్. 44

ఆ పరమాత్మపదమున జీవుఁడుగాని, శూన్యముగాని, జగత్కల్పనగాని, చిత్తముగాని దృశ్యోదయమునుగూర్చిన బుద్ధిగాని లేవు. అంతయు యథాస్థితముగ బ్రహ్మరూపమేయైయున్నది.

భూమ్యాదితా జ్ఞసంబుద్ధా జ్ఞానాదస్తముపాగతా
జ్ఞస్య శూన్యైవ సంపన్నా సంస్థితాపి న విద్యతే. 45

అజ్ఞానులచే సాకారముగ నెఱుఁగబడునట్టి భూమ్యాదులు జ్ఞానికి తత్త్వజ్ఞానముచేలయించిపోవుచున్నవి. విద్యమానములైయున్నను నయ్యవి యీ జ్ఞానికి శూన్య రూపములే యగుచు లేనివే యైయున్నవి.

భవత్యేకసమాధానసౌమ్యాత్మా వ్యోమనిర్మలః
తిష్ఠత్యపగతాసఙ్గః స్థిత ఏవాప్యసత్సమః. 46

జ్ఞాని ఆకాశమువలె నిర్మలుఁడై, సౌమ్యరూపుఁడై, కేవలము సమాధితత్పరుఁడై, సంగరహితుఁడై, ఉన్నను లేనివానివలె యొప్పుచు వెలయుచుండును.

అస్తంగతమనా మానీ నిరోధపదవీం గతః
తీర్ణః సంసారజలధేః కర్మణామస్తమాగతః. 47

అస్తమించిన మనస్సు గలవాఁడై, మౌనియై, ఇంద్రియ, మనంబుల నిరోధదశను బొందినవాఁడై, సంసారసముద్రమును దాటినవాఁడై, సమస్తకర్మలయొక్క యంతమును బడసినవాఁడైజ్ఞాని చెన్నొందుచుండును.

తనుభువనగగనగిరిగణ కరణపరం పరమమజ్ఞానమ్
విగలతి గలితే తస్మిన్ సకలమిదం విద్యమానమపి. 48

చతుర్విధ శరీరములయొక్కయు, వాని యాధారమగు పదునాల్గు భువనముల యొక్కయు వానికిన్ని నాధారమగు ఆకాశముయొక్కయు విహారస్థానములగు పర్వత సమూహముల యొక్కయు



తత్సాధనములగు కరణముల యొక్కయు నుపాదాన కారణము మూలాజ్ఞానమే యైయున్నది. అయ్యజ్ఞానము నశింప, ఇఁక ఆశరీర, భువనాదులన్నియును విద్యమానములై యున్నప్పటికిని (జ్ఞానికి) లేనివే యగుచున్నవి.

సంశాన్తాన్తఃకరణో గలితవికల్పః స్వరూపసారమయః
పరమశమామృతతృప్తస్తిష్ఠతి విద్వాన్నిరావరణః. 49

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తేమోక్షోపాయేషు నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే విశ్రాన్తియోగోపదేశో నామైకపఞ్చాశః సర్గః॥ 51 ॥

ఈ ప్రకారముగ జ్ఞాని, శాంతమైన యంతఃకరణముగలవాఁడై, వికల్పరహితుఁడై, స్వరూపసారమయుఁడై, పరమామృత రూపమగు ఆత్మానందముచే సదా పరితృప్తుఁడై, నిరావరణ భూమానంద స్వరూపుఁడై వర్తించుచుండును.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున విశ్రాంతియోగోపదేశమను యేబదియొకటవ సర్గము ॥ 51 ॥

---

## ద్విపఞ్చాశః సర్గః

[ఇహ తార్కికతర్కోక్తకల్పనాస్త్రఖణ్డనైః
అనిర్వాచ్యజగద్భావః కూటస్థస్య సమర్థ్యతే.

తార్కికుల తర్కములను ఖండించుచు, కూటస్థ పరమాత్మయొక్క అనిర్వచనీయ జగద్భావమును సమర్థించుట యిటఁ జూపఁగాననగును.]

శ్రీరామ ఉవాచ:—

బోధో జగదివాభాతి మునే యేన క్రమేణ హ
తం క్రమేణ క్రమం బ్రూహి భూయో భేదనివృత్తయే. 1

శ్రీరాముఁడు:- ఓమునీంద్రా! బోధరూపమగు చిదాత్మ యేక్రమముచే జగత్తువలె భాసించుచున్నదో యా క్రమమును భేదనివారణకొఱకై మరల తెలియఁజేయప్రార్థన.

శ్రీవసిష్ఠ ఉవాచ:—

వృక్షస్యేవ విమూఢస్య యద్దృష్టం తత్స్వచేతసి
యన్నదృష్టం న తచ్చిత్తే భవత్యల్పతరస్మృతే. 2

శ్రీవసిష్ఠుఁడు.— ఓ రామచంద్రా! వృక్షముయొక్క మూల, పత్ర, పుష్ప ఫలాది వివిధాకారములవలె అజ్ఞానికి వివిధాకార[illegible] వాని దృష్టియందట్లున్నది గనుక నే

వాని చిత్తమందును నట్లు ప్రసిద్ధమైయున్నది. దృష్టియందు లేనిది చిత్తమందును నుండనేరదు. కావుననే అల్పమైనప్పటికిని గాంచినదే స్మరింపఁబడుచున్నదిగాని గాంచనిదికాదు.

భవ్యః పశ్యతి శాస్త్రార్థమేవ పూర్వాపరాన్వితమ్
న దృష్టివిషయం వస్తు యత్పశ్యతి కరోతి తత్. 3

వివేకియగువాఁడు పూర్వాపరశాస్త్రార్థము ననుసరించియే చూచును, చేయును. శాస్త్రములచే నిషిద్ధమగు విషయము నేత్రమునకు సమీపముననే యున్నప్పటికిని, దానిని భోగ్యరూపముగ గాంచఁడు. మఱియు దానికొఱకై యేమియుఁ జేయఁడు.

భావానుష్ఠాననిష్ఠః సన్శాస్త్రార్థైకమనా మునిః
భూత్వోపదేశం త్వమిమం శృణు శ్రవణభూషణమ్. 4

ఓ రామచంద్రా! కాఁబట్టి నీవున్ను నీ చిత్తశుద్ధి కనుకూలమగు అనుష్ఠానమునఁ దత్పరుఁడవై శాస్త్రార్థసమ్మతమైన చిత్తముగలవాఁడవై, మననశీలుఁడవై' శ్రవణభూషణమగు ఈయుపదేశమును వినుము—

ఇయం దృశ్య భరభ్రాన్తిర్నన్వవిద్యేతి చోచ్యతే
వస్తుతో విద్యతే నైషా తాపనద్యాం యథా పయః. 5

ఈ దృశ్యసమూహమును గూర్చిన భ్రాంతియే 'అవిద్య'యనఁబడును. వాస్తవముగ ఈయవిద్య మృగతృష్ణానదీజలమువలె లేనిదేయగును.

ఉపదేశ్యోపదేశార్థమేనాం మదుపరోధతః
సత్యామివ క్షణం తావదాశ్రిత్య శ్రూయతామిదమ్. 6

కాని, ఉపదేశ్య ఉపదేశముల కొఱకై నాయను రోధముచే క్షణకాల మీఅవిద్యను సత్యముగ నమ్మి యీవాక్యముల వినుము—

కుత ఏషా కథం చేతి వికల్పాననుదాహరన్
నేదమేషా న చాస్తీతి స్వయం జ్ఞాస్యసి బోధతః. 7

ఈ అవిద్యయెట్టిది, ఎటునుండి వచ్చినది—ఈ మున్నగు వికల్పములను జేయక, నేను జెప్పఁబోవు ఈ యుపదేశమును వినుము. తదుపరి, ఈ జగత్తుగాని, అవిద్యగాని లేవను నివ్విషయమును నీవు స్వయముగనే యెఱుఁగఁగలవు.

యదిదం దృశ్యతే కించిజ్జగత్స్థావరజంగమమ్
సర్వం సర్వప్రకారాఢ్యం కల్పాన్తే తద్వినశ్యతి. 8

సర్వప్రకారములచేఁ బూర్ణమైయుండు యీకానిపించు స్థావరజంగమాత్మకమగు ప్రపంచమంతయుఁ గల్పాంతమందు నశించుచున్నది.

అస్య భాగవిభాగాత్మా నాశోఽవశ్యమవారితః
బిన్దునా బిన్దునా బోధే ఉద్ధృతస్యాస్తి హి క్షయః. 9



విమర్శచే ఈ జగత్తుయొక్క భూలోకాద్యవయవముల విభాగము (విశ్లేషము) గావించుట వలన దీని నాశము తప్పనిదగుచున్నది. ఏలయనిన, ఒక్కొక్క బిందువును దొలగించుటచే ఘటమందలి జలమంతయు నశించుచున్నదిగదా!

ఏవం స్థితే ద్రవ్యనాశే బ్రహ్మణస్తన్మయత్వతః
నానన్తత్వం న చాస్తిత్వం న చవై సంభవత్యలమ్. 10

ఇట్లుండ బ్రహ్మమునకు జగత్తు అవయవమైనచో, శాఖాద్యవయవనాశముచే వృక్షనాశమువలె, అవయవరూపమగు పదార్థముయొక్క నాశముచే అవయవియగు బ్రహ్మముయొక్క నాశమున్ను సంభవించునుగాన, అపుడు శ్రుత్యుక్తమగు 'అనంతత్వ అస్తిత్వము'లా బ్రహ్మమునకు సిద్ధింపఁజాలవు. కావున, చిదేకరసమై, నిరవయవమై నట్టి బ్రహ్మమునకు జగత్తు, అవయవమెన్నటికిని గానేరదు.

మదశక్తిరివ జ్ఞానమితి నాత్మాసు సిధ్యతి
దేహో విజ్ఞానతోఽస్మాకం స్వప్నవన్నతు తత్వతః. 11

భూమ్యాది భూతములు జడమైనప్పటికిని, మద్యముయొక్క అవయవములందు వ్యాపించిన మదశక్తివలె, దేహాకార పరిణామమొందినపుడు వానియందు, చైతన్య ధర్మముండునని (చార్వాకులు) అనినచో, అట్టిదానిని ఆస్తికులమగు మాయందు సిద్ధింపఁజేయుటకు వారికి శక్యముకాదు; ఏలయనిన, మా మతమందు దేహము విజ్ఞానముయొక్క యధీనమైయున్నది. గావున స్వప్నదేహమువలె నయ్యది వాస్తవము కానిదై యున్నది.

నశ్యత్యేవ చ దృశ్యశ్రీః సైవ నాన్యైవ నైవ చ
ఇత్థం భవేత్సముచితం కృశం శాస్త్రం చ నాన్యథా. 12

ఈ దృశ్యము అట్టిరూపముగలదికాదు, లేక మఱియొకరూపము గలదికాదు. అది అనిర్వచనీయమై, అవిద్యా మాత్ర సిద్ధమై యున్నది. కావున, విద్యచేఁ దప్పక నశించునదై యున్నది. ఇక్కారణమున జ్ఞానముచే అవిద్యా నాశము ద్వారా జగద్బాధ గావించి బంధనివృత్తినొందుట యందే శాస్త్రము సఫలము కాఁగలదు.

సైవేతీత్యసముల్లేఖం కథం నష్టస్య సంభవః
తద్రూపాన్యేతి యుక్తం స్యాదనుభూతానుగా వయమ్. 13

పూర్వకల్పమున యేప్రపంచము నశించినదో మరల అదియే తిరిగి యుత్పన్నమైనదా! లేక అన్యమా యను విషయము సంభావించుటకు శక్యముకాదు. కావున నది అనిర్వచనీయమే యగును. మఱియు, అనుభవము ననుసరించునట్టి మేము (నశించినది యుత్పన్నమగుట)యను అనుభవ విరుద్ధమగు విషయము నొకింతైనను సమ్మతింపఁజాలము. ఏలయనిన, నశించినది యెట్లుత్పన్నమగును?

సైవ వ్యోమతయైవాసీదిత్యసత్యైవ సా కథమ్
తథైవ వ్యోమసంస్థా చేన్నాశం తర్హి న సా గతా. 14

ఆ సాకారమగు జగత్తే ప్రళయమున నిరాకారమగు ఆకాశరూపమున నున్నది. కావున, అసత్తే యగును. ఏలయనిన, సాకారము నిరాకార మెట్లగును? అట్లాకాశమందున్నదైనను అది తన పూర్వావస్థను బొందియున్నదనినచో, ప్రళయమందు దాని నాశము కాకయే యుండెడిది.

కార్య కారణయోరేకరూపత్వైవం యదా తదా
కార్యకారణతాభావాదైక్యమేవాస్మదాగమః. 15

ఇట్లు, సృష్టియందును ప్రళయమును స్వీకరించుట ద్వారా కార్యకారణముల యైక్యము నంగీకరించినచో, అపుడు ప్రళయమందలి అవ్యాకృతమగు కారణము, సృష్టియను కార్యము రెంటియొక్కయు ఏకత్వము సిద్ధించినదగును. ఏలయనిన, కార్యము కారణభావమును బొందుటయే మా సిద్ధాంతమందేకత్వమగును.

శూన్యత్వముపలమ్భత్వం యద్గతం నష్టమేవ తత్
అన్యస్త్విహ భవేన్నాశః కీదృశః కిల కథ్యతామ్. 16

దృష్టిగోచరమైనను శూన్యరూపమైయుండుట యేదిగలదో అదియే నాశము. ఇంతకంటె వేఱుగ నాశమేదైన మఱియొకటి యుండినచో, అది యెట్టిదో, చెప్పుడు!

నష్టం భూయస్తదుత్పన్నమితి యత్ప్రత్యయేతి కః
నశ్యత్యవశ్యం తేనేదం పునరన్యత్ప్రవర్తతే. 17

‘అది నశించి మరల యుత్పన్నమగుచున్నది’ యనుదాని నెవఁడంగీకరించును? కావున, ‘అది అవశ్యము నశించుచున్నది. మరల వేఱైనది జనించుచున్నది’ అని చెప్పుదురుగాక!

మధ్యేమధ్యే యదుత్సేధఫలాద్యవయవైకికా
ఆదేహం బీజసత్తాస్తి కార్యకారణతా కుతః. 18

ఒకే వృక్షమందు మధ్యమధ్య ఔన్నత్య, ఫల, శాఖా పత్ర పుష్పాదులందు భేదమున్నప్పటికిని, ఆమూలాగ్రము వృక్షదేహమునను ఏకత్వమే గల్గియున్నట్లు సృష్టి ప్రళయాది వికార భేదములున్నప్పటికిని జగత్తంతటికిని ఏకత్వమే గలిగియున్నదని వచించినచో, అది సరికాదు. ఏలయనిన దృష్టాంతమందు శాఖాద్యవయవములందు అనుగతమై, వృక్షదేహమంతట వ్యాపించియున్నదైన బీజసత్తయే యటఁగలదు. ఆ సత్త అఖండమై, ఏకమై యుండుటచే శాఖాదులయొక్క పృథక్ - సత్త సిద్ధింపనేరదు. కావున కార్యకారణభావము నిర్మూలమైనదే యగును.

దేశకాలక్రియాత్మైకం యథాదృష్టమిహ స్థితమ్
బీజమేవైకకర్మాతో న ఘటః పటకార్యకృత్. 19

అట్లే, యీ జగత్తునందును ఏకమైన సన్మాత్రమగు బీజసత్త దేశకాలక్రియాది వివిధ సత్తారూపములతో నుండనేరదు. మఱియు ఏకమగు ఆబీజసత్త క్రియా, ఫలాది వివిధ కార్యములఁ జేయ సమర్థమున్నుగాదు. ఘటము పటము (వస్త్రము) యొక్క కార్యమును జేయ జాలదుగదా! కాఁబట్టి ఏకమైనట్టి సన్మాత్రము తన నిజస్వభావమందే యుండియున్నదగును. మాయచేతనే యీ వివిధ దేశకాలాదులన్నియు నందు గల్పింపఁబడుచున్నవి.



సర్వదర్శనసిద్ధాన్తే నాస్తి భేదో న వస్తుని
పరమార్థమయే తేన వివాదేన కిమత్ర నః. 20

ఇక్కారణమున సర్వశాస్త్ర సిద్ధాంతమునందు, ఐక్యమున కార్యభేద మెన్నటికినిలేదు. పరమార్థమయమగు వస్తువునందును భేదము (నానాత్వము) లేదు. కావున సర్వశాస్త్ర విరుద్ధుఁడగు వాదితోటి వివాదము గావించుటచే మాకేమి ప్రయోజనము?

ఇదం శాన్తమనాద్యన్తం తద్రూపత్వాద్విచారతః
వ్యోమాభం బోధతామాత్రమనుభూతి ప్రమాణతః. 21

ఈ సమస్తమున్ను ఆత్మరూపమే యగుటంబట్టి తత్త్వవిచారముచేతను, అనుభవప్రమాణముచేతను నిదియంతయు శాంతమై, అనాదియై, అనంతమై, ఆకాశమువలె నిర్మలమై, కేవలము బోధమాత్రమైనట్టి పరమాత్మగనే శేషించుచున్నది.

యథైతన్నానుభూతం సద్యథైతదనుభూయతే
యథైతత్సిద్ధిమాప్నోతి తదిదం కథ్యతే క్రమాత్. 22

ఓ రామచంద్రా! ఈ సద్రూపమగు చిదాత్మ యెవ్విధమున ననుభవింపఁబడదో, ఎవ్విధమున ననుభవింపఁబడునో, ఎవ్విధమున సిద్ధిఁబొందునో, ఆ విషయమంతయుఁ గ్రమముగ వచించుచున్నాను వినుము.

మహాకల్పాన్త ఉన్నష్టే సర్వస్మిన్దృశ్యమణ్డలే
ఆమహాదేవపర్యన్తం సమనోబుద్ధికర్మణి. 23
వ్యోమన్యపి శమం యాతే కాలేఽప్యకలితస్థితౌ
వాయావపి త్వపగతే తేజస్యత్యన్తమస్థితే. 24
తేజస్యపి గతే ధ్వంసం వార్యాదౌ సుచిరం క్షతే
అలమస్తమనుప్రాప్తే సర్వశబ్దార్థసంచయే. 25
శిష్యతే శాన్తబోధాత్మ సదచ్ఛం వాన్యవర్జితమ్
అనాదినిధనం సౌమ్యం కిమప్యమలమవ్యయమ్. 26
అవాచ్యమనభివ్యక్తమతీన్ద్రియమనామకమ్
సర్వభూతాత్మకం శూన్యం సదసచ్చ పరం పదమ్. 27

మహాకల్పాంతరమున, మహాదేవుని పర్యంతముగల మనోబుద్ధి కర్మసహితమగు సమస్తదృశ్యమండలము నశింప, ఆకాశ, కాల, వాయ్వగ్నులున్ను సంపూర్ణముగ శమింప, అంధకారము ధ్వంసము కాఁగా జల, పృథివ్యాదులున్ను క్షయింప, శబ్దార్థసమూహమంతయు నస్తమింప, శాంతమై, నిర్మలమై అబాధితమై, అనాదియై, అనంతమై, సౌమ్యమై, అవ్యయమై, అవాచ్యమై, అవ్యక్తమై, అతీంద్రియమై నామరూపరహితమై, సర్వభూతాత్మకమై, సర్వవస్తుశూన్యమై, అన్యపదార్థ రహితమగుటచే అసత్తుల్యమై, సన్మాత్రమై, సర్వోత్తమపదమైనట్టి బోధరూపమగు ఆత్మయే శేషించుచున్నది.

తన్న వాయుర్న చాకాశం న బుద్ధ్యాది న శూన్యకమ్
న కించిదపి సర్వాత్మ కిమప్యన్యత్పరం నభః. 28

ఆ పరమాత్మ వాయువుకాదు, ఆకాశముకాదు, మనోబుద్ధ్యాదులుకాదు, శూన్యముకాదు, ఏ పదార్థమున్ను గాదు, సర్వరూపమై, అనిర్వచనీయమైనట్టి చిదాకాశమే యగును.

తద్విదా తత్పదస్థేన తన్ముక్తేనానుభూయతే
అన్యైః కేవలమామ్నాతై రాగమైరేవ వర్ణ్యతే. 29

అట్టి ఆత్మపదము నెఱింగినవాఁడును, తదాత్మపదముననే యున్నవాఁడును, సర్వకల్పనా విముక్తుఁడునగు తత్త్వజ్ఞానియే ఆయాత్మననుభవించును. ఇతరులు కేవలము వేదశాస్త్రాదుల నవలంబించి యద్దాని వర్ణనమమాత్రము చేయుచుందురు.

న కాలో న మనో నాత్మా న సన్నాసన్న దేశదిక్
న మధ్యమేతయోరాన్నాన్తం న బోధో నాప్యబోధితమ్. 30

ఆయాత్మ కాలముకాదు, మనస్సుకాదు, జీవుఁడుకాదు, సత్తుకాదు, అసత్తుకాదు, సదసత్తుల మధ్యమున్ను గాదు, దేశముకాదు. దిక్కుకాదు, అంతముకాదు, (తనస్వరూపముకంటె భిన్నమగు) బోధకాదు, అబోధకాదు.

కిమప్యేవ తదత్యచ్ఛం బుధ్యతే బోధపారగైః
శాన్తసంసారవిసరైః పరాం భూమిముపాగతైః. 31

బోధయందు పారంగతులును, సంసారవిస్తారము శమించినవారును, పంచమ, షష్ఠాది భూమికలఁ బొందినవారునునగు మహాత్ములే యీవిలక్షణమై, అతినిర్మలమైనట్టి ఆత్మ ననుభవింతురు.

ప్రతిషిద్ధా మయైతే తు యేఽర్థాః సర్వత్ర తే స్థితాః
అస్మద్బుద్ధ్యా పరిచ్ఛేద్యాః సౌమ్యామ్భోధేరివోర్మయః. 32

మా బుద్ధియందు శాంతసముద్రముయొక్క తరంగములవలె పరిచ్ఛిన్నములును, శ్రుతులందంతటను నిషేధరూపముననున్నవియు నగు పదార్థములనే నేనిచట నిషేధించి ఆత్మబోధకొఱకై నీకు వచించితిని.

యథాస్థితం స్థితాః సర్వే భావాస్తత్ర యథాతథా
అనుత్కీర్ణా మహాస్తమ్భే వివిధాః శాలభఞ్జికాః. 33

మహాస్తంభమున నింకను జెక్కఁబడని వివిధ ప్రతిమలవలె, నిజస్వరూపమున నున్నట్టి పరమాత్మయందీ వివిధపదార్థములున్ను నుండియున్నవి.

ఏవం తత్ర స్థితాః సర్వే భావా ఏవ చ న స్థితాః.
అసర్వాత్మైవ సర్వాత్మ తదేవ న తదేవ చ. 34

ఈ ప్రకారముగ అధిష్ఠానరూపముచే సమస్తపదార్థములున్ను ఆపరమాత్మయందున్నప్పటికిని దృశ్యరూపముచే లేకయేయున్నవి. ఆ పరమాత్మ సర్వరూపమైయున్నను, సర్వరూపముగాకయే యున్నవి. అట్లే పదార్థరూపమైయున్నను, పదార్థరూపముగాకయే యొప్పుచున్నది.



పదం యద్వైతత్సర్వాత్మ సర్వార్థపరివర్జితమ్
యథా తత్ర చ పశ్యన్తి తత్త్రైకపరిణామినః. 35

శిలయందు విగ్రహమింకను జెక్కఁబడనపు డద్దానియందా విగ్రహము, కలదని లేదనికూడ వ్యవహరింపఁబడు విధమున, ఆత్మైక్యమును పొందిన మహనీయులు తమ యిచ్ఛననుసరించి యాపరమాత్మను సర్వపదార్థ యుక్తముగను, సర్వపదార్థ రహితముగనుగూడ గాంచుచుందురు.

సర్వం సర్వాత్మకం చైవ సర్వార్థ రహితం పదమ్
సర్వార్థపరిపూర్ణం చ తదాద్యం పరిదృశ్యతే. 36

సమస్తముగను ఆదియైనట్టి ఆత్మపదమును జ్ఞానులు సర్వరూపముగను, సర్వాత్మకముగను, సర్వపదార్థ రహితముగను, సర్వపదార్థ పరిపూర్ణముగనుగూడ వీక్షించుచుందురు.

తవైతావన్మహాబుద్ధే సర్వార్థోపశమాత్మకమ్
న సమ్యగ్జ్ఞానముత్పన్నం సంశయోఽత్ర నిదర్శనమ్. 37

మహాబుద్ధివగు రామచంద్రా! ఈ ప్రకారమైన సర్వపదార్థముల యుపశమన రూపమగు (సమాధిపర్యంతమగు) సమ్యక్-జ్ఞానము నీకింకను నుత్పన్నముకాలేదు. సంశయములు గలుగుచుండుటయే యిందులకుఁ బ్రమాణమైయున్నది.

యః ప్రబుద్ధో నిరాభాసం పరమాభాసమాగతః
స్వచ్ఛాన్తఃకరణ శాన్తస్తం స్వభావం స పశ్యతి. 38

దృశ్యముయొక్క ఆభాసమేమియు లేనివాఁడును పరమ సాక్షాత్కారము నొందినవాఁడును, నిర్మలాంతఃకరణుఁడును, శాంతుఁడును నగు జ్ఞానియే యట్టి ఆత్మస్వభావమును బరికించును.

అయం త్వమహమిత్యాదిత్రికాలగజగద్భ్రమః
తత్రాస్తి హేమపిణ్డాన్తరివ రూపకజాలకమ్. 39

సువర్ణపిండమున ఆభరణ, ముద్రాదుల సమూహమున్నట్లు, 'వీడు, నీవు, నేను' ఇత్యాది రూపమగు త్రికాల జగద్భ్రమ ఆ పరమాత్మయందుఁగలదు.

హేమపిణ్డాద్యథా భాణ్డజాలం నానోపలభ్యతే
తథా న లభ్యతే భిన్నం పరమార్థఘనాజ్జగత్. 40

సువర్ణ పిండముకంటె వేఱుగ నద్దాని పాత్రసమూహము లభించనట్లు, పరమార్థఘనమగు పరమాత్మకంటె వేఱుగ ఈ జగత్తున్ను లభించదు.

సర్వదైవ హి భిన్నాత్మా స్వాఙ్గభూతోపలమ్భదృక్
స జగద్ద్వైతమేవేదం హేమేవాఙ్గదరూపకమ్. 41

అంగదాది ఆభరణముల నామరూపములకంటె సువర్ణము వేఱైనట్లు, నామరూపమయమై, ద్వైతాత్మకమై, మిథ్యయైనట్టి జగత్తుకంటె, నిజస్వరూపభూతుఁడగు పరమాత్మ సదా వేఱైయే యున్నాఁడు.

రిక్తం దేశాదిశబ్దార్థైర్దేశకాలక్రియాత్మకమ్
యథా స్థితమిదం తత్రసర్వమస్తి న వాస్తి చ. 42

ఆ యాత్మ దేశకాలక్రియాదుల శబ్దార్థరహితమైయు, దేశకాల క్రియాస్వరూపమైయు గూడ నొప్పుచున్నది. మఱియు, యథాస్థితమగు ఈసమస్త జగత్తున్ను అధిష్ఠానరూపముచే సద్దాని యందుండియున్నది. నిజ (దృశ్య) రూపముచే లేకయునున్నది.

యథోర్మ్యాది సమే తోయే చిత్రం చిత్రకృదీహితే
భాణ్డవృన్దం మృదః పిణ్డే తథేదం బ్రహ్మణి స్థితమ్. 43

శాంత సముద్రమున తరంగాదులున్ను, చిత్రకారుని చిత్తమందు చిత్రమున్ను, మృత్తికా పిండమున పాత్రసమూహమున్ను నున్నవిధమున బ్రహ్మమున ఈ జగత్తున్ను గలదు.

తథైతదత్ర నో భిన్నం నాభిన్నం నాస్తిచాస్తి చ
నిత్యం తన్మయమేవాచ్ఛం శాన్తే శాన్తమిదం తథా 44

ఈ ప్రకారముగ జగత్తు పరమాత్మయందు అభిన్నముగాను, భిన్నముగానుగూడ నున్న దగును. కావున నది పరమాత్మయందున్నది. లేకయున్నదికూడను. తత్త్వజ్ఞానముచే ఈజగత్తు, నిత్యమై, నిర్మలమై, శాంతమైనట్టి పరమాత్మయందు తన్మయముగను, శాంతముగను వెలయుచున్నదే యగును.

అఖానితైవ భాతీయం త్రిజగచ్ఛాలభఞ్జికా
స్వరసస్యైవ దృశ్యత్వమితా బ్రహ్మణి దారుణి. 45

మహాస్తంభమున నింకను జెక్కఁబడని విగ్రహమువలె ఈత్రైలోక్యమను బ్రతిమ, బ్రహ్మమను కొయ్యయందు నిజసాక్షిచైతన్యమను శిల్పికిఁ గానుపించుచున్నది.

నిఖాతా దృశ్యతాం యాన్తి స్తమ్భస్థాః శాలభఞ్జికాః
అస్మిన్నక్షోభ్య ఏవాన్తస్తరఙ్గాః సృష్టిదృష్టయః 46

స్తంభమందలి విగ్రహములా స్తంభము చెక్కఁబడినపిదపయే కానుపించును. కాని బ్రహ్మమందో, ఆ బ్రహ్మము వికారరహితమైయుండినప్పటికిని సృష్ట్యాత్మకములైన వివర్తరూప తరంగములందు దృగ్గోచరమగుచున్నవి.

సరస్యతిరసే భాన్తి చిద్ఘనామృతవృష్టయః
అవిభాగే విభాగస్థా అక్షోభే క్షుభితా ఇవ.
అవిభాత విభాన్తీవ చిద్ఘనే సృష్టిదృష్టయః. 47

నిరతిశయానందమను జలముచేఁ బూర్ణమైనట్టి చైతన్యమను సరోవరమున, చిన్మయ మేఘామృత వృష్టితుల్యములగు యీ సృష్టులు భాసించుచున్నవి. అవ్వియవి, విభాజకధర్మరహితమై, క్షోభవర్జితమైనట్టి చిద్ఘన బ్రహ్మమందు విభాగయుక్తములుగను, క్షోభసహితములుగను, వాస్తవముగఁ బ్రకాశింపకయున్నప్పటికిని బ్రకాశించుచున్నవివలెను అవిద్యచే దోఁచుచున్నవి.



పరమాణౌ పరమాణావత్ర సంసారమణ్డలమ్
విభాతి భాసురారమ్భం న విభాతి చ కించన. 48

ఈ చిద్ఘన రూపమగు బ్రహ్మమున పరమాణు పరమాణువందును ప్రపంచమండలము ప్రకాశ మయమగు ఆరంభసహితమై భాసించుచున్నది. కాని వాస్తవముగ నేమియు భాసించుటలేదు.

ఆకాశకాలపవనాదిపదార్థజాత
మస్యాఙ్గమఙ్గరహితస్య తదప్యనఙ్గమ్
సర్వాత్మకం సకలభావవికారశూన్య
మప్యేతదాహురజరం పరమార్థతత్త్వమ్. 49

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే బ్రహ్మస్వరూపవర్ణనం నామ ద్విపఞ్చాశః సర్గః ॥ 52 ॥

ఓ రామచంద్రా! అవయవరహితమై, నిరాకారమైనట్టి యీపరమాత్మకు, ఆకాశ, వాయు కాలాది పదార్థసమూహము అవయవరూపముగ వర్ణింపఁబడుట యేది గలదో, అదియు మిథ్యయై యున్నది. కావున, అధిష్ఠానమాత్రముగ శేషించుటచే ఆపరమాత్మ నిరవయవమే యగును. ఇవ్విధమున ఈ జరామరణవర్జితమైనట్టి పరమార్థమయమగు ఆత్మతత్త్వము సర్వభావవికారరహితమై యున్నప్పటి కిన్ని, అధ్యారోపదృష్టిచే శ్రుతులద్దానిని సర్వరూపమని వర్ణించినవి.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున బ్రహ్మస్వరూపవర్ణనమను యేబది రెండవ సర్గము ॥ 52 ॥

---

## త్రిపఞ్చాశః సర్గః

[అధ్యారోపితచేత్యానాం ప్రాతిస్వికభిదాజుషామ్ ।
భావస్త్వప్రత్యయాత్యర్థో బ్రహ్మైవేత్యుపవర్ణ్యతే ॥

ప్రాతిభాసిక భేదయుక్తములగు అధ్యారోపిత విషయములందేసత్త గలదో, అది బ్రహ్మ రూపమే యని యిట వర్ణింపబడుచున్నది.]

శ్రీరామ ఉవాచ:—

యథా చేత్యే చేతనతా యథా కాలే చ కాలతా
యథా చ వ్యోమతా వ్యోమ్ని యథా చ జడతా జడే. 1
యథా వాయౌ చ వాయుత్వమభూతాదావభూతతా
యథా స్పన్దాత్మని స్పన్దో యథా మూర్తే చ మూర్తతా. 2

యథా భిన్నే చ భిన్నత్వం యథాఽనన్తే హ్యనన్తతా
యథా దృశ్యే చ దృశ్యత్వం యథా సర్గేషు సర్గతా. 3
ఏతత్క్రమేణ హే బ్రహ్మన్వద మే వదతాం వర
ఆదితః ప్రతిపాద్యైవ బోధ్యన్తే హ్యల్పబోధినః. 4

శ్రీరాముఁడు:— వక్తలలో శ్రేష్ఠుఁడవగునో మహాత్మా! స్మృతివిషయమున స్మృతివిషయత్వమున్ను, కాలమందు, కాలత్వమున్ను, ఆకాశమం దాకాశత్వమున్ను, జడమందు జడత్వమున్ను, వాయువందు వాయుత్వమున్ను, భూత భవిష్యద్వర్తమానములందు భూత భవిష్యద్వర్తమానత్వమున్ను స్పందమున స్పందత్వమున్ను, మూర్తమందు మూర్తత్వమున్ను, భిన్నమందు భిన్నత్వమున్ను, అనంతమున అనంతత్వమున్ను, దృశ్యమందు దృశ్యత్వమున్ను, సృష్టులందు సృష్టిత్వమున్ను నెట్లుగలవో యావిషయమును (సర్వవస్తువులయొక్క అసాధారణ రూపమును) గూర్చి క్రమముగ నాకు వచింపఁబ్రార్థన. అల్పజ్ఞులగు శిష్యులను గురు జనులు మున్నుగువారు సమస్తవిషయములను ప్రతిపాదించి బోధింతురుగదా!

## శ్రీవసిష్ఠ ఉవాచ:—

తదనన్తం మహాకాశం మహాచిద్ఘనముచ్యతే
అవేద్యచిద్రూపమయం శాన్తమేకం సమస్థితి. 5

శ్రీ వసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! ఆ సమస్తవస్తువులయొక్క సత్తకాధారమైనదేది గలదో, అది అనంత మహాకాశమై, అవేద్యమై, చిద్రూపమయమై, శాంతమై, ఏకమై, సర్వత్ర సమమై యున్నట్టి మహాచిద్ఘనమగు బ్రహ్మమనియే వచింపబడెను.

బ్రహ్మవిష్ణ్వీశ్వరాద్యన్తే మహాప్రలయనామని
శబ్దార్థే రూఢిమాపన్నే యచ్ఛుద్ధమవశిష్యతే. 6
సర్గస్య కారణం తత్ర న కించిదుపపద్యతే
మలమాకారబీజాది మాయామోహభ్రమాదికమ్. 7

మహాప్రళయమను సర్వనాశ సమయమున బ్రహ్మ విష్ణు మహేశ్వరులున్ను శమింప, నామరూపములన్నియు అంతర్ధానముకాఁగా, ఏ శుద్ధసన్మాత్రము శేషించుచున్నదో, అద్దానియందు జన్మకు గారణమైనట్టి మాయా, మోహ, భ్రమ, పాపాది ఆకృతులుగల్గిన బీజాదులెవ్వియును లేవు.

కేవలం శాన్తమత్యచ్ఛమాద్యన్తపరివర్జితమ్
తద్విద్యతే యత్ర కిల ఖమపి స్థూలమశ్మవత్. 8

ఏద్దానియందు ఆకాశమున్ను శిలవలె స్థూలముగ, గన్పట్టునో, అట్టి పరమసూక్ష్మమై, కేవలము శాంతమై, అతి నిర్మలమై, ఆద్యంతరహితమైనట్టి సన్మాత్రమే యా బ్రహ్మము.

నచ నాస్తీతి తద్వక్తుం యుజ్యతే చిద్వపుర్యదా
నచైవాస్తీతి తద్వక్తుం యుక్తం శాన్తమలం తదా. 9



ఎపుడా చిన్మాత్రశరీరము మాయా మల రహితమై యున్నదో అప్పుడీక నది లేదనిగాని కలదనిగాని వాచ్యవృత్తిచేఁ జెప్పనలవికానిదే యగుచున్నది.

నిమేషే యోజనశతే ప్రాప్తాయామాత్మసంవిది
మధ్యే తస్యాస్తు యద్రూపం రూపం తస్య పదస్య తత్. 10

వృక్షశాఖ ద్వారా చంద్రుని గాంచునపుడు నిమిషమాత్రములో నేత్రవృత్తిద్వారా ద్రష్టయొక్క సంవిత్తు (జ్ఞానము) యాశాఖనుండి యనేక వేల యోజనములదూరమున నున్న చంద్రునిఁ బొంద, ఆ శాఖా చంద్రుల మధ్యనున్న నిర్విషయమగు జ్ఞానస్వరూప మేదికలదో అదియే యా పరమాత్మ పదముయొక్క రూపమైయున్నది.

సబాహ్యాభ్యన్తరే శాన్తే వాసనావిషయభ్రమే
సర్వచిన్తావిహీనస్య ప్రబుద్ధస్యార్ధరాత్రతః. 11
శాన్తం నిఃసుఖదుఃఖస్య పురుషస్యైవ తిష్ఠతః
యదస్పన్ది మనోరూపం రూపం తస్య పదస్య తత్. 12

బాహ్యాభ్యంతర వాసనాజాలము, విషయముల భ్రమ శమింప, సర్వ చింతారహితుఁడై, యున్నవాడును, గాఢ నిద్రనుండి అర్ధరాత్రి మేల్కొనినవాఁడును, విషయములఁగూర్చిన సుఖదుఃఖములు తొలగినవాఁడును, శాంతముగ నున్నవాడును, సమాధియందారూఢుఁడై వెలయుచున్న వాఁడునగు యోగియొక్క నిశ్చల మనంబుయొక్క రూపమేది గలదో, అదయే ఆయాత్మ పదముయొక్క రూపమైయున్నది.

తృణగుల్మాఙ్కురాదీనాం సత్తాసామాన్యమాతతమ్
యదుద్భావోద్భవం రూపం రూపం తస్య పదస్య తత్. 13

తృణ, గుల్మ, అంకుర, లతాది సమస్తపదార్థములందు వ్యాపించియున్నదై, వాని యుత్పత్తియందు హేతుభూతమైనట్టి సత్తాసామాన్య రూపమేది గలదో, అదియే యా ఆత్మ పదముయొక్క స్వరూపమైయున్నది.

తస్మిన్పదే జగద్రూపం యదిదం దృశ్యతే స్ఫుటమ్
సకారణమివాకారకరాలమివ భేదవత్. 14
తత్సర్వం కారణాభావాన్న జాతం న చ విద్యతే
నాకారయుక్తం న జగన్న చ ద్వైతైక్యసంయుతమ్. 15

ఆ సత్తాసామాన్య రూపమగు ఆత్మ పదమున, ఆకార యుక్తముగను, భేద సహితముగను, సకారణముగను నున్నట్లు తోచుచునే యీ జగద్రూపము స్పష్టముగఁ గానుపించుచున్నదో, అది యంతయు కారణముయొక్క అభావమువలన నుత్పన్నముకానిదేయగుచు, లేనిదేయైయున్నది. కావున నయ్యది వాస్తవముగ ఆకారయుక్తముగను లేదు. ద్వైత, ఏకత్వ సహితముగను లేదు.

యదకారణకం తస్య సత్తా నేహోపపద్యతే
స్వయం నిత్యానుభూతేఽర్థే కోఽత్రాపహ్నవశక్తిమాన్. 16

ఏది కారణరహితమైయున్నదో, అద్దానికి (జగత్తునకు) యిచట సత్తయుండఁజాలదు. ఇక నేది స్వయముగ నిత్యానుభూత స్వరూపమైయున్నదో, అద్దాని నిటనుండి దొలగించుట కెవరు సమర్థులగుదురు?

నచ శూన్యమనాద్యన్తం జగతః కారణం భవేత్
బ్రహ్మామూర్తం సమూర్తస్య దృశ్యస్యాబ్రహ్మరూపిణః. 17

బ్రహ్మమున్ను జగత్తునకు కారణము కాఁజాలదు. ఏలయనిన దృశ్య శూన్యమై ఆద్యంత రహితమై, చిద్రూపమై, నిరాకారమైనట్టి బ్రహ్మము సాకారమై, దృశ్యమై అబ్రహ్మ రూపమైనట్టి జగత్తునకు కారణమెట్లగును?

తస్మాత్తత్ర జగద్రూపం యదాభాతం తదేవ తత్
స్వయమేవ తదాభాతి చిదాకాశమితి స్థితమ్. 18

కాఁబట్టి యీప్రకారమగు కారణరహిత బ్రహ్మమందు ఏ జగద్రూపము భాసించుచున్నదో, అది చిదాకాశమే స్వయముగ తద్రూపమున నున్నదగును.

జగచ్చిద్బ్రహ్మభావాచ్చ తథా భావో భ్రమాదివ
సర్వమేకమజం శాన్తమద్వైతైక్యమనామయమ్. 19

ఇట్లు జగత్తు చిద్రూపమగు బ్రహ్మమేయగుటచే, ఘటపటాద్యాకారము లెవ్వి స్ఫురించుచున్నవో, అవి భ్రమసిద్ధములేయగును. కావున సర్వత్ర, ఏకమై, అజమై, శాంతమై, ద్వైత, ఏకత్వ రహితమై, సర్వరూపమై, నిర్వికారమైనట్టి బ్రహ్మమే యుండియున్నది.

పూర్ణాత్పూర్ణం విసరతి పూర్ణే పూర్ణం విరాజతే
పూర్ణమేవోదితం పూర్ణే పూర్ణమేవ వ్యవస్థితమ్. 20

భ్రమ శమింప, పూర్ణమగు బ్రహ్మమునుండి పూర్ణమగు జగత్తు ప్రసరించినదగును. అట్లే పూర్ణమగు బ్రహ్మమునఁ బూర్ణమగు జగత్తు ఉదయించినదై, విరాజిల్లుచున్నదగును.

శాన్తం సమం సముదయాస్తమయైర్విహీన
మాకారముక్తమజమమ్బరమచ్ఛమేకమ్
సర్వం సదా సదసదేకతయోదితాత్మ
నిర్వాణమాద్యమిదముత్తమబోధరూపమ్. 21

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు
నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే నిర్వాణవర్ణనం నామ
త్రిపఞ్చాశః సర్గః ॥ 53 ॥

కావున ఈ జగత్తంతయు సదాసర్వాకారవర్జితమై, శాంతమై, సమమై, ఉదయాస్త రహితమై, అజమై, ఆకాశమువలె నిర్మలమై, ఏకమై, సదసద్రూపమున వ్యక్తమై, నిర్వాణ స్వరూపమై, ఆద్యమై, ఉత్తమబోధరూపమైనట్టి బ్రహ్మమేయైయున్నది.



ఇది శ్రీవాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున
నిర్వాణవర్ణనమను యేబదిమూఁడవ సర్గము ॥ 53 ॥

---

## చతుఃపఞ్చాశః సర్గః

[సర్వం వస్తు స్వభావస్థం స్వభావేన క్రియాభిదే
అవికారమతోఽద్వైతం సన్మాత్రమితి వర్ణ్యతే॥

ఈ జగత్తంతయు బ్రహ్మస్వభావమున స్థితినొంది యున్నది. వివర్తభావము చేతనే క్రియాభేదాదిద్వైతము జనించినదిగాని వాస్తవముగ సర్వము నిర్వికారమై అద్వైతమైనట్టి సన్మాత్రమే యని యిట వర్ణింపఁబడుచున్నది.]

శ్రీవసిష్ఠ ఉవాచ:—

జగన్నామ నభః స్వచ్ఛం సద్బ్రహ్మ నభసి స్థితమ్
నభో నభసి భాతీదం జగచ్ఛబ్దార్థ ఇత్యజమ్. 1

శ్రీ వసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! ఈజగత్తును నిర్మలమైన యాకాశము సద్రూపమగు బ్రహ్మకాశమున స్థితినొందియున్నది. ఇట్లు జగద్రూపముతోటి చిదాకాశమే చిదాకాశమున నెలకొనియున్నదగును. కావున జగచ్ఛబ్దముయొక్కయు, ఘటపటాది శబ్దములయొక్కయు అర్థము, జన్మాది వికారశూన్యమగు బ్రహ్మమేయైయున్నది.

త్వమహం జగదిత్యాది శబ్దార్థో బ్రహ్మ బ్రహ్మణి
శాన్తం సమసమాభాసం స్థితమస్థితమేవ సత్. 2

'నీవు' 'నేను' జగత్తు ఈమున్నగు శబ్దములయర్థము చిదాకాశములోటి సమముగ భాసించుచున్నదై, అద్దానికంటె భిన్నముగ లేనిదై, శాంతమై, సద్రూపమైనట్టి బ్రహ్మమేయగుచు బ్రహ్మమందు వెలయుచున్నది.

సముద్రగిరిమేఘోర్వీనిస్ఫోటమయమవ్యజమ్
కాష్ఠమౌనవదేవేదం జగద్బ్రహ్మవతిష్ఠతే. 3

సముద్ర, పర్వత, మేఘ, పృథివ్యాది సమస్త పదార్థములును, జన్మాదిరహితమై కాష్ఠమువలె మౌనముగ నున్నట్టి బ్రహ్మముగనే యుండియున్నవి.

ద్రష్టా ద్రష్టైవ దృశ్యస్య స్వభావాత్స్వాత్మని స్థితః
కర్తా కర్త్రైవ కర్తవ్యాభావతః కారణాదృతే. 4

అట్లే దృశ్య స్వభావరహితుఁడై ద్రష్టయు, కర్తవ్యకారణ స్వభావరహితుఁడై కర్తయు, చిన్మాత్ర స్వభావమగు స్వాత్మయందే స్థితినొందియున్నవారై యున్నారు.

న జ్ఞత్వం న చ కర్తృత్వం న జడత్వం న భోక్తృతా
న శూన్యతా న చార్థత్వమిహ నాపి నభోర్థతా. 5

కావున, దృశ్యముయొక్క అభావముచే, శుద్ధ చిత్స్వరూపమున, జ్ఞత్వముగాని, కర్తృత్వముగాని, భోక్తృత్వముగాని, జడత్వముగాని, శూన్యత్వముగాని, పదార్థత్వముగాని, ఆకాశత్వముగాని, లేకయున్నవి

శిలాజఠరవత్సత్యం ఘనమేకమజం తతమ్
సర్వం శాన్తమనాద్యన్తమేకం విధినిషేధయోః. 6

సమస్తము కేవలము శిలామధ్యభాగమువలె సచ్ఛిద్రఘనమై, ఏకమై, అజమై, సర్వవ్యాపకమై, శాంతమై, ఆద్యంతరహితమై, విధినిషేధములందు సమానరూపమైనట్టి పరబ్రహ్మమేయై యున్నది.

మరణం జీవితం సత్యమసత్యం చ శుభాశుభమ్
సర్వమేకమజం వ్యోమ వీచిజాలజలం యథా. 7

తరంగ సమూహము జలమాత్రమే యగునట్లు, జీవనమరణములు, సత్యాసత్యములు, శుభాశుభములు మున్నగు సమస్తమున్ను ఏకమై, అజమైనట్టి చిదాకాశమేయై యున్నది.

విభాగ ఏవ దృశ్యత్వం ద్రష్టృత్వం చైవ గచ్ఛతి
ఏతచ్చ కల్పనం స్వప్నపురాదిష్వనుభూయతే. 8

భ్రమచే బ్రహ్మము జీవరూపమున విభాగమునొంద, ఆ చైతన్యమగు బ్రహ్మమే చిదంశప్రాధాన్యముచే ద్రష్టగను, సదంశప్రాధాన్యముచే దృశ్యముగను నగుచున్నది. ఇట్టికల్పన (చైతన్యము ద్రష్టృదృశ్యాదులగుట) స్వప్నకల్పిత నగరాదులందనుభూతమగుచున్నది.

ఏవమచ్ఛం పరాకాశే స్వప్నపత్తనవజ్జగత్
భాతి ప్రథమమేవేదం బ్రహ్మైవేత్థమతః స్థితమ్. 9

కావున, సృష్టికిఁ బూర్వము ప్రథమమున ఏ నిష్ప్రపంచమగు బ్రహ్మముండి యుండెనో, అదియే యిపుడును తన నిర్మల చిదాకాశమున స్వప్ననగరాదులవలె ఈ జగద్రూపమున స్థితినొంది యున్నది.

తదిదం తాదృశం విద్ధి సర్వం సర్వాత్మకం చ యత్
దేశాద్దేశాన్తరప్రాప్తౌ విదో మధ్యమనఙ్కితమ్. 10

ఓ రామచంద్రా! కాబట్టి సర్వాత్మకమగు ఈసమస్తజగత్తున్ను నిష్ప్రపంచ బ్రహ్మరూపమునఁ బ్రథమమున నెట్లుండెనో, అట్లే, యిపుడును నుండియున్నదని యెఱుఁగుము. చంద్రాదులను దర్శించునపుడొకప్రదేశమునుండి మఱియొకప్రదేశమునకు నేత్రవృత్తి చనఁగా ఆరెండు ప్రదేశముల మధ్యనుండు నిర్విషయమైన చైతన్యరూపమేది గలదో, అదియే యాశుద్ధ బ్రహ్మముయొక్క రూపమగును.

చిద్వ్యోమ్నః శాన్తశాన్తస్య మధ్యమే చైవమాస్థితమ్
జగత్తథైవ సలిలమేవోర్మ్యాదితయా యథా. 11



తరంగాదులయొక్క పూర్వ, ఉత్తర, మధ్యమస్థితులందును సముద్రము జలరూపమే యగునట్లు, ఈ జగత్తున్ను సృష్టియొక్క పూర్వ, ఉత్తర, మధ్యమ (వర్తమాన) స్థితులందును శాంతమగు చిదాకాశరూపమేయైయున్నది.

యదుదేత్యుదితం యచ్చ యచ్చ నోదేతి నోదితమ్
దేశాద్దేశాన్తరప్రాప్తౌ విదో మధ్యాన్న భేదితమ్. 12

ఎయ్యది ఆరోపితజగద్రూపముచే నుదయించినప్పటికిని సత్యమగు అధిష్ఠానబ్రహ్మరూపముచే నుదయింపకనేయున్నదో అట్టి ఈ జగత్తు ఒక ప్రదేశమునుండి మఱియొకప్రదేశమునకు నేత్రవృత్తి చనినపుడు మధ్యనున్న నిర్విషయ చైతన్యము కంటె భిన్నముకానిదైయున్నది.

అతః కిలాస్య సర్గస్య కారణం శశశృఙ్గవత్
ప్రయత్నేనాపి చాన్విష్టం న కించిదుపలభ్యతే. 13

అట్లు చైతన్యముకంటె భిన్నముకానందుచే ఈ సృష్టియొక్క కారణము శశశృంగము (కుందేటికొమ్ము)వలెఁ బ్రయత్నముచే నన్వేషింపఁబడినను నేమియు లభింపకయున్నది.

యదకారణకం భాతి తదభాతం భ్రమాత్మకమ్
భ్రమస్యాసత్యరూపస్య సత్యతా కథముచ్యతే. 14

ఏది కారణములేకయే భాసించుచున్నదోఁ అది భ్రమాత్మకమై, వాస్తవముగ భాసింపకయున్నదే యగును. కావున నిట్టి యసత్యమై, భ్రమరూపమైనట్టి జగత్తు సత్యమని యెట్లు చెప్పఁబడును.

కారణేన వినా కార్యం కిల కిం నామ విద్యతే
యదపుత్రస్య సత్పుత్రదర్శనం స భ్రమో న సత్. 15

కారణములేక యే కార్యముండునో, అద్దాని సత్తయెట్లుండగలదు! వంధ్యాపతియొక్క స్వప్నమందలి పుత్రదర్శనము భ్రమయేకాని సత్యముకాదుగదా!

యత్స్వకారణకో భాతి స స్వభావో విజృమ్భతే
సర్వరూపేణ సంకల్పగంధర్వనగరాదివత్. 16

ఏది కారణములేకయే భాసించుచున్నదో, అది సంకల్ప, గంధర్వనగరాదులవలె ద్రష్టయొక్క చైతన్యమే, యట్లు సర్వరూపముచే విజృంభించినదగును.

దేశాద్దేశాన్తరప్రాప్తౌ క్షణాన్మధ్యం విదోవపుః
స్వరూపమజహత్త్వేవ రాజతేఽర్థవివర్తవత్. 17

క్షణకాలములో నొకప్రదేశమునుండి సూర్యాది అన్యప్రదేశమునకు నేత్రవృత్తిద్వారా సంవిత్తు జనునపుడాయుభయ ప్రదేశముల మధ్యనుండు నిర్విషయ చైతన్యరూపమేది గలదో, అదియే తన స్వరూపమును త్యజింపకయే రజ్జుసర్పమువలె వివర్తాకారముగ (జగత్తుగ) భాసించుచున్నది.

బోధ ఏవ కచత్యర్థరూపేణ స చ ఖాదణుః
దృష్టాన్తోఽత్రానుభూతోఽన్తః స్వప్నసంకల్పపర్వతః. 18

ఆకాశముకంటె సూక్ష్మమైనట్టి బోధరూపమగుచైతన్యమే పదార్థాకారముగఁ బ్రకాశించుచున్నది. అంతఃకరణమున ననుభూతమగు స్వప్న, సంకల్పపర్వతమే యిట దృష్టాంతమైయున్నది.

శ్రీరామ ఉవాచ:—

విద్యతే వటబీజాన్తర్యథా భావిమహాద్రుమః
పరమాణౌ తథా సర్గో బ్రహ్మన్కస్మాన్న విద్యతే. 19

శ్రీరాముడు;- మహాత్మా! వటబీజములోన భావికాలపు మహావృక్షముండు విధమున సూక్ష్మమగు చైతన్యపరమాణువందు జడరూపమగు జగత్తున్ను నుండునని యేల తలంపరాదు?

శ్రీవసిష్ఠ ఉవాచ:—

యత్రాస్తి బీజం తత్రస్యాచ్ఛాఖా వితతరూపిణీ
జన్యతే కారణైః సా చ వితతా సహకారిభిః. 20

శ్రీ వసిష్ఠుడు;- ఓ రామచంద్రా! ఎచట సాకారమగు బీజము గలదో అచటనే మృత్తికాజలాది సహకారి కారణములచే అంకురాదిక్రమమున విస్తరించినదై విశాల శాఖాయుక్తమగు వృక్షమావిర్భవించుచున్నది.

సమస్తభూతప్రలయే బీజమాకారి కిం భవేత్.
సహకార్యథ కిం తస్య జాయతే యద్వశాజ్జగత్. 21

మహాప్రళయమున సమస్తభూతములు నశింప నింక దేనినుండి జగత్తు ఉత్పన్నముకాఁగలదో యట్టిసాకారమగు బీజమేది? దానికి సహకారికారణము లెచట?

యత్తు బ్రహ్మ పరం శాన్తం కా తత్రాకారకల్పనా
పరమాణుత్వయోగేఽపి నాత్ర కేవాత్ర బీజతా. 22

మఱియు ఏది శాంతమై, శుద్ధమై, నిరాకారమైయున్నదో, అట్టి పరబ్రహ్మమందు ఆకారకల్పన యెచట? పరమాణువుయొక్క సంబంధమున్ను లేదో, అచట బీజత్వ మెట్లుండఁగలదు?

కారణస్యేతి బీజస్య సత్యాసత్త్వైకకారిణః
అసంభవాజ్జగత్సత్తా కథం కేన కుతః క్వ కా. 23

ఈప్రకారముగ సదసద్రూపమగు బీజరూపమైన కారణము అసంభవమగుటచే జగత్సత్తయేది యెట్లు దేనిచే నెచట నేరీతి యుండఁగలదు?

జగదాస్తే పరస్యాణోరన్తరిత్యపి నోచితమ్
సార్షపే కణకే మేరురాస్త ఇత్యజ్ఞకల్పనా. 24

పరమాత్మయను అణువునందు జగత్తుకలదని యనుటయు నుచితముకాదు. ఆవగింజయొక్క లేశమందు మేరుపర్వతము గలదనుట అజ్ఞాని కల్పనయేగదా.

సతి బీజే ప్రవర్తన్తే కార్యకారణదృష్టయః
నిరాకారస్య కిం బీజం క్వ జన్యజనకక్రమః. 25



జగత్తు నిరాకారమని యనినచో, సాకారమగు బీజమున్నపుడే కార్యకారణ దృష్టులు ప్రవర్తించునుగాని నిరాకారమగు దానికింక బీజమేమి? జన్యజనక క్రమమెచట?

అతో యత్పరమం తత్త్వం తదేవేదం జగత్స్థితమ్
నేహ ప్రథయతే కించిన్న చ కించిద్వినశ్యతి. 26

కావున ఏ పరమతత్త్వమగు బ్రహ్మముగలదో, అదియే (మాయచే) యీ జగద్రూపముగ స్థితినొందియున్నది. అందుచే వాస్తవముగ నిట నేదియు నుత్పన్నమగుటలేదు, నశించుటలేదు.

చిదాకాశశ్చిదాకాశే హృది చిత్త్వాజ్జగద్భ్రమమ్
అశుద్ధవదివాశుద్ధే శుద్ధం శుద్ధే ప్రపశ్యతి. 27

చిదాకాశమున చిదాకాశమే జగద్రూపముగ నెలకొనియున్నది. చిత్తమందలి చైతన్యముయొక్క స్ఫురణచే ఈ జగద్భ్రమ యుదయించుచున్నది. కావున అశుద్ధ చిత్తమందు అశుద్ధరూపమును శుద్ధ చిత్తమందు శుద్ధ (బ్రహ్మ)రూపమును జీవుఁడు గాంచుచున్నాఁడు.

ఖమేవాభాసతే తస్య రూపం స్పన్ద ఇవానిలే
సర్గశబ్దార్థకలనా నేహ కాశ్చన సన్తి నః. 28

అట్టి శుద్ధ చిత్తముగలవానికి, వాయువందు, చలనమువలె, చిదాకాశమే యీ జగద్రూపముగ భాసించును. మా సిద్ధాంతమందు సృష్టిశబ్దార్థకల్పన యెద్దియును లేదు.

యథా శూన్యత్వమాకాశే ద్రవత్వం చ యథా జలే
అన్యతాత్మమయీ శుద్ధా సర్గతేయం తథాత్మని. 29

ఆకాశమందు శూన్యత్వమున్ను, జలమందు ద్రవత్వమును నున్నవిధమున, ఆత్మయందు ఆత్మవివర్తరూపమై శుద్ధమైనట్టి యీ సృష్టిరూపమగు అన్యత్వమున్ను గలదు.

భారూపమిదమాశాన్తం జగద్భ్రాన్త్యైవ నస్తతమ్
అనాదినిధనం సత్యం నోదేతి న చ శామ్యతి. 30

మా సిద్ధాంతమందీ జగత్తు సర్వథా శాంతమై, వ్యాపకమై, సత్యమై, ఆద్యంతరహితమైనట్టి బ్రహ్మమేయగును. కావున వాస్తవముగ నిది యుదయించుటలేదు. అస్తమించుట లేదు.

దేశాద్దేశాన్తరప్రాప్తౌ క్షణాన్మధ్యే విదో వపుః
యత్తజ్జగదితీదం వ్యోమాత్మని వ్యవస్థితమ్. 31

క్షణకాలములో శాఖాది ప్రదేశమునుండి చంద్రాదిప్రదేశమునకు చేతన వృత్తి చనునపుడు, ఆ రెండు ప్రదేశముల మధ్యయం దేనిర్విషయమగు శుద్ధచైతన్య స్వరూపముగలదో, అట్టి రూపముతోటియే యీ జగత్తు చిదాకాశమందు నెలకొనియున్నది.

యథా స్పన్దోఽనిలే తోయే ద్రవత్వం వ్యోమ్ని శూన్యతా
తథా జగదిదం భాతమనన్యాశ్లేషమాత్మని. 32

వాయువందు స్పందమున్ను, జలమందు ద్రవత్వమున్ను, ఆకాశమందు శూన్యత్వమున్ను, భాసించువిధమున, ఆత్మయందీజగత్తున్ను, అసంగ, అద్వయరూపముతోటి భాసించుచున్నది.

సంవిన్నభో నను జగన్నభ ఇత్యనర్క-
మాత్మన్యవస్థితమన స్తమయోదయం క్వ
తత్త్వజ్ఞభూతమఖిలం తదనన్య దేవ
దృశ్యం నిరస్త కలనోఽమ్బరమాత్రమాస్స్వ. 33

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు
నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే అద్వైతైక్యప్రదపాతినం నామ
చతుః పఞ్చాశః సర్గః ॥ 54 ॥

ఓ రామచంద్రా! ఈజగత్తు శుద్ధ చిదాకాశరూపమేయై ఆత్మయందు స్థితిగల్గియున్నది. అట్లున్నది భూతాకాశ మెన్నటికి కాజాలదు. ఏలయనిన, సూర్యరహితమై, తత్సూర్యుని ఉదయాస్తమయ వర్జితమైనట్టి ఆత్మయందు పరమార్థ స్వరూప మాత్రముననున్నది భూతకాశమని, యెచట ప్రసిద్ధమైయున్నది? లేక, సూర్యరహితమై సూర్యుని ఉదయాస్తమయములులేని భూతాకాశమేని యెచట ప్రసిద్ధమైయున్నది? గావున సమస్తమునకు సారభూతమైనట్టియే సచ్చిత్స్వభావమగు ఆత్మ గలదో, అద్దానిఅంగభూతమే యీసమస్త ప్రపంచమున్ను అయి, దానికంటెవేఱుగాకయున్నది. కాబట్టి నీవు సకల దృశ్య (నామరూప) కల్పననువిడనాడి శుద్ధచిదాకాశ మాత్రుడవై స్థితినొందియుండుము.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున -
అద్వైతైక్య ప్రతిపాదమను యేబదినాల్గవ సర్గము ॥54॥

---

పఞ్చపఞ్చాశః సర్గః

[అన్యభావనయాన్యాం స్వాం పశ్యన్తీ చిజ్జగత్స్థితా
స్వభావనాదనన్యేతి పరమార్థమయం జగత్॥
అన్యభావనచే అన్యరూపముగను నిజస్వరూప భావనచేఁ బరమార్థమయమగు బ్రహ్మముగను చైతన్య మీ జగత్తును గాంచుచున్నదను విషయము నిచటవర్ణింపఁబడుచున్నది.]

శ్రీ వసిష్ఠ ఉవాచః—

భావాభావగ్రహోత్సర్గస్థూలసూక్ష్మ చరాచరాః
ఆదావేవ హి నోత్పన్నాః సర్గాదౌ కారణం వినా. 1

శ్రీవసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! భావాభావములు, గ్రహణ త్యాగములు, స్థూలసూక్ష్మములు, స్థావరజంగమములు మున్నగునవియన్నియు కారణములేమి సృష్ట్యాదియందే యుత్పన్నముగాక యున్నవి.



న త్వమూర్తో హి చిద్ధాతుః కారణం భవితుం క్వచిత్
స్వాత్మా శక్తః స మూర్తానాం బీజముర్వీరుహామివ. 2

నిరాకారమై స్వాత్మరూపమైనట్టి చైతన్యమే సాకార పదార్థము యొక్కయు కారణము కాఁజాలదు. ఏలయనిన వృక్షముల బీజమువంటి సాకారపదార్థమే తదితర సాకారపదార్థములకు కారణము కాఁగలదు.

స్వభావమేవ సతతం భావయన్భావనాత్మకమ్
ఆత్మనేవ హి చిద్ధాతుః సర్వోఽనుభవవాన్స్థితః. 3

ఇక్కారణమున తత్త్వజ్ఞాని సమస్తజగత్తును, చిత్స్వభావముగనే భావించుచు సదా ఆత్మయందే నెలకొనియుండును.

ఆస్వాదయతి యంభావం చిద్ధాతుర్గగనాత్మకః
లబ్ధః సర్గః ప్రలాపేన క్షీబః క్షుబ్ధతయా యథా. 4

మద్యపానాదులవలని క్షోభముచే తనవలన తానే ప్రలాపాదులతోఁ గూడిన ప్రమత్తతను బొందునట్లు ఆకాశరూపమగు చైతన్యమున్ను తానెట్లు భావించుచున్నదో ఆ ప్రకారముగనే తన నిజరూపమున ఈ సృష్టిని బొందుచున్నది.

యదా సర్వమనుత్పన్నం నాస్త్యేవాపి చ దృశ్యతే
తదా బ్రహ్మైవ విద్ధీదం సమం శాన్తమసత్సమమ్. 5

ఓ రామచంద్రా! ఎపుడీ సమస్తమున్ను కానుపించు చున్నప్పటికిని భావనామయమై వాస్తవముగ నుత్పన్నముగాకయే యున్నదో, అపుడిట్టి మిథ్యాభూతమగు జగత్తునంతయు (అధిష్ఠాన దృష్టిచే) శాంతమై, సమమైనట్టి బ్రహ్మముగనే నీవెఱుఁగుము.

చిన్నభశ్చిన్నభస్యేవ పయసీవ పయోద్రవః
చిత్త్వాత్కచతి యత్తేన తదేవేదం జగత్కృతమ్. 6

జలమందు జలముయొక్క ద్రవత్వమువలె, చిదాకాశమందు (జగద్రూపమున) చిదాకాశమే వర్తించుచున్నది. మఱియు నే కారణముచే ఆ చిదాత్మవలన అందధ్యస్తమగు యీ జగత్తు భాసించుచున్నదో ఆ కారణముచే శ్రుతులు 'చైతన్యముచే ఈ జగత్తురచింపఁ బడినదని' చెప్పుచున్నవి.

స్వప్నే తదేవ జగదిత్యుదేతి విమలా యథా
కాచకస్యేవ కచితి తథేత్థం సాది సర్గఖే. 7

స్వప్నమందు నిర్మలమగు జగత్తెట్లుదయించుచున్నదో, కాచ * రోగయుక్తమగు నేత్రమునకు ఆకసమున కేశము లెట్లు కనుపించుచున్నవో, అట్లే భ్రమచే ఈ ఆదిగల్గినట్టి విచిత్రమైన జగత్తున్ను చిదాకాశమున స్ఫురించుచున్నది.

---

* కాచము = ఒకానొక నేత్రరోగము.

చిత్కాచకస్య కచనం యథా స్వప్నే జగద్భవేత్
తథైవ జాగదవిధం తత్ఖమాత్రమిదం స్థితమ్. 8

స్వప్నమున చైతన్యమను కాచము (నేత్రరోగము) యొక్క స్ఫురణయే జగద్రూపమగునట్లు ఈ జాగ్రత్ - జగత్తున్ను చిదాకాశమాత్రముగనే స్థితినొందియున్నది.

ఆదిసర్గే హి చిత్స్వప్నో జాగ్రదిత్యభిశబ్ద్యతే
అద్య రాత్రౌ చితేః స్వప్నః స్వప్న ఇత్యపి శబ్ద్యతే. 9

సృష్ట్యాదియందు హిరణ్యగర్భుఁడను సమష్టి జీవునియందలి చైతన్యము యొక్క స్వప్నము జాగ్రత్తనఁబడును. నేఁటి రాత్రియందు వ్యష్టిజీవునియందలి చైతన్యము యొక్క స్వప్నము స్వప్నమని చెప్పఁబడును.

పూర్వప్రవృత్తా సరితాం రూఢాద్యాపి యథాస్థితా
తరఙ్గలేఖా దృష్టీనాం పదార్థరచనా తథా. 10

ఎట్లు పూర్వకాలము ప్రవర్తించినట్టి నదులయొక్క తరంగసమూహము నేఁటికిని జనుల దృష్టుల కావిధముగనే రూఢిపడియున్నదో, అట్లే సృష్ట్యాది కాలమునందుఁ బదార్థములఁ గూర్చిన నియతి ఎయ్యది స్థాపింపబడియుండెనో అది నేఁటికిని అట్లే దృఢపడియున్నది.

యథా వారితరఙ్గశ్రీః సరితాం రచనామితా
తథా చిద్వ్యోమ్ని చిద్బీజసత్తాన్తః సృష్టితామితా. 11

నదులయందు జలముయొక్క తరంగముల సత్తయు జలసత్తకంటె భిన్నముకానట్లు, చిదాకాశమున వివర్తరూపమగు ఈసృష్టియొక్క సత్తయు అచిదాకాశసత్తకంటె భిన్నముకాదు.

మృతస్యాత్యన్తనాశశ్చేత్తన్నిద్రాసుఖమేవ తత్
భూయశ్చేదేతి సంసారస్తత్సుఖం నవమేవ తత్. 12

మరణించినవానికి అత్యంతాభావము కలుగునని యనినచో, అత్తఱి వానికి సుషుప్తియందలి నిరతిశయానంద రూపముచేఁ బ్రసిద్ధమగు సుఖమే లభించినదగును. మరల దేహాదిరూపముతో సంసార ముదయించుచో, అది వానికి నూతన సంసారరూపమైనప్పటికిని అనిరతిశయ సుఖరూపమే యగును. (జగత్సత్త ఆత్మసత్త కంటె వేఱుకానందున జననమరణభీతి ప్రసంగమే లేదని భావము.)

కుకర్మభ్యస్తు చేద్భీతిః సా సమేహ పరత్ర చ
తస్మాదేతే సమసుఖే సర్వేషాం మృతిజన్మనీ. 13

దుష్కర్మలచే నరకాదులఁగూర్చిన దుఃఖభయ ముండుననిన ఆట్టిదుఃఖమున్ను సుఖసత్తయే గల్గియున్నదగును. (ఏలయనిన, నరకాదుల జీవితమునకును బ్రహ్మసుఖసత్తకంటె వేఱైనట్టి సత్త లేనందుచే దుఃఖమునకును సుఖసత్తయే గల్గియున్నదగును. కావున సుఖదుఃఖములందు విశేషమేమియును లేదు.) మఱియు నట్టి దుఃఖభయము ఈజీవితమందును, మరణాంతరమునను సమానముగనే యుండును. కాఁబట్టి జనన, మరణములు రెండును సర్వులకును సమాన సుఖదాయకములేయైయున్నవి.



మరణం జీవితం వాస్తు సహజే వాసనే తయోః
ఇతి విశ్రాన్తచిత్తో యః సోఽన్తఃశీతల ఉచ్యతే. 14

జీవితమైనను సరి లేక, మరణమైనను సరి అను నీప్రకారముగ ఈరెంటియొక్క సత్త లెవనికి స్వాభావిక బ్రహ్మసుఖరూపములై సమముగ నున్నవో, అట్టి విశ్రాంత చిత్తుఁడగు యోగి అంతఃశీలుఁడనఁబడును.

సర్వసంవిత్తివిగమే సంవిద్రోహతి యాదృశీ
భూయతే తన్మయేనైవ తేనాసౌ ముక్త ఉచ్యతే. 15

వృత్తులన్నియు నశించినవాఁడును, దృశ్యస్ఫురణ లేనివాఁడును, సర్వబంధవినిర్ముక్తుఁడును, చిద్రూపమగు ఆత్మయందు తన్మయుఁడై యుండువాఁడును ముక్తుఁడని చెప్పఁబడును.

అత్యన్తాభావసంవిత్త్యా సర్వదృశ్యస్య వేదనమ్
ఉదేత్యపాస్తసంవేద్యం సతి వాఽసతి సర్గకే. 16

ఆత్మజ్ఞానముచే దృశ్యమంతయు సంపూర్ణముగ బాధితమగుటచే, అద్దాని అత్యంతాభావ కారణమున నిఁక సృష్టియుండినను, లేకుండినను, సరియే, జ్ఞానికి సర్వదృశ్యానుభవ రహితమగు శుద్ధ నిర్విషయ చైతన్యముయొక్క అనుభవమే యుదయించును.

యన్న చేత్యం న చిద్రూపం యచ్చితేరప్యచేతితమ్
తద్భావైక్యం గతాస్తజ్జ్ఞాః శాన్తా వ్యవహృతౌ స్థితాః. 17

ఏది విషయరూపముకాదో, చేతనావృత్తిరూపమున్ను గాదో, చేతనావృత్తిచే చేతితమున్ను గాదో, అట్టి శుద్ధచైతన్యముతోటి యైక్యము నొందని మహానీయులు సంసారవ్యవహార రహితులై స్వాత్మయందే సుస్థితులై యుందురు.

చిత్కాచకాచకచ్యం యజ్జగన్నామ్నా తదుచ్యతే
అత్యచ్ఛే పరమాకాశే బన్ధమోక్షదృశః కుతః 18

అతినిర్మలమగు చిదాకాశమున చైతన్యమను కాచము (గాజు) యొక్క నిరంతర స్ఫురణమే జగత్తను పేరుచేఁ జెప్పఁబడుచున్నది. అట్టిచో నిఁక బంధమోక్ష దృష్టులెచట!

చిన్నభఃస్పన్దమాత్రాత్మ సంకల్పాత్మతయా జగత్
సద్భూతమయమేవేదం న పృథ్వ్యాదిమయం క్వచిత్. 19

ఈ జగుత్తు చిదాకాశముయొక్క స్ఫురణమాత్రమున్ను, సంకల్పరూపమున్నునై యున్నది. కావున నిది సచ్చిన్మయమే యగునుగాని పృథివ్యాది భూతమయ మెన్నటికిని గానేరదు.

నేహ దేశో న కాలోఽస్తి న ద్రవ్యం న క్రియా న ఖమ్
సదివాఖిలముచ్ఛూనం వాప్యనుచ్ఛూనమప్యసత్. 20

ఇట వాస్తవముగ దేశముగాని, కాలముగాని, పదార్థముగాని, క్రియగాని, ఆకాశముగాని లేవు. ఈజగత్తు ప్రతిభాసమాత్రముచే వృద్ధిఁబొందినను, లేక, పొందకయుండినను సరియే, అట్టి స్వకీయ కల్పితరూపముచే నది అసత్తేయగును. కాని, అధిష్ఠానరూపముచే నది సత్తుకంటె వేఱు కానిదై యున్నది.

భాతి కేవలమేవేత్థం పరమార్థఘనం ఘనమ్
యన్న శూన్యం న వా శూన్యమత్యచ్ఛం గగనాదపి. 21

ఈ ప్రకారముగ ఈ జగద్రూపముచే కేవలము పరమార్థఘనమగు ఆత్మయే ప్రకాశించుచున్నది. ఆ యాత్మ ఆకాశముకంటెను అతి నిర్మలమై, శూన్యముగాని, అశూన్యము కానిదై యున్నది.

సాకారమప్యనాకారమసదేవాతి భాస్వరమ్
అతిశుద్ధైకచిన్మాత్రస్ఫారం స్వప్నపురం యథా. 22

మఱియు ఆయాత్మ సాకారముగ నున్నట్లుతోఁచినను వాస్తవముగ నిరాకారమైనదియు, అసత్తువలెఁ గన్పట్టినను మిగుల ప్రకాశవంతమైదియు, కేవల మతిశుద్ధమైనట్టి యేకమగు చిన్మాత్రమున్న, స్వప్ననగరమువలె అతి విశాలమైనదియు నగును.

నిర్వాణమేవమిదమాతతమిత్థమన
శ్చిద్వ్యోమ్ని ఆవిలమనావిలరూపమేవ
నానేవ న క్వచిదపి ప్రస్మృతం న నానా
శూన్యత్వమమ్బర ఇవామ్బునిధౌ ద్రవత్వమ్. 23

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే ఉత్తరార్థే పరమార్థమయత్వవర్ణనం నామ పఞ్చపఞ్చాశః సర్గః ॥ 55 ॥

ఓ రామచంద్రా! ఈ ప్రకారముగ, చిదాకాశముయొక్క కలుషిత జగద్రూపము వాస్తవముగ శుద్ధవ్యాపక నిర్వాణరూపమేయగును. ఇట్టి నిర్వాణరూపముచే వ్యాపింపఁబడని దెద్దియును లేదు. కావున, ఆకాశమందు శూన్యత్వమువలెను, జలమందు ద్రవత్వమువలెను, ఈజగత్తు పరమాత్మ రూపమేయగునుగాని నా నా విధ రూపములతో గూడియున్నదికాదు!

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమువ నుత్తరార్థమున జగతః పరమార్థమయత్వ వర్ణనమను యేబదియైదవ సర్గము ॥55॥

---

## షట్ పఞ్చాశః సర్గః

[చిదేవ సర్వం సర్వత్ర సర్వం చిదితి నిశ్చితేః।
దృఢీకారాయ పాషాణాఖ్యాయికాత్రోపవర్ణ్యతే॥
సర్వత్ర సర్వమున్ను చిద్రూపమే యను ఈ నిశ్చయమును దృఢపఱచుటకొఱకై పాషాణాఖ్యాయిక యిచట వర్ణింపఁబడుచున్నది.]



శ్రీవసిష్ఠ ఉవాచ:—

సర్వత్ర సర్వదా సర్వం సర్వదా వ్యోమ్ని చిన్మయే
సాధు సంభవతి స్వచ్ఛం శూన్యత్వం ఖ ఇవాఖిలే. 1

శ్రీ వసిష్ఠుడు:— ఓ రామచంద్రా! ఆకాశమునందు శూన్యత్వమువలె, చిన్మయమగు బ్రహ్మాకాశమున సర్వత్ర సర్వమున్ను సర్వవిధముల సర్వదా నిస్సంకోచముగ సంభవించుచున్నది. అదియంతయును వాస్తవముగ శూన్యత్వమువలె స్వచ్ఛమేయైయున్నది.

యత్ర చిత్తత్ర సర్గశ్రీరవ్యోమ్ని వ్యోమ్ని వాస్తి చిత్
చిన్మయత్వాత్పదార్థానాం సర్వేషాం నాస్త్యచిత్క్వచిత్. 2

సమస్తపదార్థములును చిన్మయములగుటచే పృథివ్యాదులం దెచటను 'అచిత్' రూపము లేదు. మఱియు, ఎచట చైతన్యముగలదో, అచట సృష్టియొక్క శోభయున్ను గలదు.

పదార్థజాతం శైలాది యథా స్వప్నే పురాది చ
చిదేవైకం పరం వ్యోమ తథా జాగ్రత్పదార్థభూః. 3

స్వప్నమందలి నగర, పర్వతాది పదార్థ సమూహమంతయు చిన్మాత్రమైనట్లు, జాగ్రత్తునందలి సమస్త పదార్థములునుగూడ ఏకమగు చిదాకాశమాత్రమే యైయున్నవి.

పాషాణాఖ్యానమత్రేదం శృణురామ రసాయనమ్
పూర్వం మయైవ యద్దృష్టం చిత్రం ప్రకృతమేవ చ. 4

ఓ రామచంద్రా! ఈ సందర్భమున, పూర్వము నాచేతనే గాంచబడినదియు, మిగుల విచిత్రమైనదియు, భ్రమయను రోగమునకు అమృతరసాయనము వంటిదియు, ప్రస్తుతము వచింపఁదగినదియు నగు పాషాణాఖ్యానమును గూర్చి వినుము.

అహం విదితవేద్యత్వాత్కదాచిత్పూర్ణమానసః
త్యక్తుమిచ్ఛురిమం లోకవ్యవహారం ఘనభ్రమమ్. 5
ధ్యానైకతానతామేత్య శనైర్విశ్రాన్తయే చిరమ్
త్యక్త్వాజవం జవీభావ ఏకనార్థీ శమం వ్రజన్. 6
ఇదం చిన్తితవానస్మి కస్మింశ్చిదమరాలయే
సంస్థితో వివిధాః పశ్యన్భఙ్గురా జాగతీర్గతీః. 7

పూర్వమొకానొకపుడు నేను వేద్యవస్తువు (ఆత్మ) నెఱుఁగుటచేఁ బూర్ణచిత్తుఁడనై, మహాభ్రమసంయుక్తమగు ఈ లోకవ్యవహారమును త్యజింప నిచ్ఛగల్గి చంచలత్వమును వీడి, ఏకాంతమందభిలాషగలవాఁడనై, చిరకాల విశ్రాంతికొఱకై మెల్లమెల్లగ ధ్యానైక తత్పరతఁ జెంది శాంతిని బడయుచు, దేవలోకమున నొకానొకచోట స్థితినొంది, క్షణభంగురములైనట్టి ప్రాపంచిక దశల నవలోకించుచు నిట్లు చింతన జేసితిని.

విరసా ఖల్వియం లోకస్థితిరాపాతసుస్దరీ
న జాతు సుఖదా మన్యే కస్యచిత్క్వచిత్క్వచిత్. 8

విచారింపని కారణముచే రమణీయముగ గన్పట్టు యీ ప్రపంచముయొక్క స్థితి రసహీనమైనదే యగును. ఇయ్యది యెవనికి నేకారణము చేతను నెచటను నెపుడును సుఖప్రదముకాదని దలంచెదను

ఉద్వేగం జనయత్యన్తస్తీవ్ర సంవేగఖేదతః
ఇమా దృశ్యదృశో ద్రష్టురిష్టానిష్టఫలప్రదాః. 9

ఇష్టానిష్టఫలప్రదములగు ఈ దృశ్య విషయములు తద్ద్రష్టయగు జీవునకు వానింగూర్చిన తీవ్రప్రయత్నముచే మిగుల దుఃఖమును, భయమునే గలుగఁ జేయుచున్నవి.

కిమిదం దృశ్యతే కిం వా ప్రేక్షతే కోఽహమేవ వా
సర్వం శాన్తమజం వ్యోమ చిన్మాత్రాత్మని రిఞ్జకమ్. 10

'ఈ కాన్పించుచున్నదేమి? దీనిని చూచునదేది? నేనెవరు? ఈ ప్రకారముగ వివేకముచే విచారించినచో నిది యంతయు శాంతమై, అజమై ఆకాశసదృశమై, చిన్మాత్రమైనట్టి ఆత్మయందలి వివర్తముగనే భాసించును. (ఆత్మమాత్రముగనే తోచునని భావము.)

తస్మాత్సమస్తసిద్ధేన్ద్రదేవదైత్యాదిదుర్గమమ్
సుప్రదేశమితో గత్వా సంగోప్యాత్మానమాత్మనా. 11

అదృశ్యః సర్వభూతానాం నిర్వికల్పసమాధిగః
సమే స్వచ్ఛే పదే శాన్తే ఆసే విగతవేదనమ్. 12

ఇక్కారణమున యీ విక్షేపముయొక్క శమనము కొఱకై, సమస్తసిద్ధ, ఇంద్ర, దేవ, దైత్యాదులకునుగూడ దుర్గమమైనట్టి యొకానొక యుత్తమస్థానమున కిటనుండి చని, అచట దాఁగుకొని, ఏ జీవికిని గన్పింపక, నిర్వికల్ప సమాధియందుఁదత్పరుఁడనై, సర్వవృత్తులఁ ద్యజించి, అతినిర్మలమై, శాంతమై, సమమైనట్టి ఆత్మపదమున సుస్థితుఁడనై యుండెదను.

తస్మాత్కోను ప్రదేశః స్యాదత్యన్తం శూన్యతాం గతః
యత్రైతా నానుభూయన్తే పఞ్చ బాహ్యార్థవేదనాః. 13

కావున, శబ్దాది బాహ్యవిషయములై దున్నుగూడ ననుభవింపఁబడనట్టి అత్యంతశూన్యమైన ప్రదేశ మేదియై యుండును?

శబ్దకాననపార్వబ్దభూతౌఘాభిసమాకులాః
క్షోభయన్తథ సంక్షుబ్ధాస్తస్మాన్మే గిరయోఽరయః. 14

విక్షేపమునకు హేతుభూతములును, శబ్దకారకములునగు వన, జల, మేఘాదులచే వ్యాప్తమై, సింహవ్యాఘ్రాద్యనేక ప్రాణి సమూహములతోఁగూడి యున్నట్టి పర్వతములు నాకు శత్రువులవలె ప్రతికూలముగనే యున్నవి.



నానావిధా నగేన్ద్రాణామన్తరావలితా జనైః
దేశా విషమయా ఏవ నిఃశేషా విషయాహిభిః. 15

ఇఁక పలువిధములగు పర్వతములయొక్క మధ్యప్రదేశములైననో కిరాతాది జనులచేఁ బరివేష్టితములై విషయములను సర్పములతో గూడియుండుటబట్టి అవియన్నియును నాకువిషమయములుగనే తోచుచున్నవి.

జనైర్జలచరైర్వ్యాప్తాః సాగరా నీరకుక్షయః
వివిధారమ్భసంక్షుబ్ధైర్నగరాణీవ నాగరైః. 16

సముద్రతీరములు, జలాంతర ప్రదేశములైనను వివిధకార్యారంభ సహితములగు నగర నివాసులచే నగరము పరిపూర్ణమై యుండునట్లు పలువిధకార్యములందు వ్యగ్రులగు జనులచేతను, జలచర జీవులచేతను వ్యాప్తములై యొప్పుచున్నవి.

తటాన్యద్ర్యమ్బురాశీనాం లోకపాలపురాణి చ
భూతాకులాని శృఙ్గాణి పాతాలకుహరాణి చ. 17

సముద్రతీరములు, పర్వతతటములు, లోకపాలుర నగరములు, గిరిశిఖరములు, పాతాళకందరములు, ఇవియన్నియును ప్రాణులచే బరిపూర్ణములై యున్నవి,

గాయన్త్యనిలభాంకారైర్నృత్యన్తి లతికాః కరైః
పుష్పైర్హసన్త్యగేన్ద్రాణాం గుహా గహనకోటరాః. 18

సింహసర్పాదులచే భయంకరములైన మహాపర్వతగుహలు వాయువుయొక్క భాంకారశబ్దములచే గానముచేయుచున్నవి, లతాసమూహములచే నాట్యమాడుచున్నవి; పుష్పసంతతిచే హాస్యమొనర్చుచున్నవి.

మానిమీనమునిస్పర్శకమ్పినాలచలామ్బుజాః
సరస్యో విరసా ఏవ వార్యావర్తవిరావితాః. 19

ఇఁక సరస్సులున్ను మత్స్యముల యొక్కయు, స్నానార్థమేతెంచిన మౌనశీలురగు మునులయొక్కయు స్పర్శచేతను, చంచల నాళములచేతను ప్రకంపితములగు కమలములుగలవై జలావర్తములచే శబ్దసహితములై యున్నందున నాకవియు నీరసములుగనే తోచుచున్నవి.

పవనస్పర్శసంక్షుబ్ధతృణపాంసుపతాకినీ
రటత్యనిలభాంకారైర్నిర్ఝరోర్వ్యాప్యసంయుతా. 20

ఇఁక సెలయేళ్లతోఁగూడిన పృథివీ స్థలము, వాయుస్పర్శచే క్షోభఁజెందినదై, తృణ, ధూళిరూప పతాకములచేఁ బూర్ణమై వాయువుయొక్క భాంకారశబ్దములచే నఱచుచున్నందున నదియు విక్షేపసహితమైయే యున్నది.

తస్మాదాకాశమాశూన్యం కస్మింశ్చిద్దూరకోణకే
అత్ర తిష్ఠామ్యవష్టభ్య యోగయుక్తిమనిన్దితామ్. 21

కాఁబట్టి సర్వథా శూన్యమైనట్టి యాకాశముయొక్క యొకానొకమూల సుదూరమున నుత్తమయోగయుక్తి నవలంబించి సమాధికై స్థితుఁడనగుదును.

కస్మింశ్చిదేకకోణేఽత్ర కృత్వా కల్పనయా కుటీమ్
వజ్రోదరదృఢం తస్యామ న్తస్తిష్ఠామ్యవాసనమ్. 22

ఈ యాకాశముయొక్క యొకానొక మూల కల్పనచే నొకకుటీరమును నిర్మించి వజ్రమువలె సుదృఢమైన చిత్తము గల్గి, వాసనారహితుఁడనై యట సమాధిపరాయణుఁడ నగుదును.

ఇతి సంచిన్త్య యాతోఽహమాకాశమసి నిర్మలమ్
యావత్తదపి పశ్యామి సకలం వితతా న్తరమ్. 23

ఇట్లు చింతించి, ఖడ్గధారవలె నిర్మలమైనట్టి యాకాశమందుఁబ్రవేశింపగనే యచట సమాధియొక్క యనేక విఘ్నములచే దాని యంతరాళమంతయు వ్యాపించియున్నట్లు నేను గాంచితిని.

క్వచిద్భ్రమత్సిద్ధగణం క్వచిదుద్గర్జదమ్బుదమ్
క్వచిద్విద్యాధరాధారం యక్షోత్థిప్తక్షయం క్వచిత్. 24
క్వచిద్భ్రమత్సురవరం ప్రారబ్ధసమరం క్వచిత్
క్వచిద్ద్రివజ్జలధరం క్వచిదుద్వృత్తయోగిని. 25
క్వచిద్దైత్యపురోడ్డీనసగన్ధర్వపురం క్వచిత్
క్వచిద్భ్రమద్గ్రహగణం తారకాకులితం క్వచిత్. 26
క్వచిత్ఖే ఖగసంఘృష్టం క్వచిత్క్రుద్ధమహానిలమ్
క్వచిదుత్పాతవలితం క్వచిన్మణ్డలమణ్డితమ్. 27
క్వచిదపూర్వభూతౌఘం నాగరావలితం క్వచిత్
క్వచిదర్కరథాక్రాన్తం క్వచిదన్యరథోద్ధురమ్. 28
క్వచిదాదిత్యదాహాస్తం శశిశైత్యాన్వితం క్వచిత్
క్వచిత్క్షుద్రజనాసహ్యం క్వచిదగ్న్యుష్ణ్య దుర్గమమ్. 29
క్వచిదుత్తాలవేతాలం గరుడోడ్డామరం క్వచిత్
క్వచిత్ప్రలయామ్భోదం క్వచిత్ప్రలయానిలమ్. 30

ఎట్లనగా, ఆ యాకాశమందొకానొకచోట సిద్ధులు సంచరించు చుండిరి. ఒకచోట మేఘములు గర్జించుచుండెను; వేఱొకచోట విద్యాధరులు వసించుచుండిరి. ఇంకొకచోటు యక్షులచే గావింపఁబడిన వినాశముతోఁ గూడియుండెను. వేఱొకచోటు గంధర్వనగరములచేఁ బూర్ణమైయుండెను; ఒకచోట యుద్ధమారంభింప బడుచుండెను; ఒకచోట మేఘములు వర్షించుచుండెను. ఒకచోట ఉన్మాదకారక వృత్తిసహితులగు యోగినులు వసించుచుండిరి. మఱియొకచోట సమీపముననున్న దైత్యుల పురములచే నెగరగొట్టఁబడిన గంధర్వసహిత దేవతా నగరము లుండియుండెను; ఇంకొకచోట గ్రహములు సంచరించుచుండెను; ఒకచోటు నక్షత్రసమూహముచే వ్యాకులమై యుండెను;



మఱియొకచోటు పక్షులచేఁ బరిపూర్ణమై యుండెను; ఒకచోట మహాప్రచండమగు వాయువు వీచుచుండెను. ఒకచోటు దుశ్శకునములచే బూర్ణమైయుండెను; వేఱొకచోటు మేఘమండలములచే శోభితమైయుండెను. ఒకచోటు విచిత్రాకారులగు పిశాచాది ప్రాణిసమూహములతోఁ గూడియుండెను; ఇంకొకచోటు నగరములచే నాచ్ఛాదితమైయుండెను; ఒకానొకచోటు సూర్యరథముచే నాక్రమింపఁబడియుండెను; వేఱొకచోటు చంద్రాదిగ్రహముల రథములచే బూర్ణమైయుండెను; ఒకచోట సూర్యతాపముచేఁ బ్రాణులు మృతినొందుచుండిరి; ఇంకొకచోటు చంద్రుని శీతలత్వముచే పరిపూరితమైయుండెను;ఒకచోటు భూతప్రేతాదులచే భయంకరమై యుండెను; ఒకానొకచోటు అగ్నియొక్క యుష్ణత్వముచే మిగుల దుర్గమమై యుప్పుచుండెను; ఒకచోట నెత్తైన బేతాళములు వసించుచుండెను; ఒకచోటు గరుత్మంతులచే శోభితమై యుండెను; ఒకచోటు ప్రళయకాల మేఘములచేతను, ఇంకొకచోటు ప్రళయకాల ప్రచండవాయువు చేతను బరిపూర్ణమైయుండెను.

తతో భూతగణాం స్త్యక్త్వా దూరాద్దూరతరం గతః
ప్రాప్తవానహమేకాన్తం శూన్యమత్యన్తవిస్తృతమ్. 31

పిమ్మట నేనా ప్రాణి సమూహములను వీడి యతిదూరమునకుఁ జని మిగులవిశాలమైనదియు శూన్యమైనదియునగు ఒకానొక యేకాంతప్రదేశమును బొందితిని.

అత్యన్తమన్దపవనం స్వప్నేఽప్యప్రాప్య భూతకమ్
మజ్జలోత్పాతరహితమగమ్యం విద్ధి సంసృతేః. 32

ఓ రామచంద్రా! అచ్చోట వాయువు చాల మెల్లగా వీచుచుండెను. స్వప్నమందైనను నచట నొక్క ప్రాణి కూడఁ బొందఁబడదు. ఆ స్థానమును శుభాశుభ శకునములు లేనిదిగను, ప్రపంచ జీవుల కప్రాప్యమైనదిగను నెఱుఁగుము.

కల్పితాథ మయా తత్ర కుటీ ప్రకటకోటరా
నీరన్ధ్రి కుడ్యనిబిడా పద్మకుడ్మలసున్దరీ. 33
ఘుణక్షుణ్ణాబ్జపూర్ణేన్దు బిమ్బోదర మనోహరా
కహ్లారకున్దమన్దార పుష్పశ్రీకోశశోభితా. 34

అత్తఱి యాప్రదేశమున, కమలఁపుమొగ్గవలె సుందరమైనదియు, రంధ్రములులేని కుడ్యాదులచే దట్టమైనదియు, ప్రకటమైన లోభాగములు గలదియు, కీటములచే ఛిద్రీకృతమగు పూర్ణచంద్రబింబ మధ్యభాగమువలె మనోహరమైనదియు, కమల, కుంద, మందారాది పుష్పములచే శోభితమైనదియు నగు యొక కుటీరమును నేను నా (సత్య) సంకల్పముచే నిర్మించితిని.

సమస్తభూతాగమ్యత్వం తత్ర సంకల్ప్య చేతసా
అగమ్యే సర్వభూతానామహమాసం తదా తతః. 35

పిదప, ఏ ప్రాణియు నచటికి రాకుండునట్లు చిత్తముచే సంకల్పించి, సర్వ భూతముల కగమ్యమైనట్టి నిర్వికల్ప సమాధియందు స్థితుఁడనై యుంటిని.

బద్ధపద్మాసనః శాన్తమనాః పరమమౌనవాన్
సంవత్సరశతాన్తేన నిర్ణీయోత్థాన మాత్మనః. 36

నూఱు సంవత్సరములైన పిదపయే సమాధినుండి లేచుటకై నిశ్చయించి, పద్మాసనముపైఁ గూర్చొని, శాంతచిత్తుఁడనై, మహామౌనమును ధరించి సమాధిస్థుఁడనైతి.

నిర్వికల్ప సమాధిస్థో నిద్రాముద్రామివాగతః
సమః సౌమ్యనభఃస్వస్థః సముత్కీర్ణ ఇవామ్బరాత్. 37

సుషుప్తిని బొందినవానివలె నిశ్చలముగను, సమముగను, సౌమ్యముగను, ఆకాశమువలె నిర్మలముగను, ఆకాశమందుఁ జిత్రింపఁబడిన వానిచందమునను నున్నవాఁడనై నిర్వికల్ప సమాధిస్థుఁడనైతిని

చిరం యదనుసంధత్తే చేతః పశ్యతి తత్క్షణాత్
చిరేణ చాశాపవనవ్యక్తివద్వితతం యదా. 38
తదా వర్షశతేనాత్ర బోధబీజం వృతాన్తరమ్
ఆసీన్మే హృదయక్షేత్రే కాలమేకం వికాసతః. 39
సంప్రబుద్ధోఽభవన్మేఽథ జీవః సంబుద్ధవేదనః
శిశిరక్షీణగాత్రస్య మధావివ రసస్తరోః. 40

చిరకాల మేపదార్థమును చిత్తముధ్యానించునో యద్దానిని తత్క్షణమే అయ్యది గాంచగలదు. కావున చిరకాలమునకు నూఱు వత్సరములైనపిదప, నాయొక్క చిత్తము వాయు, దిశలవలె నెపుడు విశాలమయ్యెనో, అపుడు బోధబీజమున్ను, వ్యుత్థాననిమిత్తమున్ననగు కర్మ నా హృదయక్షేత్రమున నొకసమయమున వికసింప నత్తటి, శిశిరఋతువునందు క్షీణించిన శరీరముగల వృక్షము యొక్క రసము వసంతఋతువునందు వికాసమొందునట్లు, వృత్తిసహితముగ నాయొక్క జీవచైతన్యము ప్రబుద్ధమయ్యెను.

తచ్ఛతం తత్ర వర్షాణాం నిమేషమివ మే గతమ్
బహోర్వ్యాఽపి కాలగతయో భవన్త్యేకధియో మనాక్. 41

ఆ నూఱు వత్సరములున్ను నాకొక నిమిషమువలె గడచినట్లుండెను. ఏలయనిన, ఏకాగ్ర చిత్తునకు విస్తారమగు కాలమున్ను అత్యల్పముగనే తోచును.

వికాసమాగతో బాహ్యం గతో బుద్ధీన్ద్రియక్రమః
వాసన్తః పుష్పరూపేణ మధస్యేవ రసో మమ. 42

తదుపరి, వృక్షమునకుఁ బుష్టిహేతువగు రసము వసంతఋతువునందుఁ [illegible]ముగ వికసించునట్లు, నాయొక్క బాహ్య జ్ఞానేంద్రియములు క్రమముగ వికాసమొందెను.

మాం ప్రాణపూరితమపాగతసంనిదంశ
మభ్యాగతం త్వహమితి ప్రసృతః పిశాచః
ఇచ్ఛాఙ్గనా వివలితోఽథ కుతోఽపి సద్యః
శ్రోణ్యాం మనన్న మనవాయురివోగ్రవృక్షమ్. 43



ఇత్యార్షే శ్రీ వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే పాషాణోపాఖ్యానే 'ఆకాశమన్దిరే వసిష్ఠసమాధానవర్ణనం' నామ షట్పఞ్చాశః సర్గః ॥ 56 ॥

పిమ్మట ఎత్తైన వృక్షముయొక్క యున్నతశాఖలందు ప్రచండ వాయువు ప్రసరించునట్లు, ప్రాణములచేఁ బరిపూర్ణుఁడనై, ఇంద్రియవృత్తులతోఁగూడి, జీవచైతన్య సహితుఁడనై యున్న నాచెంతకపుడు వెంటనే ఇచ్ఛయను పత్నితోఁగూడి అహంకారమను పిశాచ మెచటి నుండియో వచ్చి చేరెను.

ఇది శ్రీ వాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున పాషాణోపాఖ్యానమున 'ఆకాశమందిరే వసిష్ఠసమాధాన వర్ణనమను' యేబదియాఱవ సర్గము ॥ 56 ॥

---

## సప్తపఞ్చాశః సర్గః

[జ్ఞాజ్ఞాహంకారయోరత్ర విశేషప్రతిపత్తయే
జ్ఞానబాధిత దృశ్యస్య చిన్మాత్రత్వం సమర్థ్యతే॥

జ్ఞాని, అజ్ఞానుల యొక్క అహంకారమునుగూర్చిన విశేష జ్ఞానమునకొఱకై జ్ఞానముచే బాధితమగు దృశ్యముయొక్క చిన్మాత్రత్వ మిచట వర్ణింపఁబడుచున్నది.]

శ్రీరామ ఉవాచః—

త్వామప్యుదితనిర్వాణమహంకారపిశాచకః
బాధతే కిమపి బ్రూహి మునే సందేహశాన్తయే. 1

శ్రీరాముడు.— ఓ మునీంద్రా! నిర్వాణముదయించిన తమ్మునుగూడ అహంకారమను పిశాచము బాధించునా యేమి? ఈవిషయమును సందేహ నివృత్తికొఱకై నాకు దెలియఁజేయవేఁడెద.

శ్రీవసిష్ఠ ఉవాచ:—

అహంభావంవినా దేహస్థితి సజ్ఞాజ్ఞయోరిహ
ఆధేయస్య నిరాధారా న సంస్థేహోపపద్యతే. 2

శ్రీ వసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! అహంకారము లేనిచో, జ్ఞాని, అజ్ఞాని యిరువురియొక్క శరీరస్థితియు సంభవించ నేరదు. ఏలయనగా, ఆధారములేనిచో, ఆధేయ పదార్థముయొక్క స్థితి యుండఁజాలదు.

అయం త్వత్ర విశేషస్తం శృణు విశ్రాన్తచేతసః
శ్రుతేన యేనాహంభావపిశాచః శాన్తిమేతి తే. 3

కాని యిందలి శేషత్వమునుగూర్చి వినుము. అద్దానిని వినినచో, చిత్తము నిశ్రాంతి నొందుటచే నీయొక్క అహంకారమను పిశాచము శమించిపోవును.

అహంభావపిశాచోఽయమజ్ఞానశిశునామునా
అవిద్యమాన ఏవాన్తః కల్పితస్తేన సంస్థితః. 4

వాస్తవముగ లేనిదైనప్పటికిని, ఈ అహంభావమను పిశాచమును అజ్ఞానమను బాలకుఁడు అంతఃకరణమున, గల్పించియున్నాఁడు. కావుననే యిది స్థితిగలదియగుచున్నది.

అజ్ఞానమపి నాస్త్యేవ ప్రేక్షితం యన్న లభ్యతే
విచారిణా దీపవతా స్వరూపం తమసో యథా. 5

దీపముగలవానికి అంధకారము లభించనట్లు, విచారించి చూచినచో అజ్ఞానము జ్ఞానికి లభింపఁజాలదు. గాన నది వాస్తవముగ లేనిదే యగును.

యథాయథా విలోక్యతే తథాతథా విలీయతే
ఇహాజ్ఞతాపిశాచికా తథా విచారితా సతీ. 6

ఏ యేరీతి విచారింపఁబడుచుండునో, ఆయారీతి తద్విచార క్రమమునననుసరించి యీ అజ్ఞానమను పిశాచియు క్షయించుచుండును

కిల సత్యామవిద్యాయామజ్ఞతోదేతి శాశ్వతీ
బుద్ధిమోహాత్మికా యక్షీ నిర్దేహైవ యథా నిశి. 7

బుద్ధియొక్క భ్రమచే రాత్రి దేహరహితయైన పిశాచి కానుపించునట్లు, మూలావిద్యయుండునంత వఱకును ఈకార్యరూపమగు అజ్ఞానము నిరంతర ముదయించుచునే యుండును.

సతి సర్గే త్వవిద్యాయాః సంభవో నాన్యతః క్వచిత్
సతి ద్వితీయే శశిని ద్వితీయో విద్యతే శశః. 8

రెండవ చంద్రుఁడున్నపుడే రెండవ కుందేలున్నునగుపించునట్లు సృష్టియను కార్యావిద్యయున్నపుడే కారణరూపమగు మూలావిద్య సంభవించును గాని లేనిచో నెచటను సంభవించదు.

సర్గస్త్వయమజాతత్వాదజ్ఞజ్ఞాతో న విద్యతే
న జాతః కారణాభావాత్పూర్వమేవ ఖవృక్షవత్. 9

అజ్ఞానిచేఁ గల్పితమగు ఈసృష్టి యుత్పన్నము గానందుచే వాస్తవముగ లేనిదైయున్నది. ఏలయనిన, ఆకాశవృక్షమువలె, కారణాభావముచే నిది పూర్వమే యుత్పన్నము గాకయున్నది.

పరమాకాశకోశాన్తరాదిసర్గే నిరామయే
పృథ్వ్యాదేరుపలమ్భస్య భవేత్కిమివ కారణమ్. 10

ఆదిసృష్టి నిర్వికారమై, చిదాకాశమయమైయుండ నింక పృథివ్యాదుల ప్రాప్తియందే కారణముగలదు!



మనఃషష్ఠేన్ద్రియాతీతం మనఃషష్ఠేన్ద్రియాత్మనః
సాకారస్య నిరాకారం కథం భవతి కారణమ్. 11

మనస్సుతోఁగూడిన పంచేంద్రియముల యొక్క విషయమైన సాకారమగు జగత్తునకు మనస్సుతోఁగూడిన పంచేంద్రియముల కతీతమగు నిరాకారమైన బ్రహ్మము కారణమెట్లు కాఁగలదు?

బీజాత్కారణతః కార్యమఙ్కురః కిల జాయతే
న బీజమపి యత్రాస్తి తత్రస్యాదఙ్కురః కుతః. 12

బీజమను కారణమునుండి అంకురమను కార్యముత్పన్నమగుచున్నది. ఎచట బీజమే లేదో, అచటనింక అంకుర మెట్లుండ గలదు?

కారణేన వినా కార్యం న చ నామోపపద్యతే
కదా క ఇవ ఖే కేన దృష్టో లబ్ధః స్ఫుటో ద్రుమః. 13

కారణము లేక కార్యమెన్నఁడును నుండజాలదు. ఆకాశమందెవఁడు ఎపుడు వృక్షమును బ్రత్యక్షముగా గాంచెను. మఱియు బొందెను?

సంకల్పేనామ్బరే యద్వద్దృశ్యతే విటపాదికమ్
ససంకల్పస్తథాభూతో న తత్రాస్తి పదార్థతా. 14

సంకల్పముచే నాకసమున వృక్షాదులు గన్పించునట్లు, ఈ జగత్తున్ను సంకల్పమయమే గాని యిట పదార్థత్వ మేమియును లేదు.

ఏవం యేయం చిదాకాశే సర్గాదావనుభూయతే
శూన్యరూప ఇవాకాశే సర్గస్థితిరనర్గలా. 15

సృష్ట్యాదియందే నిష్కంటకమగు బ్రహ్మాండముయొక్క స్థితి యనుభూత మగుచున్నదో, అదియు ఆకాశవృక్షమువలె శూన్యరూపమే యగును.

సమ ఏవ చిదాకాశః కచత్యాత్మని తత్తథా
స్వభావ ఏవ సర్గాఖ్యశ్చిత్త్వాచ్చైతన్యమీశ్వరః. 16

సృష్టియొక్క విషమత్వము లేనివాఁడును, చిదాకాశస్వరూపుఁడును, చైతన్యమయుఁడునగు ఈశ్వరుఁడు స్వభావముగనే తనయందు సృష్టిరూపముగ భాసించుచున్నాఁడు.

స్వప్న సర్గోఽత్ర దృష్టాన్తః ప్రత్యహం యోఽనుభూయతే
స్వయం సంవేదనే స్వప్నే స్ఫురత్యద్రిపురాకృతిః. 17

ప్రతిదినము స్వప్నమందనుభూతమగు సృష్టియే యిటదృష్టాంతము. స్వప్నమందు చైతన్యమే స్వయముగ పర్వత, నగరాద్యాకారములచే స్ఫురించుచున్నది గదా!

చిత్స్వభావే యథా స్వప్న ఆస్తే సర్గ ఇవేహ యః
అసర్గే సర్గవద్భాతి తథా పూర్వం మహామ్బరే. 18

స్వప్నమందు చైతన్యముయొక్క స్వభావమున సృష్టియున్నట్లు భాసించువిధమున, సృష్ట్యాదియందు చిదాకాశమున ఈసృష్టి, వాస్తవముగ లేనప్పటికిని, ఉన్నట్లు భాసించుచున్నది.

అవేద్య వేదనం శుద్ధమేకం భాత్యజమవ్యయమ్
సర్గాదౌ యదనాద్యన్తం స్థితః సర్గః స ఏవ నః. 19

సృష్టికిఁబూర్వము విషయజ్ఞాన రహితమై, శుద్ధమై, అజమై, అవ్యయమై, అనాదియై, అనంతమైనట్టి ఆత్మతత్త్వమెయ్యది భాసించుచుండెనో, అదియే యిపుడు మన యీ సృష్టిరూపమున స్థితి నొందియున్నది.

నేహ సర్గోఽస్తి నైవాయం పృథ్వ్యాదిగణలోలకః
సర్వం శాన్తమనాలమ్బం బ్రహ్మైవ బ్రహ్మణి స్థితమ్. 20

ఇట వాస్తవముగ సృష్టిగాని, పృథివ్యాది గోళములుగాని లేవు. అంతయు శాంతమై నిరాలంబమైనట్టి బ్రహ్మమే బ్రహ్మమునందు స్థితిగల్గియున్నదగును.

సర్వశక్త్యాత్మ తద్బ్రహ్మ యథా కచతి యాదృశమ్
రూపమత్యజదేవాచ్ఛం తథా భవతి తాదృశమ్. 21

సర్వశక్తిమంతమగు ఆ బ్రహ్మ మెట్లెట్లు స్ఫురించుచుండునో, అట్లట్లు తన శుద్ధరూపమును త్యజింపకనే యది సృష్ట్యాదిరూపములుగ నగుచున్నది.

యథా స్వప్నపురం జన్తోశ్చిన్మాత్రప్రవిజృమ్భితమ్
తథైవ సర్గః సర్గాదౌ శుద్ధచిన్మాత్రజృమ్భితమ్. 22

స్వప్ననగరమెట్లు జీవునకు చిన్మాత్రముయొక్క విలాసమగునో, అట్లే సృష్ట్యాదియందీజగత్తున్ను చిన్మాత్రముయొక్క విలాసమేయై యున్నది.

స్వచ్ఛే చిత్పరమాకాశే చిదాకాశో య ఆస్థితః
స్వభావ ఏవ సర్గోఽసావితి తేనైవ భావితః. 23

నిర్మలమగు ఆకాశమున నీలవర్ణాది వైచిత్ర్యము భాసించునట్లు, శుద్ధచిదాకాశమున నద్దాని స్వభావమే యాచైతన్యముయొక్క భావనచేతనే సృష్టిరూపమున స్ఫురించుచున్నది.

భావ్యభావకభావాదిభూమీనాం భావనం భృశమ్
సర్వం చిన్నభ ఏవాచ్ఛమాత్మనాత్మని సంస్థితమ్. 24

భావ్య భావక, భావాది త్రిపుటీరూపములయొక్క నిరంతర ఉత్పత్తి మొదలగు నదియంతయు నిర్మలమగు చిదాకాశమే తనయందు దాను అవ్విధమున స్థితిగల్గియున్నదగును.

ఏవం స్థితే కుతః సర్గః కుతో విద్యా క్వ చాజ్ఞతా
బ్రహ్మ శాన్తం ఘనం సర్వం క్వాహంకారాదయః స్థితాః. 25

ఇవ్విధమున చిదాకాశమే చిదాకాశమున స్థితి గల్గియుండ నిఁక సృష్టి యెచట! అవిద్య యెచట! అజ్ఞానమెచట! అహంకారాదులెచట! అంతయు శాంతమై, చిద్ఘనమైనట్టి బ్రహ్మమే యైయున్నది.



అహంభావస్య సంశాన్తిరేషాఽసౌ కథితా తవ
అహంభావః పరిజ్ఞాతః పిశాచ ఇవ శామ్యతి. 26

ఓ రామచంద్రా! ఈప్రకారముగ అహంకారముయొక్క పూర్ణశమనమునుగూర్చి నీకు వచించితిని. ఎఱుఁగఁబడినచో ఈ యహంభావము బాలునిచేఁ గల్పితమగు బేతాళమువలె శమించి పోవును.

మయా త్వేవమహంభావః పరిజ్ఞాతో యదాఖిలః
తదా మే విద్యమానోఽపి నిష్ఫలః శరదభ్రవత్. 27

ఈ రీతిగ అహంభావమను పిశాచమును నేనెపుడు పూర్ణముగ నెఱిఁగియుంటినో, అపుడది యిఁక నాకున్నప్పటికిని శరత్కాలమేఘమువలె నిష్ఫలమేయగును.

చిత్రాగ్నిదాహో విజ్ఞాతో యథా దాహ్యేషు నిష్ఫలః
తథాహంభావసర్గాది జ్ఞాతం నిష్ఫలతామియాత్. 28

ఎఱుఁగఁబడినపిదప చిత్రమందలి అగ్నియెట్లు దహనక్రియలందు నిష్ఫలమగునో, అట్లే యెఱుఁగఁబడినపిదప, అహంభావ, సృష్ట్యాదులున్ను నిష్ఫలత్వమును బొందును.

ఇతి మేఽహంకృతేస్త్యాగే రాగే చ సమతా యదా
తదా వ్యోమ్న ఇవావ్యోమ్నః సర్గేఽసర్గే చ మే స్థితిః. 29

ఈప్రకారముగ అహంకారముయొక్క త్యాగమందును, (సమాధియందును) రాగమందును, (వ్యవహారమందును,) నా కెపుడు సమత్వముగలిగియున్నదో, అపుడిఁక, మేఘఁవాయువు, అతపాదు లున్నపుడును, లేనపుడునుగూడ ఆకాశము సమముగనే యుండునట్లు సృష్టియున్నపుడును, లేనపుడునుగూడ నాయొక్క స్థితి సమముగనే యున్నదాయెను.

అహంభావస్య నైవాహం నాహంభావో మమేతి చ
తేన విద్ధి చిదాకాశమేవేదమితి నిర్ఘనమ్. 30

ఓ రామచంద్రా! 'నేను' అహంభావమునకుఁ జెంది యుండలేదు. అహంభావము నాకుఁ జెందియుండలేదని నిశ్చయించి ఈ సమస్త ప్రపంచమును చిదాకాశఘనముగనే యెఱుఁగుము.

యథా మమ తథాన్యేషామపి బోధవతామిహ
అగ్నిత్వమివ చిత్రాగ్నేర్నాస్త్యయం బోధవిభ్రమః. 31

ఈ అహంభావాది భ్రమ నాదృష్టియందెట్లులేదో, అట్లే యొక్కన జ్ఞానుల దృష్టియందును లేనిదేయైయున్నది. చిత్రమందలి అగ్నియందగ్నిత్వము (దహనశక్తి) యే బుద్ధిమంతుని దృష్టియందుండఁగలదు?

నాహమస్మి నచాన్యోఽస్తి సర్వం నాస్తీతి నిశ్చయే
ప్రకృతవ్యవహారస్త్వం శిలాఘనమయో భవ.

ఓ రామచంద్రా! వాస్తవముగ 'నేనుగాని, మతియొకండుగాని, ఈ సమస్త బ్రహ్మాండము గాని లేవ'ని నిశ్చయించి నీవున్న యథాప్రాప్తమగు వ్యవహారమాచరించుచు శిలవలె మౌనముగ నుండుము.

ఆకాశకోశవిశదాకృతిరేవ తిష్ఠ
సిద్ధేశవచ్చిరమపహ్నుతసర్వభావః
అద్యాదితశ్చ కిల చిన్మయమేవ సర్వం
నో దృశ్యమస్తి శివమేవమశేషమిత్థమ్. 33

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే పాషాణోపాఖ్యానే విదితవేద్యాహంకారవిచారో నామ సప్తపఞ్చాశః సర్గః ॥ 57 ॥

ఓ రాఘవా! చిరకాలము దృశ్యభావమంతటిని దొలగించి శిలామధ్యభాగమువలె చిద్ఘన రూపుఁడవై, ఆకాశమువలె నిర్మలమైన యాకృతిగల్గి స్వాత్మరూపమున స్థితిగల్గియుండుము. ఏల యనిన, ఈ సృష్టికాలముననుు, సృష్టికిఁ బూర్వముననుు సమస్తము చిన్మయమైన శివరూపమగు బ్రహ్మమే యైయున్నదిగాని దృశ్యప్రపంచ మెద్దియును లేదు;

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున పాషాణోపాఖ్యానమున విదితవేద్యాహంకార విచారమను యేబదియేడవ సర్గము ॥57॥

---

## అష్టపఞ్చాశః సర్గః

[సర్వత్ర సర్వసర్గశ్రీః సదైవాస్తి న చేతి చ
దృష్టిభేదేన పాషాణాఖ్యాయికార్థోఽత్ర వర్ణ్యతే.

దృష్టిభేదముచే సృష్టియొక్క శోభ సదా సర్వత్రయున్నది, లేకయున్నది — ఈ ప్రకారముగ పాషాణాఖ్యాయిక యొక్క తాత్పర్య మిచట వర్ణింపఁబడుచున్నది.]

శ్రీరామ ఉవాచ:—

అహో ను వితతోదారా విమలా విపులాచలా
భవతా భగవన్ఖ్యాత్యై భూయో దృష్టిరుదాహృతా. 1

శ్రీరాముఁడు:— అహా! మహాత్మా! మరల జ్ఞానైశ్వర్యము కొఱకై తామి విశాలమై, గంభీరమై, నిర్మలమై, విపులమై, నిశ్చలమైనట్టి ఆత్మదృష్టిని గూర్చి వచించితిరి.

సర్వథా సర్వదా సర్వం సర్వం సర్వత్ర సర్వదా
సదిత్యేవ స్థితం సత్యం సమం సమనుభూతితః. 2



మునీంద్రా! సర్వత్ర సర్వదా సర్వవిధముల సమస్తము సద్రూపమగు బ్రహ్మమే యని తాము సెలవిచ్చినది విచార, అనుభవములచేతను సత్యమై అట్టి యేకరసమగు చిన్మాత్రముగనే యొప్పుచున్నది.

అయమస్తి మమ బ్రహ్మన్సంశయస్తం నివారయ
కిమిదం భగవన్నామ పాషాణాఖ్యానముచ్యతే. 3

మహాత్మా! 'ఈపాషాణాఖ్యానముయొక్క యభిప్రాయమేమి' అను నా యీ సందేహము నిపుడు తీర్పవేడెద.

శ్రీవసిష్ఠఉవాచ:—

సర్వత్ర సర్వదా సర్వమస్తీతి ప్రతిపాదనే
పాషాణాఖ్యానదృష్టాన్తో మయాయం తవ కథ్యతే. 4

శ్రీ వసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! సర్వత్ర సర్వదా సర్వము సద్రూపముచే గలదను ఈ ప్రతిపాదనమందు, పాషాణాఖ్యాన దృష్టాంతమును గూర్చి వచించుచున్నాను వినుము.

నీరన్ధ్రైకఘనాఙ్గస్య పాషాణస్యాపి కోటరే
సన్తి సర్గసహస్రాణి కథయేతి ప్రదర్శ్యతే. 5

రంధ్రము లెవ్వియు లేనిదై, ఘనమైనట్టి శిలామధ్య భాగమందును (శిలారూపమగు అధ్యాసముయొక్క అధిష్ఠానమగు పరబ్రహ్మమందు) అనేక బ్రహ్మాండములు గలవని ఈ యాఖ్యాయికచే నిరూపింపఁబడుచున్నది.

భూతాకాశే మహత్యస్మిన్శూన్యత్వమనుజ్ఝతి
సన్తి సర్గసహస్రాణి కథయేతి ప్రదర్శ్యతే. 6

అట్లే గొప్పదై, శూన్యమైనట్టి భూతాకాశమందును — (తదధిష్ఠానమగు బ్రహ్మమందు) అనేక సృష్టులు గలవని యీ కథచేఁ దెలుపఁబడుచున్నది.

అన్తర్గుల్మాఙ్కురాదీనాం ప్రాణవాయ్వమ్బుతేజసామ్
సన్తి సర్గసహస్రాణి కథయేతి ప్రదర్శ్యతే. 7

అవ్విధముననే అంకుర, లతా, గుల్మములందును, సమస్త ప్రాణులందును, వాయు, జలాగ్నులందును గూడ ననేక సృష్టులు గలవని యీ యాఖ్యానముచేఁ జూపఁబడుచున్నది.

శ్రీరామ ఉవాచ:

కుడ్యాదౌ సన్తి సర్గౌఘా యది చేత్కథ్యతే మునే
తత్కిం విభాన్తి సర్గౌఘా ఇతి కిం న ప్రదర్శ్యతే. 8

శ్రీరాముఁడు:— ఓ మునీంద్రా! కుడ్య, లతాదులందును అనేక సృష్టి సమూహములు గలవని తాము వచించుచో నత్తటి చిదాకాశమందే సమస్త సృష్టి సమూహములు భాసించుచున్నవని యేల వచింపరాదు?

శ్రీవసిష్ఠ ఉవాచ:—

ఏతత్తే వర్ణితం రామ ముఖ్యమేవ మయాఽఖిలమ్
యోఽయమాలక్ష్యతే సర్గః స ఖ ఏవ ఖమాస్థితమ్. 9

శ్రీవసిష్ఠుఁడు.— ఓ రామచంద్రా! నీవు వచించినది సత్యమే అదియే ముఖ్యమైనపక్షము. ఈ సృష్టి ఎయ్యది కానుపించుచున్నదో, అది యంతయు చిదాకాశమే చిదాకాశమున నెలకొని యున్నదగును.

ఆదావేవ హి నోత్పన్నమద్యాపి న చ విద్యతే
దృశ్యం యచ్చావభాతీదం తద్బ్రహ్మ బ్రహ్మణి స్థితమ్. 10

ఈ దృశ్యము ఆదియందును నుత్పన్నము కాలేదు. ఇపుడును నుండియుండలేదు. ఈ భాసించునదంతయు బ్రహ్మమే బ్రహ్మమందు స్థితిగల్గియున్నదగును.

నాస్తి భూరణుమాత్రాపి సర్గైర్నిర్వివరా న యా
న చ క్వచన విద్యన్తే సర్గా బ్రహ్మఖమేవ తే. 11

ఆరోపదృష్టిచే ఈగాధమగు పృథివియొక్క ప్రతి పరమాణువందును సృష్టిసమూహములు గలవు. కాని అపవాదదృష్టిచే ఈ పృథివి అణుమాత్రమైనను లేదు. మఱియు ఈపృథివియొక్క సృష్టులెవ్వియునుగూడ లేవు. అవియన్నియు వాస్తవముగ చిదాకాశరూపమగు బ్రహ్మమే యగును.

న తేజసోఽణురప్యస్తి సర్గైర్నిర్వివరో న యః
న చ క్వచన సర్గాస్తే సన్తి బ్రహ్మఖమేవ తత్. 12
న వాయోరణురప్యస్తి సర్గైర్నిర్వివరో న యః
న చ క్వచన విద్యన్తే సర్గా బ్రహ్మఖమేవ తత్. 13
ఖం నాణుమాత్రమప్యస్తి సర్గైర్నిర్వివరం న యత్
న చ క్వచన సర్గాస్తే సన్తి బ్రహ్మఖమేవ తత్. 14
న సా మహాభూతతాస్తి సర్గైర్నిర్వివరా న యా
నచ క్వచన విద్యన్తే సర్గా బ్రహ్మఖమేవ తత్. 15
శైలానాం నాణురప్యస్తి న సర్గౌఘైర్న నిర్ఘనః
నచ క్వచన విద్యన్తే సర్గా బ్రహ్మఖమేవ తత్. 16
బ్రహ్మణో నాణురప్యస్తి సర్గైర్నిర్వివరో న యః
నచ క్వచన సర్గాస్తే సన్తి బ్రహ్మఖమేవ తత్. 17



అశ్లేగధములగు జల, అగ్ని, వాయు, ఆకాశములున్ను, పంచ మహాభూత సముదాయమున్ను, పర్వతములున్ను, బ్రహ్మదేవుని (హిరణ్యగర్భుని) సూక్ష్మభూతోపాధియు-అన్నియు ఆరోపదృష్టిచే ననేక బ్రహ్మాండములచేఁ బూర్ణములై యున్నవి. కాని అపవాదదృష్టిచే నవి అణుమాత్రమైనను లేవు. వాని సృష్టులున్ను లేనివేయైయున్నవి. అవియన్నియు వాస్తవముగ చిదాకాశరూపమగు బ్రహ్మమే యగును.

సర్గేషు నాణురప్యస్తి న బ్రహ్మాత్మైవ యః సదా
బ్రహ్మసర్గాస్తథైవ్యేష వాచి భేదో న వస్తుని. 18

స్వయముగ బ్రహ్మదేవునియందును, ఆతనిచే నిర్మితములగు బ్రహ్మాండములందును సదా బ్రహ్మము తప్ప అణుమాత్రమైనను వేరేనియును లేదు. బ్రహ్మమునందును సృష్టియందును ఏ భేదము గోచరించుచున్నదో, అది వాఙ్మాత్రమే గాని వస్తుతఃకాదు.

సర్గా ఏవ పరంబ్రహ్మ పరంబ్రహ్మైవ సర్గతా
మనాగప్యస్తి న ద్వైతమత్రాగ్న్యర్కోష్ణ్యయోరివ. 19

సృష్టియే పరబ్రహ్మము. పరబ్రహ్మమే సృష్టి, సూర్య, అగ్నుల యుష్ణత్వములందు వలె నీరెంటియందును గొంచమైనను భేదము లేదు.

ఇమే సర్గా ఇదం బ్రహ్మ తేఽప్యన్తావాచ్యదృష్టయః
విదార్య దారురవవద్భాన్త్యర్థపరివర్జితాః 20

సృజన క్రియచే సృష్టియను పదమున్ను, వర్ధనక్రియచే బ్రహ్మమను పదమున్ను నేర్పడినవి. ఈ రెండు (సృజి, బృంహి) క్రియలందును పరస్పర భేదాభావముచేతను, ఆధారాధేయముల యొక్క భేదము అనిర్వచనీయమగుటచేతను, క్రియము స్వరూపముకంటె వేఱుకానందుచే, గొడ్డలి మొదలగు వానిచేఁ జీల్చబడు కొయ్యయందలి ధ్వనివలె ఈ సృష్టి, బ్రహ్మశబ్దములున్ను అర్థరహితములై, అత్యంత అనిర్వచనీయములై, అభేదరూపమున భాసించుచున్నవి.

ద్వైతమైక్యం చ యత్రాస్తి న మనాగపి తత్ర తే
సర్గబ్రహ్మాదిశబ్దార్థాః కథం కస్యేవ భాన్తు కే. 21

ద్వైత, ఏకత్వము లెచటగలవో, అట్టి వ్యవహారదశయు యథార్థముగ చిన్మాత్రము యొక్కయే వివర్తమగుటచే నచటు గూడ సృష్టిబ్రహ్మ శబ్దార్థము లొకింతైనను భిన్నములు కానేరవు. ఏలయనిన, సృష్టి కేవలము బ్రహ్మమాత్రమే యైనపుడిఁక ఎవనికి ఎట్లు ఏవిభిన్నరూపములుగ భాసించును?

శాన్తమేకమనాద్యన్తమిదమచ్ఛమనామయమ్
వ్యవహారవతోఽప్యజ్ఞస్య మౌనం శిలాఘనమ్. 22

కావున, ఓరామచంద్రా! వ్యవహారమందుఁ బ్రవృత్తుఁడైనను జ్ఞానికి సమస్త జగత్తున్ను శిలవలె చిద్ఘనమైన, శాంతమై, ఏకమై ఆద్యంతరహితమై, నిర్మలమై, నిర్వికారమై, మౌనస్వరూపమైనట్టి బ్రహ్మమాత్రముగనే ప్రకాశించును.

నిర్వాణమేవమఖిలం నభ ఏవ దృశ్యం
త్వం చాహమద్రినిచయాశ్చ సురాసురాశ్చ
తాదృగ్జగత్సమవలోకయ యాదృగజ్ఞ
స్వప్నేఽథ జన్తుమనసి వ్యవహారజాలమ్. 23

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే పాషాణోపాఖ్యానే సర్గబ్రహ్మత్వప్రతిపాదనం నామ అష్టపఞ్చాశః సర్గః ॥ 58 ॥

ఓ రామచంద్రా! నీవు 'నేను' పర్వత సమూహములు, దేవతలు, అసురులు, ఈ మొదలగు సమస్తదృశ్యమున్ను కేవలము నిర్వాణరూపమగు చిదాకాశ మాత్రమేయై యున్నది. కాఁబట్టి మేల్కొనినపిదప జీవునిమనంబున స్వప్నమందు గాంచఁబడిన వ్యవహారజాల మెవ్విధమున నుండునో, అవ్విధమున నీవీ జగత్తును వీక్షింపుము.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున పాషాణోపాఖ్యానమున సర్గ బ్రహ్మత్వప్రతిపాదనమను యేబదియెనిమిదవ సర్గము ॥ 58 ॥

---

## ఏకోనషష్టితమః సర్గః

[సమాధివిరమే సూక్ష్మధ్వనిశ్రవణమీర్యతే
తన్మూలాన్వేషణ ధ్యానేఽనన్తకోటిజగత్ప్రథా.

సమాధియొక్క విరామకాలమందు సూక్ష్మమైన ధ్వనినివినుట, అద్దానిమూలము నన్వేషించుటలో అనంతకోటి జగంబుల ప్రతీతియగుట, ఇచట వర్ణింపఁబడుచున్నవి.]

శ్రీరామ ఉవాచః—

అనన్తరం నభఃకోశకుటీకోటరతో మునే
తవ ధ్యానాత్ప్రబుద్ధస్య వృత్తం వర్షశతేన కిమ్. 1

శ్రీరాముఁడు:—ఓ మునీంద్రా! అట్లు తామాకాశమునఁ గుటీరమును గల్పించుకొని యట నూఱువత్సరములు సమాధి శీలించినపిదప మేల్కొనినపుడు జరిగిన వృత్తాంతమేమియో తెలియఁజేయ ప్రార్థన.

శ్రీవసిష్ఠ ఉవాచః—

తతో ధ్యానాత్ప్రబుద్ధోఽహం శ్రుతవాంస్తత్ర నిస్వనమ్
మృదువ్యక్తపదం హృద్యం నచ వాచ్యానుగో యతః. 2



శ్రీవసిష్ఠుఁడు:—ఓ రామచంద్రా! సమాధినుండి లేవఁగనే యట అల్పముగ వ్యక్తమైనట్టి పదములతోఁగూడినదియు, మనోహరమైనదియు, వాక్యార్థబోధనమందసమర్థమైనదియునగు సూక్ష్మమైన ధ్వని నొకదానిని వింటిని.

స్త్రీస్వభావాదివ మృదు మధురం వా నినాది వా
స్వల్పాజ్ఞత్వాదనిర్హ్రాది మయా తద్వాక్యమూహితమ్. 3

ఆ ధ్వని స్త్రీ కంఠమునుండి బయల్వెడలిన దానివలె మృదుమధుర శబ్దకారకమై, సమీపమునుండి యేతెంచినట్లున్నదని నేనూహించితిని.

ఇన్దిన్దిరరుతాకారం తన్త్రీరణితరఞ్జనమ్.
న రోదనం చ పఠనం బిసకోశసమస్వనమ్ః 4

మఱియు ఆధ్వని భ్రమరశబ్దమును బోలినదియు, వీణారవమువలె ఆనందజనకమైనదియు, రోదనమువంటి శబ్దముగాని, పఠనమువంటి శబ్దముగాని, కానిదియు, కమలకోశమందలి భ్రమరశబ్దముతో సమమైనదియునై యుండెను.

తదాకర్ణ్యాశు తత్రేదమహం చిన్తితవానథ
శాబ్దికాన్వీక్షణాత్పశ్యన్దిశో దశ సవిస్మయః. 5

ఆ ధ్వనినివిని, అద్దాని నొనర్చినవానిని గాంచుటకై యాశ్చర్యముతో దశదిక్కులఁ బరికించుచు నట శీఘ్రముగ నేనిట్లు చింతనచేసితిని.

వ్యోమ్నోఽయం సిద్ధసంచారమార్గశూన్యోఽప్యనన్తరమ్
భాగో యోజనలక్షాణి సమతిక్రమ్య సంస్థితః. 6

తదిహేదృగ్విధస్య స్యాత్కుతః శబ్దస్య సంభవః
శాబ్దికం నచ పశ్యామి యత్నేనాపి విలోకయన్. 7

అనన్తమిదమాశూన్యం పురో మే నిర్మలం నభః
ఇహ భూతం ప్రయత్నేన ప్రేక్ష్యమాణం న దృశ్యతే. 8

సిద్ధులకున్ను సంచారయోగ్యములైనట్టి మార్గములులేని లక్షలకొలఁది యోజనముల ప్రదేశము నతిక్రమించి యీ యాకాశభాగము స్థితినొందియున్నది. అట్టి యీ యేకాంతస్థానమున ఈ ప్రకారమగు స్త్రీ శబ్దముఁబోలిన ధ్వనియెట్లు సంభవించును? ప్రయత్నముచే నవలోకించినను ఆ శబ్దమొనర్చినవానినెచటను గాంచకయున్నానే! ఈ నా యెదుట అనంతమై, మహాశూన్యమై, నిర్మలమైనట్టి యాకాశముతప్ప మఱేమియును లేదుగదా! మఱియు, యత్నముచే నన్వేషించినను నిట నొక్కప్రాణియైనను గన్పించుటలేదుగదా! అట్టిచో నీశబ్ద మెటనుండి వచ్చినది?

యదేతి చిన్తయిత్వాహం భూయో భూయో విలోకయన్
శబ్దేశ్వరం న పశ్యామి తదా చిన్తితవానిదమ్. 9

ఇట్లు విచారించి నేనచట మరల మరల చూచినప్పటికిని శబ్దమొనర్చినవాని నెచటను గాంచకయుండ నపుడు మరల యిట్లు చింతనజేసితిని.

ఆకాశ ఏవ భూత్వాహమాకాశైకతాం గతః
ఆకాశగుణశబ్దార్థస్ఫారో వ్యాకాశకోశకే. 10

మొదట, ఈయుపాధిని త్యజించి చిదాకాశమేయై అందఱ్యస్తమగు అవ్యాకృతాకాశముతోటి యేకత్వమొంది, తత్కార్యమగు భూతాకాశముయొక్క గుణమైన శబ్దమును, తదర్థమును నయ్యాకాశకోశమున ననుభూతమొనర్చుకొనెదను.

దేహాకాశమిహ స్థాప్య ధ్యానేనేహ యథాస్థితమ్.
చిదాకాశవపుర్వ్యోమ్నా యామ్యైక్యం వారివామ్బునా. 11

ధ్యానముచే దేహాకాశమును నున్నదియున్నట్లుగ నిచటనే స్థాపించియుంచి, చిదాకాశరూపుఁడనై, జలబిందువు జలముతోటియైక్యమొందునట్లు, అవ్యాకృతాకాశముతోనే నైక్యమొందెదను.

చిన్తయిత్వేత్యహం త్యక్తుం దేహం పద్మాసనస్థితః
ఆసం సమాధిమాధాతుం పునరామిలితేక్షణః. 12

ఇట్లు విచారించి దేహమును త్యజించుటకై పద్మాసనమునఁ గూర్చుండి సమాధి శీలించుటకొఱకు మరల నేత్రములను మూసితిని.

త్యక్త్వా బాహ్యార్థసంస్పర్శానైన్ద్రియానాన్తరానపి
చిత్తాకాశోఽహమభవం సంవిత్స్పన్దమయాత్మకః. 13

పిదప, ఇంద్రియ సంబంధములగు స్పర్శాది బాహ్యవిషయములను, అభ్యంతర సంకల్పాదులను గూడఁ ద్యజించి, చైతన్యస్ఫురణరూపమగు చిత్తాకాశరూపుఁడనైతిని.

క్రమాత్తదపి సంత్యజ్య బుద్ధితత్త్వపదం గతః
సంపన్నోఽహం చిదాకాశే జగజ్జాలైకదర్పణః. 14

క్రమముగఁ దానినిగూడ వదలి బుద్ధిరూపమును బొందితిని. ఆ పిమ్మట నద్దానినిగూడఁ ద్యజించి చిదాకాశమున కేవలము జగత్సమూహమునకు దర్పణరూపుఁడనైతిని.

తతస్తేన స్వభావేన భూతవ్యోమైకతామహమ్
సంప్రయాతోఽమ్బునేవామ్బు సౌరభం సౌరభేణ వా. 15

తదుపరి, జలసామాన్యముచే సముద్రాది జలమున్ను, సామాన్య సుగంధముచే ప్రత్యేక సుగంధమున్ను బొందఁబడునట్లు నేనా చిదాకాశస్వభావముచే భూతాకాశరూపమును బొంది దానితో నేకత్వమొందితిని.

సంపన్నోఽథ మహాకాశం వ్యాప్యానన్తోఽథ సర్వగః
అనాకారోఽప్యనాధారః సర్వార్థాధారతాం గతః. 16

పిమ్మట సమస్తమును వ్యాపించి నేననంతమై, సర్వవ్యాపకమైనట్టి చిదాకాశమైతిని. మఱియు, ఆకారరహితుఁడను, ఆధారవర్జితుఁడను నైనప్పటికి సర్వపదార్థముల కాధారరూపుఁడనైతిని.



అహం త్రైలోక్యవృన్దాని సంసారాణాం శతాని చ
తత్ర బ్రహ్మాణ్డలక్షాణి పశ్యామ్యగణితాన్యపి. 17

అట్టి స్థితియందా చిదాకాశమున నే ననేక త్రైలోక్యసమూహములను, వందలకొలఁది జగంబులను అగణిత లక్షలకొలఁది బ్రహ్మాండములను వీక్షించితిని.

పరస్పరమదృష్టాని మిథః ఖాన్యమలాని చ
నానాచారవిచారాణి శూన్యాన్యేవ పరస్పరమ్. 18

ఆ బ్రహ్మాండములన్నియు అన్యోన్యదృష్టియందు నిర్మలమైన వ్యాకృతాకాశమాత్ర రూపములేయైయున్నవి. కావుననే పరస్పరము గాంచఁబడకయున్నవి. మఱియు నవి వివిధములగు ఆచారవిచారములచేఁ బూర్ణములైఁ పరస్పరము శూన్యములై (అదృష్టములై) యున్నవి.

స్వప్నరూపాణి సుప్తానాం తుల్యకాలం నృణామివ
మహారమ్భానుసృష్టాని శూన్యాని చ పరస్పరమ్. 19

ఏకకాలమున నిద్రించుచున్న మనుజులయొక్క స్వప్నరూపములవలె నయ్యవి యొకని దృష్టియందు మహాకార్యారంభయుక్తములుగను, మఱియొకనిదృష్టియందు శూన్యములుగను నున్నవి. కావున ఆ బ్రహ్మాండములు శూన్యములున్ను, అశూన్యములున్ను గూడనైయున్నవి.

జాయమానాని నశ్యన్తి వర్ధమానాని భూరిశః
వర్తమానాన్యతీతాని భవిష్యన్తి చ సర్వశః. 20

ఆ చిదాకాశమున, అనేక బ్రహ్మాండము లుత్పన్నమగుచున్నవి; అనేకములు నశించుచున్నవి; అనేకములు వృద్ధినొందుచున్నవి; మఱియు నంతటను నెన్నియో జగంబులు గడచిపోయినవి, ఎన్నియో యుత్పన్నములుగానున్నవి. ఎన్నియో విద్యమానములైయున్నవి.

అనేకచిత్రజాలాని మహాభిత్తీని ఖాని చ
మనసేవోగ్రరాజ్యాని కృతాని వివిధైర్జనైః. 21

వివిధజనులచే గావింపఁబడిన వివిధ మనోరాజ్యములవంటివియు, చిత్రసమూహయుక్తములగు మహాభిత్తివంటివియునగు అనేక బ్రహ్మాండములను, శూన్యాకాశమునుగూడ నేనచట గాంచితిని.

నిరావరణరూపాణి తథైకావరణాని చ
పఞ్చావరణయుక్తాని షడేకావరణాని చ. 22
దశావరణచిత్రాణి షోడశావరణాని చ
చతుర్వింశత్యావృతీని షట్త్రింశత్త్వావృతాని చ. 23

ఆవరణములేనివియు, ఒక యావరణముగలవియు, ఐదావరణములతోఁ గూడియున్నవియు, ఏడావరణములు గలవియు, పంచీకృత, అపంచీకృత, పంచ భూతములను పది యావరణములతో, గూడియున్నవియు, ప్రకృతి, మహదహంకారాది పదునాలు ఆవరణములు గలవియు, సాంఖ్యమతానుసారము గల యిరువదినాలుగు తత్త్వములను, ఆవరణములతో గూడినవియు, శైవమతానుసారమైనట్టి ముప్పదియాఱు తత్త్వములను ఆవరణముగలవియునగు అనేక బ్రహ్మాండములను నేనచట గాంచితిని.

శూన్యాని భూతపూర్ణాని పఞ్చభూతమయాన్యపి
ఏకపృథ్వ్యాది భూతాని చతుః పృథ్వ్యాదికాని చ. 24
త్రిఃపృథ్వ్యాదీని చాన్యాని ద్విఃపృథ్వ్యాదీన్యథాపి చ

మఱియు శూన్యములును, ప్రాణులచేఁ బూర్ణములును, పంచభూతమయములును, పృథివి మొదలుగాఁగల యొక్కొక్క భూతముతోఁ గూడినవియు, పృథ్వ్యాది భూత చతుష్టయము గలవియు, అట్లే పృథ్వ్యాది భూతత్రయము గలవియు, భూత ద్వయముతోఁ గూడియున్నవియునగు వివిధ జగంబుల నట వీక్షించితిని.

తథా సప్తమహాభూతాన్యేకజాతిమయాని చ. 25

దిక్కులు, కాలము, పంచ మహాభూతములు — అను నీ సప్త మహాభూతములతోఁ గూడినవియు, ఒకేజాతికిఁ జెందిన ప్రాణులు గలవియునగు లోకములనుగూడ జూచితిని.

త్వాదృశానుభవాభోగవిరుద్ధాతిదశాని తు
తథా నిత్యాన్ధకారాణి సూర్యాదిరహితాని చ. 26
తథా మీలితసర్గాణి ఏకనాథావృతాని చ
విలక్షణప్రజేశాంశవిచిత్రాచారవన్తి చ. 27
తథా నిర్వేదశాస్త్రాణి నిఃశాస్త్రాణి తథైవ చ
కృమిక్రమసమారమ్భదేవాదిప్రాణిమన్తి చ. 28

నీ వంటి మనుజుల యనుభవమునకు విరుద్ధమైనట్టి దశలుగల సిద్ధ విద్యాధరాదులతోఁ గూడినవియు, సూర్యచంద్రాది రహితములై నిత్యాంధకార యుక్తములైయున్నవియు, ప్రళయ, సుషుప్తులఁ బోలినవియు, సృష్ట్యాదియందు హిరణ్యగర్భాది యొక్కొక్క ప్రభువు మాత్రమే అధిష్ఠానముగాఁ గలవియు, వివిధ దేవాదిగణముల విచిత్రమైన యాచార విచారములతోఁ గూడియున్నవియు, వైరాగ్యమును బోధించు వేదాంతాది శాస్త్రయుక్తములును, శాస్త్రరహితములును, మేడిపండునందలి క్రిమి సమూహమువలె ననేక కార్యారంభములతోఁ గూడినట్టి దేవతలు మున్నగు ప్రాణులు గలవియు నగు పలువిధ బ్రహ్మాండముల నచట గాంచితిని.

జాత్యా తు పారమ్పర్యేణ సంకేతాచారవన్తి చ
తథా నిత్య ప్రకాశాని జ్వలితాగ్నిమయాని చ. 29
తథా జలైకపూర్ణాని పవనైకమయాని చ
స్తబ్ధాని పరమాకాశే వహన్తి చ తథానిశమ్. 30
జాయమానాని పుష్యన్తి పరిపుష్టాని చాభితః
తిర్యగ్గచ్ఛన్తి చాన్యాని పూర్ణసర్వమయాన్యపి. 31
దేవమాత్రైకసర్గాణి నరమాత్రమయాని చ
దైత్యవృన్దమయాన్యేవ కృమినిర్వివరాణి చ. 32



కొన్ని లోకములు బ్రాహ్మణాది జాతులచే వంశపారంపర్య మాత్రముచే నిర్దేశింపఁబడిన యాచారవిచారములు గలిగియుండెను. మఱికొన్ని లోకములు ప్రజ్వలితమగు అగ్నిచేఁ బూర్ణములై నిత్య ప్రకాశయుక్తములై యుండెను. కొన్ని బ్రహ్మాండములు కేవలము జలముచేతను, మఱికొన్ని కేవలము వాయువుచేతను బూర్ణములైయుండెను. కొన్ని చిదాకాశమున నిశ్చలముగనుండెను. మఱికొన్ని నిరంతరము చలించుచుండెను. కొన్ని బ్రహ్మాండము లుత్పన్నమగుచుండెను; కొన్ని వృద్ధినొందుచుండెను; కొన్ని యంతటఁ బూర్ణముగ వృద్ధినొందియుండెను; కొన్ని సర్వభోగ్యమయములై అడ్డముగాఁ జనుచుండెను. కొన్ని లోకములు కేవలము దేవతలచేతను, కొన్ని మనుష్యమాత్రులచేతను మఱికొన్ని అసురులచేతను, కొన్ని కృమికీట పతంగాదులచేతను బూర్ణములై యొప్పుచుండెను.

అన్తరన్తస్తదన్తశ్చ స్వకోశేఽప్యణుకంప్రతి
జాతాని జాయమానాని కదలీదలపీఠవత్. 33

అరటి పట్టలవలె, ప్రతి పరమాణువులోపలను, మరల దానిలోపలను, మరల దానిలోపలను, ఎన్నియో బ్రహ్మాండము లుత్పన్నములైనవి, వర్తించుచున్నవి, ఉత్పన్నములు కానున్నవి.

పరస్పరమదృష్టాని నానుభూతాని వై మిథః
సైనికస్వప్నజాలాని జాతానీవ మహాన్త్యపి. 34

అనేక మహాబ్రహ్మాండము లుత్పన్నములై, సైనికుల స్వప్నములవలె, పరస్పరము అదృష్టములై, అననుభూతములై వెలయుచుండెను.

వివిధాన్యప్యనన్తాని స్వచ్ఛాకాశాత్మకాన్యలమ్
అన్యోన్యమన్యవృత్తీని న మిథోఽన్యస్థితీని చ. 35

పరస్పరము వేర్వేఱు క్రియలు, వేర్వేఱు స్థితులు గలిగియున్నప్పటికిని ఆ వివిధములగు అనంతకోటి బ్రహ్మాండములన్నియుఁ గేవలము చిదాకాశరూపములే యైయున్నవి.

మిథశ్చాన్యాన్యశాస్త్రాణి మిథోఽనన్తాని యాని చ
అన్యోన్యసన్నివేశాని మిథోఽన్యోన్యాని యాని చ. 36

పరస్పరము శాస్త్రజ్ఞాన సంయుక్తములును, పరస్పర మనంతబ్రహ్మస్వభావమున స్థితిగలిగియున్నవియు ఒకదాని యాకృతి బోలి మఱియొకటియున్నవియు పరస్పరము సదృశమైన జ్ఞానము గలవియునగు అనేక బ్రహ్మాండములను నేనచట గాంచితిని.

అన్యోన్యం పరలోకాని మిథః సిద్ధపురాణి చ
అన్యాదృశమహాభూతాన్యన్యాదృగ్దిగ్గిరీణి చ. 37

పరస్పరపరలోకరూపములును, పరస్పరము అంతర్ధానశక్తితోఁగూడిన సిద్ధనగరములుగలవియు భిన్నభిన్న మహాభూతములు, భిన్నభిన్న దిశలు, పర్వతములు గల్గియున్నవియునగు అనేక లోకములను వీక్షించితిని.

త్వాదృశానుభవేహానామగమ్యాభ్యాగతాని చ
అసమఞ్జసరూపాణి కథ్యమానాని మాదృశైః. 38

అణువత్ప్రేక్ష్యమాణాని చిదాదిత్యాంశుమణ్డలే
పరమార్థశ్రియో వ్యోమ్ని రశ్మిజాలాని కుణ్డలే. 39
కానిచిత్తాని తాన్యేవ భూత్వాభూత్వా భవత్యలమ్
కానిచిత్తాదృశాన్యేవ జాతాని వనపర్ణవత్. 40

కొన్నిలోకములు నీవంటిమనుజుల అనుభవ, ప్రయత్నముల కగమ్యములును, అతిసమీపమున కేతెంచినవియు, మావంటివారిచే వర్ణింపబడినను అనుభవ విపరీతముగఁ దోఁచువవియునై యుండెను. కొన్ని, చైతన్యమను సూర్యునియొక్క కిరణసమూహమందు పరమాణువులవలె నొప్పుచుండెను. మఱి కొన్ని బ్రహ్మాండములు మోక్షలక్ష్మియొక్క సువర్ణకుండలమువంటి అవ్యాకృతాకాశ మందును, భూతాకాశమందును విచిత్రరత్న కిరణములవలె చెన్నొందుచుండెను. వనమందలి యాకులవలె కొన్ని లోకములు మరల మరల యారూపముననే యుత్పన్నమగుచు నశించుచుండెను. మఱికొన్ని వానిఁ బోలిన రూపముతోఁటి జనించుచుండెను.

అన్యోన్యత్వాచ్చ సదృశాన్యన్యాని సదృశాన్యపి
కంచిత్కాలం సుసదృశాన్యన్యాన్యేవ చ కానిచిత్. 41

కొన్నిబ్రహ్మాండములు పరస్పరము సదృశములైయుండెను. కొన్ని భిన్నములుగనునుండెను. మాయయొక్క వైచిత్ర్యముచేఁ గొన్ని కొంతకాలమువఱకు సదృశములుగను మరల భిన్నరూపములుగ నుండెను.

ఫలాని తాన్యనన్తాని పరమార్థమహాతరోః
అనన్యాన్యేవ చాన్యాని తన్మయాన్యేవ వై తతః. 42
కానిచిత్స్వల్పకల్పాని దీర్ఘకల్పాని కానిచిత్
అన్యాన్యనియతం భూరి నియతం భూరి కానిచిత్. 43
అన్యాన్యజ్ఞాతకాలాని యదృచ్ఛావశతః స్వయమ్
జాయమానాని పుష్టాని సుస్థిరాణి స్థితాని చ 44

చిద్రూపమను మహావృక్షముయొక్క ఫలములవంటి యీ యనేకబ్రహ్మాండములు కొన్ని పరస్పరము సమానరూపము గలిగియు, కొన్ని భిన్నరూపముగలిగియు నుండెను. అట్లే కొన్ని అల్ప కాలమువఱకుండునవియు, మఱికొన్ని దీర్ఘకాలము వఱకుండునవియు, కొన్ని దేశకాలవస్తుస్వభావ నియతి గల్గియు, కొన్ని యట్టినియతిలేకయు నొప్పుచుండెను. సూర్యాదులు లేనందుచే నెన్నియో లోకములు కాలజ్ఞానరహితములై యుండెను. కొన్నిలోకములు అప్రయత్నముగనే స్వయముగ జనించుచుండెను. కొన్ని వృద్ధిఁబొందియు, కొన్నిస్థిరత్వముతోఁగూడియు వెలయుచుండెను

తాని శూన్యత్వజాలాని పరమాకాశకోశకే
అపరిజ్ఞాతకాలాని రూఢాన్యజ్ఞాతదోషకే. 45

అజ్ఞాన దోషముచే అనాది కాలమునుండి సాక్షిచైతన్యమున అధ్యస్తములై, రూఢపడి యున్నట్టి యీ సమస్త బ్రహ్మాండములన్ని చిదాకాశకోశమున వాస్తవముగ శూన్యరూపములే యగును.



అబ్ధ్యర్కాకాశమేర్వాది శతైరావలితాన్యలమ్
చిచ్చమత్కారఖే స్వప్నజాలాన్యాభాన్తి చావిలమ్. 46

అనేక సముద్ర, పృథివీ, సూర్య, ఆకాశ, మేరుపర్వతాదులతోఁగూడిన అగణిత బ్రహ్మాండములన్నియు చిదాకాశమున, రజస్తమోగుణముల మాలిన్యముచే స్వప్న సమూహములు భాసించునట్లు భాసించుచున్నవి.

అనుభూతేర్భ్రమాత్మత్వాత్కారణానామభావతః
పృథ్వ్యాదీనామహేతూనామత్యన్తం సన్త్యసన్తి చ. 47

కారణరహితములగు పృథ్వ్యాదుల యనుభవము భ్రమాత్మకమగుటచే ఈజగంబులన్నియు అధిష్ఠానరూపముచే నిక్కముగ నున్నవియు, నిజ (దృశ్య) రూపముచే నిక్కముగ లేనివియునగును.

మృగతృష్ణామ్బుభవద్ద్విచన్ద్రవ్యోమవర్ణవత్
సంపన్నాని స సత్యాని సత్యాన్యప్యనుభూతితః. 48

అనుభవముచే సత్యములుగఁదోఁచినను, ఈ బ్రహ్మాండములన్నియు మృగతృష్ణాజలమువలెను, చంద్రద్వయమువలెను, ఆకాశవర్ణమువలెను అసత్యములేయైయున్నవి.

చిత్సంకల్పనభస్యేవ భానమానాని భూరిశః
వాసనావాతనున్నాని విలుఠన్త్యాత్మచేష్టితైః. 49

చైతన్యముయొక్క సంకల్పజనితమగు ఆకసమున భాసించునట్టి యీ యనేక బ్రహ్మాండములన్నియు, వాసనయను వాయువుచేఁ బ్రేరితములై స్వచేష్టలచే నిటునటు పరిభ్రమించుచున్నవి.

సురాసురాదిమశకా బహుశోదుమ్బరద్రుమే
ఫలాని రసపూర్ణాని ఘూర్ణమానాని మారుతైః. 50

బ్రహ్మమను ఉదుంబర (మేడి) వృక్షమున, భోగవైచిత్ర్యమను రసముచేఁ బూర్ణములై, సుర, అసుర, మనుష్యాది మశకము (దోమ)లతోఁగూడినవై, అనేక బ్రహ్మాండములను ఫలములు వాసనయను వాయువుచే నిటునటు కదలుచున్నవి.

అభిజాతస్వభావస్య సర్గారమ్భకరస్య చ
శుద్ధచిత్తత్త్వబాలస్య సంకల్పనగరాణి ఖే. 51

ఈ బ్రహ్మాండములన్నియు చిదాకాశమున, ఉత్తమ స్వభావయుతుఁడును, సృష్ట్యారంభమను క్రీడ కావించువాఁడునునగు చైతన్యమను బాలకునియొక్క సంకల్పనగరములేయగును.

త్వమహం స ఇదం చేతి ధియా బలదృఢాన్యలమ్
సంపన్నాన్యర్కదీప్త్యేవ పఙ్కక్రీడనకాని చ. 52

'ఆరని మట్టిబొమ్మలు సూర్యప్రకాశముచే బాగుగ గట్టిపడునట్లు ఆ సంకల్పనగరములు నీవు, నేను, వాడు, ఇది' - అనునిట్టి అభిమానపూర్వకమగు బుద్ధియొక్క బలముచే బాగుగ దృఢపడుచున్నవి.

వృత్తాని రసశాలిన్యా నియత్యా నిత్యతృప్తయా
వనాన్యుగ్రఫలానీవ వసన్తరసలేఖయా. 53

వసంతకాల రససమూహము గొప్పఫలములుగలిగిన వనములను సిద్ధింపఁజేయునట్లు, నిత్య తృప్తమును, రాగయుక్తమును, కర్మఫలము నవశ్యమొసంగునదియునగు నియతి బ్రహ్మాండములను శాఖోపశాఖాయుక్తముగ సిద్ధింపఁజేయుచున్నది.

మహాకర్తృాణ్యకర్తృాణి న కృతాన్యేవ తాని వా
స్వయం సంపన్నరూపాణి చిద్వ్యోమ్న్యేవ కృతాని వా. 54

పరమాత్మ పృథివీ, స్వర్గాదిలోకములను నిర్మించెనను నీయర్థమును బ్రతిపాదించుశ్రుతుల ననుసరించి సమస్త బ్రహ్మాండములయొక్క కర్త చిదాకాశరూపమగు పరబ్రహ్మమేయగును. మఱియు 'శుద్ధబ్రహ్మమందు కర్తృత్వములేద'ని వచించు శ్రుతుల ననుసరించి సమస్త బ్రహ్మాండములున్ను కర్తృ రహితములై, చిదాకాశమున స్వయంసిద్ధమైన రూపముగలవగును.

పరమార్థమయాన్యేవ తదన్యద్వోదితాన్యపి
అలబ్ధాన్యేవ లబ్ధాని సదాఽసన్త్యేవ సన్తి చ. 55

ఈ జగత్తులన్నియు పరమార్థ బ్రహ్మస్వరూపమయములై యున్నను, అట్టి బ్రహ్మస్వరూపము కంటె వేఱుగానున్నవివలె నుదయించినవై వాస్తవముగ అలబ్ధములైనను, లభించినవిగను, సదాలేనివైనను, ఉన్నవిగను నొప్పుచున్నవి.

చతుర్దశదశైకాదివిధభూతగణాని చ
పునస్తాన్యేవ తాన్యన్తరన్యాన్యన్యాన్యథో బహిః 56

(పదునాల్గు లోకములనుబట్టి) పదునాల్గువిధములుగను, (దేవయోనులనుబట్టి) పదివిధములుగను, (మనుష్యజాతినిబట్టి) ఒక విధముగను, ఇట్లు వివిధరీతులనున్న భూతకోట్లతోఁగూడి యనేక జగంబులు మరల మరల నవియే యుత్పన్నమగుచున్నవి; ఇతరములుకూడ నుత్పన్నమగుచున్నవి.

నరకస్వర్గపాతాలబన్ధుమిత్రమయాన్యపి
మహారమ్భమయాన్యేవ శూన్యాని పరమార్థతః. 57

నరక, స్వర్గ, పాతాళములతో గూడినవియు, బంధుమిత్రాదిమయములును, మహాకార్యారంభయుక్తములునగు ఈ జగత్తులన్నియు పరమార్థముగ శూన్యరూపములే యైయున్నవి.

క్షీరామ్బుధేర్జలానీవ స్నేహసారాణి సర్వతః
తరఙ్గభఙ్గురాణ్యన్తర్బహిశ్చావృత్తిమన్తి చ. 58

ఈ జగత్తులన్నియు క్షీరసముద్రముయొక్క జలమువలె నంతట స్నేహ (రాగ) మను సారముతోఁ గూడినవియు, లోన తరంగమువలె క్షణభంగురములును, బయట అనేక పరివర్తనములతో గూడియున్నవియునై వర్తించుచున్నవి.

ఆభాసమాత్రరూపాణి తేజస్యాత్మవివస్వతః
జాతానీవ స్వతస్తాని స్పన్దనాని నభస్వతః. 59



ఈ బ్రహ్మాండములన్నియు ఆత్మయను సూర్యుని తేజముయొక్క ఆభాసమాత్ర రూపములే యగును. మఱియు, వాయువుయొక్క చలనములవలె నివి యన్నియు స్వయముగనే యుత్పన్నమాయెను.

వృక్షరూపాణి పత్రాణాం బుద్ధ్యహంకారచేతసామ్
అసతామప్యసన్త్యేవ స్వప్నే న్యస్తనృణామివ. 60

ఈ జగంబులన్నియు బుద్ధ్య, హంకార, చిత్తములను పత్రముల కాశ్రయభూతమగు వృక్షరూపములై పఱఁగుచున్నవి. మఱియు స్వప్నమందుఁ దనకంటె వేఱగు మనుజులవలె కేవలము అసద్రూపములే యైయున్నవి.

పురాణవేద సిద్ధాన్తకల్పనాతల్పశాలిషు
ఘననిద్రాణి సుప్తాని బిభ్రన్తి శవతామివ. 61

పురాణ, వేదశాస్త్రాదులందుఁ బ్రసిద్ధములైన యజ్ఞ, దాన, జప, తపాదులకు అవశ్యము ఫలము గలుగఁజేయునట్టి కల్పనారూపములైన స్వప్నములందు మహానిద్రాయుక్తములై యీ యనేక జగత్తులు ఆత్మస్వరూప జ్ఞానాభావముచే శవత్వమును ధరించియున్నవానివలె నున్నవి.

పరమార్థమహారణ్యే చిద్గన్ధర్వకృతాని వై
సూర్యదీపకదీప్తాని గృహాణి గహనాత్మని. 62

బ్రహ్మమను దట్టమగు మహారణ్యమున మాయోపహిత చైతన్యమను గంధర్వునిచే నిర్మింప బడినవై, సూర్యులను దీపములచేఁ బ్రదీప్తములై, అనేక బ్రహ్మాండములను గృహములు శోభించుచున్నవి.

ప్రజాయమానాని నభస్యనన్తే
విశీర్యమాణాని చ నిర్నిమిత్తమ్
తదా త్వహం వై తిమిరాక్షదృష్ట
కేశోణ్డ్రికాసీవ జగన్త్యపశ్యమ్. 63

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు
నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే పాషాణోపాఖ్యానే జగజ్జాలవర్ణనం నామ
ఏకోనషష్టితమః సర్గః ॥ 59 ॥

ఓ రామచంద్రా! నేనా సమాధి కాలమున, అనంతమగు చిదాకాశమందు, కారణము లేకయే జనించునవియు, కారణము లేకయే నశించునవియు, తిమిరదోషయుక్తమగు నేత్రముచే గాంచఁబడు కేశాదులవలె భ్రాంతి మాత్ర సిద్ధములుననగు అనేక జగత్తులను వీక్షించితిని.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున
పాషాణోపాఖ్యానమున జగజ్జాల వర్ణనమను
యేబది తొమ్మిదవ సర్గము ॥59॥

